# నేతాజీ

## పి. గోపిరెడ్డి

నేతాజీ పేరు వినగానే పులకించని భారతీయుడుండడు. కల్పిత గాథకన్న రసవత్తరంగా సాగిన ఆయన జీవితగాథని సమగ్రంగా పరిచయం చేసే పుస్తకాలు తెలుగులో రాలేదు. విజయవాడలో సయ్యద్ అప్పలస్వామి కాలేజీ ప్రిన్సిపాలు అయిన శ్రీ పి. గోపిరెడ్డిగారు ఆ లోటు తీర్చారు. వారెన్నో గ్రంథాలూ, పత్రాలూ చదివి, ఎంతో పరిశోధన చేసి పాఠకులకు ఆసక్తికరంగా ఈ పుస్తకాన్ని తీర్చిదిద్దారు. నవభారతి ప్రచురణల సంస్థ ఈ పుస్తకాన్ని సగర్వంగా పాఠకుల ముందు పెడుతోంది. రచయిత గోపిరెడ్డిగారికి అభివాదాలు తెలుపుతోంది.

ప్రకాశకులు

సహృదయ పాఠకులకు

# నవభారతి ప్రచురణలు

## సమర్పించు పుస్తకరత్నాలు

1. **జై సోమనాథ్** (2 వ ముద్రణ) రచన : కులపతి కె. ఎమ్. మున్షీ
   గజినీ మహమ్మద్ దండయాత్రల కాలంనాటి గగుర్పొడిపించే చరిత్రాత్మక నవల. వెల: రు. 20-00

2. **కాళరాత్రి (దేశ విభజన విషాదగాథ)** రచన : హెచ్. వి. శేషాద్రి
   జాతి జీవితంలో అతి దారుణమైన ఘట్టం యొక్క పూర్వాపరాల సమగ్ర చిత్రణ. వెల : రు. 20-00

3. **హిందూ విజయదుందుభి** రచన: శ్రీరామ్‌సాఠే
   మొగల్ సామ్రాజ్యాన్ని తుదముట్టించిన వీరుల గాథలు.
   (2 వ ముద్రణ) వెల: రు. 9-00

4. **స్వాతంత్ర్యసమరజ్వాలలు** రచన: ఎన్. వి. కాకత్‌కర్
   ప్రథమ స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న వీరుల గాథలు.
   వెల : రు. 15-00

5. **చంద్రశేఖర్ అజాద్** రచన : బాబు కృష్ణమూర్తి
   హృదయాన్ని ఊపివేసే అజాద్ జీవితగాథ వెల: రు. 15-00

6. **1857** స్వరాజ్య సంగ్రామం రచన: స్వాతంత్ర్య వీరసావర్కార్
   వెల : రు. 15-00

7. **స్వాతంత్ర్య వీరసావర్కార్** రచన : ఆర్. ఆర్.
   వెల : రు. 5-00

8. **శ్రీ జగద్గురు శంకరాచార్య** రచన: దీనదయాల్ ఉపాధ్యాయ
   వెల: రు. 10-00

# నేతాజీ

(సుభాస్‌చంద్ర బోస్ జీవిత గాథ)

రచన :

పి. గోపిరెడ్డి

నవభారతి ప్రచురణలు

3-4-705/4, నారాయణగూడ

హైదరాబాదు-500 029

# ముందుగా రెండు మాటలు

ఏ జాతికైనా బానిసత్వం ఒక మహాశాపం. బానిసత్వంతో బాధ పడుతున్న జాతి మిగిలిన అవసరాలన్నింటిని ప్రక్కనపెట్టి ముందుగా ఆ సంకెళ్ళను ఛేదించే మార్గం ఆలోచిస్తుంది. భాష, మత, ప్రాంత, వర్గ విభేదాలు విడనాడి స్వాతంత్ర్య సముపార్జనమీదనే దృష్టిని కేంద్రీకరించడం జరుగుతుంది. విజ్ఞతగల జాతి ఏదైనా స్వాతంత్ర్యం సిద్ధించే వరకూ ఈ విభేదాలకు తావివ్వక, పోరాటం సలుపుతుంది. అయితే ఈ పోరాటాన్ని ఎవరికి నచ్చిన మార్గంలో వారు సాగించి ఉండవచ్చు. కొందరు విప్లవ మార్గాన్ని అనుసరించవచ్చు, మరికొందరు అహింసా మార్గాన్ని చేపట్టవచ్చు, ఇంకొందరు సంప్రదింపుల ద్వారా పరిపాలకులను ఒప్పించి బయటకు పంపించవచ్చునని భావించవచ్చు. నేతాజీ జీవితాన్ని పరిశీలించినట్లయితే ప్రప్రథమంగా ఆయనలో గోచరించేది ప్రఖరమైన దేశభక్తి, తీవ్రమైన స్వాతంత్ర్యేచ్ఛ. స్వాతంత్ర్యం సంపాదించాలన్న తన కోర్కెను త్వరితగతిని నెరవేర్చుకొనేందుకు ఆయా పరిస్థితులలో తనకు ఉత్తమమైనదని తోచిన మార్గాన్ని చేపట్టి ముందుకు పోయాడు. అహింసావాదాన్ని అనుసరించి సత్యాగ్రహం చేసినా, కాంగ్రెస్ పార్టీలోనే ఉండి తీవ్రవాదులను కూడగట్టుకొన్నా, విప్లవవాదులతో చేతులు కలిపినా, 'ఫార్వర్డ్ బ్లాక్' స్థాపించినా, సాయుధ పోరాటానికి నాయకత్వం వహించినా- ఏది చేసినా అతి త్వరగా దేశానికి స్వాతంత్ర్యం సంపాదించాలన్న కోర్కెతోనే.

నేతాజీ విశుద్ధమైన జాతీయవాది. మానవతా దృక్పథంకల మంచి మనిషి. స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలు లేని సమాజం మృతప్రాయమైనదన్న

దృఢ విశ్వాసంకల నాయకుడు. వెనుకఉండి నీతులు వల్లించడంకంటె ముందుండి నడిపించడం అదర్శవంతమైన పని అని ఆచరణలో చూపిన ధీశాలి. దేశ స్వాతంత్ర్యానికి సంబంధించి ఆయన మస్తిష్కంలో అనేక ఆలోచనలు మెదులుతూ ఉండేవి. ఒకోసారి రష్యాలో లెనిన్ సాగించిన విధంగా భారతదేశంలోకూడ విప్లవం లేవదీస్తే బాగుంటుందేమో అనుకొనే వాడు. కొన్నిసార్లు జర్మనీ సాధించిన విజయాలుచూసి, హిట్లర్ విజృంభించిన రీతిగా విజృంభిస్తేనో అనుకొనేవాడు. ఇంకోసారి ఇటలీలో గారిబాల్డీ సాగించిన రీతిగా గెరిల్లా పోరాటం సాగిస్తేనో అనుకొనేవాడు. మరోసారి ఐర్లండులో స్వాతంత్ర్య సముపార్జనకై 'సిన్ ఫెన్' సాగించిన పోరాటం లాంటిదే భారతదేశంలో సాగిస్తే బాగుంటును అనుకొనేవాడు. అయితే కమ్యూనిస్టుగా మారాలని కాని, నాజీయిజం చేపట్టాలనికాని, ఇటలీ గెరిల్లా పోరాటాన్ని, ఐర్లండ్ 'సిన్ ఫెన్' ఉద్యమాన్ని యథాతథంగా భారతదేశానికి దిగుమతి చేసుకోవాలనికాని ఎన్నడూ కోరుకోలేదు. మంచి ఎక్కడ ఉన్నా గ్రహించి భారతదేశ పరిస్థితులకు అనుగుణంగా మలుచుకొని తన పోరాటాన్ని సాగించాలని నిర్ణయించుకొన్న జాతీయవాది సుభాస్

చిత్తరంజన్ దాస్ పట్ల అపారమైన భక్తి విశ్వాసాలు కలిగి పని చేశాడు. గాంధీజీ నిర్వహించిన అనేక ఉద్యమాల్లో పాల్గొన్నాడు. మోతీలాల్ నెహ్రూ, చిత్తరంజన్ దాసులకు కుడిభుజంగా ఉండి స్వరాజ్యపార్టీ కార్యక్రమం నిర్వహించాడు. నెహ్రూ ప్రభృతులతో కలిసి సోషలిస్టు వర్గానికి చేరువై పనిచేశాడు. ఆలిండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా పనిచేశాడు ఎవరితో కలిసి పనిచేసినా జాతీయవాదిగా మిగిలి పోయాడేకాని, ఇజాల మోజులో కొట్టుకుపోయి స్వంత ఆలోచనలు చంపుకోలేదు. అభిమానం చంపుకొని అయినా పదవులకు అంటిపెట్టుకొని ఉండటం ఆయన ఆలోచనలకు సరిపడని విషయం. తన అభిప్రాయాలతో ఏకీభవించకపోయినప్పటికీ, గాంధీజీ ఏదిచెపితే అది చేస్తూ తిరిగినట్లయితే

కాంగ్రెస్ పార్టీలో తిరుగులేని నాయకుడుగా చెలామణి అయ్యేవాడు. కాని తాను సత్యమని విశ్వసించిన దానిని వ్యక్తీకరించకుండా ఉండలేని మనస్తత్వం ఆయనది. అయితే అవతలి వ్యక్తి ఏ పార్టీకి చెందినవాడైనా అతనిలో ఉన్న మంచిని స్వీకరించడానికి వెనుకంజవేసేవాడు కాదు. గాంధీజీతో అనేక విషయాలు విభేదించినప్పటికి ఆయనను 'భారత దేశంలోని అత్యుత్తమ వ్యక్తి' అని చాటిచెప్పాడు. విప్లవవీరుడు సావర్కార్‌ను దర్శించి, విప్లవోద్యమ నిర్వహణకో మెలకువలు తెలుసుకొన్నాడు. ఆజాద్ హింద్ ఫౌజ్ నిర్మాణానికి సావర్కార్‌నుంచి పొందిన స్ఫూర్తికూడా ఒక కారణమే. ఆర్. యస్. యస్. కార్యకర్తలలోని నిస్వార్థ బుద్ధిని, త్యాగ భావనను, సేవానిరతిని గుర్తించి, సంఘ వ్యవస్థాపకులైన డా॥ హెడ్గెవార్‌ను కలుసుకోవడానికిగాను నాగపూర్‌కు వెళ్ళాడు. అయితే అప్పటికే డా॥ హెడ్గెవార్ అస్వస్థులై ఉన్న కారణంగా ఆయనతో మాట్లాడటం కుదరలేదు.

నేతాజీ తలపెట్టి నిర్వహించిన ప్రతి పనిలోను జాతీయ దృక్పథం కొట్టవచ్చినట్లు కన్పిస్తుంది. జాతీయ శ్రేయస్సు ప్రముఖంగా కనిపిస్తుంది. విదేశాలలో తాను నిర్మాణం చేసిన సైన్యానికి ఆజాద్ హింద్ ఫౌజ్ అని పేరు పెట్టాడే కాని, ఎర్ర చొక్కాలనో, నల్ల చొక్కాలనో నామకరణం చేయలేదు. స్త్రీల దళాన్ని ఝాన్సీ రాణీ దళం అని పేర్కొన్నాడే కాని టాన్యా దళమనో, జోన్ ఆఫ్ ఆర్క్ దళమనో పిలవలేదు. భారతదేశంలో ఉన్నా, జర్మనీలో ఉన్నా, జపాన్‌లో ఉన్నా, తూర్పు ఆసియా దేశాలలో పని భారంతో తలమునకలై ఉన్నా, భారత ప్రజల శ్రేయస్సు, భారతదేశ స్వాతంత్ర్యం-ఈ రెంటికే తన మస్తిష్కంలో ప్రథమ స్థానం అనేవాడు. బ్రిటిష్ సైన్యంలో పని చేస్తున్న భారతీయ సైనికులతో తలపడినప్పుడు వారిని సంహరించాలనే తలంపు వీడనాడి మనసు మార్చాలన్న ప్రయత్నమే

చేశాడు. అందుచేతనే తరతమ భేదం లేకుండా భారతీయులందరి హృదయాలలో చిరస్థాయిగా నిలిచిపోయాడు నేతాజీ పేరు చెపితే ఒడలు పులకరించని భారతీయులుండరు. నేతాజీ భౌతిక కాయం కళ్ళముందు కనిపించడం లేదు కాబట్టి అదృశ్యమయ్యాడంటే ఒప్పుకుంటారే కాని, చనిపోయాడంటే అంగీకరించలేరు. జాతీయ నాయకులలో పేరు, ప్రతిష్ఠలు సంపాదించి ప్రజల మన్ననలకు పాత్రులైన నాయకులు చాలా మంది ఉన్నారు కాని, ప్రజలను సమ్మోహితులుగా చేయగల్గినవాడు 'నేతాజీ' ఒక్కడే.

నేతాజీకి జయంతులే కాని వర్ధంతులు లేవు. ఇందుకు కారణం ఈయన చనిపోయిన తేదీ ఖచ్చితంగా తెలియకపోవడం కాదు - ఆయన స్మృతులు భారతీయుల హృదయ కవాటాలను విడిచిపోకపోవడమే.

—:o:—

# విషయసూచిక

**రక్త తర్పణం :** **126**

# పాఠకులతో ...

భారత స్వాతంత్ర్య పోరాటంలో మార్గదర్శనం చేసిన 'మహా నాయకులెందరో ఉన్నారు. కాని యువకులనూ, పెద్దలనూ, కార్మికులనూ, కర్షకులనూ, ఒకరేమిటి - ఆబాల గోపాలాన్ని సుభాస్ చంద్రుని వలె ఆకర్షించినవారు మరొకరు లేరనే చెప్పాలి. జాతీయపరమైన ఉద్యమాలు నడపడంలోనూ, సాయుధ పోరాటం కొనసాగించడంలోనూ సవ్యసాచి నేతాజీ. అందుకే ఆయనంటే అంత ఆకర్షణ. అలాంటి మహనీయుని జీవితానికి సంబంధించి తెలుగులో బహు కొద్ది పుస్తకాలు వెలువడ్డాయి. అవి కూడా సమగ్రమైనవి కావు. స్ఫూర్తిదాయకమైన ఆయన జీవితాన్ని, సాధించిన ఘన కార్యాలనూ తెలుగు పాఠకులకు అందజేయడానికి ఈ గ్రంథంలో ప్రయత్నించాను.

ఇతర భాషలలో లభ్యమైన ముఖ్య సమాచారాన్ని తెలుగు పాఠక లోకానికి అందించే ప్రయత్నమే కాని, సత్యాలను త్రవ్వి తీయడానికి చేసిన ప్రయత్నం కాదిది. బయల్పడిన సత్యాలను విశ్లేషించి పాఠకులకు ఒక నూతన దిశను చూపడానికి ప్రయత్నించాను. జాతీయ వాదిగా సుభాస్ చంద్రుని జీవితం మలచబడిన తీరు సమగ్రంగా పాఠకుల ముందుంచే ప్రయత్నంచేశాను ఈ గ్రంథ రచనలో శ్రీయుతులు గనపులే, యస్. ఏ. అయ్యర్, సిసిర్. కె. జోస్, అలెగ్జాండర్ వెర్త్, ఉత్తంచంద్, హ్యూగ్ టాయ్, సీతారాం గోయెల్, హేమేంద్రనాథ్ దాస్ గుప్త మొదలగువారు వ్రాసిన పుస్తకాలు ఎంతగానో తోడ్పడ్డాయి. ఆయా రచయితలకూ, ప్రచురణకర్తలకూ కృతజ్ఞతలు తెలియజేసుకొంటున్నాను. అమూల్యమైన సలహాలిచ్చిన శ్రీ కందర్ప రామచంద్రరావు గార్కి, వాసమూర్తి గార్కి ఇతర మిత్రులకు నా కృతజ్ఞతలు. పాఠకులు అధిక సంఖ్యలో ఈ గ్రంథం చదివి గుణదోషాలు తెలియజేసి, నా కృషికి మెరుగులు దిద్దవలసినదిగా విన్నవించుకొంటున్నాను.

—రచయిత.

# విషయసూచిక

# పాఠకులతో...

భారత స్వాతంత్ర్య పోరాటంలో మార్గదర్శనం చేసిన మహా నాయకులెందరో ఉన్నారు. కాని యువకులనూ, పెద్దలనూ, కార్మికులనూ, కర్షకులనూ, ఒకరేమిటి - అబాల గోపాలాన్ని సుభాస్ చంద్రుని వలె ఆకర్షించినవారు మరొకరు లేరనే చెప్పాలి. జాతీయోద్యమాలు నడపడంలోనూ, సాయుధ పోరాటం కొనసాగించడంలోనూ సవ్యసాచి నేతాజీ. అందుకే ఆయనంటే అంత ఆకర్షణ. అలాంటి మహనీయుని జీవితానికి సంబంధించి తెలుగులో బహు కొద్ది పుస్తకాలు వెలువడ్డాయి. అవి కూడా సమగ్రమైనవి కావు. స్ఫూర్తిదాయకమైన ఆయన జీవితాన్ని, సాధించిన ఘన కార్యాలనూ తెలుగు పాఠకులకు అందజేయడానికి ఈ గ్రంథంలో ప్రయత్నించాను.

ఇతర భాషలలో లభ్యమైన ముఖ్య సమాచారాన్ని తెలుగు పాఠక లోకానికి అందించే ప్రయత్నమే కాని సత్యాలను త్రవ్వి తీయడానికి చేసిన ప్రయత్నం కాదిది. బయల్పడిన సత్యాలను విశ్లేషించి పాఠకులకు ఒక నూతన దిశను చూపడానికి ప్రయత్నించాను. జాతీయ వాదిగా సుభాస్ చంద్రుని జీవితం మలచబడిన తీరు సమగ్రంగా పాఠకుల ముందుంచే ప్రయత్నంచేశాను ఈ గ్రంథ రచనలో శ్రీయుతులు గనపతే. యస్. ఏ. అయ్యర్, సిసిర్. కె. బోస్, అలెగ్జాండర్ వెర్త్, ఉత్తంచంద్, హ్యూగ్ టాయ్, సీతారాం గోయెల్, హేమేంద్రనాథ్ దాస్ గుప్త మొదలగువారు వ్రాసిన పుస్తకాలు ఎంతగానో తోడ్పడ్డాయి. ఆయా రచయితలకూ, ప్రచురణకర్తలకూ కృతజ్ఞతలు తెలియజేసుకొంటున్నాను. అమూల్యమైన సలహాలిచ్చిన శ్రీ కందర్ప రామచంద్రరావు గార్కి, వాసమూర్తి గార్కి ఇతర మిత్రులకు నా కృతజ్ఞతలు. పాఠకులు అధిక సంఖ్యలో ఈ గ్రంథం చదివి గుణదోషాలు తెలియజేసి, నా కృషికి మెరుగులు దిద్దవలసిన దిగా విన్నవించుకొంటున్నాను.

—రచయిత.

# చైతన్య ప్రభవం

### తల్లి గర్భంలోంచి వెలువడుతూ
### నీవు పెట్టిన కేరింత
### రేపెనులే!
### తెల్లదొరల గుండెల్లో తీరని గుబులు

భారత దేశం వీరవ్రతులకు నిలయం. వీరమాతలెందరినో కన్న ఖ్యాతి భారతమాతకు దక్కింది. విశ్వగురు స్థానంలో ప్రపంచానికి విజ్ఞాన జ్యోతి నందించి యుగయుగాల నుంచి సాగుతున్న జీవన స్రవంతిలో భాగమే మనం. ఈ జాతి మనుగడ నిలకడగా సాగేందుకు ఎందరో తమ సర్వస్వాన్ని అర్పించి కృషి చేశారు. ఉరిచేరులను ఉయ్యాలలుగా భావించిన వారు కొందరు, తుపాకి గుండ్లను పూలచెండ్లుగా స్వీకరించినవారు మరి కొందరు, ధర్మరక్షణకై తమ జీవితాల్ని వెచ్చించినవారు ఇంకొందరు. వేనకువేల వీరులు ఎనలేని త్యాగాల ఫలితంగా ఈ భూమి కర్మభూమి అయింది. ఈ కర్మభూమిలో పరిఢవిల్లిన వెలలేని సంస్కృతికి మనం వారసులం. అది మన అదృష్టం.

ఇక్కడ సిరిసంపదలతో తులతూగి, అత్యంత భోగమయమైన జీవితం కొనసాగించిన వారెందరో ఉన్నారు. కాని ఈ జాతి త్యాగమయ జీవనం కొనసాగించిన వారిని పూజించినదే కాని ఐశ్వర్యంలో మునిగి తేలిన వారిని గుర్తించుకోవడం కూడా వ్యర్థమేనని భావించింది. పదరాని

పాట్లుపడి పది కాలాలపాటు సుఖంగా జీవిద్దాం అనుకొని వంద ఏండ్లు బ్రతికినవారు ఎప్పుడో చచ్చిపోయారు. బ్రతికింది కొద్ది కాలమే అయినా ఇతరుల కోసం మరణించినవారు శాశ్వతంగా బ్రతికిపోయారు. అలాంటి వారిలో సుభాస్‌చంద్ర బోస్ ఒకరు. 'ఇతరుల త్యాగాల ఫలితంగా సంపాదించిన స్వాతంత్ర్యం పరతంత్రంకన్న నీచమైనది' అని చాటాడు సుభాస్. భారతభూమి త్యాగభూమి అని మాటలలో కాక ఆచరణలో చూపిన నేత నేతాజీ సుభాస్‌చంద్ర బోస్.

సుభాస్‌చంద్ర బోస్ 23, జనవరి 1897 లో జన్మించాడు. బ్రిటిష్ వారితో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం 1857 లో జరిగింది. అంటే ఇది జరిగాక నలభై ఏండ్లకు సుభాష్ జన్మించాడు. జన్మించిన 45 ఏండ్లకు ఆయన నాయకత్వంలో స్వాతంత్ర్యం కొరకు మరో సాయుధ పోరాటం జరిగింది. స్వాతంత్ర్య సముపార్జనకై జరిగిన ఆఖరి పోరాటం కూడా ఇదే. ప్రపంచ యుద్ధంలో బ్రిటిష్‌వారు గెలిచినా, నడుం విరిగి ఈ గడ్డపైన నిలబడలేక తోక ముడిచారు. సుభాష్ జీవితం ధన్యమైంది.

సుభాస్ తండ్రి జానకీనాథ్ బోస్, తల్లి ప్రభావతీదేవి. వారికి తొమ్మిదవ సంతానంగా జన్మించాడు సుభాస్‌చంద్ర బోస్. అధిక సంతానం శాపంగా పరిగణించని రోజులవి. ప్రభావతీదేవి ఎనమండుగురు మగ పిల్లలను, అయిదుగురు ఆడపిల్లలను కన్నతల్లి. మగపిల్లలలో ఆరవ వాడు సుభాస్‌చంద్ర బోస్. సుభాస్‌చంద్రుని తండ్రి బెంగాల్ నుండి వచ్చి ఒరిస్సాలో స్థిరపడ్డాడు. ప్రయాణ సౌకర్యాల ఏమీలేని ఆ రోజుల్లో సుదూర ప్రాంతమైన బెంగాల్ నుంచి ఒరిస్సాకు ప్రయాణమై రావడమ-టే సాహసమే జానకీనాథ్ బోస్ సాహసి. త్యాగశీలి, మేధావి, కరుణామయుడు. కటక్ బార్‌లో ఆయన 1885 లో చేరాడు. లాయర్‌గా ప్రసిద్ధి చెందాడు. గవర్నమెంటు ప్లీడర్‌గా పనిచేశాడు. న్యాయమూర్తి పదవిని

మాత్రం అంగీకరించ లేదు. ప్రజాహిత కార్యక్రమాలలో పాల్గొని ప్రజల మన్ననలను పొందాడు. కటక్ మునిసిపల్ చైర్మన్ అయ్యాడు. 1912 లో బెంగాల్ లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడు అయ్యాడు. ఆయన సేవలను గుర్తించి బ్రిటిష్ ప్రభుత్వం రావుబహదూర్ బిరుదు ప్రదానం చేసింది. కాని తరువాత ఆయన బ్రిటిష్ ప్రభుత్వ విధానాలకు నిరసనగా రావు బహదూర్ బిరుదును త్యజించాడు. ఆ తరువాతి కాలంలో ఐ.సి.యస్. హోదానే తిరస్కరించి సుభాస్‌చంద్ర బోస్ తండ్రిని మించిన తనయుడు అనిపించుకొన్నాడు.

పెద్ద సంతానంగల కుటుంబం కావడం వలన తలితండ్రుల లాలన పాలనకు ఎక్కువ అవకాశం ఉండేవి కాదు. దానికితోడు తండ్రి జానకీ నాథ్ బోస్ ప్రజాహిత కార్యాలలోనూ,వృత్తిపరమైన పనులలోనూ మునిగి ఉండటంచేత సుభాస్‌కి తండ్రి చెంత ఎక్కువ సమయం గడిపే వీలు చిక్కేది కాదు. ఆయాగా ఉంటూ ఇంటి పనులు ఆజమాయిషీ చేస్తూ ఉండే శారద సుభాస్‌ను చాలా ఆప్యాయంగా చూచేది. 'రాజా' అని ప్రేమతో పిలుస్తూ ఉండేది. ఇది ఆయనకు కొంత ఊరట కలిగించేది.

## సుభాస్ బాల్యం

బాల్యంలో సుభాస్‌చంద్రుడు ఏడు సంవత్సరములపాటు కటక్‌లో ఉన్న ప్రొటెస్టెంట్ యూరోపియన్ స్కూలులో చదివాడు. పేరుకు ఆంగ్లో-ఇండియన్ స్కూలు అయినప్పటికి ఇండియన్ అన్న పదం అనవసరంగా ఎందుకు చేర్చారా అన్న ధోరణిలోనే అక్కడ వ్యవహారాలు నిర్వహింపబడుతూ ఉండేవి. ఆ స్కూలు విడిచి వెళ్ళేటప్పుడు సుభాస్ ఏ మాత్రం బాధపడలేదు ఆ తర్వాత రెవెన్‌షా కాలేజి హైస్కూలులో చేరి ఉన్నత పాఠశాల విద్య పూర్తిచేశాడు. మొదటినుంచి ఇంగ్లీషు భాషలో మంచి పునాదులు ఉన్న కారణంగా ఈ హైస్కూలులో వాగ్ధి

వాదపు పోటీలలోనూ, పరీక్షలలోనూ చక్కటి ప్రతిభ కనపరచేవాడు. హైస్కూలు ప్రధానోపాధ్యాయుడు వేణిమాధవ దాస్ సుభాస్‌ను ఎంతో ఆప్యాయంగా చూసుకొనేవాడు. అనేక విషయాలు నిర్భయంగా ఆయనతో చర్చిస్తూ తెలుసుకొంటూ ఉండేవాడు సుభాస్. మార్చి 1913 లో మెట్రిక్యులేషన్ పరీక్షలో ఆయన కలకత్తా విశ్వవిద్యాలయ మంతటిలో రెండవ వాడుగా ఉత్తీర్ణుడైనాడు. తమ కుమారుడు అంతటి ప్రతిభగల విద్యార్థి అని తలితండ్రులు ఎప్పుడూ ఊహించలేదు. సుభాస్ సాధించిన ఫలితం వారికి ఎంతో సంతోషాన్ని కలిగించింది.

## కళాశాల విద్య

మెట్రిక్యులేషన్ పరీక్ష ప్యాసయిన తర్వాత 1913 లో కలకత్తా ప్రెసిడెన్సీ కళాశాలలో చేరాడు. ఒకరకంగా అక్కడ ఒంటరితనంతో బాధపడ్డాడు. కటక్‌లో ఉండగా తన ప్రధానోపాధ్యాయుడు వేణిమాధవ దాస్ మార్గదర్శనం లభించింది. వయస్సులో బాగా తేడా ఉన్నప్పటికీ వేణిమాధవ్ దాస్ సాన్నిహిత్యంలో సుభాస్ ఆత్మీయతను అనుభవించాడు. వేణిమాధవ్ సుభాస్‌కు గురువు, సహచరుడు, మార్గదర్శకుడు కూడా. కలకత్తా చేరడంతో ఆ ఆదరణ కరవైంది. అయితే కొద్దికాలంలోనే వివేకానందుని రచనల పట్ల ఆసక్తి పెంచుకొన్నాడు. ఆ గ్రంథాలు చదువుతూ అలౌకికానందం అనుభవించేవాడు. ఆ విధంగా వివేకానందుని రచనల రూపంలో సుభాస్‌కు మరో ఆధ్యాత్మిక గురువు లభించాడు. రామకృష్ణ, వివేకానందుల జీవితాలను అనుకరించడం ప్రారంభించాడు. ఈ దశలోనే సత్యాన్వేషణకై అతనిలో తీవ్రమైన తపన ప్రారంభమైంది. ఇక ఇంట్లో కూర్చోలేక పోయాడు. ఎవరికీ చెప్పకుండానే యాత్రలకు బయలుదేరాడు పవిత్ర స్థలాలను సందర్శించి మానసిక శాంతిని పొందాలని కోరుకొన్నాడు. లక్ష్మణ్ ఝూలా, ఋషీకేష్, హరిద్వార్, మథుర,

బృందావన్, కాశి, గయ మొదలైన పుణ్యక్షేత్రాలను దర్శించాడు. పది హేడేండ్ల ప్రాయంలోనే ఒంటరిగా ప్రారంభించిన ఈ యాత్ర సత్ఫలితాలు చేకూర్చలేకపోయింది. కాషాయాంబరాలు ధరించి ఎదురైన ప్రతి వ్యక్తిని పలుకరించి చూశాడు. కాని ఎవరూ తనను సంతృప్తిపరచలేకపోయారు. భగవంతుని చూశానని విశ్వాసంతో చెప్పిన రామకృష్ణుడు లభించడంచేత నరేంద్రుడు వివేకానందుడైనాడు. అలాంటి గురువు ఎవరూ తటస్థించని కారణంగా సుభాస్‌చంద్రుడు సుభాస్ చంద్రుడుగానే మిగిలిపోయాడు. సుభాస్ సాధించవలసిన కార్యం మరోరకంగా ఉండగా సన్యాసం ఎలా లభిస్తుంది? అలా రెండు మాసాలు వృథాగా తిరిగి అతను ఇంటికి చేరుకున్నాడు.

## నిర్భయ స్వభావం

నూతనోత్సాహంతో కళాశాల చదువు తిరిగి ప్రారంభించాడు. కాని అనుకోకుండా 1916లో ఒక చిన్న గొడవలో చిక్కుకున్నాడు. సుభాస్ క్లాసులో మానిటర్‌గా ఉండేవాడు. వాళ్ళ కళాశాలలో ఇ.యఫ్.ఓటెన్ అనే ఇంగ్లీషు ప్రొఫెసర్ ఒకాయన ఉండేవాడు. ఆ రోజుల్లో ఇంగ్లీషు వారు ఏ పదవిని నిర్వహిస్తూఉన్నా తామే పరిపాలకులము అన్న గర్వం వ్యక్తంచేస్తూ ఉండేవారు. ఈ ప్రొఫెసరుకు కూడా భారతీయులంటే చాలా చిన్న చూపు ఉండేది. ఎప్పుడూ భారతదేశాన్నీ, భారతీయుల్నీ అవహేళన చేస్తూ మాట్లాడుతుండేవాడు. పిల్లలు ఆ అవమానాన్ని భరించలేకపోయారు. ఒకరోజున ఆయన రోడ్డుమీద వెళుతూ ఉండగా అయిదుగురు విద్యార్థులు ఆయనను చితకకొట్టి మురికి కాలువలో పడత్రోశారు. అంత అవమానం జరిగాక ఆయన సహజంగానే ఆగ్రహోదగ్రుడై ఆ విషయాన్ని ప్రిన్సిపాల్‌తో చెప్పాడు. ఆ సంఘటనకు కారకులైన విద్యార్థుల పేర్లు బయటపెట్టవలసినదిగా ఎంత ఒత్తిడి తెచ్చినప్పటికి పిల్లలు చెప్ప

లేదు. సుభాస్ క్లాసులో ఎప్పుడూ నిర్భయంగా మాట్లాడుతూ ఉండేవాడు. పైగా విద్యార్థులకు నాయకుడుగా కూడా కన్పించేవాడు. ఇక ఆలోచించ వలసింది ఏముంది ? సుభాస్ బోస్ ఆధ్వర్యంలోనే ఆ పని జరిగి ఉంటుం దని నిర్ధారణకు వచ్చి అతడిని కళాశాలనుండి బహిష్కరించారు. వాస్త వానికి సుభాస్‌కు కూడా ఆ ప్రొఫెసర్ ప్రవర్తన పట్ల ఆగ్రహం ఉన్నప్పటికీ ఆ సంఘటనతో ప్రమేయం లేదు. అయినా శిక్ష అనుభవించ వలసి వచ్చింది. ఆ విశ్వవిద్యాలయంలోనే మరో కళాశాలలో చదవడానికి అనుమతించ వలసిందిగా విన్నవించుకొన్నాడు. అందుకు కూడా అధి కారులు ఒప్పుకోలేదు కాని ఈ బహిష్కరణ సుభాష్‌లో ఒక క్రొత్త విశ్వాసాన్ని తెచ్చిపెట్టింది. తప్పు చేయనప్పుడు ఎవరికీ తలవంచవలసిన పనిలేదని, ఎంతటి కష్టాన్నైనా ధైర్యంగా ఎదుర్కోవాలని నిశ్చయించు కొన్నాడు. పుటంపెట్టిన బంగారం వన్నె తరుగదు కదా !

కొంతకాలానికి ఇంగ్లాండు చేరుకొన్న తర్వాత ఈ ఓటెన్‌గారే ఒక పద్యం వ్రాసి 1967 లో ప్రచురించారు. పూర్వ స్మృతులు జ్ఞప్తికి తెచ్చు కొంటూ ఆ పద్యంలో తన పూర్వ విద్యార్థి (సుభాస్) ని మెచ్చుకొన్నాడు.

## సేవానురక్తి

సుభాస్ కళాశాలనుండి బహిష్కరింపబడటంచేత కళాశాల చదు వుకు ఒకటిన్నర సంవత్సరాలు అంతరాయం ఏర్పడింది. కలకత్తాలో వృథాగా కాలం వెళ్ళబుచ్చడం కంటె ఇంటికి చేరుకోవడం మంచిదని భావించి సుభాస్ కటక్ చేరుకొన్నాడు. ఈ సమయం వృథా కాలేదు. అతడు కటక్‌లో ఉండగా ఒరిస్సాలో రెండుసార్లు అంటువ్యాధులు అలముకొన్నాయి. ఈ సమయంలో సుభాస్ ఒరిస్సా ప్రజలకు చేసిన సేవ మరువరానిది. స్వచ్ఛంద సేవా దళాలను నిర్మాణం చేసుకుని రోగుల ప్రాణ రక్షణకు అహోరాత్రులు కృషి చేశాడు. అందరి మన్ననలకు

పాత్రుడయినాడు. ఈ కృషిలో సుభాస్‌కు తండ్రి జానకీనాథ్ బోస్ ఎంత గానో తోడ్పడ్డాడు. సేవాతత్పరుడైన కొడుకును చూసి తండ్రి హృదయం పులకించింది.

ప్రెసిడెన్సీ కళాశాల నుంచి బహిష్కరింపబడిన తర్వాత సుభాస్ చదువు మధ్యలోనే నిలచిపోతుందేమోనని అంతా భయపడ్డారు. కాని ఆ రోజులలో దేశభక్తులైన యువకులకు కొండంత అండనిచ్చే మహామనీషి ఒకరున్నారు. ఆయనే శ్యామ్‌ప్రసాద్ ముఖర్జీగారి తండ్రి అయిన ఆసుతోష్ ముఖర్జీ. ఆ రోజుల్లో ఆసుతోష్ ముఖర్జీ కలకత్తా విశ్వవిద్యాలయానికి వైస్-ఛాన్సలర్‌గా ఉండేవారు. సుభాస్ చంద్రుడు స్కాటిష్ చర్చి కాలేజీలో ప్రవేశము పొందేందుకు ఆసుతోష్ ముఖర్జీ ఎంతగానో తోడ్ప డ్డారు. దీనికితోడు ఆ కళాశాల ప్రిన్సిపాల్ డాక్టర్ అర్క్‌హార్డు విశాల హృదయుడు. విద్యార్థుల తెలివితేటలు గుర్తించి తోడ్పడడంలో సిద్ధ హస్తుడు. సుభాస్ చంద్రుని తెలివితేటలకు ముగ్ధుడై 1917 లో అతనిని తన కళాశాలలో చేర్చుకొన్నాడు. తిరిగి కళాశాలలో చేరిన సుభాస్ మిలిటరీ శిక్షణ పొందటం మంచిదని భావించాడు. విశ్వవిద్యాలయ శిక్షణ దళంలో చేరి సైనిక శిక్షణ పొంద నారంభించాడు. పట్టుదలకల మనిషి కాబట్టి కొద్ది కాలంలోనే చక్కటి నైపుణ్యం సాధించగలిగాడు. ఈ విధంగా పొందిన శిక్షణ రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో బర్మా యుద్ధరంగంలో బ్రిటిష్ వారితో సాగించిన పోరాటంలో ఎంతగానో ఉపయోగపడింది. చదువులో కూడా ఆయన తన ప్రతిభ నిరూపించుకొన్నాడు. 1919 లో బి. ఏ. పరీక్షలో తత్త్వశాస్త్రంతో ప్రథమశ్రేణిలో ఆనర్సు సంపాదించి కృతార్థుడైనాడు. ఆ తర్వాత యం. ఏ. లో చేరాడు. కాని చదువు కొన సాగించలేదు. ఆ సమయానికి ఐరోపా ఖండంలో మొదటి ప్రపంచయుద్ధం ముగిసింది. సుభాస్‌చంద్రుడు ఇంగ్లాండులో చదువు కొనసాగించాలని తండ్రి అభిలాష.

## జలియన్‌వాలా బాగ్

సభ్య మానవజాతిని నివ్వెరపరచే రౌలట్ బిల్లు ప్రవేశపెట్టబడిన రోజులవి. ఈ బిల్లు కారణంగానూ, పంజాబు దురంతాల మూలంగాను భారత జాతి అట్టుడికిపోతున్న రోజులవి. 1919 భారతదేశ చరిత్రలో అతి కౄరమైన సంఘటనలకు గుర్తుగా నిలిచిన సంవత్సరం. జలియన్‌వాలా బాగ్ దురంతం అతి రాక్షసమైనది. నిరాయుధులై శాంతియుతంగా ఉద్యమం నడుపుతున్న వారిపైన సైనికులు దారుణంగా కాల్పులు జరిపారు బ్రిటిషు అధికారుల ఈ పాశవిక చర్యకు 379 మంది బలి అయినారు. పన్నెండు వందల మందికి పైగా గాయపడ్డారు. అనధికార అంచనాల ప్రకారం మృతుల సంఖ్య ఇంకా ఎక్కువ. దేశప్రజలు భయవిభ్రమాలకు లోనయ్యారు. ఈ సంఘటన కారణంగా రవీంద్రుడు నైట్‌హుడ్ తిరస్కరించాడు. లక్షలాది సాటి భారతీయుల మూగబాధను రవీంద్రుడు ఆ విధంగా వ్యక్తీకరించాడు. ఈ సంఘటనలు సుభాస్ హృదయాన్ని కూడా కలచివేశాయి. దేశంలోనే ఉండి రాజకీయాలలో దూకి ప్రజాసేవ చేయాలనేది సుభాస్ సంకల్పం. కాని తండ్రి అందుకు ఏమాత్రం అంగీకరించ లేదు. కాబట్టి తండ్రి బలవంతం మీదనే సుభాస్ ఇంగ్లాండు ప్రయాణానికి ఒప్పుకోవలసివచ్చింది.

## ఇంగ్లండులో ఐ. సి. ఎస్.

15 సెప్టెంబరు, 1919లో 'ది సిటీ ఆఫ్ కలకత్తా' అనే పొగ ఓడలో పయనమై అక్టోబర్ నెల చివరలో సుభాస్ చంద్రుడు లండన్ చేరుకొన్నాడు. సుప్రసిద్ధ కవి, రచయిత అయిన దిలీప్ కుమార్ రాయ్, బొంబాయి విశ్వవిద్యాలయంలో సోషాలజీ ప్రొఫెసర్‌గా పని చేసిన డా॥ జి. యస్. గుర్యే, ప్రముఖ మానవ శాస్త్రజ్ఞుడు క్షితీస్ ప్రసాద్ చటోపాధ్యాయ సుభాస్ చంద్రుని సహాధ్యాయులు. ఆలస్యంగా వెళ్ళిన కారణంగా

అతనికి కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయంలో సీటు సంపాదించడం చాలా కష్ట మైంది. చివరకు ఎలాగైతేనేం ఆ విశ్వవిద్యాలయంలో చేరాడు. 1920 జూలై మాసంలో జరిగే ఇండియన్ సివిల్ సర్వీసు పరీక్షలకు తయారు కావలసి ఉంది. ఎనిమిది మాసాల వ్యవధి మాత్రమే ఉంది. అంత కొద్ది సమయ ములో ఎంతో పోటీకి తట్టుకొని విజయం సాధించడమంటే కష్టమైన పని. అది అలా ఉంచి, ఇంగ్లీషువారి ప్రభుత్వంలో ఒక అధికారిగా సేవచేస్తూ ఇంగ్లీషు దొరల పాలనకు తోడ్పడడం సుభాస్‌కు ఎప్పుడూ ఇష్టం లేదు. కాని పరీక్షకు అంటూ కూర్చుంటే మంచి శ్రేణిలో ప్యాస్ కావలసిందే. సమయం సరిపోదని తండ్రికి వ్రాస్తే, ఏమైనా పరీక్షకు హాజరు కావలసిందని ఆయన జవాబు వ్రాశాడు. ఆయన కోరిక మేరకు పరీక్షకు కూర్చోవాలనే సుభాస్ నిర్ణయించుకొన్నాడు. కాబట్టి తన శక్తినంతటిని కూడగట్టుకొని పరీక్షకు చదివాడు. తీరా పరీక్షలో ఒక పెద్ద పొరపాటు చేశాడు. ఒక ప్రశ్నకు సమాధానం వ్రాయడంలో సంస్కృత అనువాదాన్ని ముందుగా చిత్తులో వ్రాయడం ప్రారంభించాడు. ఆ తర్వాత దానిని చక్కగా వ్రాయాలనేది ఆయన సంకల్పం. కాని తీరా గంట కొట్టేసరికి చిత్తు ప్రతిలో కొంత భాగము మాత్రమే పూర్తి అయింది. చక్కగా వ్రాయడ మన్న ప్రశ్న లేనేలేదు. సివిల్ సర్వీసు పరీక్షకు ఆ రోజుల్లో తీవ్రమైన పోటీలో తనకు ఇక చాన్సు లేదనే భావించాడు. కాని ఆశ్చర్యం కొల్పే విధంగా కృతార్థులైన విద్యార్థులలో తాను నాల్గవ వాడుగా నెగ్గాడు.

కాని ఆ తరువాత సుభాస్ బాబుకు మానసిక సంఘర్షణ ప్రారంభ మైంది. తాను ఆ పరీక్షలో ఉత్తీర్ణత పొందినందుకు తండ్రీ, బంధువులూ ఎంతగానో సంతోషించారు. కాని ఐ. సి. యస్. ప్యాసయి తను ఏమి చేయాలి? సుభాస్ మానసిక సంఘర్షణతో సతమతమవుతున్న ఈ తరు ణంలో 'భారతదేశపు అలజడికి పిత' (Father of Indian unrest)గా పేరుపొందిన లోకమాన్య బాలగంగాధర తిలక్ కేంబ్రిడ్జి

విశ్వవిద్యాలయం సందర్శించడం జరిగింది. ఆయన ఇంగ్లాండులో చదువు కొంటున్న భారతీయ యువకులను ఉద్దేశించి మాట్లాడుతూ, 'మీరంతా బ్రిటిష్ పాలకుల సేవకులుకాదు, భారతజాతి సేవకు అంకితం కావాలి' అని ఉద్బోధించారు. భారత దేశంలో సంఘటనలు ఒకదాని తర్వాత మరొకటి సంఘర్షణ దిశగా సాగుతున్నాయి. ఈ ఉద్యమాలకు మహాత్మా గాంధీ నాయకుడు. సెప్టెంబరు 1920 లో కలకత్తాలో జరిగిన ప్రత్యేక కాంగ్రెస్ మహాసభలలో అహింసాయుత సహాయ నిరాకరణోద్యమం చేపట్టాలని నిర్ణయించబడింది. బెంగాల్‌లో దేశబంధు చిత్తరంజన్ దాస్ నాయకత్వంలో ఉద్యమం తీవ్రస్థాయికి చేరింది. బ్రిటిష్ పరిపాలనా యంత్రాంగంతో ఉన్న అన్ని సంబంధాలు భారతీయులు త్రెంచుకోవాలి అని దేశబంధు పిలుపు నిచ్చారు. ఆ పిలుపు సుభాస్‌బోస్ అంతిమ నిర్ణయం తీసుకోవడంలో తోడ్పడింది.

## చిత్తరంజనుని అడుగుజాడల్లో

ఒక నిర్ణయానికి వచ్చిన తర్వాత కేంబ్రిడ్జినుండి చిత్తరంజన్ దాస్‌కు సుభాస్ ఇలా వ్రాశాడు—

కేంబ్రిడ్జి,
ఫిబ్రవరి 16, 1921.

......ప్రభుత్వం క్రింద పనిచేయడం నాకెంతమాత్రం ఇష్టం లేదు...ఉద్యోగం మానివేసి దేశసేవలో అనేక పనులు చేయవచ్చునని నాకు తెలుసు...భారతదేశం చేరి ఒక కళాశాల అధ్యాపకుడిగా కాని, ఒక పత్రికను నడపడం ద్వారా కాని నా సేవను కొనసాగించాలని భావి స్తున్నాను...మాతృదేవి చరణాల చెంత నేను అర్పించేది బహుస్వల్పమే అయినా నా శరీరమూ, మనస్సూ దేశమాతకు అర్పణ చేస్తున్నాను...

కాంగ్రెసుకు ఒక ప్రత్యేక భవనం ఉండాలి. దేశం ఎదుర్కొంటున్న అనేక సమస్యలను గూర్చి విద్యార్థులు అక్కడ పరిశోధనలు కొనసాగించాలి...... —సుభాస్.

ఈ లేఖలో ఆయన తన హృదయాన్ని విప్పి చూపాడు. ఒక పనిని ప్రారంభిస్తే దానిలోని లోతుపాతులు తరచిచూడటం సుభాస్‌చంద్రుని అలవాటు. ప్రతి చిన్న విషయంలోనూ ఈ జాగ్రత్త తీసుకొనేవాడు. సుభాస్ తన పనిలో స్వల్పమైన దోషం కూడా కన్పించకుండా చేయాలని ప్రయత్నించేవాడు. బట్టల విషయంలో కానీ, పుస్తకాలు పెట్టుకొనే విషయంలో కానీ, కాగితాలు ఫైలు చేసుకోవడం విషయంలో కానీ బహు శ్రద్ధ కనబరచేవాడు. ఎక్కడపడితే అక్కడ పారవేయడం అతడి మనస్సుకు సరిపడని పని. స్నేహితులతో మాట్లాడుతూ- "త్రాగుడు, స్త్రీ సంపర్కం అన్న ఈ రెండు ఆకర్షణల విషయంలో ఐరోపా నాగరకత యొక్క బలహీనత కన్పిస్తుంది. ఈ విషయంలో కడు జాగ్రత్తగా ఉండాలి" అంటుండేవాడు. ఇంగ్లీషువారి వలసతత్వ విధానాన్ని నిరసించినప్పటికీ వారిలోని మంచి లక్షణాలను కొనియాడేవాడు – "ఇక్కడి ప్రజలు ఆశాజీవులు. మన దేశంలో ప్రజలు ఎప్పుడూ ఏవో కష్టాలు ఏకరువు పెడుతూ ఉంటారు. కాని ఇక్కడ ప్రజలు ఎక్కువగా సుఖ సంతోషాలను గూర్చి మాట్లాడుతారు" అంటూ మెచ్చుకొనేవాడు.

ఐ.సి.యస్.కు రాజీనామా ఇవ్వడమనేది అంత తేలిక విషయం కాదు. అందువలన తనకు జరిగే నష్టం ఏమిటో సుభాస్‌కు బాగా తెలుసు. కాని సహాయనిరాకరణోద్యమంలో భారతజాతి అతలాకుతలమైపోతూ ఉంటే ఐ.సి.యస్. ఉద్యోగిగా సకల భోగాలు అనుభవిస్తూ, అనేక కష్టాలకు ఓర్చి ఉద్యమంలో పాల్గొంటున్న సాటి భారతీయులను లాఠీలతో చావమోదడం తాను చేయలేడు. ఆ తరుణంలో త్యాగము, సేవ చేయ

వలసిన కర్తవ్యం తనకున్నది. తన తండ్రితోనూ, సోదరుడు శరత్ చంద్రునితోనూ, తన మనస్సుతోనూ ఏడు నెలలు తీవ్ర సంఘర్షణ అనంతరం అంతిమ నిర్ణయం తీసుకొన్నాడు. 1921 ఏప్రిల్ మూడవ వారంలో రాజీనామా సమర్పించాడు. కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో ప్రవేశం సంపాదించడానికి సుభాస్‌కు తోడ్పడిన రెడ్డావే ఈ విషయం తెలుసుకొని విస్తుపోయాడు. దేశసేవ కొరకై ఐ.సి.యస్.కు రాజీనామా చేసిన ప్రథమ భారతీయుడు సుభాస్‌చంద్రుడే.

1921 జూలై 16 వ తేదీన సుభాస్ బొంబాయికి తిరిగివచ్చాడు. రాగానే 'మణిభవనం'లో మహాత్మా గాంధీని సందర్శించాడు. ఆ సమావేశం సుభాస్‌కు సంతృప్తిని కలిగించలేదు. 'ది ఇండియన్ స్ట్రగుల్' అన్న పుస్తకంలో సుభాస్ ఇలా వ్రాశాడు- "మహాత్మా గాంధీ భారత దేశానికి స్వాతంత్ర్యం సంపాదించేందుకు ఏర్పరచుకొన్న కార్యక్రమాన్ని నేను ఎంతగానో పరిశీలించి చూశాను. అది ఉత్తమమైన విధానం కాదని నాకు అనిపించింది. మనలను గమ్యస్థానానికి చేర్చవలసిన ఆయన పోరాటం ఎప్పుడు ఏ విధంగా రూపొందగలదో మహాత్మునికే తెలియదు."

ఇందుకు భిన్నంగా చిత్తరంజన్ దాస్‌తో జరిగిన ప్రథమ సమావేశం సుభాస్ బోస్‌ను ఎంతగానో ప్రభావితం చేసింది కలకత్తాలో దిగిన వెంటనే చిత్తరంజనుని కలుసుకోవాలని అతను చేసిన ప్రయత్నం విఫలమైంది. ఆయన నగరంలో లేడు. అయితే ఆ తర్వాత కొద్దిరోజులకే ఆయనను కలుసుకోవడం జరిగింది. ఆ సమావేశానంతరము- "...... తన గమ్యమేమిటో స్పష్టంగా తెలుసుకొన్న వ్యక్తిని కలుసుకొన్నానని ఆయనతోడి సంభాషణవలన వ్యక్తమైంది. తన సర్వస్వము ధారపోయ గలడు. యువజనోత్సాహం ఆయన దృష్టిలో ఒక విశిష్టతే కాని అవాంఛనీయం కాదు. మా సంభాషణ ముగిసేటప్పటికి నా మనస్సు స్థిరపడింది.

ఒక నాయకుడు నాకు లభించాడని సంతృప్తిచెందాను. ఆయనను అనుస రించాలని నిర్ణయించుకొన్నాను'' అని సుభాస్ వ్రాసుకొన్నాడు. అయితే ఆ తర్వాత మహాత్మా గాంధీ పట్ల ఆయనకున్న అభిప్రాయంలో గొప్ప మార్పు వచ్చింది. ఏమైనా చిత్తరంజనుని ప్రభావం మాత్రం సుభాస్‌పై తుదివరకు అలాగే నిలిచి ఉంది.

## కార్యకర్తగా కాంగ్రెస్‌లో

బ్రిటిష్ రాకుమారుని రాకను బహిష్కరించాలని కాంగ్రెస్ ఉద్యమం చేపట్టింది. దానితో క్రియాశీలక రాజకీయాల్లో పాల్గొనే ప్రథమ అవకాశం సుభాస్‌కు లభించింది. ఆ నాటి ప్రభుత్వం సుభాస్‌ను అరెస్టుచేసి, ఆరు నెలల శిక్ష విధించింది. సుభాస్ నాయకత్వాన నడుస్తున్న జాతీయ స్వచ్ఛంద సేవాదళం' నిషేధించబడింది. 1922 సెప్టెంబరులో సుభాస్ విడుదల అయ్యాడు.

1922 లో చిత్తరంజనుడు 'గయ' కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్ని కయ్యాడు. కేంద్ర, రాష్ట్ర శాసన సభలకు కాంగ్రెస్ పోటీచేసి వాటిని పోరాట రంగాలుగా ఉపయోగించుకోవాలని ఆయన వాదించాడు. కాని అధిక సంఖ్యాకులు దీనిని ఆమోదించలేదు. చిత్తరంజనుడు అధ్యక్ష పదవికి రాజీనామా చేశాడు. అటు తర్వాత 1923 జనవరి 31 వ తేదీన స్వరాజ్య పార్టీకి ప్రధాన కార్యదర్శిగా మోతీలాల్ నెహ్రూ వ్యవహ రించాడు. స్వచ్ఛంద దళాధిపతిగా సుభాస్ బోస్ ఉన్నాడు. పార్టీ ప్రచారం కోసం 1923 అక్టోబర్‌లో చిత్తరంజనుడు ప్రారంభించిన 'ఫార్వర్డ్' అనే ఆంగ్ల పత్రికకు సుభాస్ ప్రధాన సంపాదకుడు అయ్యాడు. కేంద్రంలోనూ, రాష్ట్రంలోనూ, ఎన్నికలలో స్వరాజ్య పార్టీ అఖండ విజయం సాధించింది. 1923 లో ఢిల్లీలో మౌలానా ఆజాద్ అధ్యక్షతన జరిగిన ప్రత్యేక కాంగ్రెస్ స్వరాజ్యపార్టీ కార్యక్రమాన్ని ఆమోదించింది.

## కోట్స్‌కు చురక

చిత్తరంజన్ దాస్ అంటే సుభాస్‌కు గురు భావన ఉంది. అలాగే సుభాస్ అంటే చిత్తరంజనునికి వాత్సల్యం, అపారమైన విశ్వాసం. 1924 లో కలకత్తా కార్పొరేషన్‌కు జరిగిన ఎన్నికలలో స్వరాజ్య పార్టీ ఘన విజయం సాధించింది. చిత్తరంజనుడు మేయర్‌గా ఎన్నికయ్యాడు. సుభాస్ బోసును చీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగా నియమించాడు. నెలకు మూడువేల రూపాయలు వేతనం లభించేది. అందులో సగం మాత్రమే సుభాస్ తీసుకొనేవాడు. మిగిలిన సగం కార్పొరేషన్ పనులకే వినియోగించేవాడు. తాను తీసుకొన్న 1500 రూపాయలలో ఎక్కువ భాగం పేద విద్యార్థులకు సహాయం చేయడానికే ఉపయోగించేవాడు. ఆ రోజులలో కలకత్తా కార్పొరేషన్‌లో జె. ఆర్. కోట్స్ అనే ఆంగ్లేయుడు చీఫ్ ఇంజనీరుగా పనిచేస్తూ ఉండేవాడు. అతడు ఎవరినీ లెక్క చేసేవాడు కాదు. చాలా తల బిరుసుగా వ్యవహరించేవాడు. ఒక రోజు సుభాస్ బోస్ తన ఆఫీసులో కూర్చుని పనిచేసుకొంటున్నాడు. ఆ సమయంలో ఏదో పనిమీద కోట్స్ సుభాస్ గదిలోనికి వచ్చాడు. నిర్లక్ష్యంగా సిగార్ పొగ ఊదుకొంటూ సుభాస్‌తో మాట్లాడటం మొదలుపెట్టాడు. సుభాస్ అది సహించలేకపోయాడు. ఆ ఆఫీసరుకు బుద్ధి చెప్పాలనుకున్నాడు. "నీ క్రింది ఉద్యోగులు కూడా నీ ఎదుట ఇలాగే అమర్యాదగా ప్రవర్తిస్తే ఎలా ఉంటుందో ఒకసారి నీవు ఊహించుకో" అని కోట్స్‌ను హెచ్చరించాడు. సుభాస్ హెచ్చరిక అంటే ఏమిటో కోట్స్‌కు బాగా తెలుసు. సుభాస్ ఒక్క మాట చెపితే చాలు, కోట్స్ వద్ద పనిచేసే ఉద్యోగులు అతడిని దోమను విదిలించినట్లు విదిలించేస్తారు. అందుచేత అతడు వెంటనే సుభాస్‌కు క్షమాపణ చెప్పుకొని ఆ గదినుండి బయటపడ్డాడు. ఆ తర్వాత ఇంకెప్పుడూ ఆ అధికారి సుభాస్ ఎదుట అజాగ్రత్తగా ప్రవర్తించి ఎరుగడు.

ఆ కాలంలోనే జవాహర్‌లాల్ నెహ్రూ అలహాబాద్ పురపాలక సంఘానికి అధ్యక్షుడుగా ఉన్నాడు. సర్దార్ వల్లభాయ్ పటేల్ అహమ్మదా బాద్ పురపాలక సంఘానికి అధ్యక్షుడుగా ఉన్నాడు. విఠల్‌బాయ్ పటేల్ బొంబాయి మేయర్‌గా పనిచేశాడు.

## మాండలే జైలులో ముప్పై నెలలు

1924 అక్టోబరు 25 వ తేదీ రాత్రి బెంగాల్ ఆర్డినెన్స్ క్రింద సుభాస్ అరెస్టు అయ్యాడు. ఆ విధంగా ఆరు మాసలు మాత్రమే కలకత్తా కార్పొరేషన్ ఎక్జిక్యూటివ్ ఆఫీసరుగా పని చేయగలిగాడు! ఆయనలో ఉన్న సంఘటనా సామర్థ్యానికి బ్రిటిష్ ప్రభుత్వం ఎంతగానో భయపడ నారంభించింది. అందుకే ఆయనను విప్లవకారుడు అని కాకుండా 'విప్లవోద్యమ కేంద్రం' అని వర్ణించారు. అల్లిపురం, బరహంపురం జైళ్ళలో మూడు మాసాలు ఉంచి, ఆ పిమ్మట 1925 జనవరి 25 వ తేదీన సుభాస్‌ను బర్మాలోని మాండలే జైలుకు పంపారు. ఆ రోజుల్లో ప్రభుత్వా నికి ఎంతో ప్రమాదకారులని భావించిన వారిని మాండలేజైలుకు పంపేవారు. అంతకు ముందు ఆ గౌరవం లభించిన వారిలో లాలా లజపతిరాయ్ (1907), బాలగంగాధర తిలక్ (1908) ఉన్నారు. ఈ విధంగా సుభాస్‌ను అరెస్టు చేయడాన్ని కలకత్తా మేయర్ హోదాలో చిత్తరంజనుడు నిరసిస్తూ ఒక ప్రకటన చేశాడు. "నాకంటె బోస్ పెద్ద విప్లవకారుడు కాదు. అలాంటపుడు నన్ను ఎందుకు అరెస్టు చేయలేదో తెలుసుకోవాలనుకొంటు న్నాను. దేశాన్ని ప్రేమించడం ఒక నేరమైతే, నేనూ నేరస్థుడినే. కలకత్తా కార్పొరేషన్ చీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరే కాదు, మేయర్ కూడా తప్పు చేసినవాడే అవుతాడు. బోస్‌ను అరెస్టు చేయడమనేది బ్రిటిష్ ప్రభుత్వపు దమన నీతికి నిదర్శనంమాత్రమే... ఆయన మీద లిఖిత పూర్వకంగా ఏ నేరమూ మోపలేదు, ఏ కారణమూ చెప్పలేదు. మా పశుబలం ఉపయో

గించి నిన్ను జైలుకు ఈడ్చుకు పోతున్నామని చెప్పి నిర్బంధించారు. ఈ ప్రభుత్వంలో చట్టం ఎక్కడ ఉంది? న్యాయం ఎక్కడ ఉంది?" అంటూ తన ఆక్రోశం వెలిబుచ్చాడు చిత్తరంజనుడు.

సుభాస్ మాండలే జైలు నుంచి- 'మహోన్నతమైన దేశభక్తుల అడుగుజాడలలో నడుస్తున్నందుకు నాకెంతో గర్వంగా ఉంది' అంటూ వ్రాశాడు. మే 2, 1925 వ తేదీన తన మిత్రుడు దిలీప్‌కుమార్ రాయ్‌కి వ్రాసిన లేఖలో- "బలవంతపు ఏకాంతంలో రాజకీయ ఖైదీకి జీవితంలో ఎదురయ్యే అనేక మౌలిక సమస్యలను గూర్చి లోతుగా ఆలోచించే అవకాశం లభిస్తుంది. ఇతరుల సంగతి ఎలా ఉన్నా నామటుకు నేను ఈ జైలులో ఉన్నందువల్ల వైయక్తిక జీవనంలోనూ, సమష్టి జీవనంలోనూ మనకు ఎదురయ్యే అనేక చిక్కు ప్రశ్నలకు క్రమక్రమంగా సమాధానం రాబట్టుకోగల్గుతున్నాను. గతంలో ఒక నిర్దుష్టమైన సమాధానం చెప్పలేక తాత్కాలికంగా ఏదో చెప్పి దాట వేసిన ప్రశ్నలకు దిన దినం చక్కటి సమాధానాలు లభిస్తున్నాయి. మరే ప్రయోజనం లేకపోయినా ఈ జైలు జీవితం నాలో భావౌన్నత్యానికి దోహదం చేసిందని చెప్పాలి" అని వ్రాశాడు.

ఇలా జైలు జీవితానికి అలవాటు పడుతున్న తరుణంలో సుభాస్ ఒక దారుణమైన వార్త వినవలసి వచ్చింది. జూన్ 16, 1925 వ తేదీన చిత్తరంజన్‌దాస్ స్వర్గస్థుడయ్యాడు. ఈ వార్త విని దేశం అంతా దుఃఖ సాగరంలో మునిగింది. సుభాస్‌కు కల్గిన బాధ వర్ణించనలవి కానిది. సుభాస్‌కు చిత్తరంజనుడు గురువు, సచివుడు, దైవము, సర్వస్వమూనూ. దిలీప్ కుమార్ రాయ్, "చిత్తరంజనుని మరణం దేశానికి తీరని లోటు అయితే యువతకు భయంకరమైన జలప్రళయంలాంటిది" అంటూ వ్రాశాడు.

రాజకీయ ఖైదీలలో క్రైస్తవులకు క్రిస్టమస్ పండుగ జరుపుకోవడానికి నిధులు సమకూర్చి, దుర్గ పూజ జరుపుకోవడానికి హిందువులకు నిధులు నిరాకరించడంతో, జైలులో బోస్ నిరాహార దీక్ష పూనాడు. ఈ వార్త దేశంలో సంచలనం కల్గించింది. అప్పుడు హిందువులకు కూడా నిధులు కల్పించడానికి ప్రభుత్వం ఒప్పుకొంది. సుభాస్ 40 పౌన్లు బరువు కోల్పోయాడు. బ్రాంకో నిమోనియా వ్యాధితో బాధపడ్డాడు. క్షయ వ్యాధి అనే అనుమానం వచ్చింది.

అప్పటికి మాండలేజైలులో రెండు సంవత్సరాలు గడిచాయి. సుభాస్ ఆరోగ్యం బాగా క్షీణించింది. బెంగాల్ అంతటా తమ ప్రియతమ సుభాస్‌ను వెంటనే విడుదల చేయాలంటూ ఆందోళన ప్రారంభమయింది. ఇంతలో బెంగాల్ శాసన సభ ఎన్నికలు వచ్చాయి. జైలులో ఉన్న సుభాస్ ఎన్నికలలో ఘన విజయం సాధించాడు. అయినా ఆయనను విడుదల చేయలేదు.

ఏప్రిల్ 1927 నాటికి సుభాస్‌చంద్రుని ఆరోగ్యం ప్రమాదస్థాయికి చేరింది. జైలులోనే సుభాస్ ప్రాణాలు కనుక పోతే బెంగాల్‌లో బ్రిటిష్ ప్రభుత్వానికి నూకలు చెల్లినట్లే. ఏమిచేయాలో తోచక ఆయనను రంగూన్‌కు మార్చారు. అయినా పరిస్థితిలో మార్పు రాలేదు. లెఫ్టినెంట్ కర్నల్ కేల్‌సాల్, సుభాస్ సోదరుడు డా॥ సునీల్ చంద్రబోస్ ప్రభుత్వ అనుమతిపై సుభాస్‌ను పరీక్షచేశారు. పరిస్థితి చాలా క్లిష్టంగా ఉందని తెలియజేశారు. స్వంత ఖర్చులపై చికిత్స కోసం స్విడ్జర్‌లాండ్ వెళ్లేటట్లయితే బోస్‌ను విడుదల చేస్తామని ప్రభుత్వం ప్రకటించింది. కాని ఏ రకమైన షరతులు విధించినా ఒప్పకొనేది లేదని సుభాస్ స్పష్టం చేశాడు. ఇక చేసేది లేక 1927 మే 15 వ తేదీన ప్రభుత్వం బోసును విడుదల చేసింది.

అప్పటికి ఆయన వయస్సు 30 సంవత్సరాలే. మాండలే జైలులో రెండు సంవత్సరాల, ఆరుమాసాల ఇరవై ఒక్క రోజులు ఉన్నాడు.

## స్వరాజ్య పార్టీ సారథ్యం

చిత్తరంజనుడు అస్తమించడంతో స్వరాజ్యపార్టీ భారం సుభాస్‌పైన పడింది. ఆయన ఆరోగ్యం బాగుండక పోయినా విశ్రాంతి లేకుండా పని చేయడం ప్రారంభించాడు. ఇలా ఆరు మాసాలు గడిచాయి. మద్రాసులో కాంగ్రెసును మహా సభలు జరిగాయి. డాక్టరు అన్సారీ అధ్యక్షత వహించారు. ఈ మద్రాసు కాంగ్రెసు కాంగ్రెస్‌లోనే జవాహర్‌లాల్‌తో పాటు సుభాస్ చంద్రుడు కూడా అఖిల భారత కాంగ్రెస్ కార్యదర్శిగా ఎన్నికయ్యాడు. ఆ విధంగా సుభాస్ అఖిల భారత స్థాయికి చేరుకొన్నాడు. ఈ క్రొత్త బాధ్యతలో బోస్ మహాత్మాగాంధీని సబర్మతీ ఆశ్రమంలో సందర్శించాడు. సైమన్ కమిషన్‌కు వ్యతిరేకంగా దేశవ్యాప్తంగా ఉద్యమం జరుగుతున్న రోజులవి. ఎక్కడ చూసినా 'సైమన్, వెనక్కుపో' అనే నినాదాలు దిక్కులు పిక్కటిల్లేటట్లేవి నబడు తున్నాయి కాంగ్రెసు పార్టీలో తల ఎత్తిన వివాదాల కారణంగా గాంధీజీ క్రియాశీల రాజకీయాలకు దూరంగా ఉండేందుకు నిర్ణయించుకొని ఆశ్రమం లోనే ఉండిపోయారు. ఆ పరిస్థితిలో గాంధీగారు రాజకీయాలకు దూరంగా ఉండటంవలన దేశానికి ఎంతో నష్టం సంభవిస్తుందని తెలియజేస్తూ, వెంటనే రంగంలో దిగి ఉద్యమానికి నాయకత్వం వహించవలసినదిగా సుభాస్ విన్నవించాడు. అయినా గాంధీజీ అందుకు అంగీకరించలేదు.

సుభాస్‌ది మొదటి నుంచీ సిద్ధాంతాలలో రాజీపడే మనస్తత్వం కాదు. తాను నమ్మిన సిద్ధాంతాల కొరకు ఎంతటి కష్టాలను సహించవలసి వచ్చినా సంతోషంగా స్వీకరిస్తాడు. ఎప్పటికపుడు సర్దుబాటు ధోరణిని అవలంబించే నాయకులు ఆయనను అతివాదిగా లెక్కకట్టారు. చిత్తరంజన్ దాస్ అస్తమించడంతో బెంగాల్‌లో ఒక రకంగా రాజకీయ సంక్షోభం తలఎత్తింది. వాస్తవానికి అన్ని విషయాలలోనూ చిత్తరంజనునికి దీటైన

వారసుడు సుభాస్‌చంద్రుడే. కాని, గాంధీజీకి సుభాస్ పట్ల సదభిప్రాయం లేదు. రాష్ట్ర కమిటీ అధ్యక్ష పదవినీ, స్వరాజ్యపార్టీ పార్లమెంటరీ నాయకత్వాన్నీ, కలకత్తా మేయర్ పదవినీ మూడింటిని జె. యం. సెన్‌గుప్తాకు కట్టబెట్టాలని మహాత్ముడు ఆలోచించాడు. ఇది విభేదాలకు దారితీసింది. దీనికితోడు ఆశయాలలో కూడ కొన్ని విభేదాలు తలఎత్తాయి. సంపూర్ణ స్వాతంత్ర్యమే లక్ష్యంగా పెట్టుకొని బ్రిటిష్‌వారితో పోరాడాలనేది మొదటి నుండీ సుభాస్ సంకల్పం. కాని అఖిలపక్ష సమావేశం ఆధ్వర్యంలో మోతీలాల్ నెహూ్రా నాయకత్వంలో ఏర్పడిన కమిటీ సమర్పించిన నివేదికలో అధినివేశ ప్రతిపత్తిని అంగీకరించడం జరిగింది. బోస్‌కు ఇది తీవ్రమైన మనస్తాపాన్ని కలిగించింది. "మోసంతో, బానిసత్వంతో, అసమానత్వంతో రాజీ అన్నది ఎన్నటికీ లేదు'' అని బోస్ ఎలుగెత్తి చాటాడు. శ్రీనివాస అయ్యంగార్, జవాహర్‌లాల్ నెహ్రూ, బులుసు సాంబమూర్తి, సర్దార్ శార్దూలసింగ్ ప్రభృతులు కూడా నెహ్రూ కమిటీ రిపోర్టు పట్ల అసంతృప్తి ప్రకటించారు. వీరంతా కలిసి భారత స్వాతంత్ర్య సమితి (Independence of India League)ని ఏర్పరచారు. నెహ్రూ కమిటీ రిపోర్టును వ్యతిరేకించడమే ఈ సమితి లక్ష్యం. 1929 లో జవాహర్‌లాల్ ఈ సమితి నుంచి విడిపోయినప్పటికి శ్రీనివాస అయ్యంగార్‌తో కలిసి ఈ రిపోర్టుకు వ్యతిరేకంగా బోస్ పోరాటాన్ని సాగించాడు.

సైమన్ కమీషన్ బహిష్కారణోద్యమాన్ని కాంగ్రెస్ పార్టీలోని యువకులంతా ఉత్సాహవంతంగా నిర్వహించారు. బోస్ బాబు కంటె ఎనిమిది సంవత్సరాలు పెద్దవాడైన జవాహర్‌లాల్ బోస్‌తో కలిసి అనేక యువజనోత్సవాలలో పాల్గొన్నాడు. సుభాస్ బోస్ యువకుల నుద్దేశించి అనేక సభలలో మాట్లాడాడు. గాంధీగారివలె ఉదాసీన వైఖరి అవలంబించడం వలన ప్రయోజనం లేదనీ, ప్రజలంతా ఉద్యమంలో ముమ్మ

రంగా పాల్గొనాలనీ బోస్ ప్రబోధించాడు. గాంధీజీ అనుయాయులకు ఈ ధోరణి ఆగ్రహం కల్గించింది.

## కార్మిక రంగ ప్రవేశం

1928 లో అనేక పరిశ్రమలలో కార్మికులు సమ్మెకు తలపడ్డారు. బొంబాయి వస్త్ర పరిశ్రమ, కలకత్తా జౌళి పరిశ్రమ, జమ్‌షెడ్‌పూర్ ఉక్కు పరిశ్రమలలో పనిచేస్తున్న కార్మికులు సమ్మె చేశారు. ఉక్కు పరిశ్రమలో సమ్మె విఫలమైపోయే స్థితిలో బోస్ దాని నాయకత్వం చేపట్టి గౌరవప్రదమైన పరిష్కారం కుదిర్చాడు. కార్మికరంగంలో తలదూర్చడం బోసుకు అదే ప్రథమం. ఆ తర్వాత ఆయన అలిండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌కు అధ్యక్షుడయినాడు.

1928 చివర భాగంలో కలకత్తా కాంగ్రెస్ మహా సభలకుగాను ఏర్పరచిన స్వచ్ఛంద దళ విభాగానికి అధిపతిగా బోస్ బాధ్యత స్వీకరించాడు. ఈ దళాన్ని బోస్ అత్యంత క్రమశిక్షణాయుతమైన, శక్తివంతమైన సంస్థగా రూపొందించాడు. ఈ దళాధిపతిగా బోస్ ధరించిన ఆకర్షణీయమైన యూనిఫారం కాంగ్రెస్ మహా సభలలో పాల్గొన్న ప్రజల దృష్టినే కాక అధ్యక్షుడైన మోతీలాల్ దృష్టిని కూడా ఆకర్షించింది. కలకత్తా నేతాజీ మ్యూజియంలో అది ఇప్పటికీ భద్రపరచబడి ఉంది.

## స్వాతంత్ర్యోద్యమం : కాంగ్రెసు

ఒక సంవత్సరంలోగా భారతదేశానికి అధినివేశ ప్రతిపత్తి కల్పించకపోతే పోరాటం తప్పదని బ్రిటిష్ ప్రభుత్వాన్ని కలకత్తా కాంగ్రెస్ హెచ్చరించింది. ఒక సంవత్సరంలో అధినివేశ ప్రతిపత్తిని కలుగజేసి బ్రిటిష్ ప్రభుత్వం వైదొలుగుతుందనే నమ్మకం ఎవరికీ లేనప్పుడు, అలాంటి ప్రతిపాదనను ప్రవేశపెట్టి కాంగ్రెస్‌ను అవహేళన పాలుచేయడం ఎందుకని బోస్ ప్రశ్నించాడు. ఊహించినట్లుగానే ప్రభుత్వం దానిని

అవహేళన చేసి త్రోసిపుచ్చింది. ఈ దశలోనే అసలు అధినివేశ ప్రతిపత్తి ప్రసక్తి లేనే లేదని, సంపూర్ణ స్వాతంత్ర్యమే తమ లక్ష్యమని బోస్ పోరాటం కొనసాగించాడు. ఈలోగా గాంధీజీ కూడా 'యంగ్ ఇండియా' వార పత్రికలో వ్రాస్తూ 31 డిశంబరు, 1929 నాటికి ప్రభుత్వము కనుక అధినివేశ ప్రతిపత్తిని కల్పించకపోతే జనవరి 1, 1930 నాడు తాను కూడా సంపూర్ణ స్వాతంత్ర్యవాదిగా మారిపోగలనని ప్రకటించాడు. చివరికి 1929 లో జరిగిన లాహోర్ కాంగ్రెస్‌లో నెహూ్రు కమిటీ నివేదికను త్రోసిరాజని సంపూర్ణ స్వాతంత్ర్యమే భారతదేశపు లక్ష్యం అని స్పష్టంగా ప్రకటించారు. సుభాస్ చంద్రుని వాదమే నిలబడింది. కాని గాంధీజీ, ఇతర వృద్ధ నాయకులు సుభాస్ పట్ల కినుక వహించారు. సుభాస్ పట్ల కక్షతో 1929 లాహోర్ కాంగ్రెస్‌లో సుభాస్‌కు వర్కింగ్ కమిటీలో సభ్యత్వం లేకుండా చేశారు. వర్కింగ్ కమిటీనుంచి తొలగించ గలిగారే కాని ప్రజల హృదయముల నుంచి తొలగించడం వారి చేతులలో లేదు కదా? ఈ చర్యవలన సుభాస్‌కు ప్రజలలో అభిమానం మరింత పెరిగింది. సుభాస్‌తోపాటు జవాహర్‌లాల్ కూడా అతివాదులలో చేరిపోతున్నాడని భయపడిన గాంధీజీ ఆయనను తమ వైపుకు త్రిప్పుకొనేందుకు, మరుసటి సంవత్సరం లాహోర్‌లో జరగబోయే మహా సభలకు అధ్యక్షుడిగా ఎంపిక చేశారు.

లాహోర్ ప్రతిపాదనకు అనుగుణంగా తాను సహాయ నిరాకరణోద్యమం చేపట్ట బోతున్నట్లుగా ప్రభుత్వానికి గాంధీజీ హెచ్చరిక చేశాడు. 'స్వాతంత్ర్య సారాంశం' అన్న పత్రంలో తన కోర్కెలు పొందుపరచాడు. ఇదే పదకొండు సూత్రాలుగా గుర్తింపు పొందింది. ఈ పదకొండు సూత్రాలలో ఉప్పు పన్ను నిషేధం, మద్యపాన నిషేధం అన్న రెండు సూత్రాలు కూడా ఉన్నాయి. ఉప్పు పన్ను నిషేధంవల్ల మద్యపాన నిషేధం వలన స్వాతంత్ర్యం రావడమేమిటి అని వామపక్షీయులంతా విస్తు

పోయారు. కాని తాను దాని ద్వారా సాధించదలచుకొన్నదేమిటో గాంధీజీకి బాగా తెలుసు.

మార్చి రెండవ తేదీన వైస్రాయ్ లార్డ్ ఇర్విన్‌కు వ్రాసిన లేఖలో ఉప్పుపైన పన్ను వేయడమంటే పేద ప్రజలను హింసించడమేనని, ఉప్పు ఆనేది ధనికులకంటే పేదవారు నిత్యము సేవించే పదార్థమని అలాంటి పదార్థంపైన కూడా పన్ను విధించడం నిర్దాక్షిణ్యమైన చర్య అని గాంధీజీ పేర్కొన్నాడు. స్వాతంత్ర్య సముపార్జన ముఖ్యంగా పేదవారి ప్రయోజనాలు కాపాడటానికే కాబట్టి అందుకు ప్రథమ చర్యగా ఉప్పు పన్నును వ్యతిరేకిస్తూ ఉద్యమం చేపట్టుతున్నామని తెలియజేశాడు. దీనికి ఇర్విన్ చిందులు తొక్కుతూ సమాధానం ఇచ్చాడు. ఆ ఉద్యమం చట్ట వ్యతిరేకమని, శాంతి భద్రతలకి భంగం కల్గించేదీ అవుతుందని, కాబట్టి దాని తలంపు విరమించవలసిందని ఇర్విన్ హెచ్చరించాడు. దానికి గాంధీజీ ఉద్వేగపూరితమైన సమాధానం ఇచ్చాడు. "నేను మోకాళ్ళపైపడి భిక్ష వేడితే మీరు రాళ్ళతో తలపై మోదారు. ఆంగ్లేయులు బలప్రదర్శనకు తప్ప లొంగరని నాకు బోధపడింది. భారత ప్రజలకు అసలైన శాంతి నేడు జైళ్ళలోనే లభిస్తోంది. దేశం అంతా ఒక పెద్ద జైలుగా కనిపిస్తోంది. మా గుండెలను పిండుతున్నట్టి ఈ శ్మశాన శాంతిని భగ్నం చేసేందుకైనా నేను ఈ చట్టానికి వ్యతిరేకంగా పోరాడదలచుకొన్నాను'' అని వ్రాశాడు. అనతికాలంలోనే 'ఉప్పు' అనేది స్వాతంత్ర్య మంత్రంగా రూపొందింది. దండి సత్యాగ్రహానికి సన్నాహాలు మొదలయ్యాయి. దేశం అంతటా బ్రిటిష్ వ్యతిరేకత కారుచిచ్చులా వ్యాపించింది. ఈ వ్యతిరేకత సైన్యంలోకి కూడా చొచ్చుకుపోయింది. పెషావర్‌లో శాంతియుతంగా ప్రదర్శన జరుపుతున్న సత్యాగ్రహులపై కాల్పులు జరపమని ఆదేశాలు ఇస్తే రాయల్ గర్‌వాల్ రైఫుల్స్ దళం తిరస్కరించింది. బ్రిటిష్ వారి దమనకాండను

ప్రజలు అహింసాయుతంగానూ, క్రమశిక్షణా పూరితంగానూ ఎదుర్కొని తమ శక్తిని ప్రదర్శించారు.

## దండి సత్యాగ్రహ కాలంలో సుభాస్

సుభాస్ బోస్‌పైన బ్రిటిష్ ప్రభుత్వం లెక్కకుమించిన కేసులు పెట్టింది. అలాంటి కేసులలో ఒకదానిని పురస్కరించుకొని బోస్ బాబుకు ఒక సంవత్సరం జైలు శిక్ష విధించి, 1930 జనవరి 23 వ తేదీన సెంట్రల్ జైలుకు పంపించారు. ఇంతలో మహాత్మా గాంధీ ఉప్పు చట్టానికి వ్యతిరేకంగా సత్యాగ్రహం తలపెట్టి, మార్చి 12 వ తేదీన అహమ్మదాబాద్ నుండి సముద్రతీరం వరకు సత్యాగ్రహ యాత్ర ప్రారంభించాడు. సముద్రపు ఒడ్డున ఉప్పు తయారుచేయడం ఈ ఉద్యమంలో ఒక భాగం. ఈ ఉద్యమం దండి సత్యాగ్రహంగా ప్రసిద్ధి చెందింది. దండి సత్యాగ్రహమన్నది ఒక దివ్యమైన సంకల్పం. ఈ సత్యాగ్రహం తీవ్రమైన పరిణామాలకు దారి తీస్తుందని బ్రిటిష్ ప్రభుత్వం గ్రహించింది. మార్చి నెలాఖరుకు దేశంలో 80 వేలమంది అరెస్టు అయ్యారు.

గాంధీజీని మే 5 వ తేదీ అర్ధరాత్రి అరెస్టు చేశారు. కాని ఉద్యమం నిరంతరాయంగా సాగింది. స్వాతంత్ర్యం కొరకు సాగిన ఈ పోరాటాన్ని అణచడానికి బ్రిటిష్ ప్రభుత్వం తన దమననీతిని ప్రయోగించింది. జైలు గోడల మధ్యవుంటూ బయట జరుగుతున్న విషయాలన్నీ ఎప్పటికప్పుడు బోస్‌బాబు తెలుసుకొంటూనే ఉన్నాడు. ఆ ఉద్యమంలో గాంధీజీ నాయకత్వం ప్రశంసాపాత్రమైనదని బోస్ కొనియాడాడు. నిర్బంధంలో ఉన్న రాజకీయ ఖైదీలను బ్రిటిష్ అధికారులు నానాబాధలకు గురిచేస్తూ ఉండడం చూచి బోస్‌బాబు సహించలేకపోయాడు. జూలై మాసాంతంలో తన నిరసన తెలియజేస్తూ జైలులో సుభాస్ నిరాహారదీక్షకు పూనుకొన్నాడు. అధికారులు తగిన హామీలు ఇచ్చిన మీదట తన నిరసన వ్రతం నిలిపి

వేశారు. జైలు నుండి బోస్‌బాబును సెప్టెంబరు 25 నాడు విడుదల చేశారు. బోస్‌బాబు కలకత్తా మునిసిపల్ కార్పొరేషన్ మేయర్‌గా ఎన్నుకోబడ్డాడు.

## ప్రజానేతగా సుభాస్

సుభాస్ లాహోర్ కాంగ్రెస్ సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానం ఆమోదించిన తర్వాత దేశమంతటా జనవరి 26 ను స్వాతంత్ర్య దినంగా జరపడం పరిపాటి అయింది. 1931 జనవరి 26న కలకత్తాలో స్వాతంత్ర్య దినం జరపాలని నిర్ణయమైంది. సుభాస్ దానికి నాయకత్వం వహించాడు. ప్రభుత్వం ఊరేగింపును నిషేధించింది. కాని సుభాస్ ఊరేగింపు బయలు దేరదీశాడు. బ్రిటిష్ ప్రభుత్వం తన దమననీతిని ప్రయోగించింది. శాంతి యుతంగా జరుగుతున్న ఊరేగింపుపైన పోలీసులు విరుచుకుపడ్డారు. పాశ వికంగా లాఠీ చార్జి చేశారు. సుభాస్‌కు తీవ్రమైన గాయాలు తగిలాయి. ఈ గాయాలు ఆయనలో పట్టుదలను ఇంకా పెంచాయి. ప్రభుత్వం సుభాస్‌ను అరెస్టుచేసింది. ఆరు మాసాలు శిక్ష విధించారు. ఈలోగా 1931 మార్చి 5 వ తేదీన గాంధీ - ఇర్విన్ ఒడంబడిక జరిగింది. తత్ఫలితంగా సుభాస్ విడుదల అయ్యాడు.

కాంగ్రెస్‌లో అనేకులూ, వామపక్షీయులూ ఈ ఒడంబడికను నిశితంగా విమర్శించారు. కాని మార్చినెల ఆఖరులో జరిగిన కరాచీకాంగ్రెస్‌లో ఈ ఒప్పందంపై విశ్వాసం ప్రకటించడం జరిగింది. గాంధీజీతోపాటు కరాచీ వరకు బోస్‌బాబు ప్రయాణం చేశాడు. ఈ ఒప్పందం గూర్చి అనేక విషయాలు మాట్లాడాడు. అయినా గాంధీజీ మనసును మార్చలేకపోయాడు. ఆ తర్వాత మాట్లాడుతూ 'గాంధీ - ఇర్విన్ ఒడంబడిక అసంతృప్తినీ, నిస్పృహనూ కల్గించేదిగా ఉంది' అన్నాడు సుభాస్. ఇటు భారతీయులు, అటు బ్రిటిష్ వారు కూడా ఈ ఒడంబడికను విమర్శించారు. విన్‌స్టన్ చర్చిల్ తన వైమనస్య ధోరణిలో మాట్లాడుతూ ''బ్రిటిష్ చక్రవర్తి

ప్రతినిధులతోపాటు సమాన హోదాలో ఒక అర్ధనగ్న ఫకీరు (గాంధీ) చర్చలలో పాల్గోవడం అలజడి కల్గించడమే కాక కంపరం పుట్టిస్తున్నది" అన్నాడు. బ్రిటిష్ అధికారులలో చాలా మంది ఈ ఒడంబడికపట్ల అసంతృప్తిని ప్రకటించారు. ఈలోగా ఇర్విన్ స్థానంలో లార్డ్ విల్లింగ్డన్ అధికారం చేపట్టాడు. రౌండ్ టేబుల్ సమావేశానికి గాంధీజీ ఇంగ్లాండు వెళ్ళవలసి ఉంది. అయితే ఇరువర్గాలలోనూ ఈ ఒడంబడికపట్ల ప్రబలిన అసంతృప్తి కారణంగా ఆలస్యమవుతూ వచ్చింది. చివరికి కాంగ్రెస్ తరపున ఏకైక ప్రతినిధిగా ఆగష్టు 29 నాడు గాంధీజీ లండన్ బయలు దేరి వెళ్ళాడు.

మొట్టమొదటి సమావేశంలోనే భారత వ్యవహారాల శాఖ కార్యదర్శి సర్ శామ్యూయేల్ హోర్ మాట్లాడుతూ, తక్షణమే భారత దేశానికి స్వాతంత్ర్యం ఇవ్వడంగానీ, అధినివేశ ప్రతిపత్తి కల్గించడం కానీ వీలుపడదని స్పష్టం చేశాడు. భారత ప్రజల ఏకైక ప్రతినిధిగా గాంధీజీ పాల్గొనడంలో ఔచిత్యం లేదన్నాడు. గాంధీజీ కూడా ఇక ఆ సమావేశాలవల్ల లాభం ఏమీ లేదని తేల్చుకొన్నాడు. ఆవతల వందమంది కూర్చుని రకరకాల వాదనలతో ఇబ్బంది పెడుతూ ఉండగా భారతదేశం తరపున ఒక్క ప్రతినిధి కూర్చుని సమాధానం చెప్పడమనేది అర్థంలేని విషయమనీ,అసలు ఈ ప్రతిపాదనకు గాంధీజీ అంగీకరించి ఉండవలసింది కాదనీ బోస్ ప్రకటించాడు. మొదట్లో వైస్రాయి ప్రతిపాదించిన విధముగా జాతీయ ముస్లిం సోదరులను కూడా కలుపుకొని పదిహేను మందికి తక్కువ లేకుండా మన ప్రతినిధులు కూడా పాల్గొని అవతలి ప్రతిక్రియాత్మక శక్తుల నోరు మూయిస్తే బాగుండేది అన్న అభిప్రాయం వెలిబుచ్చాడు సుభాస్. అసలు గాంధీజీ ఆ సమయంలో లండన్ వెళ్ళడము పొరపాటు, అంతగా వెళ్ళాలనుకొంటే లేబర్ ప్రభుత్వం మారకముందు 1930 లోనే వెళ్ళవలసింది అని కూడా అన్నాడు.

ఈలోగా బ్రిటిష్ ప్రభుత్వపు దమననీతి పెచ్చుపెరిగింది. చీఫ్ కమీషనర్ పిలిచిన సమావేశానికి హాజరుకాలేదన్న పనికిమాలిన కారణం చూపి సరిహద్దు గాంధీగా ప్రఖ్యాతి పొందిన ఖాన్ అబ్దుల్ గఫర్‌ఖాన్‌ను అరెస్టు చేశారు. పన్ను ఎగవేత కార్యక్రమాన్ని అణచివేయడానికి బెంగాల్ లోని మిడ్నపూర్ జిల్లాలో అనేక అరాచక చర్యలకు పూనుకొన్నారు. ఆ కోపంతో ప్రజలు ఇంగ్లీషు మేజిస్ట్రేట్లను కొందరిని కాల్చిచంపారు. బ్రిటిష్ ప్రభుత్వం ఇంకా రెచ్చిపోయి చిట్టగాంగ్‌లో మార్షల్ లా విధించింది. దానితో బెంగాల్ ప్రాంతీయ కాంగ్రెస్ కమిటీ గాంధీ- ఇర్విన్ ఒడంబడికకు గోరీ కట్టబడిందనీ, తిరిగి సహాయనిరాకరణోద్యమం చేపట్టాలనీ ప్రకటించింది.

ఈసారి కూడా రౌండ్ టేబుల్ సమావేశం విఫలం కావడంతో 28 డిశంబరు, 1931 లో గాంధీజీ భారత దేశానికి వట్టి చేతులతో తిరిగి వచ్చాడు. దేశంలో జరుగుతున్న కాల్పులూ, అరెస్టులూ, అరాచక కృత్యాలూ చూసి వైస్రాయిగా ఉన్న లార్డ్ విల్లింగ్‌డన్‌కు వెంటనే శాంతి యుత పరిస్థితి నెలకొల్పడానికి తగిన చర్యలు తీసుకోవలసిందగా గాంధీజీ విజ్ఞప్తి చేశాడు. అయితే వైస్రాయి గాంధీజీకి ఇంటర్వ్యూ కూడా ఇవ్వ లేదు. 4 జనవరి, 1932 నాడు గాంధీజీ అరెస్టు అయ్యాడు. అంతకు రెండు రోజులు ముందే బోస్‌బాబు అరెస్టు అయ్యాడు. నెహ్రూను, ఇతర కాంగ్రెస్ నాయకులను కూడా అరెస్టు చేశారు. ఒక్కుమ్మడిగా ప్రజలపైన విరుచుకుపడి, అనేక రకాలుగా హింసించడం ప్రారంభించారు. అందుకు గాను అనేకమైన ఆర్డినెన్సులు జారీ చేశారు. దేశంలో బ్రిటిష్ వస్తువుల బహిష్కరణ, కల్లు, సారా దుకాణాలవద్ద ధర్నాలు, అనధికార సమా చారాన్ని అందించే 'కాంగ్రెస్ బులెటెన్లూ' 'హర్తాళ్ళూ' ఎల్లెడలా నిత్య కృత్యాలై పోయాయి. బహిష్కరించబడిన కాంగ్రెస్ పార్టీ ఢిల్లీలో మహా సభలు కూడా నిర్వహించింది. 50,000 మంది జైళ్ళకు వెళ్ళారు. ఆరు మాసాలలోనే సహాయ నిరాకరణోద్యమం అణచటానికి వీలులేని స్థాయికి

ఎదిగింది. బ్రిటిష్ ప్రభుత్వం దిక్కుతోచని స్థితిలో పడింది. ఉద్యమంలో పాల్గొనకుండా ఉన్న భులాభాయ్ దేశాయ్, సుభాస్ అన్నగారైన శరత్ చంద్ర బోస్ ప్రభృతులను కూడా అరెస్టు చేశారు. 163 భారతీయ పత్రికల పైన చర్య తీసుకొన్నారు. సంపాదకులను, ముద్రాపకులను జైళ్ళలో పెట్టి ముద్రణాశాలలపై విరుచుకుపడి స్వాధీనం చేసుకొన్నారు. పోలీసు కాల్పులు సాధారణ సంఘటనలై పోయాయి.

ఇంతలో ప్రజల దృష్టి మరోవైపు మరలింది. సెప్టెంబర్ మూడవ వారంలో గాంధీజీ ఆమరణ నిరాహారదీక్ష ప్రారంభించారు. బ్రిటిష్ ప్రధాని రామ్సే మెక్‌డొనాల్డ్ 'కమ్యూనల్ ఎవార్డ్' ప్రకటించడంతో గాంధీజీ ఈ చర్య తీసుకున్నారు. కులమూ, మతమూ ప్రాతిపదికగా నియోజక వర్గాలను విభజించి ఓటింగ్ హక్కును ప్రసాదించడం ఈ ప్రకటన ముఖ్యోద్దేశ్యం. హిందూ సమాజంలో చీలికలుతెచ్చే ఉద్దేశ్యంతోనే ఈ విధంగా చేయడం జరిగిందని గాంధీజీ విశ్వసించాడు. గాంధీజీ ప్రాణాలు కాపాడాలని, నిరాహార దీక్షను విరమింప చేయాలని అనేకులు ప్రయత్నించారు. దీక్ష ప్రారంభించిన అయిదవ రోజున గాంధీజీకీ, దళిత వర్గాల నాయకుడు డాక్టర్ అంబేద్కర్‌కూ అంగీకారయోగ్యమైన ఒక సూత్రం రూపొందించారు. గాంధీజీ ప్రాణాన్ని రక్షించటం ముఖ్యమైన విషయము అయినప్పటికీ, సహాయ నిరాకరణోద్యమం ప్రక్కత్రోవ పట్టిందే అని సుభాస్ బాధపడ్డాడు. అతిశీఘ్ర కాలంలో స్వరాజ్యం సంపాదించాలని ఉవ్విళ్ళూరుతున్న సుభాస్‌కు ఇది ఆశాభంగాన్ని కలిగించింది

ఈ ఆలోచనలతో ఉక్కిరి బిక్కిరై పోతున్న కారణంగా సుభాస్ ఆరోగ్యం మళ్ళీ దెబ్బతిన్నది. మాండలే జైలులో ప్రారంభమైన అనారోగ్యం ఇప్పుడు మళ్ళీ తిరగబెట్టింది. గాలి మార్పుకని ఒక జైలు నుంచి మరో జైలుకు మారుస్తూ పోయినప్పటికి ప్రయోజనం లేకపోయింది. మద్రాసు

జైలులో ఉండగా జరిగిన ఒక సంఘటన ఆయన ఆవేదనకు అద్దం పట్టింది. మద్రాసు చీఫ్ ప్రెసిడెన్సీ మేజిస్ట్రేట్ అబ్బాస్ అలీ ఒక రోజు జైలు తనిఖీకి వచ్చి మామూలు ధోరణిలో బోస్‌ను 'క్షేమంగా ఉన్నారా?' అని అడిగాడు. బోస్ చర్రున మండిపోయి "ఏరకమైన నేరం మోప కుండా, విచారణ లేకుండా నన్ను జైలులో నిర్బంధించినందుకు నీవు, నీ ప్రభుత్వం సిగ్గుతో తలవంచుకోవాలి. 'క్షేమంగా ఉన్నావా' అని ఏ మొఖం పెట్టుకొని అడుగుతున్నావు? నీవే నా స్థానంలో ఉన్నట్లయితే ఎలాంటి సమాధానం చెప్పేవాడివో ఒక్కసారి ఊహించుకో" అన్నాడు. బోస్ ఆరోగ్యం బాగా చెడిపోవడంతో, వైద్యుల సంఘం సలహాపై సంయుక్త రాష్ట్రాలు (ఇప్పటి ఉత్తరప్రదేశ్ ప్రాంతం) లోని భోవాలి శానిటోరియంకు తరలించారు. ఇక్కడ కూడా ఆరోగ్యం ఏ మాత్రం కుదుటబడక పోవడంచేత బోస్‌ను పరీక్షించడానికి మరో వైద్య సంఘాన్ని నియమించారు. ఆ వైద్యుల సంఘం బోస్‌ను గాలి మార్పుకొరకై వెంటనే ఐరోపాలో ఏ దేశానికైనా పంపవలసినదిగా సిఫార్సు చేసింది. అక్కడ నుంచి వెళ్ళిపోయేముందు తలిదండ్రులను చూడటానికి కూడా ప్రభుత్వం అనుమతివ్వలేదు. ఒక పోలీసు పటాలం లాంటిది వెంటరాగా జబల్పూర్ నుంచి బొంబాయికి చేరి, అక్కడ నుండి పొగఓడ 'గంగ' లో ఫిబ్రవరి 13, 1933 నాడు బోస్ ఐరోపాలోని వియన్నాకు బయలుదేరాడు. ఈ విధంగా దేశబహిష్కరణ వలన మరోసారి బోస్ ఐరోపా పర్యటన ప్రారంభమైంది.

## విదేశాలలో స్వదేశం కోసం

వియన్నాలో సుభాస్ విఠల్‌భాయ్ పటేల్‌ను కలుసుకోవడం తటస్థించింది. సుభాస్ జీవితంలో ఇదొక మరువరాని ఘట్టం. అనేక అంశాలపైన విఠల్‌భాయ్ ఆలోచనలూ ఆయన ఆలోచనలూ కలిశాయి.

ఇరువురి ఆశయాలు ఒకటే. ఆశయ సాధనకు ఆలోచించే మార్గాలు కూడా ఒక్కటే అయ్యాయి. వల్లభాయ్ పటేల్‌లా కాక విఠల్‌భాయ్ తీవ్రవాది. ఏ విషయంలోనూ రాజీ ధోరణిని అంగీకరించే వ్యక్తి కాదు. సుభాస్‌బాబు, విఠల్‌భాయ్ ఇద్దరూ కలిసి ఒక సంయుక్త ప్రకటన చేశారు. ఆ ప్రకటనలో గాంధీజీ తన సత్యాగ్రహాన్ని మధ్యలోనే నిలుపుచేయడాన్ని వారు తీవ్రంగా విమర్శించారు. గాంధీజీ నాయకత్వానికి ప్రత్యామ్నాయంగా తీవ్రవాద నాయకత్వం రూపొందించవలసిన అవసరాన్ని నొక్కి వక్కాణించారు.

సుభాస్ ఆలోచన ఒక్కటే- ఏ విధంగానైనా సరే బ్రిటిష్ సామ్రాజ్యాన్ని కూకటివ్రేళ్ళతో పెల్లగించాలి. అందుకుగాను అవసరమైతే బ్రిటిషువారి శత్రువులను మన మిత్రులుగా చేసుకోవడానికీ కూడా సిద్ధమే. వియన్నా చేరాక సుభాస్‌బాబుకు కొంత విశ్రాంతి చిక్కింది. ఈ తీరిక సమయాన్ని వృథా పుచ్చకుండా ఇటలీ, స్విట్జర్‌లాండ్, రుమేనియా, బల్గేరియా, యుగోస్లావియా, జెకొస్లొవేకియా మొదలైన దేశాలలో పర్యటించాడు. అదే సమయంలో విఠల్‌భాయ్ పటేల్ ఒక లక్ష రూపాయల నిధిని ఏర్పాటుచేశాడు. విదేశాలలో భారతదేశ సమస్యను ప్రచారం చేయడానికి ఆ మొత్తం ఖర్చుపెట్టే అధికారం బోసుకు ఇచ్చాడు. 1933 లో 'నయాన్' అనే గ్రామంలో విఠల్‌భాయ్ కన్నుమూశాడు. అతని శవాన్ని భారతదేశానికి పంపడానికి శవపేటికలో మార్సెల్స్ వరకు వచ్చి బరువైన హృదయంతో వెనుదిరిగాడు సుభాస్. విదేశాలలో భారత జాతీయ సమస్యను ప్రచారం చేయడంలోనే విఠల్‌భాయ్ తన ప్రాణాలను కోల్పోయాడు. విఠల్‌భాయ్ పాడైన ఆరోగ్యంతోనే అమెరికాలో మూడు మాసాలు పర్యటించి 85 ఉపన్యాసాలు ఇచ్చాడు. జెనీవా కేంద్రంగా యూరోప్‌లోనూ, అమెరికాలోనూ శాఖలు స్థాపించి ప్రచారం చేయాలని విఠల్‌భాయ్ ఆశిం

చాడు. తన జీవితకాలంలోనే 'డబ్లిన్'లో 'ఇండో-ఐరిష్ లీగ్' అను పేరుతో ఒక శాఖ స్థాపించాడు. తాను తలపెట్టిన కార్యభారాన్ని సుభాస్ చేపట్టడం వలన ప్రశాంతంగా కన్ను మూశాడు.

లండన్‌లో జరిగే భారత రాజకీయ సమ్మేళనానికి అధ్యక్షత వహించవలసినదిగా నేతాజీని ఆహ్వానించారు. కాని సుభాస్ ఇంగ్లాండులో ప్రవేశించరాదన్న ఆంక్షలు ఉన్నకారణంగా ఆయన వ్రాసి పంపించిన అధ్యక్షోపన్యాసాన్ని ఆ సమ్మేళనంలో చదివి వినిపించారు.

'......రాజ్యాంగ బద్ధమైన ప్రజాస్వామిక ప్రభుత్వాన్ని నెల కొల్పడం ద్వారా 17 వ శతాబ్దంలో ప్రపంచ నాగరికతకు ఇంగ్లాండు దోహదం చేసింది. అలాగే 18 వ శతాబ్దంలో స్వేచ్ఛ, సమానత్వం, స్వాతంత్ర్యం అన్న నినాదం అందించడం ద్వారా ఫ్రాన్సు ప్రపంచ సంస్కృతికి ఎంతో మేలు చేసింది. 19 వ శతాబ్దంలో మార్క్సు వాదాన్ని అందించి జర్మనీ ప్రపంచానికి ఎంతో సేవ చేసింది. 20 వ శతాబ్దంలో ప్రోలిటేరియన్ ప్రభుత్వం, ప్రోలిటేరియన్ సంస్కృతి ప్రపంచం ముందుంచి ప్రపంచ నాగరికతను, సంస్కృతిని రష్యా ఒక మెట్టు పైకి తీసుకుపోయింది. ఇప్పుడు ప్రపంచ నాగరికతనీ సంస్కృతినీ పెంపొం దించే బాధ్యత భారతదేశం వహించవలసి ఉంది', అన్నాడు సుభాస్.

జూలై 1933 లో సుభాస్‌చంద్రుడు వార్సానుండి బెర్లిన్ చేరు కొన్నాడు. జర్మనీలో భారతదేశంపట్ల వ్యాపించియున్న దురభిప్రాయాన్ని పోగొట్టడానికి ప్రయత్నించాడు. ఒకానొక సందర్భంలో మెయిన్ కాంప్ఫ్ (Mein kempf) అన్న పుస్తకంలో హిట్లర్ ఇలా వ్రాశాడు:

'భారతదేశంలో పరిపాలనా యంత్రాంగాన్ని సంపూర్ణంగా భార తీయులు వశపరచుకొన్నప్పుడు లేదా బ్రిటిష్ వారికంటె బలవంతులైన శత్రువులు భారతదేశాన్ని ఆక్రమించుకొన్నప్పుడు మాత్రమే ఇంగ్లీషువారు

భారతదేశం విడిచిపెట్టిపోతారు. అంతేగాని తిరుగుబాటుదారులపట్ల ఒరిగేది ఏమీ ఉండదు...... నేను, ఒక జర్మన్ దేశస్థుడిగా, ఇప్పుడు జరుగుతున్న వ్యవహారాలన్నీ తెలిసి ఉండి కూడా, వేరే ఒక శక్తివంతమైన దేశం భారతదేశాన్ని ఆక్రమించుకోవడం కంటె భారతదేశం బ్రిటిష్‌వారి ఆధీనంలోనే ఉండటాన్ని కోరుకొంటాను.'

హిట్లర్‌తో ముఖాముఖి మాట్లాడి భారతదేశముపట్ల హిట్లర్‌కు ఉన్న అభిప్రాయంలో మార్పు తేవాలని సుభాస్ ఎంతగానో కోరుకొన్నాడు. హిట్లర్‌ను కలుసుకోవాలని ఎంత ప్రయత్నించినా కుదరలేదు.

బెర్లిన్‌లో ఇండియా కాలనీలో నివసిస్తున్న భారతీయులను కలుసుకోవడం నేతాజీ చేయదలచుకొన్న మరో పని. ఆ భారతీయులలో మూడు వర్గాలు ఉన్నాయి. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో జర్మన్‌ల సహకారంతో భారతదేశంలో విప్లవం తేవాలని ప్రయత్నించినవారు ఒక వర్గం. ఈ వర్గంలో చంపకరామన్ పిళ్ళై, సరోజినీ నాయుడు తమ్ముడు వీరేంద్రనాథ్ చటోపాధ్యాయ ఉన్నారు. రెండవ వర్గంవారు జర్మన్ సోషలిష్టుపార్టీతో సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకొని పనిచేస్తున్నవారు. ఇక మూడోవర్గంవారు అప్పుడే క్రొత్తగా చదువులకొరకై బెర్లిన్ చేరిన నవ యువకులు. వీరికి నాయకుడు ఏ.సి.యన్. నంబియార్. బెర్లిన్‌లో భారత సమాచార కేంద్రాన్ని నెలకొల్పవలసినదిగా ఒకసారి నెహ్రూ ఈయనను కోరాడు. జర్మనీని సందర్శించడానికి వచ్చిన భారతీయ నాయకుల రాకపోకలు అందరికీ తెలియజేయడం ఈ కేంద్రం నిర్వహించే ముఖ్యమైన పనులలో ఒకటి. ఈ నంబియార్‌గారే ఆటు తర్వాత రెండవ ప్రపంచ యుద్ధకాలంలో బెర్లిన్‌లో సుభాస్ చంద్రునికి కుడిభుజంగా పని చేశాడు.

బెర్లిన్‌లో ఉన్న కొద్ది సమయంలో జర్మన్ ప్రభుత్వం బ్రిటన్, భారతదేశాల పట్ల అనుసరిస్తున్న విధానంలో మార్పు తేవాలని సుభాస్

కృషి చేశాడు. ఆ రోజుల్లో జర్మన్ మంత్రి ఫ్రాంక్ రూపొందించిన చట్టాన్ని సుభాస్ తీవ్రంగా విమర్శించాడు. జర్మన్-భారతీయుల మధ్య వివాహం ఆ చట్టంలో సంకర వివాహంగా వర్ణించబడింది. గాంధీజీ బ్రిటిష్ వ్యతిరేక విధానం అనుసరిస్తున్న బోల్షివిక్ ఏజంటు అని హెర్మన్ గోరింగ్ ప్రకటించడంపట్ల కూడా బోస్ తీవ్ర నిరసన తెలియజేశాడు. ఐరోపాలో ప్రవాసంలో ఉండగానే 'ది ఇండియన్ స్ట్రగుల్ 1920-34' అన్న పుస్తకాన్ని వ్రాశాడు. ఈ పుస్తక రచనలో మిస్. ఎమిలీ శాంకల్ (Miss. Emilia Schenkl) సుభాస్‌కు ఎంతగానో తోడ్పడింది. ఆ తర్వాత ఈమెనే తన శాశ్వత కార్యదర్శిగా సుభాస్ నియమించు కొన్నాడు. భారతీయ పద్ధతిలో అమెను ఫిబ్రవరి 1942 లో వివాహం చేసుకొన్నాడు. వారికి వియన్నాలో పుట్టిన బిడ్డే 'అనిత'. ఈమె ఆ తర్వాత 1965 లో వియన్నా విశ్వవిద్యాలయం నుంచి డాక్టరేట్ పట్టా పుచ్చుకొంది.

భారతదేశంలో జాతీయ విప్లవం తేవడానికి ఏక కాలంలో అనేక రంగాలలో పని చేయవలసి ఉంటుందనీ, బ్రిటిష్‌వారితోనే కాక వారి మిత్రులుగా ఉన్న భారతీయులతో కూడ పోరాటం సాగించవలసి ఉంటుం దనీ బెర్లిన్‌లో ఉన్న కాలంలో సుభాస్ తన మిత్రులతో చెపుతూ ఉండే వాడు.

తండ్రి జానకీనాథ్‌బోస్ వ్యాధిగ్రస్తుడయ్యాడన్న వార్త తెలుసుకొని ఆయనను చూడటానికి సుభాస్ వెంటనే విమానంలో బయలుదేరి కరాచీ చేరాడు. ఆయన కలకత్తా చేరాక ఇల్లుదాటి బయటకు పోరాదనే ఉత్తర్వులు విమానాశ్రయంలోనే బోస్‌కు అందజేశారు. సుభాస్ భారతదేశంలో అడుగు పెట్టిన రోజునే తండ్రి మరణించాడు. సుభాస్ ఆరోగ్యం ఇంకా కుదుట పడలేదు. తిరిగి యూరోప్‌కు పయనమై వెళ్ళిపోయాడు. యూరోప్ దేశా

ంలో విరివిగా పర్యటన కొనసాగించి అనేకమంది భారతీయులను, ఐరోపా నాయకులను కలుసుకొన్నాడు.

ఈ పర్యటనల సందర్భంలో సుభాస్ అనేకసార్లు ఇటలీ మీదుగా పోవడం తటస్థించింది. కొన్ని రోజులపాటు ఇటలీలో ఉంటూ ఉండడం కూడా జరిగేది. అటువంటి సందర్భాలలో ఇటలీలో పనిచేసిన అజ్ఞాత సంస్థ కార్బొనీర్ (Corbonieri)ని గూర్చి తెలుసుకొంటూ ఉండేవాడు. వాస్తవానికి ఈ సంస్థ దక్షిణ ఇటలీలో ఆవిర్భవించింది. ఉన్నత ప్రభుత్వాధికారులు, సైనికాధికారులు ఈ సంస్థలో సభ్యులుగా ఉండేవారు. మాజినీ కూడా ఈ సంస్థలో సభ్యుడే. ఆ రోజులలో ఒక్క రోమ్ ప్రాంతం మినహా మిగిలిన ఇటలీ అంతా ఆస్ట్రియన్ల ఆధీనంలో ఉండేది. రోమ్ మాత్రం ఫ్రెంచివారి ఆధీనంలో ఉండేది. ఇటలీ ప్రజలకు ఈ పర ప్రభుత్వం నుండి విముక్తి కలిగించేందుకు కృషిచేసిన వారిలో మాజినీ, కవూర్, గారిబాల్డీలను ప్రముఖంగా పేర్కొనవచ్చు. మాజినీ మరియు కవూర్‌లు ఆస్ట్రియన్ల ఉక్కు పిడికిలి నుండి రోమ్ మినహా మిగిలిన ఇటలీ ప్రజలను విముక్తిచేయగా గారిబాల్డీ ఫ్రెంచివారి కబంధ హస్తాల నుండి రోమ్‌కు విముక్తి కలిగించాడు. ఈ ముగ్గురికి స్ఫూర్తినిచ్చిన సంస్థ కార్బొనీర్. కార్బొనీర్ సభ్యులను ఇటలీదేశపు స్వాతంత్ర్య పోరాట ద్రష్టలుగా పేర్కొనవచ్చు. కాలగతిలో సంభవించిన అనేక మార్పుల అనంతరం ఇటలీ పరిపాలనా భారం నియంత అయిన ముసోలినీ వహించాడు.

ఒకానొక సందర్భంలో సుభాస్ బోస్ ముస్సోలినీని కలిశాడు. అప్పుడు వారి సంభాషణ ఇలా సాగింది:

ము : 'భారతదేశానికి అతి త్వరలో స్వాతంత్ర్యం లభిస్తుందని మీరు నిజంగా నమ్ముతున్నారా?'

**సుభాస్: అవును.**

ము : సంస్కరణలు ద్వారానా లేక విప్లవం ద్వారానా- ఏ విధం స్వాతంత్ర్యం సాధించాలనుకొంటున్నారు?

సు : సంస్కరణ విధానం కంటె విప్లవం ద్వారానే అది సాధ్యప తుందనుకొంటున్నాను.

'అయితే మంచి అవకాశాలే ఉన్నాయి' అంటూ, 'మీ వద్ద తత్ బంధమైన ముసాయిదా సిద్ధంగా ఉందా?' అని అడిగాడు ముస్సోలినీ.

బోస్ మౌనంగా ఉండటాన్ని చూచి 'మీరు వెంటనే ఒక ము యిదా తయారు చేసుకొని ఆ ప్రకారం లక్ష్యాన్ని సాధించడానికి ని రామంగా కృషి చేయండి' అన్నాడు ముసోలినీ.

ఐర్లండులో ఐరిష్ విప్లవకారులు కొన్నిసార్లు జర్మన్ల సహాయ తోనూ మరికొన్నిసార్లు స్వతంత్రంగాను తమ అజ్ఞాత విప్లవాన్ని ఎ కొనసాగించినదీ సుభాస్ బోస్ క్షుణ్ణంగా పరిశీలించాడు ఇరువురి శత్రుష ఒకరే కాబట్టి ఐర్లండులో సిన్‌ఫిన్స్ (Sinn Feins) సాగించిన రీతి భారత విప్లవకారులు కూడా పోరాటం సాగిస్తే విజయం తప్పక లభిస్తు దని జర్మన్ స్నేహితులు కొందరు బోస్‌కు చెప్పారు. బోస్ ఆ ఉద మాన్ని తరచి చూశాడు.

ఐర్లండులో కొనసాగిన స్వాతంత్ర్య పోరాటానికీ భారత స్వాతంత్ర పోరాటానికీ దగ్గరిపోలికలున్నాయి. ఐర్లండులో కూడ మొదట రాజ్యాం పరంగా 'ది ఐరిష్ నేషనలిస్టు పార్టీ' పోరాటం సాగించింది. ఆ పద్ధతిలో భారతదేశంలోని 'ఇండియన్ లిబరల్ ఫెడరేషన్' కూడా పోరాట మొదలు పెట్టింది. ఈ రెండు పార్టీలు అధికివేళ ప్రతిపత్తి లభిస్తే చా . కొ . వే ఆ తర్వాత ఐర్లండులో సిన్‌ఫిన్ ఉద్యమం ద్వార ఆవిర్భవించిన 'ది యునైటెడ్ ఐరిష్‌మన్' సంపూర్ణ స్వాతంత్ర్యం త

ధ్యేయమని ప్రకటించింది. అలాగే భారతదేశంలో బోస్ నాయకత్వం వహించిన 'ఇండియన్ రాడికల్స్' కూడా సంపూర్ణ స్వాతంత్ర్యమే తమ లక్ష్యమని ప్రకటించారు. 1916-17 నుండి 1941-45 మధ్యకాలంలో ఈ రెండు దేశాల పరిస్థితుల మధ్య పోలికలు కొట్టవచ్చినట్లు కన్పిస్తాయి. బోస్‌బాబు డివేలరాను కలుసుకొన్నాడు అంతకు పూర్వమే భారతదేశంలో సాగుతున్న స్వాతంత్ర్య పోరాటాన్ని గూర్చి డీవెలరా ఐరిష్ ప్రజలకు వివరించి ఉన్నాడు. ఆయన ద్వారానే ప్రపంచ దేశాలకు ఈ పోరాటాన్ని గూర్చి వివరింపజేయాలని బోస్‌బాబు కోరుకొన్నాడు.

బెర్లిన్‌లో ఉన్నకాలంలోనే సుభాస్ బోస్ టర్కీలోని పరిణామాలు కూడా నిశితంగా పరిశీలించాడు. 1908లో 'యంగ్‌టర్క్స్' విప్లవం ప్రారంభమైన తర్వాత టర్కీలో కొన్ని మౌలికమైన మార్పులు వచ్చాయి. జర్మనీ సహాయంతో టర్కీ తన సైన్యాన్ని ఆధునికం చేసింది. పరిపాలనా యంత్రాంగాన్ని పటిష్టం చేసుకొని ఇతర రాజ్యాలపై ఆధారపడటం తగ్గించుకొంది. 'యూనిటీ అండ్ ప్రోగ్రెసివ్ పార్టీ' ఆధ్వర్యంలో 'యంగ్ టర్క్స్' విప్లవం సాగింది. ముస్తాఫా కెమాల్ పాషా ముఖ్య నాయకుడు. టర్కీలో అమలు జరిగిన సాంస్కృతిక, సాంఘిక, పరిపాలనా సంస్కరణలు భారత దేశానికి బాగా ఉపయోగపడతాయనీ,ముఖ్యంగా భారత దేశం స్వాతంత్ర్యం పొందిన తర్వాత ముస్లింలను నూతన సాంఘిక జీవనం వైపుకు మరల్చడానికి ఎంతగానో తోడ్పడతాయనీ బోస్ భావించాడు. ఆధునిక టర్కీ పితామహుడు కెమాల్ అతాతుర్క్ ఈ శతాబ్దంలోని రాజనీతిజ్ఞులందరిలో గొప్పవాడని సుభాస్ భావించాడు. అనేక మంది టర్కిష్ నాయకులతో మాట్లాడిన తర్వాత నేతాజీ ఒక విషయం తెలుసుకొన్నాడు. జర్మన్ సేనలు టర్కీలో ఉన్నప్పటికీ జర్మనీవారు ప్రతిపాదించిన అనేక విషయాలను తిరస్కరించి టర్కీ స్వతంత్రంగా వ్యవహ

రించింది. అది విన్నప్పటినుండి జర్మన్లు సహాయం అందించినప్పటికీ అంత రంగిక విషయాల్లో జోక్యం కలుగచేసుకోరనే ధైర్యం బోస్‌కు కల్గింది.

ఫ్రెంచి సాహితీవేత్త రోమైన్ రోలండ్ బోస్ తలపెట్టిన స్వాతంత్ర్య పోరాటాన్ని గూర్చి వ్రాస్తూ, "......సంఘటిత నిరాకర ణోద్యమంలో అవసరమైనప్పుడు హింసాయుత పోరాటం ఒక భాగమే అవుతుంది...... ఐరోపాలో సాగుతున్న యుద్ధంలో బ్రిటన్ తలమునకగా ఉన్నందువలన భారత స్వాతంత్ర్య పోరాటం సఫలీకృతం కావడానికి ఇది తోడ్పడుతుంది" అన్నాడు.

## ప్రపంచ రాజకీయ పరిశీలన

ప్రపంచ రాజకీయాలను నిశితంగా పరిశీలన చేసి ఒక అవగాహనకు రావడం భారత స్వాతంత్ర్యపోరాటానికి ఎంతగానో తోడ్పడుతుందని బోస్‌కు అపారమైన విశ్వాసం ఉంది. అందుచేతనే అనేక దేశాలు తిరిగి అక్కడి రాజకీయాలూ, జీవన పరిస్థితులూ అవగాహన చేసుకోవడానికి బోస్ తీవ్రంగా ప్రయత్నించాడు-తన అనారోగ్యాన్ని లెక్కచేయకుండా. వైద్యం చేయించుకోవడానికి విదేశాలకు వెళ్ళిన వ్యక్తి ప్రపంచ పర్యటన లోనే ఎక్కువ సమయం గడిపేశాడు. ఆయనలోని స్వాతంత్ర్యపిపాస ఆయనను ఎన్నడూ విశ్రాంతి తీసుకోనివ్వలేదు. తన ఒక్కడి సుఖం ముఖ్యమైనదని భావించే వాడైతే ఐ. సి. ఎస్. కు రాజీనామా చేసేవాడే కాదు. భారతీయులందరి సుఖమే తన సుఖం అని భావించేవాడు కాబట్టే తాను ఏ పరిస్థితిలో ఉన్నా స్వాతంత్ర్య సమరాన్నిగూర్చే ఆలోచించాడు.

1936 లో జవాహర్‌లాల్ అధ్యక్షతన కాంగ్రెస్ స్వర్ణోత్సవాలు జరుపుకోవడానికి సమాయత్తమవుతోంది. సుభాస్ బోస్ ఆరోగ్యం కూడా కుదుటబడింది భారతదేశానికి తిరిగి వెళ్ళాలనుకొన్నాడు. కాని వియన్నా లోని బ్రిటిష్ దౌత్య కార్యాలయంవారు భారతదేశానికి తిరిగి వెళితే అరెస్టు

చేయడం న్యాయం అని చెప్పారు. అయినప్పటికీ నేరం చేసి దేశ బహిష్కృతుడైన వ్యక్తివలె యూరోప్‌లో కాలం గడపడం సుభాస్‌కు దుర్భరమనిపించింది. ఏమైతేఅయిందని భారతదేశానికిప్రయాణమయ్యాడు. అనుకొన్నట్టుగానే 1936 ఏప్రిల్‌లో బొంబాయిలో దిగగానే ప్రభుత్వం బోస్‌ను అరెస్టు చేసింది. ఎర్రవాడ జైలులో ఉంచారు. అక్కడ నుంచి 1936 మే మాసంలో కుర్సియాంగ్ జైలుకు మార్చారు. ఇంతలో ఆయన ఆరోగ్యం మళ్ళీ క్షీణించ సాగింది. డిశెంబరు మాసంలో ఆయనను కలకత్తాలోని మెడికల్ కాలేజి హాస్పిటల్‌లో పూర్తి పోలీసు బందో బస్తుతో వైద్యం నిమిత్తం చేర్పించారు. ఈ చికిత్స వలన ప్రయో జనం లేక పోయింది. ఆరోగ్యం మరింతగా క్షీణించింది. 1937 మార్చి 17 వ తేదీన సుభాస్‌ను బేషరతుగా విడుదల చేసింది. హిమాచలప్రదేశ్ లోని డల్‌హౌసీ అనే పర్వత పట్టణంలో స్నేహితుడు డా॥ ధర్మవీర వైద్యం చేయగా సుభాస్ అయిదు నెలలపాటు గడిపాడు. కాస్త ఆరోగ్యం బాగుపడగానే మళ్ళీ రాజకీయ రంగం వైపుగా దృష్టి మళ్ళించాడు. గవర్నమెంట్ ఆఫ్ ఇండియా ఏక్ట్ 1935 ప్రకారం దేశంలో ఎన్నికలు నిర్వహించబడ్డాయి. కాంగ్రెస్ పార్టీ ఈ ఎన్నికలలో ఘన విజయాలు సాధించింది. అంతకు పూర్వం జరిగిన ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీ పోటీ చేయలేదు. స్వరాజ్య పార్టీ పోటీ చేసింది. బొంబాయి, మద్రాస్, బీహార్, ఒరిస్సా, సంయుక్త రాష్ట్రాలు, సెంట్రల్ ప్రావిన్సెస్‌లలో కాంగ్రెస్ ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. అస్సాంలో కాంగ్రెస్ అతి పెద్ద పార్టీగా గెలిచింది కాని, ప్రభుత్వం చేపట్టలేదు. బెంగాల్‌లో 250 స్థానాలకు గాను కేవలం 60 స్థానాలలో మాత్రమే కాంగ్రెస్ గెలిచింది. బ్రిటిష్ వారు తయారుచేసి ప్రకటించిన 'కమ్యూనల్ ఎవార్డు' ఫలితం అది. మత పరంగా నియోజక వర్గాల విభజన జరిగిన పర్యవసానం.

హిందూ-ముస్లిం విభేదాలు దేశవిభజనకు దారితీస్తాయని ఆలోచించి అలాంటి ఆపదనుండి దేశాన్ని రక్షించడానికి చాలా ప్రయత్నం చేశాడు సుభాస్ ప్రముఖ శాస్త్రవేత్త మేఘనాథ్ సాహాతో మాట్లాడుతూ-"...... సమైక్యానికి సంబంధించిన సమస్య ముఖ్యంగా మానసికమైనది. తమది ఒకే జాతి అనే విషయం ప్రజలు అర్థంచేసుకొనేట్లు పదే పదే తెలియ జెప్పాల్సి ఉంటుంది. భాషా, వేషం,ఆహారం ఇత్యాది విషయాలు ఏకత్వానికి దోహదం చేస్తాయే కాని దానిని సృష్టించలేవు" అన్నాడు సుభాస్. ఈ విషయంపైన జిన్నాతో వరుసగా కొన్ని రోజులు చర్చలు జరిపినప్పటికీ జిన్నా మొండి వైఖరి కారణంగా ఆ సంప్రదింపులు విఫలమయ్యాయి.

1937, డిశంబరు మాసంలో బోసు ఆస్ట్రియాలోని ఆరోగ్య కేంద్ర మైన బడగాస్టీన్‌కు వెళ్ళాడు. అక్కడినుండి ఇంగ్లాండు వెళ్ళాడు.

## సుభాస్ అధ్యక్షుడుగా హరిపుర కాంగ్రెస్

హరిపుర కాంగ్రెస్.

అది 51వ కాంగ్రెస్. 1938లో జరిగింది. బార్డోలీకి 11 మైళ్ళ దూరంలో తపతీనదీతీరంలో ఉన్న చిన్న గ్రామం 'హరిపుర'. అధ్యక్ష పదవికి సుభాస్ పేరుతోపాటు అబ్దుల్ కలాం అజాద్, జవాహర్‌లాల్ నెహ్రూ, అబ్దుల్ గఫార్‌ఖాన్ పేర్లుకూడా సూచించబడ్డాయి. కాని ఆ ముగ్గురూ తమ పేర్లు ఉపసంహరించుకొన్నారు. 1938 జనవరి 14వ తేదీన బోస్ ఇంగ్లాండునుంచి మాతృభూమికి తిరిగివచ్చాడు. కరాచీ విమానా శ్రయంలో ఘనమైన సత్కారం లభించింది. భారత జాతీయ కాంగ్రెస్ చరిత్ర సుభాస్ ఎన్నికతో మరోమలుపు తిరిగినట్లుగా యువలోకం ఉప్పొం గింది.

విఠల్‌భాయ్ పటేల్ స్మారకార్థం నిర్మించిన విఠల్ నగరంలో ఆయన జీవిత చరమదశలో అతి సన్నిహితుడుగా ఉన్న స్నేహితుడు

కాం|గెస్ అధ్యక్షపీఠాన్ని అధివసించగా ఆ మహాసభలు జరగటం అన్ని ఎధాల సముచితంగా ఉంది. ఆహ్వాన సంఘంవారు అన్ని ఏర్పాట్లు ఘనంగా చేశారు. సుప్రసిద్ధ కళావేత్త నందలాల్ బోస్ ఆధ్వర్యంలో విఠల్ నగరం యావత్తూ రమ్యంగా అలంకరించారు. 1938 ఫిబ్రవరి 11వ తేదీన మహాత్మా గాంధీ స్వదేశ వస్తు ప్రదర్శన ఏర్పాటు చేశాడు. 13 వ తేదీన రాష్ట్రపతి సుభాస్ విఠల్ నగరానికి చేరుకొన్నాడు. అది 51వ కాంగ్రెస్ కాబట్టి 51 జతల ఎడ్ల రథంమీద ఊరేగింపు జరిపారు. 51 ద్వారాలు నిర్మించారు. 16 వ తేదీన అఖిలభారత కాంగ్రెస్ సభా సమావేశంలో జవాహర్‌లాల్ నెహ్రూ సుభాస్ బోస్‌ను అధ్యక్షస్థానం అలంకరించవలసినదిగా ఆహ్వానించాడు. అది ఒక చరిత్రాత్మక సన్నివేశం. ఆ సన్నివేశాన్ని తిలకించిన ప్రజలు అదృష్టవంతులు. భారతజాతికి ఆశాజ్యోతిగా వెలుగొందిన నాయకుని అధ్యక్షస్థానంలో చూసుకొని ప్రజలు పరవశించారు.

## అధ్యక్షోపన్యాసం

అధ్యక్షోపన్యాసంలోనే తన భావి కార్యక్రమాన్ని సూక్ష్మంగా తెలియజేశాడు బోస్. సామ్రాజ్యవాదాన్ని నిశితంగా విమర్శించాడు. "ప్రతి చోటా సామ్రాజ్యాలు స్వతంత్ర రాజ్యాలుగా చీలిపోయాయి. ఆస్ట్రో - హంగేరియన్ సామ్రాజ్యం కూలిపోయింది. ఆ విధంగానే బ్రిటిష్ సామ్రాజ్యంకూడా కూలిపోతుంది'' అని గర్జించాడు సుభాస్.

'స్వాతంత్ర్యం కోసం పోరాటం సాగిస్తున్న వీరులను పోరాట మార్గంలో నడపడం మాత్రమే వర్కింగ్ కమిటీ కర్తవ్యం అనుకో కూడదు. వర్కింగ్ కమిటీ అనేది స్వతంత్ర భారతదేశపు మంత్రివర్గానికి ప్రతిరూపం. నేను ఊహాలోకం నుంచి మాట్లాడుతున్నానని అనుకోవద్దు. మనకంటె ముందు స్వాతంత్ర్య పోరాటాలను సాగించిన దేశా

అన్నింటిలోను వర్కింగ్ కమిటీలు ఈ రకమైన పాత్ర నిర్వహించాయి. ఎప్పుడో కాదు, మన జీవిత కాలంలోనే భారతదేశం స్వాతంత్ర్యం పొందు తుందని నమ్మేవారిలో నేనొకడిని. కాబట్టి వర్కింగ్ కమిటీ స్వతంత్ర భారత ప్రభుత్వ మంత్రివర్గానికి ప్రతిరూపంగా తయారు కావాలనీ, ఆ విధంగా పనిచేయాలనీ నేను కోరుకుంటున్నాను. డీవెలరా రిపబ్లిక్ ప్రభుత్వం ఆ విధంగానే పనిచేసింది. అధికారాన్ని వశపరచుకొనేముందు ఈజిప్టులోని వాఫ్టు పార్టీ కార్యవర్గం అలాగే పనిచేసింది. రాజకీయ అధి కారం మన వశమైనప్పుడు సమస్యలను పరిష్కరించుకొనే విధానం ఇప్పటినుంచే మనం ఆలోచించాలి' అని ఉద్ఘాటించాడు.

ఈ మాటల ద్వారా బోస్‌లో ఉన్న ఆత్మ విశ్వాసం, పరిస్థితిని అంచనావేయగల శక్తి వ్యక్తమయ్యాయి. అంతేకాదు, యూరోప్ దేశా లతో అతి సన్నిహిత సంబంధాలు కలిగి ఉండి, ఎక్కువకాలం ఆ దేశాలలో గడిపిన కారణంగా కూడా ప్రపంచ పరిస్థితులను బోస్ అవగాహన చేసుకున్నంతగా మరే భారతీయ నాయకుడు అవగాహన చేసుకోలేదు. మిగతా భారతీయ నాయకులకు, కొంతవరకు ఇంగ్లాండు పరిస్థితి తెలుసు. కాకపోతే ఇంగ్లాండు ద్వారా తెలుసుకొన్న మిగతా దేశాల విషయాలు కూడా కొన్ని తెలుసు. అంతేకాని, వాస్తవంగా ఆ దేశాలలో జరుగుతున్న ఉద్యమాలను గూర్చికాని, మారుతున్న ప్రపంచ పరిస్థితులను గూర్చి కాని అవగాహన చేసుకొనే అవకాశం ఈ నాయకులకు లేదు. కాబట్టి సుభాస్ బోస్ కాంగ్రెస్ సారథ్యం చేపట్టిన తర్వాత మిగతా నాయకులు అంతకు పూర్వం చేసిన ఆలోచనలకు భిన్నంగా ఆలోచించడం ప్రారం భించాడు. ఆనాడు బ్రిటన్ ఎదుర్కొంటున్న సమస్యలను ఆకళింపు చేసు కొన్నవాడు కాబట్టి, బ్రిటిష్ వ్యతిరేక ఉద్యమం ముమ్మరంగా సాగించ వలసిన సమయం ఆసన్నమైనదని బోస్ గ్రహించాడు. ఆ సమయంలో

బ్రిటిష్ ప్రభుత్వంపైన గట్టి వత్తిడి తేగలిగితే బ్రిటిష్‌వారు లొంగి వస్తారని, జాతీయ నాయకులు కోరిన విధంగా చేయక తప్పదని భావించాడు.

## నేతాజీ, గాంధీజీల భావ వైరుధ్యం

అయితే, గాంధీజీ అవగాహన సుభాష్ బోస్ అవగాహనకు భిన్నంగా ఉంది. మహాత్మా గాంధీకి భారతీయుల నాడి బాగా తెలుసు. యూరోపులో ఉన్న పరిస్థితి అంతగా ఆకళింపు చేసుకొనే అవకాశం ఆయనకు రాలేదు. 1930 ఉద్యమంలో అనుభవించిన కష్టాలనుంచి భారత ప్రజలు ఇంకా తేరుకోలేదని గాంధీజీ భావించాడు. వెంటనే మరొక తీవ్రమైన ఉద్యమంలో పాల్గొనేందుకు భారతీయులు సంసిద్ధంగా లేరనే ఆలోచన ఆయనలో ఉంది. ఇద్దరి ఆలోచనలూ వాస్తవమైనవే. కాని ఈ రెంటి మధ్య సమన్వయం కుదిర్చేవారు లేకపోయారు. భారతీయుల నాడిని మహాత్మా గాంధీ ఎంత సరిగా అంచనా వేయగలిగాడో. యూరపులో ఉన్న పరిస్థితిని బోస్ కూడా అంత సరిగానే అంచనా వేశాడు. అయితే వీరిరువురు ఎవరికివారు తమ అంచనాలు సరియైనవని అనుకొన్నారే కాని అవతలివారి ఆలోచనలో ఉన్న నిజానిజాలు గుర్తించే ప్రయత్నం చేయలేదు. దీనికి ప్రబలమైన కారణం ఉంది. 1921 నుండి ఏ కొద్ది కాలమో తప్ప సుభాస్ బోస్ జైలులోనో లేక విదేశాలలోనో ఉంటూ వచ్చాడు. అందుచేత భారత దేశంలో ప్రసిద్ధ నాయకులతో కలిసి పనిచేసే అవకాశం ఆయనకు బహు తక్కువగా లభించింది. మహాత్మా గాంధీ, జవాహర్‌లాల్ నెహ్రూ, వల్లభాయ్ పటేల్, అబ్దుల్ కలాం ఆజాద్, గోవిందవల్లభ పంత్, రాజేంద్రప్రసాద్, రాజాజీ మొదలైన నాయకులతో ఆయన కలిసి పని చేసిన సమయం తక్కువ. ఈ నాయకులేమో ప్రతి ఉద్యమంలోనూ కలిసి పని చేశారు. అందుచేత వీరు ఒకరినొకరు అర్థం చేసుకోగలిగారు. సుభాస్

విషయం వేరు. కాబట్టి సుభాస్‌కు మిగిలిన నాయకులకు మధ్య భావ సారూప్యం లోపించింది. ఆ కారణంగా ప్రజల అంచనాలలో కూడా తేడా వచ్చింది. సుభాస్ బోసును అతివాద వామపక్షీయుడుగాను, మిగిలిన నాయకులను మితవాదులుగానూ పిలువనారంభించారు. నిజానికి సుభాస్ బోస్ ఎప్పుడూ వామపక్షీయుడు కాదు. స్వతంత్రమైన ఆలోచనగల జాతీయ నాయకుడు. యువ శక్తిలోనూ, కార్మిక శక్తిలోనూ నమ్మకమున్నవాడైనంత మాత్రన వామపక్షీయుడుగానో, మార్క్సివాదిగానో ముద్రవేయడం పొరపాటు.

సుభాస్ బోసు కాంగ్రెస్ అధ్యక్షుడుగా పని ప్రారంభించాక భేదాభిప్రాయాలు ఇంకా పెరిగాయి. స్వార్థపరశక్తులు కొన్ని ఈ విభేదాలకు సిద్ధాంతాల రంగు పులిమాయి. వామపంథా అనుసరిస్తూ వచ్చిన సోషలిస్టులు ఒక నాయకుడి కోసం అన్వేషిస్తున్నారు. 1929 లో కాంగ్రెస్ అధ్యక్షుడైన తర్వాత నెహ్రూ తమ చేయి జారిపోయాడు. యావద్భారత దేశంలో తెలిసిన మరో నాయకుడు వారికి కావాలి. సుభాస్ బోస్‌ను తమ వైపుకు త్రిప్పుకోవాలనే ప్రయత్నం చేశారు. ఇక మితవాదులనబడేవారేమో సుభాస్‌ను అనుమానంతో చూడ నారంభించారు. కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఉండి పార్టీని తమ విధానాలకు దూరం చేస్తాడేమోనని భయపడటం ప్రారంభించారు. ఈ విధమైన అంతర్గత విభేదాలు కారణంగా సంవత్సరం తిరగకుండానే సుభాస్ బోస్ మార్గం, మిగతా పాత నాయకుల మార్గాలు వేరయ్యాయి. సుభాస్ పదవీకాలం ముగియగానే అదంతా సమసిపోతుందని భావించారు.

ప్రత్యర్థుల భావాలను చదవగల్గి విభిన్న భావాలమధ్య సామరస్యాన్ని సాధించే విధంగా ఆలోచన చేసి, సుభాస్ తర్వాత అధ్యక్ష పీఠాన్ని అలంకరించే వ్యక్తిని ఎంపిక చేయగల్గితే పరిస్థితి చాలా వరకు మెరుగయ్యేది.

కాని ఆ విధంగా జరగలేదు. స్వాతంత్ర్య పోరాటం సద్దుమణగరాదని, రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభం కాక పూర్వమే పోరాటం పుంజు కోవాలని సుభాస్ కోరుకొన్నాడు. సుభాస్‌ను మరల కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నుకొంటే, ప్రజలు సంసిద్ధంగా లేని సమయంలో ఉద్యమాన్ని ఉధృతం చేసి కూర్చుంటాడేమో అన్న భావం మితవాద నాయకులను పీడించ సాగింది. అంతకంటే సుభాస్‌పట్ల వారికి వ్యక్తిగత ద్వేషం ఏమీలేదు. వర్కింగ్ కమిటీలో సుభాస్‌కు ఒక ప్రధానమైన పాత్ర ఇవ్వడానికి కూడా వారు సిద్ధంగానే ఉన్నారు. కాని పరిస్థితుల ప్రభావానికిలోనై సుభాస్ బోసు ఏమైనాసరే మరల అధ్యక్ష పదవికి పోటీచేసి ప్రజల హృదయాలలో తనకున్న స్థానం ఏమిటో ఋజువు చేయాలని నిశ్చయించుకొన్నాడు.

ఇంతలో బ్రిటిష్ ప్రభుత్వం 1935 ఇండియా చట్టంలోని ఫెడ రల్ రాజ్యాంగాన్ని ప్రవేశపెడతానని ప్రచారం చేసింది. "వెయ్యి నిలువులలోతున ఫెడరల్ రాజ్యాంగాన్ని పాతిపెడతాను" అని బోస్ గర్జించాడు. గాంధీతోపాటు మితవాద మిత్రులకు ఇది నచ్చలేదు. 1938 జూన్ 12 నాడు యావద్భారతదేశంలో 'చైనా దినోత్సవం' జరిపి చైనాకు సమర్థన ప్రకటించాలని బోస్ తెలిపాడు. చైనా ఉద్యమానికి సహాయంగా ధనం ప్రోవు చేయడమేగాక, వైద్యబృందాన్ని ఒకదానిని పంపాలని కోరాడు. అయితే ఆ చైనా సైన్యాలే తర్వాత కాలంలో మణిపూర్, అస్సాం రంగాలలోను, బర్మా కదన భూమిలోను తన అజాద్‌హింద్ ఫౌజ్ సైన్యాలతో తలపడతాయని బోస్ కలలో కూడ ఊహించలేదు. చైనా విషయంలో ఒక్క సుభాస్‌చంద్రదే కాదు, 1960 లో జవాహర్‌లాల్ నెహ్రూ కూడా అలాగే మోసపోయాడు. 12,000 చ. మై. భారత భూభాగాన్ని చైనా దురాక్రమణ చేసి వెన్నుపోటు పొడిచింది. ఆ రోజులలో జిన్నా ధోరణి కూడా సుభాస్‌ను చికాకు పరిచింది. 2, ఆగస్టు 1938 లో

సుభాష్‌కు వ్రాసిన లేఖలో ముసల్మాన్ల తరఫున మాట్లాడే హక్కు ముస్లిం లీగ్‌కు మాత్రమే ఉంటుందని జిన్నా స్పష్టంచేశాడు. అంతేకాదు, హిందూ ముస్లిం సమస్యను చర్చించడానికి కాంగ్రెస్ పార్టీ ఏర్పాటుచేసిన కమిటీలో ముసల్మాన్ ఎవరూ ఉండకూడదన్నాడు. జిన్నాతో మాట్లాడేందుకు అబ్దుల్‌కలాం ఆజాద్‌ను వెంటబెట్టుకు వెళ్ళడానికి గాంధీ ప్రయత్నిస్తే జిన్నా అందుకు ఒప్పుకోలేదు.

సుభాష్ బోస్ అధ్యక్షుడుగా ఉన్న కాలంలో గాంధీజీ కానీ ఆయన అనుయాయులు కానీ పరిపూర్ణ సహాయం అందజేయలేదనే చెప్పాలి. అంతేకాకుండా, ఏమైనాసరే రెండవసారి అధ్యక్షపదవికి సుభాష్ ఎన్నిక కాకుండా చేయాలని వారు నిశ్చయించుకొన్నారు. అబ్దుల్‌కలాం అజాద్‌ను సుభాష్‌కు పోటీ పెట్టాలనుకొన్నారు. కాని అనారోగ్యంగా ఉందని చెప్పి ఆజాద్ పోటీ చేయడానికి ఒప్పుకోలేదు. పైగా ఆయనే పట్టాభి సీతా రామయ్యగారి పేరు సూచించాడు. మితవాద వర్గం అంతా పట్టాభిని బల పరిచారు. సర్దార్ వల్లభాయ్ పటేల్ స్వయంగా పట్టాభిని సమర్థిస్తూ ప్రకటన చేశాడు.

మితవాద వర్గంవారు తాము చేస్తున్న పనిని సమర్థించుకోడానికి అనేక కారణాలు చెప్పడం ప్రారంభించారు. ప్రత్యేక పరిస్థితులలో తప్ప ఒకే వ్యక్తి రెండుసార్లు అధ్యక్షపదవిని చేపట్టకూడదన్నారు. అధ్యక్ష పదవికి ఎన్నిక ఏకగ్రీవంగా జరగడమే మంచి సంప్రదాయం అన్నారు. సుభాష్ బోస్ కాకుండా మరెవరైనా తమకు అభ్యంతరం ఉండబోదన్న ధోరణిలో ప్రచారం మొదలు పెట్టారు. కాని, వారు లేవదీసిన అభ్యంతరాలను సుభాష్ బోస్ చాలా గట్టిగా సమాధానం చెప్పాడు. ''కాంగ్రెస్ చరిత్రను పరిశీలిస్తే ఒక వ్యక్తి ఒకసారి కంటె ఎక్కువ పర్యాయాలు అధ్యక్ష స్థానాన్ని అలంకరించిన సందర్భాలు అనేకం ఉన్నాయి. ఎప్పుడూ

అధ్యక్షపదవికి ఏకగ్రీవంగా ఎన్నిక జరుగుతోందనడం కూడా నిజం కాదు. అనేకసార్లు నేను నాకు నచ్చిన వ్యక్తికి ఓటు చేసిన జ్ఞాపకం ఉంది" అంటూ బోస్ స్పష్టంగా ప్రకటించాడు.

## రెండవసారి కాంగ్రెస్ అధ్యక్షుడుగా చరిత్ర సృష్టి

మితవాద నాయకత్వం అంతా పట్టాభి విజయానికి పట్టుదలతో కృషి చేయడం జరిగింది. గాంధీజీ కూడా తన సమర్థన పట్టాభికేనన్న విషయం అసంగ్దిగ్ధంగా తెలియజేశాడు. కాని ప్రజల హృదయాలలో సుభాస్‌కు ఉన్న స్థానం తిరుగులేనిది. ఇందరు ఇన్ని విధాలుగా ప్రచారం చేసినప్పటికి పట్టాభిని అత్యధిక మెజారితో బోస్ ఓడించాడు. పోలయిన ఓట్లు 2957 కాగా, బోస్‌కు 1580, పట్టాభికి 1377 ఓట్లు వచ్చాయి. ఈ లెక్కలు ఎలా ఉన్న సుభాస్ బోస్ ప్రజల ప్రియతమ నాయకుడన్నది ఋజువైంది.

ఇంత జరిగినప్పటికీ గాంధీజీపట్ల సుభాస్‌కు అమితమైన గౌరవ భావం ఉంది. 1939 జనవరి 31 వ తేదీనాడు కలకత్తా శ్రద్ధానంద పార్క్‌లో బ్రహ్మాండమైన బహిరంగ సభ జరిగింది. ఆ సభలో బోస్ తన విజయంపట్ల ఏ మాత్రం గర్వపడకుండా మాట్లాడాడు. వినయంగా, ఆ విజయం వలన తనపైన గురుతరమైన బాధ్యత పడిందని తెలియజేశాడు. 'పట్టాభి ఓటమి నా ఓటమి' అని చాటుతూ గాంధీజీ ఫిబ్రవరి 5 వ తేదీన చేసిన ప్రకటనను ప్రస్తావిస్తూ, "మహాత్ముడు నా విజయాన్ని తన వ్యక్తిగత ఓటమిగా భావించడం కేవలం నా దురదృష్టం. మహాత్ముడు ఆ విధంగా ఆలోచించడంలో ఆవంతయినా న్యాయం లేదు. మహాత్మునికి ఓటు చేయాలా లేక నాకు ఓటు చేయాలా అన్న ప్రశ్న ఎన్నడూ ప్రజల ముందు లేదు. అలాంటప్పుడు గాంధీజీ ఓటమి చెందడం అనేది ఎలా సంభవిస్తుంది?'' అంటూ తన ఆవేదనను వ్యక్తం చేశాడు.

"మహాత్మునికి నాపైన ఏ విధమైన అభిప్రాయం ఉన్నప్ప
నేను మాత్రం ఎప్పుడూ ఆయన సానుభూతిని పొందడానికే ప్రయత్నిస్తా
అది నా ఆశయం. భారతీయులందరి ప్రేమను పొందగల్గిన నే
భారతీయులందరిలో ఉత్తమోత్తముడైన గాంధీజీ సానుభూతి పొందజా
పోతే అంతకంటె విషాదకరమైన విషయం మరొకటి ఉండబోదు" అం
గాంధీజీపట్ల తనకున్న గౌరవ భావాన్ని వెలిబుచ్చాడు సుభాస్. అయి
సుభాస్ బోస్ విప్లవకారుడు. వ్యక్తిగత సంబంధాలను పురస్కరించుక
సిద్ధాంతాలకు స్వస్తిచెప్పే వ్యక్తి కాడు. అందుకే అతడి రాజకీ
జీవితం గాంధీవాదంతో పోరాటంగా పరిణమించక తప్పలేదు.

మొదటినుంచి కుండ బద్దలు కొట్టినట్టు ఉన్నది ఉన్నట్టు
చెప్పడం సుభాస్ లక్షణం. ఆ రోజులలో కాంగ్రెస్‌లో వామపక్షీయుల
ఉన్న అతివాదు లెవరో, మితవాదు లెవరో ప్రజలకు తెలుసు. అయి
ఆ విషయాన్ని కప్పిపుచ్చేందుకు ప్రయత్నం చేస్తూ- 'మితవాదు
వామపక్షీయులు అన్న పదాలకు అర్థంఏమిటి?' అని ప్రశ్నిస్తూ జవాహ
లాల్ నెహ్రూ ఒక ప్రకటన చేశాడు. దానికి సమాధానంగావామపక్షీ
లను మితవాదులు అణచివేస్తున్నారు అని హరిపురలో అఖిల భా
కాంగ్రెస్ కమిటీకి రిపోర్టు చేసిన జవాహర్‌లాల్‌కు మితవాదు లె
వామపక్ష అతివాదు లెవరో తెలియనే తెలియదా?' అంటూ ప్రశ్నించా
సుభాస్. 'గాంధీ సేవా సంఘం' అన్న పేరుతో కాంగ్రెస్‌లోనే కొంద
తమ స్వంత పార్టీ మరొకదాన్ని కల్గి ఉండడాన్ని ప్రశ్నించాడు సుభా
'మహాత్ముని గౌరవించడం అంటే ఆయనను గ్రుడ్డిగా అనుసరించ
కాదు' అని స్పష్టంగా ప్రకటించాడు.

గాంధీజీకి సుభాస్ వైఖరి నచ్చలేదు. అనాటి కాంగ్రెస్ న్యా
కత్వం సుభాస్ విజయాన్ని తమ పరాజయంగా మాత్రమే కాక ప

వంగా కూడా భావించింది. 'అధ్యక్షునితో సహకరించజాలకపోతే నిరాక రింపవచ్చు' అంటూ గాంధీజీ ఒక ప్రకటన చేశారు. తత్ఫలితంగా సర్దార్ పటేల్, అజాద్, బులాభాయ్ దేశాయ్, పట్టాభి సీతారామయ్య, బాబూ రాజేంద్రప్రసాద్, సరోజినీ నాయుడు, అబ్దుల్ గఫర్ ఖాన్, జయరాందాస్ దౌలత్ రాం, జమన్‌లాల్ బజాజ్ మొదలైన కాంగ్రెస్ కార్యవర్గ సభ్యులు 12 మంది కార్యవర్గం నుంచి రాజీనామా చేశారు. ఒక వారం రోజులలో త్రిపుర కాంగ్రెస్ జరుగుతుందనగా వారు రాజీనామా పత్రాలు సమర్పించడం జరిగింది. అందుచేత కాంగ్రెస్ వ్యవ హారాలే కాక పార్లమెంటరీ బోర్డ్ వ్యవహారాలు కూడా బోస్ నిర్వహించ వలసి వచ్చింది విశ్రాంతి లేకుండా పనిచేయడం వలన ఆరోగ్యం దెబ్బ తిన్నది. ఆ జబ్బుతో సుభాస్ అయిదు వారాలు బాధ పడ్డాడు. వ్యాధి తీవ్రతతో సుభాస్ బాధపడుతూ ఉంటే, అది దొంగ జబ్బు అని అతడి రాజకీయ విరోధులు దేశంలో ప్రచారం చేశారు. ఫిబ్రవరి 22 వ తేదీన వార్ధాలో జరిగే వర్కింగ్ కమిటీ సమావేశానికి హాజరు కాకుండా తప్పించు కోవడానికి పన్నిన పన్నాగమని, అది కేవలం 'రాజకీయ జ్వరం' అని ప్రచారంచేశారు. ఈ స్థితిలో 'మరణిస్తే త్రిపురలోనే మరణిస్తాను' అంటూ రాష్ట్రపతి బోస్ మార్చి 6 వ తేదీన జబల్‌పూర్ మీదుగా అంబులెన్సు కారులో త్రిపుర చేరాడు. అపుడు ఆయనకి 103 డిగ్రీల జ్వరం ఉంది.

రెండు లక్షల మంది ప్రజలు 1939 మార్చి 10 వ తేదీన జరిగిన త్రిపుర కాంగ్రెస్ మహాసభలకు హాజరయ్యారు. సుభాస్ తన అధ్యక్షోప న్యాసంలో బ్రిటన్ భారతదేశం నుంచి వైదొలగి పోవాలంటూ అల్టిమేటం ఇవ్వాలని చాటాడు. ప్రపంచ రాజకీయాలను గూర్చి మాట్లాడుతూ, జర్మనీ దినదినం ఏ విధంగా తన బలాన్ని పెంచుకొంటున్నదీ వివరించాడు. మ్యూనిచ్ ఒడంబడికలో యూరోపుతో ఫ్రాంసు అధికారం అంతరించిందని

పుచ్చింది. సుభాస్‌వంటి తీవ్ర జాతీయవాదులను తరిమివేయాలనే పట్టు దలతో ఈ వర్గం పనిచేసింది.

అందుచేతనే 1939 ఏప్రిల్ 2 వ తేదీన బిర్లాభవనంనుంచి గాంధీజీ ఇలా జవాబు వ్రాశాడు—"నీ అభిప్రాయాలకు అనువైనవారితో కూడిన వర్కింగ్ కమిటీని వెంటనే నియమించి, కార్యక్రమాన్ని ఏర్పాటు చేసు కొని రానున్న అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సమావేశంలో అంగీకారం పొందటం మంచిది. అన్ని విషయాలు సమగ్రంగా ఆలోచించిన మీదట నాదైన ఈ అభిప్రాయాన్ని నీకు తెలియజేస్తున్నాను. ఆ కార్యక్రమాన్ని కమిటీ అంగీకరిస్తే అంతా సవ్యంగా జరిగిపోతుంది. ఆ విధముగా కాకుండా నీ కార్యక్రమాన్ని కమిటీ తిరస్కరించే పక్షంలో నీవు రాజీ నామా చేయాలి. క్రొత్త అధ్యక్షని ఎన్నుకొనే అవకాశం కల్పించాలి. అప్పుడు దేశానికి నీకు తోచిన రీతిగా నీవు సలహా ఇవ్వవచ్చును. పంత్ తీర్మానంతో నిమిత్తం లేకుండా నేను నీకి సలహా ఇస్తున్నాను."

ఈ ఉత్తరంతో ఇక మహాత్మునితో రాజీ సంభవం కాదని తేలి పోయింది. కార్యవర్గంలో ఉన్న అధికసంఖ్యాకులు మితవాద వర్గంవారే. వారు ఏ పరిస్థితిలోనూ సుభాస్ రూపొందించిన కార్యక్రమాన్ని ఆమోదిం చరు. ఆ విషయం అందరూ ఎరిగినదే. ఎలాగైనా సుభాస్ చేత రాజీ నామా చేయించడమే గాంధీజీ లక్ష్యం అని తేటతెల్లం అయింది.

## కాంగ్రెస్ అధ్యక్షపదవికి రాజీనామా

ఏప్రిల్ 28 వ తేదీన కలకత్తాలో అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సమావేశం ఉద్రిక్త వాతావరణంలో జరిగింది. ఒక్క కలకత్తాయేకాదు, యావద్భారతదేశం మితవాద నాయకత్వం అనుసరించిన మార్గాన్ని గర్హిం చింది. ఏదిఏమైనా మహాత్మునికీ, సుభాస్‌కూ రాజీ కుదరలేదు. బోస్‌బాబు

తన పదవికి రాజీనామా ఇచ్చాడు. సుభాస్ స్థానంలో బాబూ రాజేంద్ర ప్రసాద్‌ను రాష్ట్రపతిగా ఎన్నుకొన్నారు.

కాంగ్రెస్ సారథ్యాన్ని విడిచిపెట్టి 1939 మే నెలలో సుభాస్‌బోస్ 'ఫార్వర్డ్‌బ్లాక్' స్థాపించాడు. ఆ సందర్భంగా మాట్లాడుతూ - "ఫార్వర్డ్ బ్లాక్ కార్యక్రమం కాంగ్రెస్‌ను విచ్ఛిన్నం చేయడం కాదు. దేశంలోని సామ్రాజ్య వ్యతిరేక శక్తులను కూడగట్టుకోవడం, కాంగ్రెస్‌లో విప్లవ శక్తిని నింపడం ఫార్వర్డ్‌బ్లాక్ లక్ష్యం. అతివాదులలో ఐక్యత సాధించి, జాతీయపోరాటానికి ఉపక్రమించడమే ఫార్వర్డ్‌బ్లాక్ కార్యక్రమం" అని సుభాస్ ప్రకటించాడు.

## ఫార్వర్డ్‌బ్లాక్ స్థాపన : విస్తరణ

అనతికాలంలోనే దేశంలో అన్ని రాష్ట్రాలలో ఫార్వర్డ్‌బ్లాక్ శాఖలు ఏర్పడ్డాయి. సర్దార్ శార్దూల్ సింగ్, రూయికర్, శీలభద్రయాజి, హెచ్ వి. కామత్, సహరేంద్రుదత్ మజుందార్, రాజమన్నార్ చెట్టి, లాలా శంకర్ లాల్, అన్నపూర్ణయ్య మొదలగు ప్రముఖులు ఫార్వర్డ్‌బ్లాక్‌లో చేరారు. సుభాస్‌బోస్ ఎక్కడికి వెళ్ళినా ఆయన దర్శనానికి జనం తండోపతండా లుగా వచ్చారు. ఈ సమయంలోనే సుభాస్‌బోస్‌ను కాంగ్రెస్ నుంచి మూడు సంవత్సరాలపాటు బహిష్కరించారు కాంగ్రెస్‌లో బహిష్కరణల పర్వం క్రొత్తదేమీకాదు. ఆ సందర్భంగా మాట్లాడుతూ-"కాంగ్రెస్ నుంచి అయితే నన్ను తొలగించగలిగారేమోకాని ప్రజల హృదయాలనుంచి దూరం చేయలేరు'' అన్నాడు సుభాస్. పార్టీనుండి తొలగించబడినప్పటికి బెంగాల్‌లో కాంగ్రెస్ వ్యవహారాలు బోస్‌బాబుకు తెలియకుండా ఏమీ జరిగేవి కావు.

22 జూన్, 1939 లో ఫార్వర్డ్‌బ్లాక్ అఖిల భారత మహాసభలు బొంబాయిలో జరిగాయి. చాలామంది బోస్‌కు తమ సమర్థన తెలియజేశారు. వామపక్ష పార్టీలన్నీ తమ తమ సంస్థలను రద్దుచేసుకొని ఫార్వర్డ్‌బ్లాక్‌లో

కలిసిపోవలసిందిగా బోస్ పిలుపునిచ్చినప్పటికి ఆ పక్షాలు ఈ పిలుపును పెడ చెవినిపెట్టాయి. కనీసం తమ సభ్యులు వ్యక్తిగత హోదాలో ఫార్వర్డ్ బ్లాక్‌లో సభ్యులుగా చేరడానికి కూడా ఈ పార్టీలు ఒప్పుకోలేదు. ఆవిధంగా ఫార్వర్డ్‌బ్లాక్ కూడా కాంగ్రెస్ మాదిరిగానే విభిన్న భావాలుగల వ్యక్తుల కృతక వేదికగా తయారైందే కాని, సువ్యవస్థితమైన సంఘటనగా మాత్రం రూపొందలేదు.

బొంబాయి మహాసభల పర్యవసానంగా లెఫ్ట్ కన్సాలిడేషన్ కమిటీ ఏర్పడింది. ఫార్వర్డ్‌బ్లాక్, కాంగ్రెస్ సోషలిష్టు పార్టీ, యం యన్. రాయ్ గారి ఆధ్వర్యంలోని రాడికల్ డెమోక్రటిక్ పార్టీ ఆ రోజుల్లో కమ్యూనిష్టుల కూటమి అయిన నేషనల్ ఫ్రంట్ ఈ లెఫ్ట్ కన్సాలిడేషన్ కమిటీలో చేరాయి. ఈ పార్టీలన్నింటి మధ్య ఏకాభిప్రాయం కుదిరినప్పుడు మాత్రమే ఏ సమస్యనైనా చేపట్టడానికి వీలు అవుతుంది. ఆ కారణంగా ఈ కమిటీ బోస్ బాబుకు వెసులుబాటుగా ఉండటానికి బదులు పెద్ద ప్రతిబంధకంగా తయారైంది. భౌతికమైన సర్దుబాటు తప్పితే ఇక్కడ భావాత్మకమైన కలయిక లేదు. అందువలన దాని బరువు క్రింద అదే కూలిపోయింది. జూలై 9 ని కాంగ్రెస్ తీర్మానాల పట్ల నిరసన దినంగా పాటించాలని లెఫ్ట్ కన్సాలిడేషన్ కమిటీ కోరింది. దానితో బెంగాల్ ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ వ్యవహారాలలో బోస్ జోక్యం చేసుకోరాదని, అలాగే ఆగష్టు 1939 లో ఎన్నికల ద్వారా భర్తీచేయబడే ఏ పదవిలోనూ బోస్ సభ్యుడుగా ఉండేందుకు వీలులేదని ఆంక్షలు విధించారు.

రవీంద్రనాథ్ ఠాగూర్‌కు సుభాస్ అంటే అవ్యాజమైన ప్రేమానురాగాలు ఉండేవి. బోస్‌ను గూర్చి ప్రస్తావిస్తూ- "చాలాకాలంక్రితం ఒక సభలో మాట్లాడుతూ అప్పటికి ఇంకా ఈ దేశం చేరుకోనటువంటి బెంగాల్ నాయకుడికి ఒక సందేశం అందజేశాను. మళ్ళీ చాలాకాలం తర్వాత ఇక్కడికి చేరుకొని అందరి మన్ననలకు పాత్రుడైన ఆ మహా

నాయకునికి ఈ సందేశం ఇస్తున్నాను. నా చివరి రోజులు సమీపిస్తు న్నాయి. రాబోవు పోరాటంలో నేను చేతులు కలిపి పనిచేసే స్థితిలో లేను. దేశం భరిస్తున్న కష్టాలు తనవిగా భావించి సాటిప్రజల కష్టాలను భరిస్తూ ముందుకు సాగిపోతున్న ఆ నాయకుడిని ఆశీర్వదిస్తూ నేను సెలవు తీసు కొంటాను. దేశ స్వాతంత్ర్యం కొరకు జరిగే తుది పోరాటంలో అతడికి లభించవలసిన గౌరవ మర్యాదలు తప్పక లభిస్తాయి'' అని వ్రాశాడు. ఈ ఉత్తరం బోస్‌బాబుకు అందివుంటే తన పట్ల గురుదేవులకున్న ఈ ఆదరభావం గమనించి ఆయన ఉత్సాహంతో ఉప్పొంగిపోయేవాడు. దురదృష్టవశాత్తు సుభాస్‌బాబూ, గురుదేవుడూ ఇద్దరూ కూడా ఈ ప్రపం చమునుంచి నిష్క్రమించాకే, 1946 లో ఆ ఉత్తరం బయటపడింది.

1939 సెప్టెంబరు 3 వ తేదీన జర్మన్ నియంత హిట్లర్ పోలండు పైన దాడి చేశాడు. పోలండుతో ఉన్న ఒప్పందం ప్రకారం ఇంగ్లాండు జర్మనీతో యుద్ధానికి దిగవలసివచ్చింది. దీనితో అంతర్జాతీయ రంగంలో గొప్ప సంచలనం బయలుదేరింది. బ్రిటన్ ఇరకాటంలో పడింది. బ్రిటిష్ ప్రభుత్వాన్ని భారతదేశం నుంచి తరిమివేయడానికి అదే సరియైన సమయ మన్నాడు బోస్. యుద్ధ సహాయనిరాకరణ మాత్రమే కాకుండా యుద్ధ వ్యతిరేక ప్రచారం సాగించాలన్నాడు. బ్రిటిష్ ప్రభుత్వాన్ని పారద్రోల డానికి అంతిమ సమరం సాగించాలని సుభాస్ బోస్ నాయకత్వంలో ఫార్వర్డ్‌బ్లాక్ ప్రచారం చేసింది.

## ఆంధ్రలో పర్యటన

1939 సెప్టెంబరు కడపటి వారంలో కాకినాడలో ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి మహాసభలు జరిగాయి. ప్రారంభోపన్యాసకులుగా సుభాస్ విచ్చే శాడు. జనసందోహం తమ ప్రియతమ నాయకునికి అఖండ స్వాగతం పలికారు. యువకుల హృదయాలు ఉత్సాహంతో ఉరకలు వేశాయి.

ఆయన సందేశం విని జన్మ చరితార్థమైనదని భావించారు. రాజకీయ బాధితుల మహాసభకు అధ్యక్షత వహించేందుకు సుభాస్ 1940 జనవరి నెలలో తిరిగి ఆంధ్ర రాష్ట్రానికి వచ్చాడు ఏలూరు పట్టణంలో ఆయన ఆసీనులైఉన్న రథాన్ని పురవీథులగుండా ఊరేగించారు. జనులు పుష్ప వర్షం కురిపించారు. అప్పుడే సుభాస్ బోస్ రాజమండ్రి, మండపేట, రామచంద్రపురాలలో జరిగిన బ్రహ్మాండమైన బహిరంగ సభలలో ఉపన్య సించాడు.

చరఖా, మద్య నిషేధం అన్న రెండు ఆయుధాలు స్వాతంత్ర్యం సంపాదించి పెడతాయని గాంధీజీ చెప్పగా, రాజకీయ పోరాటానికి ఇవి పనికిరాని ఆయుధాలు అన్నాడు సుభాస్. ఇది గాంధీజీని బాగా నొప్పించింది. గాంధీజీ ఎంతవరకు పోయాడంటే - గౌరవప్రదమైన ఒప్పందం కుదిరేట్లయితే బ్రిటిష్ వారితో రాజీకి సిద్ధమే అని ప్రకటించాడు.

## తన మార్గంలో ఉద్యమ సారథ్యం

బీహార్‌లోని రాంఘర్‌లో సుభాస్ రాజీ వ్యతిరేక మహాసభలు జరిపాడు. దేశ వ్యాప్తంగా ఏప్రిల్ 6 వ తేదీన. సత్యాగ్రహం జరపాలని నిర్ణయమైంది. బలవంతంగా భారతదేశాన్ని యుద్ధంలోనికి ఈడ్వరాదని, స్వాతంత్ర్య సముపార్జనకు తుది పోరాటం ప్రారంభించాలని తీర్మానించారు. ఒకసారి ఉద్యమం ప్రారంభమయ్యాక 1922లో జరిగిన చౌరీచౌరా ఒప్పందంలాంటిది కానీ, 1931 లో జరిగిన ఢిల్లీ ఒప్పందం లాంటిది కాని, 1933 లో హరిజనోద్యమం ప్రారంభమయినప్పుడు త్రొక్కిన ప్రక్క త్రోవలు కాని ఉండవు అంటూ స్పష్టంగా ప్రకటించారు. ఇది సూటిగా గాంధీజీ చర్యలు విమర్శించినట్లే అయింది. బ్రిటిష్ వారికి అల్టిమేటమ్ ఇచ్చినట్లు కూడా అయింది. ఫార్వర్డ్‌బ్లాక్ చరిత్రలో రాంఘర్ సమావేశం ఒక మైలు రాయి. గాంధీజీతో తెగతెంపులు చేసుకొని

స్వతంత్ర సంస్థగా తన సొంత కాళ్ళపైన ఫార్వర్డ్ బ్లాక్ నిలచింది. ఈ దశలోనే వామపక్ష సమైక్యతా సంఘం (Left Consolidation Committee) లోని పార్టీలవారు ఎవరి దారి వారు చూసుకొన్నారు. రాడికల్ డెమోక్రటిక్ పార్టీ ముందే ఫార్వర్డ్ బ్లాక్‌ను వదిలిపెట్టిపోయింది, ఇప్పుడేమో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ, నేషనల్ ఫ్రంట్ అన్న ముసుగులో ఉన్న కమ్యూనిస్టు పార్టీ కూడా వైతొలగాయి. దరిమిలా జూన్ 1941 లో మిత్ర పక్షాలతో చేతులు కలిపి రష్యా యుద్ధ ప్రవేశం చేయగానే వ్యక్తిగతంగా బోస్‌కూ పార్టీపరంగా ఫార్వర్డ్ బ్లాక్‌కూ కమ్యూనిస్టు పార్టీ బద్ధ శత్రువుగా మారిపోయింది. దాని దృష్టిలో ఒక్కత్రుటిలో సామ్రాజ్యవాద శక్తుల యుద్ధం కాస్తా ప్రజా పోరాటం అయిపోయింది. కమ్యూనిస్టులకు బ్రిటన్, అమెరికాలు మిత్రదేశాలు అయిపోయాయి. రష్యా ఆదేశాలకు అనుగుణంగా నడిచే పార్టీగా కమ్యూనిస్టు పార్టీ మరొకసారి రుజువు చేసుకొంది.

ఫార్వర్డ్ బ్లాక్ కార్యవర్గంలోని చాలామంది మందిని ప్రభుత్వం అరెస్టు చేసింది. ఈసారి బోస్‌ను మాత్రం అరెస్టు చేయలేదు. జూన్ 1940 లో నాగపూర్‌లో ఫార్వర్డ్ బ్లాక్ రెండవ మహా సభలు జరిగాయి. ఈ సభలలో ఫార్వర్డ్ బ్లాక్ కాంగ్రెస్ పార్టీలో అంతర్భాగంగానే పని చేస్తుందని తీర్మానించారు. బోస్ ఒక క్రొత్త నినాదం ఇచ్చాడు. 'భారత ప్రజలకు తక్షణమే అన్ని అధికారాలూ బదిలీ చేయాలి' యుద్ధంలో అన్ని రంగాలలోనూ బ్రిటన్‌కు ఎదురుదెబ్బలు తగులుతున్న రోజులవి. హిట్లర్ శర వేగంతో దూసుకుపోతున్నాడు. అదును చూసి భారతీయులు తమ ఉద్యమాన్ని తీవ్రతరంచేసి బ్రిటిష్ వారిపైన వత్తిడితెస్తే, అన్ని వైపుల నుంచీ ఒక్కసారిగా చుట్టుముట్టిన కష్టాలనుంచి తేరుకోలేక బ్రిటిష్‌వారు భారత దేశాన్ని విడిచిపెట్టిపోతారని బోస్ సూచించాడు. ఇది సువర్ణావకాశం, చేయిజారితే తిరిగి రాదని సుభాస్ వాదించాడు. కాని గాంధీజీ ఈ

వాదనతో ఏకీభవించలేదు. 'ఇక ముందు మంచిఅవకాశాలురావని నీవు ఎందుకు భావిస్తున్నావో నాకు అర్థం కావడంలేదు. ఈ యుద్ధంలో బ్రిటన్ గెలిచినా ఓడిపోయినా బలహీనం కావడం తథ్యం. ఇంత విశాలమైన దేశాన్ని పరిపాలించే శక్తి బ్రిటన్‌కు ఇకపైన ఉండబోదు. కాబట్టి మనం ఏ కొద్ది ప్రయత్నం చేసినప్పటికీ భారతదేశానికి స్వాతంత్ర్యం ఇవ్వడంకంటె చేయగల్గింది ఉండదు. రాజకీయంగా ఆలోచించినా, నైతికంగా ఆలోచించినా తక్షణమే ఉద్యమాన్ని తీవ్రతరం చేయడం భావ్యంకాదని నేను భావిస్తున్నాను. మంచిరోజులకొరకు వేచి ఉండాలని నా అంతరాత్మ చెపుతోంది' అన్నాడు గాంధీజీ. ఇలా అంటూనే 'నీ అంతరాత్మ కనుక ఇంతకుమించిన సువర్ణావకాశం లభించదని చెపుతున్నట్లయితే ముందుకు సాగిపోయి నీకు మంచిదని తోచిన రీతిన చేయి. నీకు విజయం చేకూరితే తొట్టతొలుత అభినందించేవాడిని నేనే' అని చెప్పాడు.

ఇంతలో బోస్‌బాబు మరొక ఉద్యమం చేపట్టాడు. స్మారక చిహ్నలుగా నగరంలో కూడలి ప్రదేశాలలో నెలకొల్పబడి ఉన్న బ్రిటిష్‌వారి విగ్రహాలను తొలగించక పోయినట్లయితే మార్చి 3, 1940 నాడు స్వచ్ఛంద సేవకులతో కలిసివచ్చి స్వయంగా తానే ఆ విగ్రహాలు తొలగించవలసివస్తుందని హెచ్చరించాడు. తొట్టతొలుత హాల్ వెల్ విగ్రహాన్ని తొలగిస్తానన్నాడు. ఎలాగూ అనుకొన్నపని చేయక వదలడని భావించి డిఫెన్స్ ఆఫ్ ఇండియా రూల్సు క్రింద రెండవ తేదీనాడే బోస్‌బాబును అరెస్టు చేశారు. ఆయనను అరెస్టు చేయడం ఇది పదకొండవసారి. ఇదే ఆఖరు అరెస్టు కూడా.

డిఫెన్స్ ఆఫ్ ఇండియా రూల్సులో ఒక సెక్షన్ క్రింద బోస్ శాశ్వత నిర్బంధంలో ఉండగా, మళ్ళీ ఆ నిబంధనలక్రిందనే మరో సెక్షన్ క్రింద ఇంకా రెండు న్యాయస్థానాల్లో విచారణ సాగించారు. న్యాయస్థానాల

చరిత్రలో ఇంతకంటె ఘోరమైన విషయం మరొకటి ఉండదు. కేంద్ర శాసన సభకు సభ్యుడుగా ఎన్నికైనప్పటికీ బోస్‌బాబును నిర్బంధంనుంచి విడిచిపెట్టలేదు. పార్లమెంటు సమావేశం అవుతూవుండగా ఏ సభ్యుడినీ నిర్బంధంలో ఉంచరాదన్న బ్రిటిష్ పార్లమెంటు సంప్రదాయము ఇక్కడ గాలికి వదలేశారు. విచక్షణారహితమైన ఈ నిర్బంధాన్ని ప్రజలంతా ఖండించారు కాంగ్రెస్ కార్యవర్గం అనుమతి పొందకుండానే బోస్‌బాబు ఉద్యమం చేపట్టి చట్టాన్ని ఉల్లంఘించడంచేత కాంగ్రెస్ కార్యవర్గంకానీ, గాంధీజీ కానీ ఈ అరెస్టును నిరసిస్తూ ప్రకటన చేయలేదు. బోస్‌బాబుకు ఇది తీవ్ర మనస్తాపం కలిగించింది. కాంగ్రెస్ కార్యవర్గం అనుసరిస్తున్న ఈ జుగుప్సాకరమైన పంథాతో విసిగిపోయి, 'కాంగ్రెస్ రాజకీయాలను తరచిచూస్తున్నకొద్దీ ముందు ముందు కాంగ్రెస్ హైకమాండుతో పోరాడటానికే మనం ఎక్కువ సమయం వినియోగించడం అవసరమనిపిస్తోంది. స్వరాజ్యం సిద్ధించినతర్వాత పగసాధింపు ఆలోచనలతో కక్షలు పెంచుకొని విచక్షణారహితంగా ప్రవర్తించగల ఇంత నీచ మనస్కుల చేతులలోనికి అధికారం వెళితే దేశం గతి ఏమికాను?' అని తన సోదరుడు శరత్ చంద్ర బోస్‌కు అక్టోబర్ 31 నాడు వ్రాసిన ఉత్తరంలో బోసు ఆవేదన వ్యక్తం చేశాడు.

ఆ నిర్బంధం నుంచి బయటపడటానికి అత్యంత ప్రమాదకరమైన నిర్ణయం తీసుకోవడం మినహా గత్యంతరం లేదని నిర్ణయించుకొని, తన పైన మోపిన అన్యాయమైన నేరాలకు నిరసనగా తాను 29 నవంబరు నుంచి నిరాహారదీక్ష పూనుతున్నట్లుగా బెంగాల్ గవర్నర్‌కూ, ముఖ్య మంత్రికీ 26 వ తేదీన ఒక లేఖ వ్రాశాడు. అంతకు ముందు టెరెన్స్ మెక్స్వినీ, శ్రీ జతిన్‌దాస్‌లు బ్రిటిష్‌వారి నిర్బంధంలో నిరాహార దీక్ష పూని ప్రాణాలు పోగొట్టుకొన్న ఉదంతం తెలిసి ఉండి కూడా బోస్ ఆ

నిర్ణయం తీసుకోక తప్పలేదు. బ్రిటిష్ అధికారులు తనకు బలవంతం ఆహారం ఇవ్వడానికి ప్రయత్నిస్తున్నారని తెలుసుకొని, 'బలవంతం నన్ను దీక్షనుంచి విరమింపచేయాలని ప్రయత్నిస్తే ఆత్మాహుతికి ప్రత్యామ్నాయ మార్గాలు వెతుక్కోవలసివస్తుంది. అందుకు బ్రిటిష్ ప్రభుత్వ బాధ్యత వహించవలసి ఉంటుంది' అని ప్రభుత్వాన్ని హెచ్చరించాడు జైలులో నేతాజీ మరణించాడంటే ఈ దేశంలో బ్రిటిష్ ప్రభుత్వాని సమాధి కట్టడమే అవుతుంది. కాబట్టి 1940 డిశంబర్ 5 వ తేదీన బోస్ బాబును జైలునుండి విడుదల చేశారు. అయితే మిగతా రెండు కేసుల మాత్రం ఉపసంహరించుకోలేదు.

## ఆత్మ విశ్వాసం

కాంగ్రెస్ పార్టీ బోస్‌బాబు పైన తీసుకొన్న క్రమశిక్షణ చర్యన ఉపసంహరించుకోవాలని ప్రజలనుంచి ఒత్తిడిరాగా, క్రమశిక్షణారహితంగా ప్రవర్తించినందుకు సుభాస్ బేషరతుగా క్షమాపణ చెప్పుకొన్నప్పుడే అది సాధ్యమవుతుందని గాంధీజీ చెప్పిన సమాధానానికి బోస్ మర్యాద పూర్వకమైన చురక పెట్టాడు-

'స్విడ్జర్‌లాండ్ దేశంలో గొప్ప దేశభక్తుడైన విలియం టెల్‌ను గూర్చి వ్రాసిన ఈ క్రింది పద్యం నాకు గుర్తుకు వస్తోంది:

నేను మోకరిల్లేది
కేవలం ఆ భగవంతుని ముందనే
నా ప్రాణాలు ఆస్ట్రియన్ హస్తాలలో ఉన్నా
తలవంచదు సొంతదైన నా అంతరాత్మ
(My knee shall bend, he calmly said
To God and God alone;

My life is in the Austrians' hand
My Conscience is my own.)

నా రాజకీయ జీవితంలో నాకు తెలిసినంతవరకు నేను ఎలాంటి తప్పు చేయలేదు. కాబట్టి పైన ఉదహరించిన పద్యంలో కొన్ని మాటలు మార్చి అది నా సమాధానంగా తీసుకోవచ్చు' అన్నాడు.

న్యాయస్థానాలలో సుభాష్‌పైన విచారణ జరుగుతున్న సందర్భంలో తన క్షయంటు జబ్బుతో బాధపడుతున్నాడు కాబట్టి కేసు వాయిదా వేయాలని సుభాష్ తరఫున న్యాయవాది కోరాడు. అప్పుడు 'అనేక మందికి ఇంటర్వ్యూలు ఇస్తున్న మనిషి జబ్బుతో బాధపడుతున్నాడని చెపితే నమ్మడం ఎలా?' అని కోర్టు ప్రశ్నించింది. దానికి సమాధానంగా 'ఇతరులకు ఇంటర్వ్యూలు ఇచ్చి వారితో మాట్లాడుతూ ఉండటం నా క్షయంటు పొందుతున్న చికిత్సలో ఒక భాగం. ఈ ఇంటర్వ్యూలు లేకుండా ఆయనకు ఆరోగ్యం చేకూరేదెలా? ఇతరులతో సంభాషించడమే ఆయన ఊపిరి. ఒక రాజకీయ నాయకుడిని ఇతరులతో మాట్లాడ నివ్వకుండా ఒంటరిగా ఉంచడం కంటె పెద్ద శిక్ష మరొకటి ఉండదు' అన్నాడు న్యాయవాది. మారు మాట్లాడకుండా కోర్టువారు కేసు వాయిదా వేశారు.

భారతదేశంలో ఉన్నంత కాలం స్వేచ్ఛగా పోరాటం సాగించడానికి వీలుపడదనీ, ఎక్కువ కాలం బ్రిటిష్ ప్రభుత్వ జైళ్ళలోనే మగ్గవలసి వస్తోందనీ, అందువలన విలువైన సమయం ఎంతో వృధాఅయిపోతోందనీ బోస్ బాధపడ సాగాడు. తన సమయం అంతా ఏ మాత్రం వృధా కాకుండా భారత స్వాతంత్ర్య పోరాటానికే ఉపయోగపడాలనీ, అది తాను భారతదేశంలో ఉంటే సాధ్యపడదనీ తేల్చుకొన్నాడు. అందుచేత జనవరి 1941 మొదటి వారంలో భారతదేశం నుంచి తప్పించుకు పోవడానికి పథకం వేసుకొన్నాడు. ఒక నెల రోజులపాటు శరత్ చంద్రబోస్ కుమా

రుడు శిశిర్ రాత్రి ప్రొద్దుపోయే వరకు సుభాస్‌తో రోజూ మంతనాలు జరుపుతూ వచ్చాడు. కాని ఇది ఎవరిలోను అనుమానం కలిగించలేదు. అసలు బోస్‌బాబుకు దేశం వదిలిపెట్టి పోయే ఆలోచన ఉందని ఎవరూ ఊహించలేదు కూడా.

## మారు వేషంలో విదేశాలకు

తన పథకంలో భాగంగా బోసు తాను అనారోగ్యంతో బాధపడుతున్నట్లు ప్రకటించాడు. ఎవరూ తనను చూడటానికి రావద్దని విజ్ఞప్తి చేశాడు. రక రకాల వదంతులు బయలుదేర దీశాడు. చండీ పూజ చేసుకొంటూ కాలం గడపాలని సుభాస్ నిశ్చయించుకొన్నాడని దగ్గర బంధువులు తెలియజేశారు. సుభాస్ ఎప్పుడూ నాస్తికుడు కాదు కాబట్టి, ఈ వదంతులు అంతా నమ్మారు. అసలు జీవితం మీద విరక్తి పుట్టిందనీ, రాజకీయాలతో ఎలాంటి ప్రమేయం పెట్టుకోకూడదనీ సుభాస్ నిశ్చయించుకొన్నాడనీ కొందరు అన్నారు

రాజకీయాలలో ఎంత తీవ్రవాది అయినప్పటికి బాల్యంనుంచి కూడా ఆధ్యాత్మిక చింతన కలవాడు కావడం చేత, నిజంగానే భక్తి మార్గం వైపుకు దృష్టి మరల్చుకొంటున్నాడేమో అనుకొన్నారు. సుభాస్ చరిత్ర తెలిసిన కొందరు, చిన్నప్పుడే చదువు సంధ్యలు వదిలేసి గురువును వెతుక్కుంటూ ఉత్తర భారతంలో పర్యటించినవాడు ఈ రాజకీయాలతో విరక్తి చెంది భక్తి భావం పెంచుకోవడంలో ఆశ్చర్యము లేదన్నారు. అసలు తన ఆంతర్యమేమిటో బయట పెట్టకుండా రకరకాల వదంతులు వ్యాపించేట్లు చేశాడు బోసుబాబు. ఎక్కువ మందితో మాత్రం తన ఆరోగ్యం సరిగాలేదని, తాను ఎక్కడికీ కదలే పరిస్థితిలో లేదని చెప్పాడు. తన దగ్గర స్నేహితులకు ఉత్తరాలలో కూడ తన ఆరోగ్యం సరిగా లేదనీ, రాజకీయాలకు దూరంగా ఉండాలని నిశ్చయించుకొన్నాననీ

వ్రాశాడు. ఈ ఉత్తరాలన్నీ సెన్సార్ చేసి చదువుకొన్న బ్రిటిష్ ప్రభువులు అసలు ఆంతర్యం ఏమిటో గ్రహించలేకపోయారు. సుభాస్ అప్పుడప్పుడు సాధువులనూ, ఫకీర్లనూ రప్పించుకొనేవాడు. అతి సన్నిహిత మిత్రుడైన శార్దూలసింగ్‌కు కూడా సుభాస్ తప్పించుకుపోయిన వార్త 1941 జనవరి 26 నాడు ప్రపంచానికి వెల్లడి అయ్యేంతవరకు తెలియదు. సుభాస్ బోస్ సాధువైపోయి, దక్షిణ దేశంలో ఏ పుణ్య క్షేత్రానికో వెళ్ళిపోయి ఉంటాడు అని ఆయన ప్రకటించాడు.

## ఉత్కంఠ కల్గించే సుదీర్ఘ ప్రయాణం

జనవరి 15వ తేదీన ఒక పైజామా, షెర్వానీ, టర్కీటోపీ ధరించాడు సుభాస్. పొడుగాటి గడ్డంతో లక్నో మౌల్వీ వేషంలో తయారయ్యాడు. ఆ వేషంలో బర్ద్వాన్ వరకు కారులో చేరుకొన్నాడు. అక్కడనుంచి పంజాబ్ మెయిల్‌లో బయలుదేరి, జనవరి 17 రాత్రికి పెషావర్ చేరాడు. పెషావర్‌లో రెండు రోజులు గడిపాడు. కాబూల్‌కు ప్రయాణం చేయడానికి వీలుగా ఉండేందుకుగాను మౌల్వీవేషాన్ని తీసివేసి పఠాన్ వేషం వేసుకొన్నాడు పెషావర్‌లో ఉన్న మిత్రుడు రహమత్ ఆలీఖాన్‌తో కలిసి 'జంరాడ్ రోడ్డు' వరకు మోటారులో ప్రయాణం చేశాడు. అక్కడినుంచి మట్టి రోడ్డున ప్రయాణంచేసి 'గర్హి' అనే కుగ్రామం చేరారు. ఆ రాత్రి అక్కడ గడిపి మర్నాడు రహమత్‌తో పాటు మరో ముగ్గురు సాయుధులైన పఠానులను తోడు తీసుకొని కాబూలుకు కాలినడకన ప్రయాణమయ్యాడు. ఆ సాయంత్రానికి భారత దేశ సరిహద్దును దాటి కొండజాతి వారు నివసించే ఒక గ్రామం చేరారు. అక్కడ 'అదే-షరీఫ్' అనే ఒక మసీదు ఉంది. ఆ మసీదులో ఉన్న గురువు, పెషావర్‌నుంచి వచ్చిన మిత్రులు సుభాస్ కాబూల్‌కు చేరడానికి ఏర్పాట్లు చేశారు. పెషావర్‌నుంచి వచ్చిన ముగ్గురు వ్యక్తులు అక్కడ

నిలిచిపోయారు. క్రొత్తవారిని ముగ్గురిని తోడుగా ఇచ్చి పంపాడు ఆ మత గురువు. కొండ దాటిన ప్రయాణం చేసి 'లాల్‌పూరా' చేరారు. వీరి రాకకు ముందుగానే అక్కడ కావలసిన ఏర్పాట్లు జరిగాయి. ఆ రాత్రికి అక్కడ ప్రశాంతంగా గడిపారు. అక్కడ ఓ పెద్ద 'ఖాన్ సాహెబ్' ఇంట్లో బస చేశారు. ఆయన కొండజాతుల పరిపాలకుడు. ఆఫ్ఘన్ ప్రభుత్వం ఆయనను బాగా గౌరవిస్తుంది. ఎంతోగానో అలసిపోయి ఉన్నప్పటికీ బోసు అక్కడికి కొద్ది దూరంలోనే ఉన్న కాబూల్ నదిని దాటితే మంచి రోడ్డు ఉందని తెలుసుకొని ప్రయాణమయ్యారు. ఆ 'ఖాన్ సాహెబ్' ఇచ్చిన ఉత్తరం దారిలో బాగా ఉపయోగపడింది. అది పర్షియన్ భాషలో ఉంది. రహమత్ ఖాన్, జియా ఉద్దీన్ (సుభాన్)లు సరిహద్దు జాతి వారనీ, పవిత్రమైన 'సఖీ సాహెబ్' సమాధి దర్శించడానికి బయలు దేరిన యాత్రికులనీ ఆ ఉత్తరంలో ఉంది. అంత కష్టపడకుండా 'దోర్గా' మీదుగా కాబూల్ చేరవచ్చును కాని దారిలో మూడుసార్లు పాస్ పోర్టుల తనిఖీకి నిలబడాలి. అందుచేత వారు చుట్టుదారినే ప్రయాణం చేశారు. నది దాటి రోడ్డు ఎక్కిన తర్వాత ఒక లారీలో రాత్రి అంతా ప్రయాణంచేసి, అక్కడక్కడ 'టీ' మాత్రం సేవిస్తూ 'బడ్‌ఖబ్' చేరారు. అక్కడ పాస్‌పోర్టులు తనిఖీ జరిగింది. 'ఖాన్‌సాహెబ్' ఇచ్చిన ఉత్తరం తోడ్పడింది. జియాఉద్దీన్ (సుభాన్) చెవిటి, మూగవాడని నమ్మించడం జరిగింది. సుభాన్ పెషావర్‌లోనే తన డబ్బును అఫ్ఘన్ నాణాలలోనికి మార్చుకొన్నాడు. అందుచేత లారీవాడికి చెల్లించవలసిన సొమ్ము చెల్లించి వేశాడు.

1941 జనవరి 22 నాడు సుభాన్ కాబూలు చేరాడు. కాబూల్ చేరాక రహమత్‌ఖాన్ (అసలు పేరు భగత్‌రామ్) వివిధ దేశాల దౌత్య కార్యాలయాల అధికారులను రహస్యంగా కలుసుకొని ముందు ప్రయాణానికి సన్నాహాలు చేయాలనుకొన్నాడు కాని అది అంతగా ఫలించలేదు.

గత్‌రాం మర్దాన్ జిల్లాకు చెందినవాడు. పూర్వం పంజాబ్ గవర్నర్‌ను పిస్టోలుతో కాల్చిచంపడానికి ప్రయత్నం చేసి శిక్షించబడిన ఒక విప్లవకారుని సోదరుడు. ఆ అన్నకు తగిన తమ్ముడు కాబట్టే సుభాస్‌తో ఈ సాహస యాత్ర చేయగలిగాడు. సమయస్ఫూర్తిగల చురుకైన వ్యక్తి. అయినప్పటికీ యుద్ధజ్వాలలు ప్రపంచంలో నలుదిశల వ్యాపిస్తున్న ఆ రోజులలో దౌత్యకార్యాలయాలతో రహస్య సంబంధం కుదుర్చుకోవడం అంటే సామాన్యమైన విషయం కాదు. సుభాస్ సోవియట్ భూభాగం గుండా ప్రయాణం చేయక తప్పదు కాబట్టి, ఏ విధంగానైనాసరే రష్యన్ దౌత్యకార్యాలయంతో సంబంధాలు ఏర్పరచుకోవాలనుకొన్నాడు. మధ్యవర్తుల ద్వారా సాగించిన ప్రయత్నం ఫలించలేదు. ముందు అనుకొన్న రీతిగా కాబూల్ చేరేంతవరకు ఏర్పాట్లన్నీ పకడ్బందీగా జరిగాయి కాని, ఆ తర్వాత ప్రయాణానికి సంబంధించిన ఏర్పాట్లు ఏమీ జరగలేదు. ఎంత త్వరగా వీలైతే అంత త్వరగా కాబూల్‌ను విడిచిపెట్టిపోవాలి. లేకపోతే ప్రమాదంలో చిక్కుకోవలసివస్తుంది. అఫ్ఘన్ ప్రభుత్వానికి సుభాస్ ఉనికి ఏమాత్రం తెలిసినా అరెస్టుచేసి నిర్దాక్షిణ్యంగా బ్రిటిష్‌వారికి అప్పచెపుతారు. కాబట్టి. చురుకుగా ప్రయత్నాలు సాగించవలసి ఉంది. ఈలోగా మరో అవాంతరం వచ్చిపడింది. సుభాస్ ఉంటున్న సత్రంపైన ఒక గూఢచారి దృష్టి పడింది. అనేక ప్రశ్నలతో అతడు వీరిని విసిగించడం ప్రారంభించాడు. చివరికి ఒక పది రూపాయల నోటు, చేతిగడియారం సమర్పించుకొని వాడిని వదిలించుకోగలిగారు. ఇక ఎంతమాత్రం ఆ సత్రంలో బస చేయడం శ్రేయస్కరం కాదని నిశ్చయించుకొన్నారు. ఫిబ్రవరి 13 నాడు ఉత్తమచంద్ ఇంటికి చేరారు. ఉత్తమచంద్ భగత్‌రాంకు పాత స్నేహితుడు. అతడిని వెతికిపట్టుకోవడానికి భగత్‌రాంకు కొన్ని రోజులు పట్టింది. ఉత్తమచంద్‌కు కాబూల్‌లో ఒక రేడియోలూ, పింగాణీ సామానుల షాపు ఉంది. భగత్‌రాం వచ్చిన పని విని ఉత్తమచంద్

కాసేపు నివ్వెరపోయాడు. అయితే తనకు చేతనైన సహాయం చేయడానికి సంసిద్ధత వ్యక్తం చేశాడు.

అప్పటికే సుభాస్ తన ప్రయత్నం ద్వారా జర్మన్ దౌత్యకార్యాలయంతో సంబంధం ఏర్పరచుకొన్నాడు. ఫిబ్రవరి 6 న ఒక రకంగా బలవంతంగానే గేటు లోపలికి జొరబడ్డాడు. ఏలాగైతేనేం, దౌత్య ప్రతినిధి హెర్ పిల్గర్ (Herr Pilger) ను కలుసుకొన్నాడు. కాబూల్‌లో సీమెన్స్ ప్రతినిధిగా పనిచేస్తున్న హెర్ థామస్ (Herr Thomas) వార్తాహరుడుగా ఉంటాడనీ, అతని ద్వారా ఎప్పటికప్పుడు వార్తలు తెలియజేస్తామని పిల్గర్ సుభాస్‌తో చెప్పాడు. ఈ లోపల బెర్లిన్‌కు వర్తమానం పంపి ఆదేశాలు సంపాదిస్తానని తెలియజేశాడు. ఆ తర్వాత ఫిబ్రవరి 15 వ తేదీ వరకూ ఏ విధమైన ప్రగతీ కన్పించలేదు. ఉత్తమ్‌చంద్ ఇంట్లో నాలుగు గోడల మధ్య సుభాస్ కాలక్షేపం చేయవలసివచ్చింది. భారతీయులతో ఎవరితోనైనా సంప్రదిద్దామంటే వారు బ్రిటిష్ వారి ఏజెంట్లు అయితే ప్రమాదం జరుగుతుంది. అలాగే అఫ్ఘన్ వారితో మాట్లాడదామా అంటే అందులో పోలీసులకు వార్తలు చేరవేసే వారుండవచ్చు. కాబట్టి కదలకుండా గదిలో కూర్చోవడం తప్ప ఆయనకి చేయగల్గింది కన్పించలేదు. ఇంతలో ఉత్తమ్‌చంద్ పొరుగున ఉన్నవారు వీరివైపు అనుమానంతో చూడసాగారు కొన్నిరోజులు వారి దృష్టి నుంచి బయట పడటం మంచిదని భావించి వేరే సత్రానికి మకాం మార్చారు. కాని అక్కడ సుభాస్ ఆరోగ్యం దెబ్బతినడంతో మళ్ళీ ఉత్తమ్‌చంద్ గృహానికే చేరవలసి వచ్చింది. ఏ విదేశీ దౌత్యకార్యాలయానికైనా సాహసంతో వెళ్ళగల్గినప్పటికీ 'నేనే సుభాస్ చంద్రబోస్‌ను' అని పరిచయం చేసుకొంటే మాత్రం వారు వెంటనే నమ్మడం ఎలా? ఋజువు చేసుకోవడానికి తన వద్ద ఆధారాలు ఏమీలేవు. రష్యా దౌత్యకార్యాలయాన్ని అసలు సమీపించడానికే వీలు లేకపోయింది. జర్మన్లేమో పట్టీ పట్టనట్లున్నారు.

అంతులేకుండా కాబూల్‌లోనే నిలబడి పోవడం వలన సుభాస్‌కు విసుగు పుడుతోంది. ఇక బోస్ ఎవరి సహాయం లేకుండా స్వయంగానే సోవియట్ యూనియన్‌కు చేరుకొనే ప్రయత్నం ప్రారంభించాడు. ఒక హత్యానేరంలో ముద్దాయిగా ఉండి పెషావర్ నుంచి తప్పించుకు వచ్చి కాబూల్‌లో ఉంటున్న ఒక వ్యక్తిని పట్టుకొని, సరిహద్దు ప్రాంతంలో బంది పోటు దొంగతనాలతో జీవిస్తున్న అతడి బావమరది సహాయం తీసుకోవాలని ఆలోచన చేశాడు. అయితే ఈలోగా 23 ఫిబ్రవరి నాడు హెరేథామస్ నుండి కబురు వచ్చింది. ఇటాలియన్ దౌత్య ప్రతినిధి ఆల్‌బెర్టో కరోనీని కలుసుకొని మిగతా ఏర్పాట్ల సంగతి ఆలోచించమన్నారు. కరోనీని మొట్ట మొదట భగత్‌రాం కలుసుకొన్నాడు ఆ తర్వాత సుభాస్ అతడిని కలుసుకొని మాట్లాడే ఏర్పాటు జరిగింది. వారి మొదటి ఇంటర్వ్యూ ఒక రాత్రి అంతా జరిగింది. భవిష్యత్తులో తాను ఏరీతిలో పోరాటం సాగించాలనేది బోస్ ముందుగానే నిర్ణయించుకొన్నాడు. ఐరోపాదేశాలకు వెళ్ళి స్వతంత్ర భారత ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసి జర్మనీలోనూ, ఇటలీలోనూ,ఇతర ఐరోపా దేశాలలోనూ ఉన్న భారతీయ యువకులను సమరోన్ముఖులుగా తయారు చేసుకోవడం తన ధ్యేయమని కరోనీకి సుభాష్ స్పష్టంగా తెలియజేశాడు. భారత స్వాతంత్ర్యంకోసం ప్రచారం చేయడానికిగాను ఒక రేడియో కేంద్రాన్ని తన ఆధీనంలో విడిచిపెట్టవలసినదని కరోనీని కోరాడు. బెర్లిన్‌లోను, రోమ్‌లోను సుభాష్ ఆలోచనకు ఏపాటి విలువ ఇస్తారు అన్న అనుమానం పీకుతున్నప్పటికీ, బోస్‌బాబు అప్పటికే తన ఆలోచనలతో ఎంతో ముందుకు సాగి ఉన్నాడు కాబట్టి కరోనీ నిరుత్సాహపరచదలచుకోలేదు. శ్రీమతి కరోనీ క్రమంతప్పకుండా ఉత్తమ్‌చంద్ షాపుకు వెళ్ళి అటు, ఇటు సమాచారం అందజేయడానికి ఏర్పాటు చేసుకొన్నారు.

ఈ సమయంలోనే జర్మన్, ఇటాలియన్ ప్రభుత్వాలు రెండూ రష్యా భూభాగంగుండా బోస్‌బాబు ప్రయాణానికి సోవియట్ ప్రభుత్వంతో మాట్లాడటం జరిగింది. ఆఫ్ఘనిస్థాన్‌లోనూ, వన్యక్షేత్రాలలోనూ తన భవిష్యత్ కార్యక్రమాలకు తోడ్పడగల నమ్మకస్తులను సమకూర్చుకొనేందుకు బోస్ ఈ విరామాన్ని ఉపయోగించుకొన్నాడు. ఈ సమయంలోనే సుభాష్ ప్రసిద్ధమైన తన పరిశోధనా వ్యాసం 'ఫార్వర్డ్ బ్లాక్ - దాని నిరూపణ' (Forward block - Its Justification) వ్రాయడం జరిగింది. ఇటాలియన్లతో రెండు రకాలుగా సంబంధాలు పెట్టుకోవడం జరిగింది-ఒకటి శ్రీమతి కరోనీ ఉత్తమ్‌చంద్ షాపును దర్శించడం, రెండవది భగవత్‌రాం ఇటాలియన్ దౌత్య ప్రతినిధి అయిన సీనార్ క్రెసీనిని (Segnor Creseini) అతడి స్వంత గృహంవద్ద కలుసుకోవడం.

నాల్గు వారాల తర్వాత సోవియట్ ప్రభుత్వంనుంచి వర్తమానం చేరింది. ఈ మూడు ప్రభుత్వాలు అంగీకరించిన మేరకు కాబూల్‌లో ఇటలీ దౌత్య కార్యాలయంలో గుమాస్తాగా పనిచేస్తున్న ఆర్లెండో మెజొట్టా పేరున ఉన్న పాస్‌పోర్టుతో సుభాష్ రష్యాగుండా ప్రయాణం చేయాలి. ఆఫ్ఘన్ ప్రభుత్వాన్ని ఒక వార్తాహరునికి ఇచ్చే వీసా జారీ చేయవలసినదిగా కోరడమైంది. సరిగ్గా ఇంకో వారం రోజుల్లో సుభాష్ కాబూల్‌ను వీడిపోతాడనగా శ్రీమతి కరోని ఉత్తమ్‌చంద్ షాపుకు ఒక ముఖ్యమైన వార్త అందజేసినది. ఆ సూచన మేరకు పాస్‌పోర్టుపైన మెజొట్టా ఫోటో అతికించవలసినచోట సుభాష్ ఫోటోను అతికించడానికి ఏర్పాట్లు జరిగాయి. సుభాష్‌కు అందుకు అనువైన బట్టలుకూడా తయారైనాయి. మార్చి 16 వ తేదీన ఇటాలియన్లు బోస్‌బాబు సూట్‌కేసు తీసుకువెళ్ళారు. ఆ మర్నాడే బోస్‌బాబుకూడా క్రేసీనీ ఇంటికి చేరుకొన్నాడు. తన సూచనల మేరకు భారతదేశంలో అందజేయవలసిన ముఖ్యమైన పత్రాలను సుభాష్ భగత్‌రాంకు అందించాడు. భారతదేశానికి,కాబూలుకు మధ్యసమాచారం అందించ

డంలో భగత్‌రాం తోడ్పడేట్టు, బోస్‌బాబు కాబూల్‌కు మధ్య సమాచారం చేర్చడంలో ఇటాలియన్లు సహకరించేట్లు అంగీకారం కుదిరింది

మార్చి 18 వ తేదీ ఉదయం ఒక జర్మన్ ఇంజనీర్, మరో ఇద్దరు వ్యక్తులు తోడురాగా ఒక కారులో సుభాస్ సోవియట్ సరిహద్దులకు ప్రయాణమైనాడు. దారిలో రెండు రోజులు జర్మన్ల ఇళ్ళలో గడపాలని నిశ్చయమైంది హిందూకుష్ పర్వత కనుమలగుండా ప్రయాణం చేసి సువిశాలమైన అఫ్ఘన్ దేశపు స్టెప్పీ గడ్డి భూముల గుండా అఫ్ఘన్ సరిహద్దులలో 'పాటా కిసార్' వద్దకల గస్తీ కేంద్రం గుండా 'ఓక్సస్'ను దాటి చరిత్ర ప్రసిద్ధమైన 'సమర్‌ఖండ్' పట్టణానికి చేరుకొన్నారు. మార్చి 20 వ తేదీన సమర్‌ఖండ్ నుంచి బయలుదేరి మాస్కో చేరుకొన్నారు. అక్కడ నుంచి విమాన ప్రయాణం చేసి, 1941 ఏప్రిల్ మొదటి వారంలో బెర్లిన్ చేరారు ఆఫ్ఘన్ సరిహద్దులు దాటి రష్యాలో ప్రవేశించాడనుకొన్న సిన్యర్ ఆర్లెండో మెజొట్టో కాబూలులోనే ఉన్నాడన్న సంగతి తెలుసుకోవడానికి అఫ్ఘన్ ప్రభుత్వానికి చాలా రోజులు పట్టింది. అప్పటికి మధ్య ఆసియాకు ఎంతో దూరంలో ఉన్నాడు సుభాస్.

1941 మార్చి 31 వ తేదీ సాయంత్రం సరిహద్దు ప్రాంతాలనుంచి 1,వుడ్‌బర్న్ పార్క్‌లో ఉన్న శరత్ చంద్రుని గృహానికి ఒక ఆగంతకుడు వచ్చి. శిశిర్ ఉన్నాడా అని అడిగాడు. శిశిర్ వెంటనే లోపలికి వెళ్ళి శరత్ చంద్రుని వెంటబెట్టుకొనిరాగా ఆయనకు మూడు పత్రాలు అందజేశాడు భగత్‌రాం. అందులో ఒకటి బెంగాలీలో శరత్ చంద్రునికి సుభాస్ వ్రాసిన వ్యక్తిగత లేఖ, 'ఫార్వర్డ్ బ్లాక్ - ఒక నిరూపణ' అన్న పరిశోధన వ్యాసం, మూడవది 1941 మార్చి 22 తేదితో 'ఐరోపాలో ఒక ప్రదేశం నుంచి' అని వ్రాసి 'నా దేశీయులకు సందేశం' అన్న పత్రం. ఆ మర్నాడు భగత్‌రాం, శరత్‌చంద్రుడు ప్రభాత సమయంలో కాలినడకన విక్టోరియా

మెమోరియల్ గార్డెన్ వైపుకు సాగిపోతూ ఉండగా కలుసుకొని బోస్‌బాబు పెషావర్ నుంచి రష్యా సరిహద్దుల వరకు జరిపిన ప్రయాణాన్ని వర్ణించి చెప్పాడు. అజ్ఞాత సంస్థ అయిన బెంగాల్ వలంటీర్ గ్రూప్‌కు చెంది, సుభాస్ బోస్‌కు నమ్మినబంటు అయిన సత్సరంజన్ బక్షికి శరత్‌చంద్రుడు భగత్‌రాంను పరిచయం చేశాడు. 1941 నవంబరు మాసంవరకు కలకత్తాలో ఉన్న జపాన్ దౌత్య సిబ్బంది ద్వారా టోక్యో గుండా బోస్ సోదరులు వైర్‌లెస్‌లో మాట్లాడు కొనేవారు.

ఇల్లు వదిలిన తర్వాత రెండు మాసాల పదకొండు రోజులు ఉత్కంఠ కలిగించే సాహసోపేతమైన ప్రయాణానంతరం తన క్రొత్త అవతారం అయిన 'సిన్యార్ ఆర్లాండో మెజొట్టా' నామధేయంతో బోస్ బాబు క్షేమంగా బెర్లిన్ చేరుకొన్నాడు.

ఎందరో బ్రిటిష్ పోలీసులూ, పంచమాంగదళ సభ్యులు, వార్తా హరుల కన్నుగప్పి కలకత్తా నుంచి బెర్లిన్ వరకు బోస్ సాగించిన ప్రయాణం చరిత్రలో అత్యంత ఆసక్తికరమైన ఘట్టంగా నిలిచిపోతుంది.

# స్వాతంత్ర్య రఘురఘు

'నాజీ' నియంతతో నీ మైత్రి
ఆ విధాత కల్పించిన వైచిత్రి
శత్రువుకు శత్రువు-మన మిత్రుడే
అన్న మహామంత్ర దర్శనం
హిందు ఫౌజుగా-బృహద్దర్శనం.

నేతాజీ జర్మనీ చేరేసరికి అక్కడి పరిస్థితులు గందరగోళంగా ఉన్నాయి. జర్మనీ అప్పటికే రెండవ ప్రపంచ యుద్ధంలో తలమునకలై ఉంది అంతలో ఇటలీదేశం హిట్లర్‌తో చేతులు కలుపుతున్నట్లు ప్రకటన చేసింది. దీనితో జర్మనీ బాధ్యత ఇంకా పెరిగింది తన దళాలలో ముఖ్యమయిన వాటిని ఉత్తర ఆఫ్రికాకు, బాల్కన్ దేశాలకు పంపవలసిన అగత్యం ఏర్పడింది. ఈ తరుణంలో ఆర్లాండో మెజోట్టా పేరుతో జర్మనీ ఫారిన్ ఆఫీసులో నేతాజీ ప్రత్యక్షమయ్యాడు. జర్మన్ విదేశాంగ శాఖ అధికారులకు నేతాజీ ఎవరో బాగా తెలుసు. భారతదేశంలో అత్యంత ప్రియతమ నాయకుడైన నేతాజీ తమముందు నిలచాడన్న సంగతి వారు గుర్తెరిగినవారే. అయితే నేతాజీని తమ మధ్యకు ఏ విధంగా ఆహ్వానించాలో తేల్చుకోలేని పరిస్థితిలో పడ్డారు. నియంతృత్వ విధానంలో సాగుతున్న హిట్లర్ పరిపాలనలో ఆయనకి తెలియకుండా ముఖ్య నిర్ణయాలు ఏవీ తీసుకునే వీలుపడదు. కాబట్టి జర్మన్ అధికారులు సమయం కోరారు.

## శ్రమజీవులు జర్మన్లు

నేతాజీకి జర్మనీ వెళ్ళడం క్రొత్త ఏమీకాదు. 1935 లో జర్మనీ సందర్శించాడు. అప్పుడు ప్రభుత్వ అతిథిగా కాక కేవలం ఒక **విదేశీ**

పర్యాటకుడుగా మాత్రమే ఆ దేశాన్ని సందర్శించాడు. ఆ దేశంలో పరిశ్రమలతో పాటు వ్యవసాయానికి అత్యంత ప్రాధాన్యం ఇవ్వడం కళ్ళారా చూశాడు. ఆడ, మొగ అన్న వ్యత్యాసం లేక యువతీ యువకులందరూ కష్టించి పనిచేయడం చూశాడు. అక్కడ రాజకీయ రంగాన్ని కూడా సునిశితంగా పరిశీలన చేశాడు. హిట్లర్ యూదులను ఊచకోత కోయడం, కమ్యూనిస్టులను సమూలంగా నేలమట్టం చేయడం గురించి విన్నాడు. ఏ రాయిటర్ ద్వారానో లేక యు.యన్.ఐ. ద్వారానో పరోక్షంగా విన్న వార్తలు కాకుండా ప్రత్యక్షంగా హిట్లర్‌నూ, హిట్లర్ పరిపాలననూ చూడాలని చేసిన ప్రయత్నం అది.

## హిట్లర్ భావాలు

హిట్లర్‌కు జాత్యభిమానం విపరీతంగా ఉంది. తెల్లవారు వర పుత్రులని, మిగిలినవారు వారిచేత పాలింపబడడానికి పుట్టినవారేనని అతని అభిప్రాయం. బ్రిటిష్‌వారు అంత దూరం ప్రయాణం చేసి భారత దేశం చేరి క్రమంగా భారతదేశాన్ని తమ కాలనీగా మార్చుకొన్నందుకు ఒక రకంగా బ్రిటిష్ వారిని అభినందించాల్సిందే అనేది అతడి అభిప్రాయం. అందుచేత వెనువెంటనే బ్రిటన్ మీద దాడిచేసి బ్రిటిష్ వారిని ఓడించాలనే ఉద్దేశ్యం అతని హృదయాంతరాలలోలేదు. కాని దిన దినం పెరుగుతున్న జర్మన్ ప్రాబల్యం చూసి తమ దేశం జర్మనీకి ద్వితీయ శ్రేణి శక్తిగా మిగిలిపోతుందన్న భయంతో బ్రిటిష్ వారే ముందుగా యుద్ధం ప్రకటించడంతో పరిస్థితి తారుమారు అయింది. ఆంగ్లో-జర్మన్ సమైక్యతే కనుక సంభవించిఉన్నట్లయితే భారతదేశ స్వాతంత్ర్యం అంత సులువుగా సాధ్యమయ్యేది కాదు.

హిట్లర్‌కు ఆశ్చర్యం కలిగించే విషయం ఒకటి ఉంది. ఒక ప్రక్క భారత దేశంలో బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా స్వాతంత్ర్య పోరాటం

సాగుతూ ఉండగా మరో ప్రక్క ఇతర ఐరోపా దేశాలలో బ్రిటిష్ వారి తరఫున భారత సైనికులు యుద్ధం చేస్తూ ఉండడం సామాన్య సైనికుడుగా ఉన్న హిట్లర్ మొదటి ప్రపంచ యుద్ధ కాలంలో ప్రత్యక్షంగా చూశాడు. రెండవ ప్రపంచ యుద్ధంలో కూడా భారత సైనికులు బ్రిటిష్ వారి తరఫున ఇతియోపియా, ఈజిప్టులలో యుద్ధం చేయడం గమనించాడు. ఈ భూమికను ఆధారంగా చేసుకొన్నప్పుడు నేతాజీకి ఎలాంటి గౌరవం ఇవ్వాలనేది తేల్చుకోవడం హిట్లర్‌కు కూడా కష్టతరంగానే తోచింది.

## ప్రతి గంటా విలువైనదే

సుదూర ప్రాంతాలైన నార్వే, లిబియా మొదలైన చోట్ల హిట్లర్ సైన్యాలు యుద్ధంలో నిమగ్నమై ఉన్నాయి ఆ సంవత్సరంలోనే జూన్ 22 వ తేదీన రష్యా పైకి కూడా సైన్యాలు పంపించాడు. ఈ స్థితిలో నేతాజీ రూపంలో మరో భారాన్ని వహించడానికి జర్మనీ వెనుకా ముందు ఆడవలసి వచ్చింది. అంతేకాక, నేతాజీ వద్ద అధికారికంగా వచ్చిన దాఖలాలు ఏమీ లేవు భారత జాతీయ కాంగ్రెస్ కానీ, మరో సంస్థ కాని ఆతనికి ఎలాంటి అధికారాలు దత్తంచేసి పంపలేదు. కాబట్టి నేతాజీకి రాజకీయ ఆశ్రయం కల్గించడం కంటే మరో సహాయం అందించకల్గిన పరిస్థితి కాదు అది. జర్మన్ అధికారులకు సంబంధించినంత వరకు బోస్ సమస్య అంత అర్జెంటుగా పరిష్కరించవలసినదిగా మాత్రం కన్పించలేదు. కాని నేతాజీ విషయం వేరు. అంత దూరం నుంచి జర్మనీకి వచ్చి చేరింది గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోడానికి కాదు కదా! పోగొట్టుకొంటున్న ప్రతి గంటా అతి విలువైనది. బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా సాగిస్తున్న స్వాతంత్ర్య పోరాటంలో ప్రతి గంటా విలువైనదే. జర్మనీలో రోజులు గడుస్తున్న కొద్దీ బోసు బాబుకు యుగాలు గడుస్తున్నట్లు అనిపించింది.

జర్మనీ వారు విజయ పరంపర సాధిస్తున్న రోజులవి. ఆ సమయంలోనే కనుక హిట్లర్‌ను ఒప్పించకగల్గితే భారత దేశానికి చాలా మేలు కలుగుతుందనీ, తన కోర్కెలలో చాలా భాగం నెరవేరుతాయనీ బోస్ భావించాడు.

## సుభాస్ పట్ల హిట్లర్ వైఖరి

కాని అంతరాంతరాలలో బ్రిటిష్ వారి పట్ల హిట్లర్‌కు ఉన్న అభిమానం కూడా భారతదేశం పట్ల త్వరలో సరియైన అవగాహనకు రాలేకపోవడానికి కారణమయింది. నిజంగా ఇంగ్లీషు వారిని మట్టు పెట్టి ఇంగ్లాండును స్వాధీనం చేసుకోవాలనే కోర్కె గనుక హిట్లర్‌కు ఉంటే, ఆ పని ముందుగానే నెరవేరి ఉండేది. డన్‌కర్క్ సంఘటన ఇందుకు నిదర్శనం. 29 మే, జూన్ 14 మధ్య కాలంలో మూడు లక్షల మంది బ్రిటిష్ సైనికులను సురక్షితంగా డన్‌కర్క్ నుంచి ఇంగ్లాండు పోవడానికి అనుమతి ఇచ్చాడు హిట్లర్. ఆ సమయంలో జర్మనీకి బలమైన విమాన దళం ఉంది. జలాంతర్గాముల దళం ఉంది. భీతి చెందిన బ్రిటిష్ సైనికులను జర్మన్లు వెంటాడుతున్న పరిస్థితి అది. హిట్లరే తలచుకుంటే బ్రిటిష్ దళాల్లో ఒక్క సైనికుడు కూడా ఇంగ్లాండు చేరేవాడు కాదు. కాని హిట్లర్ అలా చేయలేదు.

అయితే ప్రత్యక్షంగా కానీ, పరోక్షంగా కానీ బ్రిటిష్ యుద్ధ యంత్రాంగానికి తూట్లు వేసే చర్యలో ఏ దేశం పాల్గొనడానికి సిద్ధపడినా దాన్ని ఆహ్వానించేందుకు జర్మన్లు సిద్ధమే. బ్రిటిష్ వారికి మనుష్యులూ, వనరులూ అందజేయడంలో భారత దేశం అగ్రస్థానంలో ఉంది. భారత ప్రజల అభీష్టానికి వ్యతిరేకంగా జరుగుతున్న విషయం ఇది. కాబట్టి బోస్ బాబును నిర్లక్ష్యం చేయడం మంచిది కాదని జర్మనీ గుర్తించింది. హిట్లర్‌కు కుడి భుజంగా పనిచేసిన రిబ్బెన్‌ట్రాప్ బోస్ బాబును సమర్థించాడు.

## స్వేచ్ఛాభారత కేంద్రం

ఈ లోగా బోస్ కూడా ఒక నిర్ణయానికి వచ్చాడు. భవిష్యత్‌కు సంబంధించిన ప్రణాళికను తయారు చేసుకోవడంలో మనస్సును లగ్నం చేశాడు. స్వేచ్ఛా భారత కేంద్రం (Free India Centre) అనే సంస్థను స్థాపించాడు. రేడియో ప్రచారం, సైనిక దళం స్థాపించడం, అలాగే ఆర్థిక సామాజిక సమస్యలు ఆకళింపు చేసుకునేందుకు ఒక ప్రణాళికా సంఘాన్ని నెలకొల్పుకోవడం ఆ సంస్థ లక్ష్యాలు. అయితే, మూడవ లక్ష్యం అంతగా ముందుకు సాగలేదు.

అనుకొన్నట్లుగానే బోస్ జర్మనీ అధికారులతో మంతనాలు సాగించాడు. ఆ అధికారులు సుభాస్ మేధస్సుకు ఆశ్చర్యపోయారు స్వేచ్ఛా కేంద్రానికి అప్పుగా ప్రతి నెలా కొంత సొమ్ము మంజూరు చేయడానికి ఓ ఒప్పందం కుదిరింది. నేతాజీకి వ్యక్తిగతంగా నెలకు 800 పౌన్లు కేటాయించారు. స్వేచ్ఛా భారత కేంద్రానికి కేటాయింపు 1941 లో 1200 పౌన్లతో ప్రారంభించి 1944 లో 3200 పౌన్లకు పెంచారు. ఈ అప్పు తీర్చే బాధ్యత వ్యక్తిగతంగా బోస్ బాబుదే.

జర్మనీతో పొత్తు కలిసిన దేశాల చేత భారతదేశానికి స్వాతంత్ర్యం ఇచ్చి తీరాలనే ప్రకటన కనుక చేయించగలిగితే తాను జర్మనీ వచ్చిన పనికి మంచి ప్రోత్సాహం లభించినట్లేనని బోస్ మొదటి నుంచీ భావిస్తూ వచ్చాడు. అయితే జర్మనీ కానీ, ఇటలీ కానీ బాహాటంగా అలా ప్రకటించడానికి సిద్ధంగా లేవు. అయితే బోస్ బాబుకు తన కార్యక్రమాలు ఏలాంటి అంతరాయం లేకుండా కొనసాగించడానికి అన్ని వసతులూ సమకూరుస్తామని స్పష్టం చేశాయి. స్వేచ్ఛా భారత కేంద్రానికి రాయబార కార్యాలయ హోదా ఇచ్చి గౌరవించారు. 1941 చివరికి స్వేచ్ఛా భారత కేంద్రంలో పనిచేసే భారతీయుల సంఖ్య 30 కి చేరింది. స్వేచ్ఛా భారత

కేంద్ర ప్రథమ సమావేశం 2 నవంబరు 1941 లో జరిగింది. ఈ సమా వేశంలో సభ్యులంతా నేతాజీ పట్ల పరిపూర్ణ విశ్వాసం ఉంచి పనిచేస్తామని ప్రమాణం చేశారు. నేతాజీ తన ఉపన్యాసంలో వారికి కృతజ్ఞతలు తెలియ జేస్తూ — "మనను విజయలక్ష్మి వరించి మన ప్రణాళిక విజయవంతం అయితే మనకు అన్ని వైపుల నుంచి అభినందనల పరంపర లభిస్తుంది. కాని ఒక వేళ మనం అపజయాన్నే రుచి చూడవలసి వస్తే, మాతృదేశ సేవలో మనను మనం అంకితం చేసుకోగలిగాం అన్న సంతృప్తి ఒకటే మనకు మిగులుతుంది. కాబట్టి మనం రెంటికీ సిద్ధపడాలి" అని హెచ్చ రించారు. ఈ సందర్భంలో చెప్పుకోదగ్గ నిర్ణయాలు నాలుగు జరిగాయి. ''జై హింద్'' అనేది యుద్ధ నినాదంగానూ, నేతాజీ జాతీయ నాయకుడు గానూ, జనగణమన జాతీయ గీతంగాను, హిందూస్థానీ రాష్ట్రభాషగాను అంగీకరించారు.

జై హింద్ నినాదం ఒక పలకరింపుగా, ఒక పరామర్శగా, స్వాతంత్ర్య సమర నినాదంగా, పరస్పర ఆశయాకాంక్షల ప్రకటనగా భారతీయుల హృదయ తంత్రులు మీటే మంత్రంగా రూపొందింది. 'హిందుభూమికి జయమగుగాక' అనే నినాదంతో భారతీయ హృదయాలు పులకించేవి. మన దేశంలో అనేక కులాలూ, మతాలూ, కూటముల వారూ ఆయా సందర్భాలలో కలిసినపుడు నమస్తే అనో, రామ్‌రామ్ అనో, జై గోపాల్ అనో, సలాం అనో కుశలం అడగడం అలవాటు. ఇలా వివిధ వర్గాలలో ఉన్న పరిస్థితుల విభిన్నత్వంలోనుంచి పుట్టిన ఏకత్వమా అన్నట్లు 'జైహింద్' ఉద్భవించింది. ఆ రోజుల్లో పని చేస్తున్న 'స్వేచ్ఛా భారత కేంద్రం' లోనే కాదు- భారతీయులందరికీ 'జై హింద్' జాతీయ అభినందన నినాదం అయింది. మనం అంతా ఒకే జాతికి చెందినవారం, ఒకే దేశమాత సంతానం అన్న భావనకు సంకేతంగా జై హింద్ వర్ధిల్లింది. ఇది కేవలం జాతీయ నినాదం. ఏ కులంవారిని గానీ, ప్రాంతం వారిని

గానీ, మతం వారినిగానీ, వర్గాన్ని కానీ గాయపరిచేది కాదు. హిమాల యాలు మొదలు కన్యాకుమారి వరకు వ్యాపించియున్న యావత్ భారతీయులూ తమదైన ఒక విశిష్ట సంస్కృతిని గర్వంగా చాటుకునేందుకు ఈ నినాదం ఐక్య మంత్రంగా ప్రభవిల్లింది. మనలో మనం పరస్పరం కుశలం అడిగేప్పుడు మనమంతా ఒకే మాతృభూమికి చెందినవారము, ఒకే మాత సంతానం అన్న భావన కల్గుతుంది. అలాగే 'జైహింద్' నినాదంతో విదేశీయులను అభివాదం చేస్తే ఒక వ్యక్తిగా కాక భారతజాతి పేరుతో ఆ విదేశీ వ్యక్తిని అభివాదం చేస్తున్నామన్న మాట. కనుకనే జైహింద్ నినాదాన్ని మనకందించిన నేతాజీని స్తుతిస్తూ ఒక కవి ఇలా వ్రాశాడు:

''పారతంత్ర్య శృంఖలాలు ఫటఫటమని త్రెంచివైచి
కట కటాలు వెడలివచ్చి జైహిందని పిలుపునిచ్చి
జాతికి జీవం పోసిన నేతాజీ''!

భారతీయులలో ఎవరైనా తమ ప్రతిభచేతా, మేధాసంపత్తిచేతా ఒక విశిష్ట స్థానాన్ని అలంకరించినట్లయితే, వారిని మామూలు పేరుతో కాక ఏదో ఒక బిరుదు నామంతో పిలవటం పరిపాటి. మహాత్మ, సర్దార్, పీర్, సాయి, గురూజీ-ఇలా అనేక బిరుదునామాలు మనకు పరిచితమే. అలాగే అత్యున్నత ధైర్య సాహసాలు ప్రదర్శించి భారతీయులందరికి ప్రేమాస్పదుడైన సుభాస్‌ను ఆనాటినుండి ఆప్యాయంగా 'నేతాజీ' అని పిలవ నారంభించారు. నేతాజీ ఆయన సార్థక నామం అయింది. ఈ బెర్లిన్ సమావేశంలో 'జనగణమన' జాతీయగీతంగా అంగీకరించబడింది. అనంతరం దేశ స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత ఈ గానమే జాతీయ గీతంగా నిలచిపోయింది. మొదటిసారిగా పూర్తి వాద్య తాళాలతో జనగణ మన గీతాన్ని 1942 లో హేంబర్గ్‌లో ఇండో-జర్మన్ కల్చరల్ సొసైటీ

ఉత్సవంలో ఆలాపించారు. ఈ సందర్భంలోనే మొట్ట మొదటిసారిగా స్వేచ్ఛా భారత జాతీయ పతాకం మరో దేశపు పతాకం సరసన సగర్వంగా రెపరెపలాడింది. ఆ సందర్భంలోనే 'హేంబర్గ్' పట్టణం మేయర్ అనేకమంది విదేశీ రాయబారుల మధ్య నేతాజీని ఒక స్వతంత్ర దేశాధిపతికి ఒసగే అన్ని లాంఛనాలతోనూ గౌరవించారు. భారతదేశాన్ని ఒక స్వతంత్రదేశంగా గుర్తించి పిలవడమే కాక, ఎల్లప్పుడు జర్మనీ భారతదేశం పట్ల అలాంటి మిత్రత్వంతోనే సంచరిస్తుంది అని పేర్కొన్నారు. ఆ విధంగా 29-5-1942 నాడు నేతాజీకి ఇవ్వబడిన హామీగా దానిని పేర్కొనవచ్చు.

29, మే 1942 నాడు హిట్లర్‌ను ఆయన హెడ్‌క్వార్టర్స్‌లో నేతాజీ కలుసుకొన్నాడు. స్వేచ్ఛా భారత కేంద్రంలోని కొద్దిమంది మిత్రులకు ఈ ఇంటర్వ్యూ సమయంలో ప్రస్తావించబడిన విషయాలు నేతాజీ తెలియజేశాడు. ఈ సందర్భంలో 'మైన్ కేంఫ్' (Mein Kemp) అన్న పుస్తకంలో భారతదేశాన్ని అవమానపరుస్తున్నట్లుగా వ్రాయడ లో ఉద్దేశ్యమేమిటని నేతాజీ హిట్లర్‌ను అడిగాడు ఆ నియంతకిది మ్రింగుడు పడలేదు. ఆ విషయాన్ని చర్చించదలచుకోలేదని కట్టె విరిచి పొయ్యిలో పెట్టినట్లు చెప్పాడు. అలాగే యుద్ధానంతరం భారతదేశానికి స్వాతంత్ర్యం ఇవ్వడం జరుగుతుందని నిర్ద్వంద్వంగా ప్రకటించడానికి కూడా హిట్లర్ ఒప్పుకోలేదు. ఈ ప్రశ్న అడిగినప్పుడు ప్రపంచ పటం చూపిస్తూ, జర్మన్‌లు యుద్ధం చేస్తున్న ప్రదేశానికి భారత సరిహద్దులు ఎంత దూరములో ఉన్నాయో చూడమన్నాడు. కాబట్టి ఆ విషయంలో తక్షణమే ఒక ప్రకటన చేయడం ద్వారా ఒరిగేదేమీ లేదన్నాడు. ఆ విధంగా ముఖ్యమైన రెండు ప్రశ్నలకు హిట్లర్ వద్దనుంచి అసంతృప్తికరమైన సమాధానాలే లభించాయి. ఈ సంభాషణ జరిగేప్పుడు దుబాసిగా వ్యవహరించిన ఆడం వాన్‌ట్రాట్ ఇలా చెప్పాడు— "భారతదేశానికి ఇంత అననుకూలమైన

పరిస్థితి కనిపిస్తున్నప్పుడు మీ ప్రయత్నాలవలన ఎలాంటి ప్రయోజనం సమకూరుతుందని మీరు భావిస్తున్నారు?'' అని అడిగాడు హిట్లర్. దానికి సమాధానంగా, ''నేను పుట్టినది మొదలు రాజకీయాలలో మునిగితేలుతున్నాను. ఒకరి సలహాకోసం తాపత్రయపడటంలేదని ఘనమైన హిట్లర్‌తో చెప్పండి" అంటూ ట్రాట్‌తో ఇంగ్లీషులో చెప్పాడు నేతాజీ. హిట్లర్‌నుంచి ఆశించిన మేరకు ప్రోత్సాహం లభించకపోయేసరికి తాను ఏ ఉద్దేశ్యంతో జర్మనీ యాత్ర తలపెట్టిందీ హిట్లర్‌కు నిర్మొహమాటంగా చెప్పాడు నేతాజీ– ''నా దేశానికి స్వాతంత్ర్యం సాధించే ప్రయత్నంలో జర్మనీ చేరుకొనేందుకు ప్రాణాయకరమైన ప్రయాణం చేశాను. ఇక్కడ నా లక్ష్యం నెరవేరదని భావిస్తే మరల మాతృభూమికి తిరిగి వెళ్ళేందుకు కూడా ప్రాణాల పట్ల అదే నిర్లక్ష్య వైఖరి ప్రదర్శించగలను. బ్రిటిష్ గూఢచార శాఖ సమర్థతను తక్కువగా అంచనా కట్టకండి. వారిని తప్పించుకు రాగలిగాను. అదే విధంగా మీ గూఢచార శాఖ కన్నులు కప్పి తప్పించుకుపోగలను."

ఈ సమావేశం సత్ఫలితాలు సాధించకపోయినా, నేతాజీ ఏ కోవకు చెందినవాడో హిట్లర్ తెలుసుకోగలిగాడు.

ఆ రోజుల్లో మధ్య ఐరోపా దేశాలలో పని చేస్తున్న ఎ సి. ఎన్. నంబియార్ అనే సుప్రసిద్ధ జర్నలిస్టు జనవరి 1942లో నేతాజీతో వచ్చి చేరాడు. ఆయన అనుభవం నేతాజీకి ఎంతగానో తోడ్పడింది. నేతాజీతో కలిసిన వారందరిలో శ్రీ నంబియార్ మేధావి అంటే అతిశయోక్తికాదు. ఆ తరువాత నేతాజీ తూర్పు ఆశియాదేశాలకు పయనమై వెళ్ళిన తరువాత నంబియార్‌ను ఉప నాయకుడుగా గుర్తించాడు. ఆ తర్వాత పారిస్‌లో కూడా ఒక కేంద్రం నెలకొల్పాడు. ఆ విధంగా 'స్వేచ్ఛా భారత కేంద్రం' 1940లో ప్రారంభించబడిన నాటినుంచి చివరివరకు ఎన్ని ఒడుదుడుకులు ఎదుర్కొనవలసివచ్చినా పనిచేస్తూనే వచ్చింది.

## అజాద్ హింద్ రేడియో

క్రమక్రమంగా నేతాజీ చొరవను, మేధాసంపత్తిని, నాయకత్వ లక్షణాన్ని జర్మనీ గుర్తించ నారంభించింది. నేతాజీ ఏ సహాయం అడిగినా మారు మాట్లాడకుండా అది అందజేసే పరిస్థితి ఏర్పడింది. నేతాజీతో కలిసి పనిచేయడానికి సిద్ధపడిన భారతీయ యువకులు అంతకు ముందెన్నడూ జాతీయ పోరాటంలోగాని, విప్లవోద్యమాలలోగాని పాల్గొని అనుభవం సంపాదించినవారు కాదు. అయినా నేతాజీ ప్రభావానికి లోనై వారు, ఏది చేయడానికైనా వెరవక ముందుకు వచ్చారు. నేతాజీలోని ఆత్మసంయమనం, సందర్భోచితమైన సంభాషిప్వగల నేర్పూ చూసి వారు ముగ్ధులైనారు.

స్వేచ్ఛా భారత కేంద్రం ఎవరికీ జమా ఖర్చులను అందజేయ వల సిన అవసరం లేకున్నప్పటికీ, నేతాజీ ప్రతి పైసకూ లెక్క చెప్పాలనే పట్టుదలతో ఖర్చులు వ్రాయించేవాడు. 1941 నుండి ఏప్రిల్ 1945 వరకు ఇంజనీరింగ్ చదివిన ఒక పార్సీ యువకుడు ఆ పని సమర్థవంతంగా చేస్తూ వుండేవాడు. వ్యాపారగణక శాస్త్రంతో ఏ విధమైన సంబంధం లేకపోయి నప్పటికీ పట్టుదల, శీలసంపదగల యువకుడు ఏ పనినైనా సమర్థవంతంగా నిర్వహించగలడన్న దానికి అదొక పెద్ద ఉదాహరణ.

ఆంగ్లమూ, జర్మనూ తెలిసిన ఒక జర్మన్ లేడీ స్టెనో టైపిస్టు, ఇంకా కొందరు స్త్రీలు రేడియో కార్యక్రమాలకు కావలసిన సమాచారం తయారు చేస్తూ ఉండేవారు. ఈ సమాచారాన్ని అంతటినీ క్రోడీకరించుకొని తన దేశ ప్రజలను నూతనోత్సాహంతో తొణికిసలాడేట్లు చేసి స్వాతంత్రో ద్యమోన్ముఖులుగా తయారు చేయడం తన విధిగా భావించాడు నేతాజీ. అందుకుగాను రేడియోను ఒక ఉత్తమ సాధనంగా ఎంచుకొన్నాడు. కొన్ని వేల మైళ్ళ దూరంలో ఉంటూ కూడా తన ప్రజలతో మాట్లాడి ఒప్పించి, ఉత్సాహపరచే సాధనం రేడియో కాక మరేముంటుంది? రేడియోను చాలా

చక్కగా ఉపయోగించు కొన్నాడు నేతాజీ. కేవలం భారత పౌరులే కాదు, బ్రిటిషు సైన్యంలో పని చేస్తున్న భారత సైనికులుకూడా తెల్లదొరలకు తెలియకుండా యుద్ధరంగంలో నేతాజీ ఉద్బోధలు రేడియోలో విని ఉత్తేజితులవుతూ వుండేవారు. ఎప్పుడు అదను దొరుకుతుందా, ఎప్పుడు నేతాజీ సేనలో చేరిపోదామా అన్న ప్రగాఢమైన కోర్కెతో వారి ఆలోచనలు ఉరకలువేస్తూ ఉండేవి.

రేడియో ప్రసారాలంటే ఒక్క రోజుతో సమాప్తమయ్యేవి కావు. ఇది నిత్యము నిర్దిష్టమైన సమయంలో సాగుతూ ఉండవలసిన పని. కాబట్టి నేతాజీ కొంతమంది యువకులను సహాయకులుగా ఎంచుకొన్నాడు. కాని ఈ యువకులు కూడా అంతకు ముందెన్నడు స్వాతంత్ర్యోద్యమంతో సంబంధం ఉన్నవారు కాదు. అదీకాక నేతాజీ వ్యక్తిత్వం వేరు, నేతాజీపట్ల ప్రజలకున్న అవ్యాజానురాగం వేరు. ఆయనపట్ల వారికివున్న భక్తి ప్రపత్తులు వేరు. ఆ స్థానాన్ని ఇతరులెవ్వరు అధిష్టించలేరు. అయినా సమాచారం సేకరించి ప్రసారం చేయడానికి తగిన విధంగా రూపొందించడంలో నేతాజీకి వారు తోడ్పడేవారు. జర్మన్లు నేతాజీకి ఈ విషయంలో పూర్తి స్వాతంత్ర్యం ఇచ్చారు. రేడియో కార్యక్రమాలలో వారేరకమైన జోక్యం చేసుకొనేవారు కాదు. సాంకేతిక పరమైన సహాయం తప్ప మిగిలిన కార్యక్రమాలన్నీ నేతాజీ, ఆయన అనుచరులే రూపొందించేవారు. ఏ విధమైన సెన్సార్‌షిప్ ఉండేదికాదు. స్వేచ్ఛగా ఆయన భావాలు వెలువరించడానికి అవకాశం లభించింది. ఆ రోజుల్లో హిట్లర్‌ను సంహరించడానికి జర్మన్ సైనికాధికారులు కొందరు కుట్ర పన్నారు. అయినా ఇవేమీ నేతాజీ కార్యక్రమాలకు అడ్డు రాలేదు.

నేతాజీ మహా వక్త. భారత ప్రజల నాడి తెలిసిన మహా నాయకుడు. భారతీయులు స్వతంత్ర సమరంలో పాల్గొనవలసిన ఆవశ్యకతను

నొక్కి చెప్పేవాడు. విదేశీయుల పాదాల క్రింద క్రుమ్మగ్గిపోవడం, బానిస బ్రతుకు ఈడుస్తూ కాలక్షేపం చేయడం భారతీయుల ఆత్మాభిమానానికి తలవంపులు కలిగించే విషయమనీ, బ్రిటీషువారి పాదసేవ చేస్తూన్నంత వరకు భారతదేశం ఆర్థిక ప్రగతిని సాధించలేదనీ, భారతదేశ వనరు లన్నింటినీ బ్రిటిషువారు కొల్లగొట్టి భారత ప్రజలను దారిద్ర్యంలో ముంచెత్తుతున్నారనీ ఉద్బోధలు చేసేవాడు. అజాద్ హింద్ రేడియో పేరుతో జరిగే ప్రసారాలు భారత ప్రజలను ఎంతగానో ఆకట్టుకొనేవి.

నేతాజీ ఈ రేడియో ప్రసారాలలో భారత ప్రజలకు అనేక విషయాలు తెలియచేస్తూ ఉండేవాడు. పోలెండుపై హిట్లర్ బల ప్రయోగం చేశాడని బ్రిటిష్ వారు జర్మనీపైన యుద్ధం ప్రకటించారు. నిజమే కాని ఏవిధమైన బలప్రయోగం లేకుండా తమ స్వాతంత్ర్యం కోసం శాంతియుతమైన పోరాటాన్ని సాగిస్తున్న భారతీయులనూ, వారి ప్రియతమ నాయకులనూ అరెస్టుచేసి జైళ్ళపాలు చేసినప్పుడు బ్రిటిషువారి న్యాయం ఎక్కడకు పోయింది ? బ్రిటిషు ప్రజలకు ఇక్కడ ఆటవిక నీతి తప్ప మరో న్యాయం గుర్తు రాలేదా అని నేతాజీ సవాలు చేసేవాడు. భారతదేశంనుండి బయట పడి జర్మనీ చేరిన కారణంగా తాను ఈ విధంగా మాట్లాడగల్గుతున్నానని, భారతదేశంలో ఉండి ఇవే మాటలు స్వేచ్ఛను గురించి తాను ప్రస్తావించి ఉంటే తన నోరునొక్కి జైల్లో పారేసేవారు అని బ్రిటిషువారి కుటిల నీతిని ఎరుకపరచేవాడు నేతాజీ.

నేతాజీ భారతదేశం వదిలివెళ్ళిన తర్వాత బ్రిటిష్ గూఢచారులు తమశక్తి యుక్తులన్నింటినీ వెచ్చించి ఆయన జాడ తీయడానికి ప్రయత్నించి విఫలు లయ్యారు. ఆఖరి అస్త్రంగా ఓ అబద్ధం ప్రచారం చేశారు. నేతాజీ విషాద కర పరిస్థితులలో మరణించినట్లు ప్రకటించారు. ఈ వార్త ఎంత నిర్దు ష్టంగా ప్రకటించారంటే-గాంధీజీకూడా ఆ వార్తను విశ్వసించారు. నేతాజీ

తల్లికి అనేక ప్రాంతాలనుంచి నేతాజీ మరణంపట్ల తమ సానుభూతి తెలు
పుతూ ఉత్తరాలు అందాయి. బెర్లిన్‌లో ఉన్న నేతాజీకి ఈ వార్తలు
తెలుస్తూనే ఉన్నాయి. ఇది తన ఉనికిని తెలుసుకోవడానికి బ్రిటిషువారు
పన్నిన పన్నుగడగా ఆయన గుర్తించాడు. ఒకవిధంగా నేతాజీ ఆ పరి
స్థితికి ఆనందించాడు. తనపట్ల భారతీయులకున్న ప్రేమానురాగాలు
ఎంతటివో ఆయన తెలుసుకోగలిగాడు.

ప్రారంభదశలో రేడియో వార్తలూ, ప్రసంగాలూ నేతాజీ స్వయం
గానే తయారుచేసుకొనేవాడు. వాటిని మిగిలిన యువకులు హిందూస్తానీ,
బెంగాలీ భాషలలోనికి అనువదించేవారు. ఆ తర్వాత క్రమంగా వారే
ఈ పనులు చేయడానికి అలవాటుపడ్డారు. జర్మనీనుంచి భారత దేశానికి
మొదటి ప్రసారం జరిగిన రోజు చరిత్రాత్మక దినం. 1941 నవంబరు
మాసంలో జరిగిన ఆ ప్రసారం భారతీయులను ఆనందడోలికలలో ముంచె
త్తింది. బ్రిటిషువారి దుష్టప్రచారాన్నిబట్టి చనిపోయాడనుకున్న తమ
నాయకుడు రేడియోలో సంభాషిస్తున్నాడనగానే భారతీయుల హృదయాలు
పులకించాయి. యువకుల హృదయాలు చూరగొనడం నేతాజీకి వెన్నతో
పెట్టిన విద్య. ఈ రేడియో ప్రసారాలకు ఆయన కొంతమంది
యువకులను తయారు చేసుకొన్నాడు. వివిధ భాషలలోనికి తర్జుమా
చేయడంలోనూ, ప్రసార కార్యక్రమాలు తయారు చేసుకోవడంలోనూ,
వివిధ అంశాలు రూపొందించుకొనడంలోనూ ఈ యువకులకు
నేతాజీ పూర్తి స్వేచ్ఛ ఇచ్చేవాడు. ప్రతి యువకుడూ
తన కార్యక్రమం చెడిపోతే తన వలన నేతాజీ ప్రతిష్ఠకు భంగం
కలుగుతుందన్న ఆలోచనతో పట్టుదలగా పనిచేసేవాడు. అందుచేతనే ఈ

రేడియో కార్యక్రమాలు ఆదినుండి తుదివరకూ జయప్రదంగా సాగాయి. అజాద్ హింద్ రేడియోకు ప్రసంగాలు తయారుచేసే పని ఒక కెమిస్ట్రీ విద్యార్థికి అప్పచెప్పబడింది అతడు ఆంగ్లంలో అనర్గళంగా ఉపన్యసించ గలవాడు. కాబట్టి స్వయంగా ప్రసంగాలు చేసేవాడు; ప్రసంగాలు వ్రాసే వాడు కూడా. పట్టుదలతో పరిశ్రమ చేస్తే చేయలేనిది లేదు అనేది ఆ యువకుడు ఋజువు చేశాడు. మరో యువకుడు ఫిలిం టెక్నాలజీ నేర్చు కోవడానికి జర్మనీకి వచ్చినవాడు. అతడికి హిందీ అనువాదాల పని అప్ప చెప్పారు. తుదివరకూ అతడు ఆ పనిని సమర్థవంతంగా నిర్వహించాడు. అతని కంఠం రేడియోకి బాగా అతికిపోయింది. ఒక ఆఫ్ఘన్ యువకుడు పర్షియన్ భాషలోనికి అనువదిస్తూ ఉండేవాడు. ఆ ఆఫ్ఘన్ యువకుడు ఒక ధనిక కుటుంబంలో జన్మించిన వాడు. నేతాజీపట్ల భక్తి శ్రద్ధలు పెంపొందించుకొని నేతాజీ తలపెట్టిన కార్యం జయప్రదం కావాలనే దృఢ దీక్షతో ఆయనకు సహాయపడ్డాడు. పుస్తు భాషలోనికి మరో ఇద్దరు యువ కులు అనువదించేవారు. తమిళ భాషలోనికి ఓ హోటల్ వ్యాపారి అను వదిస్తూ ఉండేవాడు. ఈయన పారిస్‌లో ఓ పెద్ద రెస్టారెంటు నడుపు తుండేవాడు. తన సర్వస్వాన్ని వదిలివేసి, నేతాజీ చేత ఆకర్షితుడై జర్మనీ చేరి, తమిళ బ్రాడ్ కాస్టింగ్ కార్యక్రమాలలో ఆయనకు తోడ్పడేవాడు. ఆయన రేడియో సంభాషణలలో అగ్ని కురిపించేవాడు. జ్వరంతో బాధ పడుతూ కూడా కార్యక్రమాలకు విఘాతం కలుగకుండా నిర్వహించేవాడు. తెలుగు కార్యక్రమములు హైద్రాబాదు నుంచి వచ్చిన ఓ యువకుడు నిర్వహిస్తూ ఉండేవాడు.

కొద్ది కాలానికే అజాద్ హింద్ రేడియో ప్రసారాలు మరో రెండు పేర్లతో ప్రసారం కావడం ప్రారంభమయింది. నేతాజీ సమయం దొరికి నప్పుడల్లా కార్యక్రమాలలో స్వయంగా పాల్గొంటూ ఉండేవాడు. 'భారతదేశ

స్వాతంత్ర్యానికై బ్రిటిష్‌వారితో ఎడతెరిపిలేని పోరాటం సాగిస్తున్న నా జీవితమే నా నిజాయితీకి నిదర్శనం' అంటూ భారతీయులకు చెప్పేవాడు.

ఈ రేడియో ప్రసారాలన్నింటినీ అంతకుముందు ఏమాత్రం అనుభవంలేని సివయువకులే నిర్వహించేవారు. అనతి కాలంలోనే తమకు తామే సాటి అన్న రీతిలో ఈ కార్యక్రమాలు నడిపారు. నేతాజీ జర్మనీ వదిలి వెళ్ళిన ఆరు మాసాలకు ఈ రేడియో ప్రసారాల కేంద్రం బెర్లిన్ నుంచి హాలెండుకు మార్చారు. ఆ రోజులలో బెర్లిన్‌పై తరచు బాంబుల దాడి జరుగుతున్న కారణంగా ఈ మార్పు అవసరమైంది. ఈ మార్పు జరిగిన మూడు మాసాలకే బెర్లిన్‌లోని స్వేచ్ఛా భారత కేంద్రం బాంబు దాడికి గురియై శిథిలమైపోయింది. హాలెండ్‌లో హిల్వర్సం స్టేషను నుండి ఒక సంవత్సరంపాటు ఈ కార్యక్రమాలు ప్రసారం అయ్యాయి. 1944 లో మిత్రపక్షాలు ఫ్రాన్సును ముట్టడించి హాలెండ్ పైన పడతారని అనుమానించగానే ఈ కార్యక్రమాలు మళ్ళీ జర్మనీలోని హేమ్‌సైడ్ స్టేషనుకు మార్చారు. ఓబిన్‌ఫీల్డ్ ప్రసార కేంద్రం నుంచి ఏప్రిల్ 9, 1945 వరకు ప్రసారాలు సాగాయి. అప్పటికే శత్రుసైన్యాలు ఈ కేంద్రానికి 50 కి.మీ. దూరంలో వచ్చి చేరాయి.

## మన దుర్దశకు కారణం

భారతదేశపు కీర్తి ప్రతిష్ఠలు ఒకనాడు ప్రపంచమంతటా వ్యాపించాయి ఖండ ఖండాంతరాలలో భారతీయ జ్ఞానపతాక గగనతలంలో రెప రెపలాడింది. అయితే కాలక్రమేణా ఆవరించిన అలసత్వం కారణంగా భారత జాతి నిర్వీర్యమైపోతూ వచ్చింది. దీనికితోడు అహింస ముసుగులో జడవాదం, అకర్మణ్యతా సమాజాన్ని ఆవరించుకొన్నాయి. సర్వశక్తులను సమకూర్చుకొని, శక్తివంతమైన జాతిగా రూపొంది మనం అహింసను పాటించడమే కాకుండా ఇతరులు కూడా పాటించేటట్లు చూసే

తప్పదు కాబట్టి, బాగా ముందుగానే నేతాజీ రాక యుద్ధ ఖైదీల క్యాంపులో వెల్లడించడం జరిగింది. మొట్టమొదట క్యాంపులో నేతాజీ నాన్‌కమాండ్ ఆఫీసర్లను కలుసుకొన్నాడు. వారితో మాట్లాడుతున్నప్పుడు మిగిలిన వారంతా వినడానికి వీలుగా ఆ ప్రసంగం ప్రసారం అయ్యేటట్లు చేశారు. అయితే ఈ సమావేశం అంత ఆశాజనకంగా సాగలేదు. నాన్‌కమాండ్ ఆఫీసర్లంచే పది పన్నెండేళ్ళు బ్రిటిషు సైన్యంలో పనిచేసి అనుభవం గడించినవారే సహజంగానే వారికి తమ పెన్షన్‌మీదా, సర్వీసుమీదా మమకారం ఎక్కువ. పైగా ఆ వయస్సులో ఉద్రేకంగా ముందుకు దూకే స్వభావం కోల్పోయి ఉంటారు. కాబట్టి వారు చాలా ముభావంగానే ఉండిపోయారు. అయితే వారి హృదయాలలో తమ నాయకుని పట్ల దాగిఉన్న ప్రేమ ముఖాలలో కన్పించకపోలేదు. కానీ వ్యక్తం కాకుండా జాగ్రత్తపడ్డారు.

కానీ, రెండవ రోజు సమావేశం చిరస్మరణీయమైంది. ఈసారి ఒక్క నాన్‌కమాండ్ ఆఫీసర్లనేకాక నేతాజీ యుద్ధఖైదీలందరినీ కలుసుకోవడానికి బయలుదేరాడు. ఖైదీలు కూడా నేతాజీ రాకపట్ల అమిత ఉత్సాహం కనబరిచారు. కొందరు కాగితాలతోనూ, కొందరు ఆకులతోనూ ఎవరికి అందిన పరికరాలతో వారు దండలు తయారుచేసి నేతాజీ మెడలో వేశారు. దిక్కులు పిక్కటిల్లేటట్లు నినాదాలు చేశారు. అది యుద్ధఖైదీల క్యాంపు అన్న సంగతి అందరూ మర్చిపోయి కేరింతలు కొట్టారు. తమ ప్రియతమ నాయకుడు అంత దూరదేశంలో తమ మధ్య ఉండడం అనే అద్భుత అనుభవాన్ని తనివితీరా ఆస్వాదించారు. వారిలోని యువకరక్తం పొంగులువారింది. ఆ విధంగా చేయడం ద్వారా తమ పెన్షన్లకు ఇబ్బంది వస్తుంది అని కానీ, భారతదేశంలో తమ కుటుంబాలు నష్టపోతాయని కానీ వారు వెనుకంజ వేయలేదు. హృదయపూర్వకంగా నేతాజీని స్వాగతించారు. భారతదేశంలోనే కనుక తాము ఉండిఉంటే అలాంటి అదృష్టం

పొరపాటున కూడా తమను వరించేదికాదని పదే పదే మదిలో తలపోశారు. బ్రిటిషు సైన్యంలో పనిచేస్తూ ఒక జాతీయ నాయకుని ఆహ్వానించడం, వారి ఉపన్యాసం వినడం అనేది ఊహించరాని విషయం. అలాంటిది, యుద్ధఖైదీలుగావున్న తమకు ఆ అనుభవం ఎదురైనందుకు మనస్ఫూర్తిగా ఆనందించారు. నేతాజీ జర్మనీకి ఎందుకు చేరాడన్న విషయంపై ఎవరికి తోచిన వ్యాఖ్యలు వారు చేసుకొన్నారు.

ఈ సమావేశం ఏ దృష్టితో చూసినా సఫలమైన ప్రయత్నమే. నేతాజీపట్ల భారతీయులకున్న అవ్యాజానురాగాన్ని జర్మనీ విదేశాంగశాఖ వారు కళ్లారా చూసి తెలుసుకొనేందుకు ఈ సమావేశం తోడ్పడింది. ఏదో రకంగా జర్మనీవారి దయా దాక్షిణ్యాలు సంపాదించడం నేతాజీ ఉద్దేశ్యం కాదు. ఒక సర్వ స్వతంత్ర సైన్యాన్ని నిర్మాణం చేసుకోవాలనేది ఆయన ఆకాంక్ష. ఆ పటాలం జర్మనీవారి కోసం యుద్ధం చేయదు. బ్రిటిషు వారిని భారత దేశంనుంచి పారద్రోలేందుకు యుద్ధం చేస్తుంది. బ్రిటిషువారు దేశం నుంచి వెళ్లిపోయాక ఈ సైన్యం భారత సైన్యానికి శిక్షణ ఇచ్చేపని కొన సాగించి, దేశస్వాతంత్ర్యాన్ని కాపాడే కృషిలో తోడ్పడుతుంది ఇదే ఆయన ఆశయం.

జర్మన్ అధికారులు నేతాజీ విధించిన షరతులన్నింటినీ ఒప్పుకొని, నేతాజీ నిర్మాణం చేసే పటాలన్ని ఒక స్వతంత్ర సైనిక పటాలంగా గుర్తించడానికి అంగీకరించి, తదనుగుణమైన శిక్షణ ఇవ్వడానికి సుశిక్షితులైన అధికారులను నియమించారు. ఈ పటాలానికి ప్రత్యేకమైన దుస్తులు తయారు చేసి, ఆ దుస్తులపైన పులిగుర్తుతో అజాద్ హింద్ ఫౌజ్ అనే అక్షరాలు కుట్టించారు. అంతటితో బ్రిటిషువారి కిరాయి సైనికులుగా చేరిన వారు భారత స్వాతంత్ర సమర సైనికులుగా మారిపోయారు. అయితే మరొక సమస్య ఎదురైంది. పశుమాంసం తిననివారు కొందరు, పంది

మాంసం భుజించని వారు కొందరు, 'హలాల్' చేస్తేనేకాని ముట్టనివారు కొందరు, 'ఝట్కా' (ఒక ప్రేటుతో తల నరకడం) జరిపితేగాని తినని వారు మరికొందరు- ఇలా అనేక అభిరుచులు, అనేక ఆచారాలు కలవారిని ఎట్టకేలకు సంతృప్తిపరచి ఒకచోటికి చేర్చేసరికి తలప్రాణం తోకకు వచ్చినంత పని అయింది. ఇక వీరిని విముక్తి సైన్యంగా మార్చడం మిగిలిపోయింది.

## అజాద్ హింద్ ఫౌజ్

జర్మనీలో ఉన్న భారత యుద్ధ ఖైదీలందరినీ తమ దళంలో చేర్చుకోవాలనే కోర్కె నేతాజీకి లేదు. ఎంతవీలైతే అంత తక్కువ మందిని, చిత్తశుద్ధి గల వారిని ఎంపిక చేసుకొని తన దళంలోనికి తీసుకోవాలనేది నేతాజీ ఆశయం. అందుచేతనే ఒక ఆంక్ష పెట్టాడు. భారత యుద్ధఖైదీలు ఎవరైనా సరే అజాద్ హింద్ ఫౌజ్ దళంలో చేరి శిక్షణ పొందవచ్చు. వారికి బ్రిటిషు సైన్యంలో ఉన్న హోదా ఇవ్వడం మాత్రం జరగదు. వారు మళ్లీ మామూలు సైనికుడుగా జీవితం ప్రారంభించి తమ పరిశ్రమ ద్వారా, నేర్పు ద్వారా మాత్రమే పై పదవులు పొందవలసి ఉంటుంది. ఈ నిబంధన పెట్టడంతో నాన్‌కమాండ్ ఆఫీసర్లుగా ఉన్నవారు చాలామంది నేతాజీ దళంలో చేరకుండా ఆగిపోయారు. చేరుదామని కుతూహలంగా ఉన్న మరికొంతమందిని కూడా ఈ నాన్ కమాండ్ ఆఫీసర్లు నిరుత్సాహపరచి ఆపేశారు. అయినా పట్టుదల గల కొందరు శిక్షణ పొందడానికే సిద్ధపడ్డారు. నాలుగు మాసాల సమయంలో మూడువందల మంది శిక్షణ కోసం దళంలో చేరి ఫ్రాంకెన్‌బర్గ్ చేరుకొన్నారు. మరో ఆరు మాసాలలో ఇంకో మూడు వందల మంది వచ్చి చేరారు ఇంతమందికి సరియైన వసతులు సమకూర్చడానికి ఫ్రాంకెన్‌బర్గ్‌లో అవకాశం లేని కారణంగా శిక్షణాకేంద్రాన్ని డ్రెస్‌డెన్ సమీపంలో ఉన్న కోనిగ్స్‌బ్రుక్‌కు మార్చారు.

# ఇటలీలో భారతీయ యుద్ధ ఖైదీల దురవస్థ

ఈలోగా ఇటలీలో యుద్ధ ఖైదీలుగా ఉన్న భారతీయుల పరిస్థితి దయనీయంగా తయారైంది. లిబియాలో బ్రిటిష్‌వారికి తోడుగా యుద్ధం చేస్తూ పట్టుబడ్డ భారతీయ సైనికులను ఇటలీకి తరలించారు. యుద్ధంలో గెలిచి మరొకరిని ఖైదీలుగా పట్టుకోవడమన్నది ఇటలీవారికి అంత అలవాటు అయిన విషయంకాదు. ఈసారి అయినా జర్మన్ల ప్రతిభ కారణంగానే బ్రిటిష సైన్యం లిబియాలో ఓటమి చవి చూచింది. అయితే యుద్ధ ఖైదీలుగా పట్టుబడ్డవారిని ఇటలీ ఆధీనంలో ఉంచారు. ఇటలీవారికి యుద్ధ ఖైదీలను ఎలా చూడాలో తెలియదు. యుద్ధభూమిలో ఎలాగూ యుద్ధం చేయలేరు కాబట్టి తమ ప్రతాపమంతా ఖైదీలమీద చూపించ నారంభించారు. వారికి ఆఖరికి మంచినీరుకూడా సరఫరా చేయలేనిస్థితిలో పడ్డారు. ఖైదీలకు అందించే రేషన్‌ను ఇటలీ సైనికులు కాజేస్తూ ఖైదీలను మాడ్చేవారు. స్వేచ్ఛా భారత కేంద్రం ప్రతినిధులు ఇటలీ మిలిటరీ అధికారులతో సంప్రదింపులకు వచ్చినప్పుడు భారతీయ యుద్ధ ఖైదీలు తమను జర్మనీకి తరలించ వలసిందిగా మొరపెట్టుకొన్నారు. ఆతర్వాత కొద్ది కాలానికే వారిని జర్మనీకి తరలించడం ప్రారంభమయింది. అప్పటికే ఆజాద్ హింద్ ఫౌజ్ శిక్షణా కేంద్రం కోనిగ్స్‌బ్రుక్‌కు తరలించడం జరిగింది. ఖైదీలకు అక్కడి వాతావరణం బాగా నచ్చింది. ఇటలీవారు పెట్టిన హింసలు తట్టుకోలేక నానా బాధలు పడిన ఆ ఖైదీలకు ఇక్కడి పరిస్థితి ఊరట కలిగించింది. నేతాజీ నెలకొల్పిన దళంలో చేరినవారు చక్కటి దుస్తులు ధరించి స్వేచ్ఛగా తిరుగుతూ సరిపడిన ఆహారం భుజిస్తూ కష్టపడి శిక్షణ పొందడం చూచి వీరు ఆనందించారు కూడా. ఆ విధంగా ఇటలీనుంచి వచ్చి అక్కడ చేరిన భారత యుద్ధ ఖైదీలు నేతాజీని చూడాలనీ, ఆయన చెప్పేది వినాలనీ కుతూహలంగా ఎదురుచూడసాగారు.

అనుకున్న ప్రకారం, అనుకున్న సమయానికి, నల్లని దుస్తులతో టోపీ పెట్టుకొని, తన దేశానికి చెందిన ఎక్కువ మంది సైనికులతో సుదూర ప్రాంతంలో మాట్లాడే అవకాశం దొరికినందుకు ముఖంపై సంతోష చిహ్నాలు ప్రస్ఫుటంగా కన్పిస్తూ ఉండగా మందహాసంతో సమావేశ స్థలానికి వచ్చాడు నేతాజీ. 'ఆజాద్ హింద్ జిందాబాద్' 'ఇంక్విలాబ్ జిందాబాద్' 'నేతాజీ జిందాబాద్' అనే నినాదాలు ఆకాశంలో మారుమ్రోగాయి. యుద్ధ ఖైదీలు కూడా తమ గొంతు కలిపారు. దళంవారు జాతీయ గీతాలు, తాము వ్రాసుకొన్న గీతాలు పాడటంతో సభా కార్యక్రమం ప్రారంభమయింది.

హమే సుఖతో ఆజ్ భూల్ జానా పడేగా
వతన్ కేలియే దుఃఖ్ ఉఠానా పడేగా
ఆయ్! ఆజాద్ హిందీయో ఉఠో కమర్ బాంధో
వతన్ బులా రహాహై బచానా పడేగా

(ఇప్పుడు సుఖాలన్నీ మర్చిపోయి దేశం కొరకు ఎంతటి కష్టాన్నైనా సహించడానికి సిద్ధపడాలి. దేశం కొల్లగొట్టబడుతోంది. ఓ అజాద్ హింద్ బంధువులారా! భుజం భుజం కలిపి ముందుకు నడవండి. దేశం పిలుస్తోంది; రక్షించడం మన విధి.)

ఇలాంటి పాటలు పాడారు. ఈ పాటల ముగింపు ''హుకుం నేతాజీకా బజానా పడేగా'' (నేతాజీ ఆజ్ఞలు శిరసా వహించాలి ?) అనే మాటలతో జరిగింది.

## స్వార్థం విడిచిపెడితేనే స్వాతంత్ర్యం

నేతాజీ లేచి నిలబడగానే సభలో సూదిపడినా వినపడే నిశ్శబ్దం ఏర్పడింది. చాలా సులువైన హిందూస్తానీ భాషలో ప్రసంగం నడిచింది.

అక్కడ సమావేశమై ఉన్న యువక హృదయాలకు సూటిగా హత్తుకొనే టట్లు చెప్పిన మాటలవి. అక్కడ చేరిన వారిలో ఎక్కువ మంది నిరక్ష రాస్యులు. అత్యధిక సంఖ్యాకులు ఇంకా దళంలో చేరనివారు; ఉద్యోగం పోతుందేమోనన్న భయం ఆవరించి ఉన్నవారు; వారి జీతాలు, పెన్షన్ రద్దు అవుతాయోమోనన్న భయం పుడిగొన్నవారు. వారిలో ఎక్కువ మంది లాభం పొందడానికి సైనికులుగా చేరిన వారు నేతాజీ పంటి జాతీయ నాయకుడి మాటలు వింటే ఈ లాభాలు పోగొట్టుకోవలసి వస్తుంది. తన వక్తృత్వ పటిమ, హేతుబద్ధమైన వాదన వారిమీద ఎక్కువగా పని చేయవన్న సంగతి నేతాజీకి తెలుసు. వారి భావాలకు అనుగుణంగా వారి కుటుంబాలకు కొద్దో గొప్పో ఆర్థిక సహాయం లభింపచేసేరీతిగా కొన్ని ప్రతిపాదనలు చేయగలిగినప్పుడు మాత్రమే ఆ మాటల ప్రభావం వారిపైన ఉంటుందన్న సంగతి ఆయనకు తెలుసు అయితే ఒక బాధ్యత కలిగిన జాతీయ స్థాయి నాయకుడుగా జవాన్లను భర్తీ చేసుకొంటున్నప్పుడు బ్రిటిష ఆఫీసర్లు చెప్పినట్లుగా కల్లబొల్లి కబుర్లు తాను చెప్పలేడు. నిజాన్ని మాత్రమే తాను వారి ముందుంచగలడు. నిజం చెప్పడమంటే మ్రింగుడు పడని కఠిన సత్యం వారి ముందుంచడమే. తాను వెల్లడించే నిజాయితీ అన్ని విధాలా త్యాగాన్ని కోరుతుంది. త్యాగం అంటే కేవలం తనకు లభిస్తున్న జీతమే కాదు. కుటుంబానికి లభించే పెన్షన్ మాత్రమే కాదు. అవసరాన్నిబట్టి ప్రాణాలు సహితం త్యాగం చేయడానికి సిద్ధంగా ముందుకు రావాలి. అయితే ఆ పోరాటంలో వారిని విజయలక్ష్మి వరిస్తే కేవలం వారి భవిష్యత్తే కాకుండా మానవజాతి భవిష్యత్తు బాగుపడుతుంది. తాను చెప్పే విషయాలు వారి హృదయాలను, అంతఃకరణను స్పందింపచేయాలి. అంటే తన నాయకత్వంపట్ల పరిపూర్ణ విశ్వాసం ఉంచి, పరిపూర్ణ విధేయతతో సంపూర్ణ త్యాగభావనతో మాతృభూమి సేవకు బేషరతుగా అంకితం కావాలి.

జీతపు రాళ్ళకోసం సైనికులుగా చేరిన వారికి ఇంతటి మహోన్న
మైన ఆశయం అర్థం కావడం కష్టమే. తన పేరు వారంతా విని వు
వచ్చు. తాను ఎలాంటి పరిస్థితిలో ప్రాణాలను సహితం లెక్కచేయ
మాతృదేశ దాస్యవిముక్తికై అంతదూరం ప్రయాణం చేసి వచ్చాడో కూ
వారికి తెలిసి వుండవచ్చు. కాని జీవితంలో ఎదురయిన చేదు అనుభవా
కారణంగా - నేతాజీ 90 నిమిషాల సేపు చేసిన ప్రసంగం విన్నప్పటి
వెంటనే నిర్ణయం తీసుకొని ముందుకు దూకేశక్తిని వారు కోల్పోయార
నేతాజీ కూడా వారు వెంటనే ఒక నిర్ణయానికి రావాలని కోరుకోలేద
బహు జాగ్రత్తగా ఆలోచించుకొన్న మీదటనే వారు ఒక నిర్ణయాని
రావాలని, అది స్థిరమైన నిర్ణయంగా ఉండాలని నేతాజీ కోరుకున్నాడు
దళంలో చేరడంలో గల కష్టనష్టాలు సంపూర్ణంగా అవగాహన చేసుకొన్న
తర్వాత చేరిన కొద్దిమంది మాత్రమే స్థిరంగా నిలువగలరని ఆయన
భావన.

భారతదేశంలో సాగిన స్వాతంత్ర్య పోరాటాల చరిత్రను సింహా
లోకనం చేస్తూ అనేక విషయాలు వారికి తెలియచేశాడు. మొదటి ప్రపంచ
యుద్ధం, రెండో ప్రపంచ యుద్ధం గూర్చి వివరాలు తెలియచేస్తూ
బ్రిటిష్ సామ్రాజ్యం కృంగిపోతున్నదని, భారతదేశం నుంచి వారిని
తరిమికొట్టడానికి అది అన్నివిధాలా తగిన సమయమని నొక్కి చెప్పాడు.
విదేశ పాలన కారణంగా మాత్రమే భారత దేశం అంత పేద దేశంగా
మారిందని తెలియచేశాడు.

'ఒక వ్యక్తి జీవితంలో ఏ విధంగానైతే సువర్ణావకాశాలు అరు
దుగా వస్తూంటాయో, ఒక దేశపు చరిత్రలో కూడా అంతే అరుదుగా అవి
వస్తూంటాయి. ఆ అవకాశాన్ని జారవిడిచినట్లయితే అలాంటి అవకాశాలు
కొన్ని దశాబ్దాల వరకు రావు. అలాంటి సువర్ణావకాశం ఇప్పుడు మన

ముందుంది. మనం అది జారవిడుచుకోకూడదు. ఇది మన పవిత్ర కర్తవ్యం. ఈ కర్తవ్య నిర్వహణలో మనం ఎలాంటి ప్రతిఫలాన్ని ఆశించ రాదు. మన కర్తవ్యాన్ని మనం పాటించనట్లయితే భావి తరాలకు పాపం చేసినవారమవుతాము మనకు తగిలించబడిన శృంఖలాలు బంగారు సంకెళ్ళే కావచ్చు. స్వేచ్ఛను కోరుకొంటున్న పౌరులుగా ఆ సంకెళ్ళను తెగకొట్టుకోవలసిందే. భారతదేశానికి ఎంతో సేవ చేసినట్లు బ్రిటిషు వాడు ఎంతగానో ప్రచారం చేసుకొంటున్నారు. కాని వారు మన సర్వస్వం దోచుకొని మనను ఏ విధంగా పనికిరానివారుగా చేశారో ప్రపంచానికి తెలియజేయలేదు'—అంటూ వారి హృదయాలకు హత్తుకునేటట్లు ఉపన్యా సించాడు. సభికులంతా మంత్రముగ్ధులై విన్నారు. నేతాజీ వెల్లడించిన విషయాలకంటే ఆయన జీవితం, అకుంఠిత దీక్ష, కార్యసాఫల్యానికై ఆయన చెందే తపన, ఆయనలో ఉన్న నిజాయితీ వారిని బాగా ఆక ర్షించినాయి ఒక సైనికుడు మరొక సైనికుడితో మాట్లాడుతూ ఉన్నట్లుగా ఉంది. అది వారి హృదయాలపై శాశ్వత ముద్ర వేసింది.

ఇంత నిర్దుష్టంగా కష్టాలను లెక్క చేయకుండా, ప్రమోషన్లు ఆశించకుండా, త్యాగమయ జీవితానికి ఇష్టపడి, తమ సర్వస్వాన్ని మాతృభూమి పాదాల చెంత అర్పించడానికి సిద్ధంగా ఉన్నవారుమాత్రమే ముందుకు రావాలని పిలుపు ఇచ్చినా—ఒక సంవత్సర కాలంలోనే 3,500 మంది స్వేచ్ఛా భారత సైనిక దళంలో చేరారు.

అలా చేరిన వారికి వెంటనే యూనిఫారం, కిట్టూ సరఫరా చేసే వారు. చేరకుండా మిగిలిన ఖైదీలు క్యాంపులో అలాగే ఒకటి రెండు రోజులు ఉండిపోయేవారు. ఎవరినీ బలవంతపెట్టడమన్నది లేదు. అన్ని విధాలా ఇష్టపడిన వారిని మాత్రమే దళంలో చేర్చుకోవడం జరిగేది.

ఎక్కువ మందిని చేర్చుకొని దళాన్ని అనేక అవక తవకలతో కొనసాగిం చడం నేతాజీకి యిష్టంలేదు. అయితే యుద్ధఖైదీలుగా శతృవుల క్యాంపులో స్వేచ్ఛను సంపూర్ణంగా కోల్పోయి బానిస బ్రతుకు బ్రతుకుతూ కొరగాని వారుగా కాలం వెళ్లబుచ్చకుండా ఆరోగ్యవంతులు, ఉత్సాహవంతులు అయిన భారత యువకులను కాపాడాలనేదే నేతాజీ సంకల్పం.

డిశంబరు 1942 నాటికి దళంలో చేర్చుకోవడం ప్రారంభించి సరిగ్గా ఒక సంవత్సరం గడిచింది. ఈ సంవత్సర కాలంలో నాలుగు బెటాలియన్లు తయారయ్యాయి. ఇప్పుడు అది మొదట ఏర్పడిన 15 మందితో కూడిన చిన్న దళంకాదు; అన్ని హంగులూ సమకూర్చుకొన్న అజాద్ హింద్ ఫౌజ్.

## జర్మన్ అధికారుల శిక్షణ

ఈ దళంలో చేర్చుకొనబడే వారికిశిక్షణ యిచ్చేందుకు ప్రత్యే కంగా 300 మంది జర్మన్ సైనికాధికారులు నియుక్తులైనారు. జర్మన్ల క్రమ శిక్షణ చాలా కఠినంగా ఉంటుంది. ఏమాత్రం చిన్న దోషం కని పించినా సహించలేరు. అది ఒక్కొక్కప్పుడు శిక్షణపొందే అజాద్ హింద్ ఫౌజ్ సైనికులకు కోపం కలిగించేది. వారికి కోపం రావడానికి అనేక కారణాలున్నాయి. తమ దేశం వదిలి వందల మైళ్ళ దూరంలో తమకు ఏ మాత్రం పరిచయంలేని దేశంలో వచ్చి పడ్డారు. ఎంతకాలం అక్కడ ఉండాలో వారికి తెలియదు. ఎప్పుడు తమ దేశం చేరతారో అంతకంటే తెలియదు. తాము పుట్టి పెరిగిన వాతావరణానికీ, అక్కడ ఉన్న వాతావరణానికీ ఎలాంటి సంబంధం లేదు. గానుగ ఎద్దుల్లా ఒకే రకమైన యాంత్రిక జీవనానికి కట్టుబడి ఉండాలంటే ఎవరిలోనైనా విసుగు, నిరాశా, నిస్పృహలు చోటు చేసుకొంటాయి. అందుచేతనే అతి చిన్న విషయాలపైన తగాదాలు పెట్టుకొని వారు తమ సహచరులతో

కొట్లాటకు దిగిన సందర్భాలు కూడా ఉండేవి. కొన్ని సందర్భాలలో అసంగతమైన విషయాలను ఆధారంగా చేసుకొని ఆత్మహత్యలు, కాల్చి చంపుకోవడాలు సంభవించేవి. అనుకూల వాతావరణంలో స్వదేశంలోనే గనుక వారు శిక్షణ పొందుతూ ఉండేటట్లయితే ఇలాంటి దుస్సంఘటనలు చాలావరకు జరిగేవి కావు. ఇది దృష్టిలో ఉంచుకొని వారికి తగు విధంగా నచ్చచెప్పి శాంతంగా వారికి శిక్షణ గరపాలని జర్మన్ అధికారులతో స్వేచ్ఛాభారత కేంద్రానికి చెందిన ప్రతినిధులు చెపుతూ ఉండేవారు. అలాగే, సైనికులతో మాట్లాడుతూ వారు ఎన్ని కష్టాలకైనా ఓర్చి శిక్షణ పొందాలనీ ఆ విధంగా ఓరిమి వహించి శిక్షణ పొందినప్పుడు మాత్రమే శిక్షితులైన సైనికులుగా తయారై బ్రిటీషు వారిని పారద్రోలగల శక్తి లభిస్తుందనీ కాబట్టి జర్మన్ సైనికాధికారులతో సంఘర్షణకు దిగరాదనీ నచ్చచెప్పేవారు ఈ విధంగా ఎంతో జాగరూకతతో ఆజాద్ హిండ్ ఫౌజ్ సైనికుల నిర్మాణం జరిగింది.

మిలిటరీ శిక్షణ చాలా కట్టుదిట్టంగా ఉంటుండేది. ఒక చిన్న గుండీ ఊడిపోయినా, లేక సరిగా పెట్టుకోకపోయినా చాలా కఠినంగా శిక్షించేవారు చేసిన పనే చేయిస్తూ మిలిటరీ శిక్షణా, క్రమశిక్షణా రెండూ శిక్షితుల నరనరాల్లో పాతుకుపోయేటట్లు చేసేవారు. ఇది భరించడం కష్టమనిపించినా ఈ శిక్షణానంతరం మనిషి నిజ జీవితంలో కూడా ఎంతో మార్పు, ఎంతో క్రమశిక్షణ, ఎంతో నిగ్రహం ఏర్పడతాయి. తరతమభావం లేకుండా అధికారి చెప్పిన ఆజ్ఞలు పాటించడం నేర్పుతారు. విదేశాలలో ప్రతీవారూ మిలిటరీ శిక్షణ పొందాల్సిందే. ఒక్కొక్కప్పుడు నిత్యజీవితంలో యజమాని, కార్మికుడుగా ఉన్న ఇద్దరు వ్యక్తులు మిలిటరీ శిక్షణ కాలంలో భిన్నమైన బాధ్యతలు స్వీకరించవలసిరావచ్చు. కార్మికుడుగా పనిచేసేవ్యక్తి శిక్షణ యిచ్చేవాడుగాను, యజమానిగా ఉంటున్న వ్యక్తి శిక్షణపొందేవాడుగాను ఉండవచ్చు. ఆ సందర్భంలో అధికారి

చెప్పినట్లుగా ఎంత అల్పమైన పని అయినప్పటికీ క్రిందివారు చేయవల సిందే. వ్యక్తిగత జీవితంలోని హెచ్చు తగ్గులు మిలిటరీ కేంద్రాలలో పనికిరావు. కాబట్టి నిగ్రహం కోల్పోకుండా ఓపికతో ప్రతి పనీ చేయ డానికి వారు అలవాటు పడతారు. భారతదేశంలో మనకు అటువంటి సంప్రదాయం లేదు. అందుకే మనవారిలో ఒక రకమైన మిథ్యాభిమానం, ఓరిమిలేనితనం, అధికారులపైన తిరగబడటం మొదలైన లక్షణాలు కని పిస్తూ ఉంటాయి. మరో అవలక్షణం ఏమిటంటే. ఎవరికి వారే యమునా తీరే అన్నరీతిలో మనవారు ఆలోచిస్తారే కాని సంఘటనాత్మక దృష్టి బహు తక్కువ. ఒకజట్టుగా పనిచేయలేకపోవడానికి కారణం ఇదే. మిలిటరీలో ఇది కుదరదు. ఎవరికివారు తమ పై అధికారి సూచనను శిరసావహించి పనిచేస్తేనేకాని అవసరమైన సహకారం, సమన్వయం సిద్ధించవు. బ్రిటిషు అధికారుల క్రింద పొందిన శిక్షణ చిత్తశుద్ధితో జరిగింది కాదు. కాబట్టి ఎవరికి వారు తమకు తెలిసింది చాలా తక్కువే అయినప్పటికీ ఆ శాస్త్రా నికి సంబంధించిన—పరిపూర్ణ విజ్ఞానం తమకు అబ్బిందని భావించు కుంటారు. అన్నిరకాల శస్త్రాలకు సంబంధించిన శిక్షణ తక్షణమే లభింప చేయటం అనేది అభిలషణీయం కాకపోవడమేకాదు, అసాధ్యం కూడా. అట్లాంటిక్ తీరంలో విమానదళ రక్షణ కార్యక్రమంలో నియుక్తులైన కొందరు తమకు విమానం నడపడంలో శిక్షణ ఇవ్వమని అడిగేవారు. మరికొందరు జలాంతర్గాములు నడపడం చెప్పమనేవారు. ఈ రెండూ విభిన్న శాఖలని, ఒక్కొక్క శాఖలో శిక్షణ పొందడానికి కొన్ని సంవ త్సరాల కఠిన శిక్షణ అవసరమని గుర్తించేవారుకాదు. దళంలోని సభ్యు లలో ఈ రకమైన అసంతృప్తి కూడా కొంత ఉండేది. కాని దళం కార్య క్రమాలు సాఫీగా జరిగిపోవడానికి ఇవి అడ్డురాలేదు.

జర్మన్ మిలిటరీ అధికారులు కఠినంగా ఆజ్ఞలు జారీచేస్తూ అరుస్తూ

వుంటే తెల్లవాళ్ళ దొరతనం పోయి స్వేచ్ఛగా ఉన్నాము అనుకుంటే మళ్ళీ వీళ్ళేమిటి అని అనుకుంటూ ఉండేవారు. బ్రిటీషువారిపట్ల పేరుకుపోయిన ఈర్ష్య, ఆగ్రహం, జర్మనీ అధికారులపట్ల కూడా వ్యక్తం అవుతూవచ్చేది. ఏమైనాసరే ఇక తెల్లవాళ్ళకి తలవంచం అన్న పట్టుదల దళంలో శిక్షణ పొందేవారిలో కనిపిస్తూ ఉండేది. అలాంటి సందర్భాలలో స్వేచ్ఛా భారత కేంద్ర ప్రతినిధులు చాలా చాకచక్యంతో సమన్వయం కుదుర్చుతూ ఉండేవారు.

## పెంచుకొన్న పాటవం

నేతాజీ చేపట్టిన పనులు విజయవంతంగా సాగుతూ ఉండటంతో ఆయనలో ఉత్సాహం రెకెత్తింది. అహోరాత్రులు కృషిచేస్తూ ఉండేవాడు. రాత్రి బాగా ప్రొద్దుపోయే వరకు పనిచేస్తూ ఉండిపోయి తన ఆరోగ్యాన్ని గూర్చికూడా పట్టించుకొనేవాడు కాడు. తాను తలపెట్టిన కార్యం ఎంతో మహత్తరమైనది. వేలాది మంది సుశిక్షితులైన మేధా సంపన్నులు పూనుకొంటేనేకాని సఫలంకాని పని అది. తనకు యుద్ధఖైదీల నుంచి లభించే వ్యక్తులు అంతటి సమర్థవంతమైన ఉన్నత శ్రేణి కార్యకలాపాలకు పనికి వచ్చేవారు కారు వారిలో చాలామంది నిరక్షరాస్యులని తెలుసుకున్నాం కదా! వారు పోలీసు చర్యకు, సైనిక చర్యలకు ఉపయోగపడేవారే కాని, అంతకు మించిన సున్నితమైన కార్యకలాపాలకు వారు వినియోగపడరు.

ఇది ఇలా ఉండగా మరో రెండువందల మందిని చేర్చుకొని వారికి భద్రతా దళాలకు శిక్షణ యిచ్చేందుకు కావలసిన తరిఫీదు ఇవ్వాలను కున్నాడు నేతాజీ. యుద్ధ ఖైదీల నుంచి ఏరుకోడానికి తగినంత మంది లభించేటట్లు లేరు.

ఈలోగా కోఎన్స్ బ్రక్ మిలిటరీ కేంద్రం నుంచి ఆజాద్ హింద్ దళాన్ని మార్చాలనే ప్రయత్నాలు తీవ్రమయ్యాయి. చాలాకాలంగా శిక్షణ

నిమిత్తమై ఉండిపోయిన దళం సభ్యులు భారతదేశానికి సుదూర ప్రాంతమైన ఆ గ్రామంలో దాదాపుగా స్థిర నివాసులై పోయినట్లుగా మారిపోయారు. ఆ గ్రామస్థులందరికి వీరి ప్రవర్తన పట్ల ఆదర భావమే ఉండేది. కానీ రష్యా సరిహద్దులలోకి వెళ్ళి యుద్ధం చేసి సెలవు మీదనో, లేక అంగ వికలురై పోయో తిరిగి వచ్చిన ఆ గ్రామవాసులు కొందరిలో ఏపనీ లేకుండా మిలిటరీ క్యాంపులో కాలక్షేపం చేస్తూ తమ గ్రామంలో హోటళ్లను, ఇతర ప్రదేశాలను నింపుతున్న ఈ ఆజాద్ హింద్ దళం వారంటే ఒక చిన్న చూపు ప్రారంభమైంది. అది వాతావరణాన్ని కలుషితం చేసే ప్రమాదం ఉంది. అదీకాక-ఎంతకాలమని ఆ క్యాంపులో ఊరికే కాలక్షేపం చేస్తారు? కాబట్టి అక్కడినుంచి మార్చాలనే నిర్ణయం జరిగిపోయింది. హాలెండులో తీరప్రాంతానికి కనుక తరలిస్తే, కొన్ని స్థావరాలు అప్పచెప్పి వాటి రక్షణ భారం కూడా అప్పచెప్పితే బాగుంటుందనే ఆలోచన వచ్చింది. హాలెండు దేశం అంత అతి శీతలప్రదేశంకాదు కాబట్టి భారతీయులకు బాగా ఉంటుం దనే ఆలోచనకూడా కలిగింది. దానితో అక్కడికి తరలించడానికి ఆజ్ఞలు జారీ అయ్యాయి. దళంలోని మొదటి బ్యాచి ప్రయాణ సన్నద్ధమై బయలు దేరింది. గ్రామవాసులూ దళంలోని మిగతా సభ్యులూ వారికి ఘనమైన వీడ్కోలు చెప్పారు.

కాని రెండో బెటాలియన్ బయలుదేరవలసిన రోజున ఆ బెటాలి యన్ సభ్యులు అక్కడినుంచి కదలడానికి ఇష్టపడలేదు. ఆ చోటు వీడి పోమని మొండికేశారు. అందరికీ ఆశ్చర్యం అనిపించింది. అందుకు కారకులైన ఒకరిద్దరు వ్యక్తులను ఏరిపారేయడం అంతకష్టమైన పనికాదు. కాని మూలకారణం ఏమిటో తెలుసుకోవాలి.

కోఎన్స్బ్రిక్‌లో ఉన్న దళంలో ఉన్న కొంతమందిని ఎంపిక చేసి బెర్లిన్‌లో ఉన్నత శిక్షణ నిమిత్తం పంపించారు వారితో నల్గురి ప్రవర్తన

భరించరానిదిగా తయారైంది. తప్పనిసరి పరిస్థితులలో వారిని బెర్లిన్ నుండి కోఎన్స్‌బ్రక్ క్యాంపుకు త్రిప్పి పంపివేయాల్సివచ్చింది. అలా త్రిప్పి పంపినవారిలో ఇద్దరు తమ తప్పు తెలుసుకొని పశ్చాత్తాపం వెలిబుచ్చారు. కాని మరో ఇద్దరు తమ బలహీనతలను కప్పిపుచ్చుకోడానికి తప్పుడు ప్రచారం ప్రారంభించారు. జర్మనీలో ఉంటున్న కొందరు పిరికి భారతీయులకు నేతాజీ ప్రారంభించిన ఉద్యమం సఫలం కావడం ఇష్టం లేదు. నేతాజీకి ఏదో రకంగా అవమానం జరిగితే బాగుండునని కోరుకునే వారు. ఆనాడు విదేశాలలో ఉన్న భారతీయులందరు ఎంతటి త్యాగాలకైనా సిద్ధపడి దేశ స్వాతంత్ర్యం కోసం సాగిస్తున్న సాయుధ పోరాటంలో తోడ్పడవలసిందిగా నేతాజీ పిలుపు నిచ్చాడు. అయితే స్వార్థపరులైన కొందరు భారతీయులు నేతాజీ ఉద్యమానికి తోడ్పడితే తమ ఉజ్జ్వల భవివ్యత్తు పోగొట్టుకొంటామేమో అన్న భయంతో ఆయనకు దూరంగా ఉన్నారు. అయితే అలా దూరంగా ఉండిపోతే తమను పిరికివారు అనుకొంటారేమోనని, నేతాజీ తలపెట్టిన ఉద్యమం విజ్ఞతతో కూడినది కాదని ప్రచారం చేయ సమకట్టారు. బెర్లిన్ నుంచి త్రిప్పిపంపబడిన ఇద్దరు సైనికులకు వీరితోడ్పాటు లభించింది. వారు పెద్ద పెట్టున దుష్ప్రచారం సాగించారు. తమను నట్టేట ముంచి నేతాజీ పారిపోయాడన్నారు. నేతాజీని జర్మనీ నుంచి తరిమి వేశారని పుకారు పుట్టించారు. కొంతమంది నేతాజీని ఖైదుచేసి టర్కీ పంపించేశారని పుకారు పుట్టించారు. నేతాజీ అలా పారిపోయాడు కాబట్టి ఇక్కడి ఆజాద్ హింద్ దళాన్ని ఏదో ఒక యుద్ధరంగంలో వినియోగించుకోవడానికి జర్మనీవారు వారిని పశ్చిమంగా ఉన్న ప్రదేశాలకు తరలిస్తున్నారని ప్రచారం చేశారు బలహీనులు కొందరు ఈ పుకార్లు నమ్మి, ఈ పుకార్లను ప్రచారంచేసేవారి పక్షాన చేరారు.

నిజానిజాలు తెలుసుకోవడానికి దళం నుంచి ఆరుగురు వ్యక్తులు కల ప్రతినిధివర్గం స్వేచ్ఛాభారత కేంద్రంలో బాధ్యతకల వ్యక్తులను

కలుసుకోవడానికి బెర్లిన్ వెళ్లారు. అదృష్టవశాత్తు నేతాజీ స్వయంగా తయారుచేసి ఉంచిన అధికార పత్రాలు కొన్ని అక్కడ లభ్యమయ్యాయి. ఆ పత్రాలవల్ల చాలవరకు నిజం ఏమిటో తెలిసింది. అయితే ఈ పుకార్ల వెనుక బ్రిటీషు వారి హస్తం ఉందనడానికి అవకాశం లేకపోలేదు. నేతాజీ ఉద్యమం బలపడకుండా చూసేందుకు బ్రిటీషువారు అహర్నిశలు కృషిచేశారు. గోడమీది పిల్లి వాటంగా ఉన్న కొందరు భారతీయులకు ఆశలు చూపించి అజాద్ హింద్ ఫౌజ్‌లో చీలికలు తెచ్చే ప్రయత్నాలు చాలా చేశారు అయితే వారి ప్రయత్నాలు విఫలమయ్యాయి. బెర్లిన్ వెళ్ళి వచ్చిన ప్రతినిధివర్గం తమ అభిప్రాయాన్ని ఖచ్చితంగా వెలిబుచ్చడంతో చాలామంది మనస్సులలో ఉన్న భ్రమలు తొలిగిపోయాయి. రెండు మూడు మాసాలవరకు అత్యంత రహస్యమైన పనిలో ఉన్న కారణంగా నేతాజీ తమను కలుసుకోవడానికి పిలుపడటంలేదు కాని, వాస్తవానికి తమను హాలెండు పంపించాలనే నిర్ణయం నేతాజీయే తీసుకొన్నాడని వారు విశ్వసించారు. జర్మనీ తరఫున యుద్ధం చేయడానికి వారు హాలెండు వెళ్లడం లేదని, తీరప్రాంతం రక్షించుకోవడంలో పన్నవలసిన వ్యూహాలు, వాటి రహస్యాలు నేర్చుకోవడం కోసమే తాము అక్కడకు వెళుతున్నారన్న విషయం వారు తెలుసుకొన్నారు. అంతవరకు సాగిన సిద్ధాంతపరమైన శిక్షణ ఇకమీదట ఆచరణలో పెట్టే అవకాశం లభించినందుకు కొందరు సంతోషపడ్డారు కూడా.

హాలెండు చేరాలంటే వారు బెవర్లూ మీదుగా వెళ్లాలి. మొదటి బెటాలియన్ బెవర్లూ చేరి ఖాళీగా ఉన్న బెల్జియన్ మిలిటరీ శిబిరంలో తమ స్థావరం ఏర్పాటు చేసుకొన్నారు. ఆ తర్వాత రెండో బెటాలియన్ వచ్చి చేరింది. బెవర్లూలో దళం పదిరోజులు మకాం చేసింది. 44 వ ఆర్మీకోర్‌కు చెందిన కమాండింగ్ జనరల్ అజాద్ ఫౌజ్ దళాన్ని చాలా పరిశీల

నాత్మక దృష్టితో పర్యవేక్షించాడు. మొదట్లో అపహాస్య ధోరణిలో మాట్లాడినవాడు చివరికి దళం పొందిన శిక్షణను తెలుసుకొని మెచ్చుకొని బయటకు నడిచాడు. కోఎన్సుబ్రక్‌ను క్రమంగా మర్చిపోయి హాలెండు చేరాలనే ఉత్సాహం దళంలో చోటు చేసుకొంది.

## రంగస్థలి మార్పు

అజాద్ హింద్ దళం తన శిక్షణా కార్యక్రమాలు చాలా సమర్థవంతంగా పూర్తి చేసుకొంది. దళంలో సంఖ్య 3,500 కు చేరగానే ఇంక క్రొత్తవారిని చేర్చుకోవడం ఆపేశారు. గోళ్ళు గిల్లుకుంటూ పడేసింది ఇంత తింటూ జర్మనీవారి యుద్ధఖైదీల శిబిరాలలో నిరర్థక జీవితం గడపవలసిన వారికి ఒక చక్కటి అవకాశం లభింపచేశాడు నేతాజీ. చక్కటి శిక్షణ యిప్పించగలిగాడు. అప్పుడప్పుడు వారు జరిపే సైనిక విన్యాసాలు పర్యవేక్షించడానికి వెళుతూ ఉండటం తప్ప ఎక్కువ సమయం దళం నిర్మాణంలో వెచ్చించడానికి నేతాజీకి వీలు లేకపోయింది. అయినా దళం సభ్యులు పొందిన శిక్షణ, సంపాదించిన ప్రావీణ్యం అల్పమైనవి కావు. జర్మనీ ఉన్నతాధికారులు వారి విన్యాసాలు తిలకించి పులకించిపోయేవారు. అది సుభాన్‌కు చాలా సంతృప్తి కలిగించేది.

నేతాజీ స్థాపించిన రేడియో కార్యక్రమాలు కూడా సాఫీగా జరిగిపోతున్నాయి. నిర్దిష్ట సమయాలలో అనుకున్న ప్రకారం ఎలాంటి అంతరాయం లేకుండా సమర్థవంతంగా రేడియో కార్యక్రమాలు నిర్వహింపబడుతున్నాయి నేతాజీ ప్రమేయం లేకుండానే ఆ కార్యక్రమాలు చక్కగా నిర్వహించడానికి కావలసిన జట్టు నిర్మాణం అయింది. అది కూడా నేతాజీకి చాలా సంతోషాన్ని కల్గించింది. అయితే ఈ రేడియో కార్యక్రమాల నిర్వహణకంటే 3,500 మంది సభ్యులు గల దళాన్ని నిర్వ

హించే పని చాలా పెద్దపని. జర్మనీ అధికారుల సహాయ సహకారాలు అన్ని విధాల పొందుతూనే వారికి బంటుగా వ్యవహరించకుండా తమ స్వతంత్ర ప్రతిపత్తిని కాపాడుకోవాలి. ఇది చాలా సున్నితమైన విషయం. అయినా నేతాజీ ఈ విషయంలో బహు చాకచక్యంగా వ్యవహరించాడు. జర్మనీవారి అడుగులకు మడుగులు ఒత్తుతున్న ధోరణిలో ఎన్నడూ వ్యవహరించలేదు. తమది స్వతంత్రమైన సైన్యమనీ, స్వాతంత్ర్యమును సాధించుటయే తమ ధ్యేయమనీ ఆయన ఎలుగెత్తి చాటేవాడు. ఆత్మాభిమానాన్ని, ఆత్మగౌరవాన్ని పరిరక్షించుకుంటూ జర్మనీవారి సహాయం పొందటమే ఆయన లక్ష్యం. అంత సంక్లిష్ట పరిస్థితులలో అనితర సాధ్యమైన పని నేతాజీ సాధించాడు.

తాను చేపట్టిన ఆ రెండు కార్యక్రమాలు దారిన పడి సక్రమంగా పనిచేస్తూ ఉండటంతో, నేతాజీ ఆలోచనలు మరో దిశకు పరుగెత్తాయి. ఆ కొద్దిపాటి సైన్యంతో భారతదేశంపైన దండయాత్ర జరిపి బ్రిటిషు వారిని పారద్రోలి స్వాతంత్ర్యాన్ని సంపాదించిపెట్టగలమనే దురభిమానం, అవాస్తవిక దృక్పథం నేతాజీకి ఎప్పుడూ లేవు. చుట్టుపట్ల జరుగుతున్న పరిస్థితులు జాగ్రత్తగా పరిశీలించడం ప్రారంభించాడు. యుద్ధం సాగుతున్న రీతి గమనించాడు. అందుకు సంబంధించిన పూర్తి సమాచారం సేకరించాడు. తన కార్యరంగాన్ని తూర్పు ఆసియాకు మరల్చాలని నిశ్చయించుకున్నాడు. తూర్పు ఆసియాకు చేరడం అన్నది యుద్ధం ముమ్మరంగా సాగుతున్న ఆ రోజుల్లో అంత సులభంగా సాధ్యపడే విషయం కాదు. విమానం ద్వారా పోవాలన్నా, సముద్రంపైన ప్రయాణం చేయాలన్నా- రెండూ ప్రమాద భరితలే. అయినా ప్రమాదాలు ఎదుర్కోవడం నేతాజీకి క్రొత్తకాదు.

అయితే ఇక్కడ ఒక చిక్కు ఉంది. నేతాజీ తూర్పు ఆసియాలో తన కార్యక్రమాన్ని నిర్విఘ్నంగా కొనసాగించాలంటే జపానువారి అండ

ధనం లభించడం ఎంతో అవసరం. ఆ రోజుల్లో జపాన్ బర్మా తీరంవరకు విజయవంతంగా ప్రయోగించి ముందుకు సాగిపోతోంది కాబట్టి జపాన్ సహాయం తీసుకోవడం తప్పనిసరి. ఆ సమయంలో జర్మనీలో జపాన్ రాయబారిగా ఉన్న ఓషిమా చాలా తెలివైన రాజకీయవేత్త. నేతాజీ జర్మనీలో చేస్తున్న పని చాలా జాగ్రత్తగా పరిశీలించి చూసిన వ్యక్తి. భారతదేశానికి దూరంగా ఎక్కడో జర్మనీలో ఉండి పనిచేయడం కంటే, భారతదేశానికి దగ్గరలో ఉంటే నేతాజీ ఇంకా సమర్థవంతంగా పనిచేయగలడని విశ్వసించాడు. కాబట్టి జపాన్ ప్రభుత్వాన్ని ఒప్పించడానికి తన సర్వశక్తులను ఉపయోగించి పనిచేస్తానని వాగ్దానం చేశాడు.

జపాన్‌వారు మంచి జాతీయభావాలు కలవారే కాదు; కష్టపడి పని చేస్తారు. జాగ్రత్తగా పరిశీలిస్తారు, మర్యాదగా ప్రవర్తిస్తారు. జట్టుగా పని చేస్తారు. విదేశాలలో స్థావరాలు ఏర్పాటు చేసుకొని నివసిస్తున్న జపాన్ వారిని పరిశీలిస్తే ఈ విషయాలు స్పష్టంగా బోధపడతాయి ఏదైనా ఒక విషయం మీద తమ భావాన్ని వెలిబుచ్చడం అనవసరం అని భావిస్తే ఎంత తీవ్రమైన వాదోపవాదాలు జరుగుతున్న ప్రదేశంలో కూర్చున్నప్పటికీ ఇతరులు వాదించుకొనేది వింటూ కాలక్షేపం చేస్తారే కాని పెదవి విప్పరు. బలవంతంగా వారి అభిప్రాయం ఏమిటో తెలుసుకోవాలని ప్రయత్నించినా ఆ భావ తమకు తెలియదనో, ఆ విషయాన్ని గూర్చి తమకు బొత్తిగా పరిజ్ఞానం లేదనో అంటారే కాని తమ భావం వెలిబుచ్చరు వారి గుణగణాలు కొన్ని భారతీయులు అలవరచుకొంటే దేశానికి మేలు జరుగుతుంది.

ఓషిమా సహాయం చేస్తానని చెప్పినప్పటికి, ఆనాటి పరిస్థితులు ప్రయాణానికి అంత అనువైనవి కావు. అయితే అంత క్లిష్టపరిస్థితులలో కూడా ఇటలీ వారు కొందరు నేరుగా సింగపూర్ వరకు తమ విమానాల్లో

ప్రయాణం చేసిన ఉదంతాలున్నాయి. కాబట్టి ఇటలీ వారి సహాయంతో విమానం మీద అయితే సింగపూర్‌కు అతివేగంగా చేరుకోవచ్చని ఆలోచించి వారితో కూడా సంప్రదింపులు ప్రారంభించాడు నేతాజీ.

## ప్రయాణానికై ఆతురత

జర్మన్ ప్రభుత్వం నేతాజీ కోరిన విధంగా ఎలాంటి సహాయం చేయడానికైనా సిద్ధంగానే ఉంది. జపాన్ ప్రభుత్వానికి కూడా ఎలాంటి అభ్యంతరం లేదు. జర్మన్ జలాంతర్గాములూ, జపాన్ జలాంతర్గాములూ తరచు కలుసుకొంటూ తమకు పరస్పరం అవసరమైన సరుకులు మార్పిడి చేసుకొంటూనే ఉన్నాయి జర్మన్‌వారు కేప్ ఆఫ్ గుడ్‌హోప్ వరకు తమ జలాంతర్గాములను తీసుకురాగల్గుతున్నారు అక్కడి నుంచి జపాన్ జలాంతర్గాములు సులభంగానే ఆసియా దేశాలవైపు పయనం సాగించ గల్గుతున్నాయి. అయితే నేతాజీని ఈ జలాంతర్గాములలో సింగపూర్ చేర్చడమంటే సరుకు రవాణా చేయడం వంటి సులభమైన విషయం కాదు. బ్రిటిష్ ఛానల్ దాటి రావడం అంటే ఎంతో ప్రమాదానికి తలపడి ప్రయాణం చేయడమే. సముద్ర గర్భంలో అనేక చోట్ల మందుగుండు మాటుపెట్టి ఉంచారు బ్రిటిషువారు. కడుజాగ్రత్తతో ప్రయాణం చేస్తేనే గాని ప్రమాదాన్ని తప్పించుకొని బయటపడే వీలుండదు ఏమాత్రం అచూకి తెలిసినా శత్రువులు వదిలిపెట్టరు. రెండు ప్రభుత్వాలు అతి రహస్యంగా సమాలోచనలు జరుపుకోవాలి. దానికి సంబంధించిన ఏర్పాట్లు అన్నీ కూలంకషంగా నావికా దళంతో చర్చించాలి. జలాంతర్గాములు ఎక్కడ ఆగాలి, ఎక్కడ ఇంధనం సమకూర్చుకోవాలి, జర్మన్ జలాంతర్గాములు ఎక్కడవరకు రావాలి, జపాన్ వారు ఎక్కడ నేతాజీని అందుకోవాలి మొదలైన విషయాలు అన్నీ నిర్ణయింపబడాలి అందుచేత ఉభయ ప్రభుత్వాలకు ఇష్టమే అయినా కొన్ని మాసాలు నేతాజీ వేచి ఉండాల్సి

వచ్చింది. ఒకసారి వెళ్ళిపోవాలని నిశ్చయించుకొన్నాడు కాబట్టి ఏమాత్రం సమయం వృధా కావడం నేతాజీకి ఇష్టం లేదు. శరీరం జర్మనీలో ఉందే కాని, మనస్సంతా తూర్పు ఆసియాలో తాను తలపెట్టిన కార్యంపైనే లగ్నమై ఉంది.

ఈ లోగా జపాన్‌వారు బ్రిటీషు సైన్యాలను సింగపూర్ నుంచి తరిమివేయడమేగాక బర్మా వరకు ఆక్రమించుకుని కూర్చున్నారన్న వార్త అందింది. జపాన్ వారు ఖైదీలుగా పట్టుకొన్న భారతీయులలో చాలామంది భారత స్వాతంత్ర్య సమరానికి సన్నద్ధంగా ఉన్నారన్న వార్త కూడా నేతాజీకి చేరింది. అలాంటి వారి నందరినీ రాస్ బిహారీ బోస్ అధీనంలో ఉంచడం జరిగింది. కాని రాస్ బిహారీ బోస్ వృద్ధాప్యంలో ఉన్నాడు. అప్పటికే జపాన్‌లో 30 సంవత్సరాలుగా ఉన్నాడు. యుద్ధ సైన్యాలను నడపగలిగిన శారీరక పటిమ ఆయనకు లేదు నేతాజీ వంటి శక్తివంతుడు వచ్చి ఆ బాధ్యత స్వీకరిస్తే బాగుండునని ఆయన కూడా ఎదురుచూస్తూ ఉన్నాడు. ఆ పరిస్థితులలో జర్మనీలో ఉండటం అంటే నేతాజీకి తేళ్ళూ, జెర్రులూ ప్రాకినట్లు ఉంటోంది. కావాలని జర్మనీ వారే తన పథకానికి అడ్డుపడుతున్నారేమో అన్న అనుమానం కూడా అప్పుడప్పుడు వచ్చేది. ఎలాగైనా తూర్పు ఆసియా దేశాలకు చేరుకోవాలన్న ఒకే ఒక కోరిక అతని మనస్సంతా ఆక్రమించివేసింది.

ఒకసారి ఇటలీవారు రోమ్‌నుండి సాహసంతో కూడిన ప్రయాణం చేసి సింగపూర్ చేరినట్లుగా సుభాస్ విన్నాడు. తాను కూడా అలాంటి ప్రయాణం చేస్తే బాగుంటుందేమో అని ఆలోచించడానికి రెండుసార్లు రోమ్ వెళ్ళాడు. సంకుల సమరం సాగుతున్న ఆ రోజులలో అంత ప్రమాదంతో కూడుకున్న ప్రయాణం చేయడం విజ్ఞతతో కూడిన పని కాదనే నిర్ణయానికి వచ్చాడు. అంతేగాక, ఆ రోజుల్లో వాటికన్ నగరం

అన్ని దేశాల రాయబారులు స్వేచ్ఛగా తిరిగే నగరం. కాబట్టి రో
నగరంలో ఏ రహస్యమూ దాచడానికి అనువైన పరిస్థితి లేదు. నేతా
రోమ్‌నుంచి విమానంలో ప్రయాణమై పోవడమే జరిగితే, ఆ వార్త ని
షాల మీద శత్రువులకు చేరేది. నేతాజీ బందీగా పట్టుబడటమో లే
విమానం పేలి మరణించడమో జరిగేది. నేతాజీకి ఎంతటి ఆవేశం ఉందో
అంతటి ఆలోచన గూడా ఉంది. అందుచేతనే ఆ ప్రయాణం మానుకు
న్నాడు. ఈలోగా జర్మన్, జపాన్ ప్రభుత్వాలు అన్ని ఏర్పాట్లు ఏ లోప
లేకుండా పూర్తి చేసుకోగలిగాయి. నేతాజీ ప్రయాణానికి తేదీ నిర్ణయం
అయిపోయింది.

మళ్ళీ నేతాజీ మానసిక ఉల్లాసంతో శారీరక రుగ్మతను మర్చి
పోయాడు. బెర్లిన్‌లో గడిపిన ఆఖరి రోజులు నిమిషం తీరుబడిలేకుండా
కార్యక్రమాలతో నిండిపోయాయి. సన్నిహితమిత్రులూ, నేతాజీని ప్రాణ
సమానంగా చూచుకొన్నవారూ నేతాజీ తమతో లేని లోటును ఏ విధంగా
పూడ్చాలా అన్న ఆలోచనలో పడ్డారు. వారికి తగు విధంగా సలహా
ఇవ్వడంలోనూ, మార్గదర్శకం చేయడంలోనూ చాలా సమయం వెచ్చిం
చాడు నేతాజీ. ప్రాణాపాయ పరిస్థితులలో కలకత్తా విడిచి జర్మనీ చేరు
కొన్నప్పుడు జర్మనీలో తాను చేయబోయే కార్యక్రమం ఏమిటో నేతాజీకి
సూచనప్రాయంగానైనా తెలియదు. కానీ స్వేచ్ఛా భారత కేంద్రం
సాగించిన ప్రసారాల ద్వారా బ్రిటిషువారి తప్పుడు ప్రచారాన్ని సమర్థ
వంతంగా త్రిప్పికొట్టగలిగాడు. భారతీయులలో నూతనోత్తేజాన్ని, ఉత్సా
హాన్ని, విశ్వాసాన్ని రగుల్కొల్పే అనేక ప్రసారాలు చేశాడు. స్టాఫర్డ్
క్రిప్స్ దౌత్యంలో ఉన్న లోపాలను కళ్ళకు కట్టినట్లు చూపించగలిగాడు.
ప్రచారానికి సంబంధించినంతవరకు ఆజాద్ హింద్ రేడియో భారత
ప్రజలకు ఎనలేని సేవ చేసింది. రేడియో ప్రసారాలు ఎప్పుడూ కడపటి
ఢిల్లీ చక్రవర్తి అయిన బహదూర్‌షా గీతంతో ప్రారంభమయ్యేవి.

**గజియోంమే ఖూరహేగీ జబ్‌తక్ ఇమ్మాన్‌కీ**
**తబ్‌తో లండన్ తక్ చలేగీ తేజ్ హిందూస్తాన్‌కీ**

(మన స్వతంత్ర పోరాటం జరిపే వీరులలో ఆత్మవిశ్వాసం ఉన్నంతవరకు భారతీయుల కత్తి లండన్ గుండెలో దూసుకొనిపోతూనే ఉంటుంది.)

ముగింపు ఈ గీతంతో జరిగేది-

**మజా ఆయేగా జబ్ హమారా రాజ్ దేఖేంగే**
**కి అపనీహీ జమీన్ హోంగీ అపనా ఆస్మాఁహోగా**
**షహీదోంకి చితోంపర్ లగేంగే హరా బరస్ మేలే**
**వతన్‌పర్ మర్‌నేవాలోంకా యహీ నామోనిషాన్ హోగా.**

(భారత భూమి, ఆకాశం తిరిగి మన వశమై మనకు స్వారాజ్యం సిద్ధించిననాడు ఈ గడ్డపై ఆనందోత్సవం కన్నులపండువుగా కనిపిస్తుంది. మృతవీరుల సమాధుల వద్ద వార్షికోత్సవాలు జరిగి ఈ దేశం కోసం ప్రాణాలర్పించిన వీరుల గుణగానం జరుగుతుంది.)

## భారత రాజకీయాల అవగాహన

జర్మనీలో తన కార్యక్రమాలు విజయవంతంగా కొనసాగిస్తూనే భారత దేశంలో జరుగుతున్న పరిణామాలను గూర్చి కూలంకషంగా తెలుసుకొనే ప్రయత్నాలు సాగించాడు నేతాజీ. అందుచేత భారతదేశంలోని తాజా పరిణామాలు ఆయనకు కరతలామలకంగా ఉంటుండేవి. దేశవిభజనకు సంబంధించిన చర్చ ఆయనకు ఎంతగానో బాధ కల్గించింది. ద్విజాతి సిద్ధాంతాన్ని ఆయన ఎప్పుడూ అంగీకరించలేదు. భారతదేశం హిందూస్తాన్, పాకిస్తాన్ అని రెండు ముక్కలుగా విడిపోవడం కంటే ఘోరమైన పరిస్థితి మరొకటి లేదన్నాడు. చరిత్రకు అందిన కాలఖండం పరిశీలిస్తే ఈ

భూమి ఎల్లప్పుడు అఖండంగా భారతఖండమనో, హిందూస్థాన్ అనో, ఇండియా అనో గుర్తింపబడిందేకాని ముక్కముక్కలుగా ఎన్నడూ గుర్తింపు పొందలేదు. ఆర్థికంగానూ, సాంస్కృతికంగానూ, జాతిపరంగానూ అవిభాజ్యంగా వస్తున్న ఈ భూఖండాన్ని విభజించాలనుకోవడం అవివేకంతో కూడిన ఘోరమైన దుశ్చర్య అవుతుంది. ఇది కేవలం ఒక మనోభావం మాత్రమేకాదు- ఆర్థిక, సామాజిక, రాజకీయ ప్రగతిని సాధించడం దృష్ట్యా కూడా ఈ దేశాన్ని అవిభాజ్యంగా ఉంచవలసిన అవసరం ఉంది అని స్పష్టంగా పేర్కొన్నాడు. ఎవరో కొద్దిమంది కోరిక కారణంగా శాశ్వతంగా దేశాన్ని రెండు ముక్కలుగా చేయాలన్న ప్రతిపాదన అత్యున్నత స్థాయిలో చర్చింపబడటంకన్నా దురదృష్టకరమైన పరిణామం మరొకటి ఉండబోదు అన్నాడు. బ్రిటీషువారి పన్నుగడలో భాగంగా నడపబడుతున్న ఈ రాజకీయాన్ని ఎదిరించి తన సర్వశక్తులు ఒడ్డి పోరాటం జరపడానికి తాను భారతదేశంలో లేనందుకు బాధపడ్డాడు. తనకు అందుబాటులో ఉన్న ఏకైక సాధనం ఆజాద్ హింద్ రేడియో ద్వారా ఆ ప్రతిపాదనను తీవ్రంగా ఖండించాడు ఆ సమస్యపైన భారతదేశంలోని ముస్లింలు, హిందువులూ ఏ అభిప్రాయంతో ఉన్నారో తెలుసుకోవడానికి సర్ స్టాఫర్డ్ క్రిప్స్ భారతదేశానికి వస్తే, బ్రిటీషువారి మాయలో పడిపోయి రాజగోపాలచారి అంతటివాడు మధ్యవర్తిగా వ్యవహరించడం పట్ల తన తీవ్ర సంతాపాన్ని ప్రకటించాడు.

## పోషించలేని తల్లికి కవలపిల్లలు

పాకిస్తాన్ ఏర్పాటునే గనుక అంగీకరించడం జరిగితే, అది బ్రిటీష్ వారి రాజనీతిజ్ఞతకు పరిపూర్ణ విజయం అవుతుంది. ఇలాంటి రాజకీయంతోనే తమ ప్రక్కనున్న ఐరిష్ వారితో సహా ప్రపంచంలో అనేక జాతులను బ్రిటీషువారు నాశనం చేశారు అన్న సంగతి నేతాజీ గుర్తుకు తెచ్చాడు.

అనేక వేల సంవత్సరాలుగా ఈ గడ్డపైన జరిగిన దాడులను ఎదుర్కొంటూ తన ఐక్యతను కాపాడుకొంటూ వస్తున్న ఈ జాతి పాకిస్థాన్ ఏర్పాటు ద్వారా తన భౌగోళిక, ఆర్థిక, జాతీయ సమగ్రతను కోల్పోతుంది అన్నాడు. సమైక్యంగా ఉన్న ఇండియా ఆసియాలో కెల్లా బలవత్తరమైన రాజ్యంగా రూపొందుతుంది. ఇండియా గనుక విభజింపబడితే-నీరసంగా ఉండి, ఒక బిడ్డను గూడా పోషించలేని తల్లికి కవలపిల్లలు పుట్టినట్లు అవుతుంది. అది మన ఆర్థిక విచ్ఛితికి దారితీస్తుంది. బ్రిటిషువారి దొరతనం పోయి అమెరికా పెత్తనమో, మరో పెట్టుబడిదారీ దేశపు పెత్తనమో సిద్ధిస్తుంది. లేదా పొంచి ఉన్న కమ్యూనిస్టులకు చక్కటి ఆహ్వానం లభించినట్లు అవుతుంది.

పాకిస్తాన్ ఏర్పడాలన్న కోరికకు అనుగుణంగా సంప్రదింపులు ప్రారంభించడానికి ఒప్పుకోవడం అంటే ద్విజాతి సిద్ధాంతాన్ని అంగీకరించడమే అవుతుంది ఇది నేతాజీకి ఏమాత్రం ఇష్టం లేదు. అయితే మన దురదృష్టవశాత్తు ఆయన ఆ తరుణంలో భారతదేశంలో లేడు. ఆయన చేయగలిగింది ఆజాద్ హింద్ రేడియో ద్వారా దేశానికి సంభవించనున్న ముప్పును గూర్చి హెచ్చరించడం మాత్రమే. అది ఆయన చాలా సమర్థవంతంగా నిర్వహించాడు. కనీసం అసారి క్రిప్స్ రాయబారం విఫలమైంది.

నేతాజీకి అద్భుతమైన అవగాహన శక్తి ఉంది. ఏ విషయమైనా సూచనప్రాయంగా తెలియచేస్తేచాలు, లోతులు తరచి చూడగల మేధాశక్తి ఆయనది. యుద్ధరంగంలో జర్మనీ వారు అద్భుత విజయాలు సాధిస్తున్న వార్తలు అందుతుండగానే అంతిమ విజయానికి సంబంధించిన అనుమానాలు కూడా ఆయనను వెన్నాడాయి. దానికితోడు జర్మనీలో ఉండి తాను చేయవలసిన పని ముగిసిందన్న నిశ్చితాభిప్రాయానికి వచ్చాడు. అందు చేతనే తన కార్యక్షేత్రాన్ని తూర్పు ఆసియాకు మార్చాలని నిశ్చయించు

కొనడం జరిగింది. అప్పుడు ఆయన ఆరోగ్యం కూడా అంతంతమాత్రం గానే ఉండేది. రోజూ ఇంజక్షన్ చేయించుకోవలసి ఉండేది. అయినా తాను అనుకున్న రీతిగా తూర్పు ఆసియా ప్రయాణం నిశ్చయమైనదన్న వార్త చెవిన పడగానే ఆయనకు కొండంత బలం వచ్చింది. ఆఖరు సారిగా కోఎన్స్‌బ్రక్‌లో శిక్షణ పొందుతున్న తన సైనిక దళాన్ని దర్శించడానికి బయలుదేరి వెళ్లాడు. వారిని వదిలిపెట్టి వెళ్లుతున్నందుకు ఒక ప్రక్కన బాధగా ఉంది. వారికి సంబంధించిన ఏర్పాట్లు అన్నీ సంపూర్ణంగా చేసిన తర్వాతనే వెళుతున్నందుకు సంతృప్తిగా ఉంది. ఏమైనా తన సైనిక దళం గానీ, తాను కానీ శాశ్వతంగా జర్మనీలో ఉండిపోవాలనే కోరిక ఎప్పుడూ లేదు. భారతదేశ దాస్యవిముక్తి తను అందరి లక్ష్యం. ఎవరికి ఎక్కడ అవకాశం లభిస్తే అక్కడ పని చేస్తూ లక్ష్యం చేరుకోడానికి కృషి సాగించాలి. తాను జర్మనీలో ఉండి కృషి సాగించడం కంటే తూర్పు ఆసియా దేశాలలో భారతదేశానికి సమీపంలో ఉండి పనిచేస్తే ఎక్కువ ఫలితాలు సాధించే అవకాశాలు ఉన్నాయి. కాబట్టే తన కార్యక్షేత్రాన్ని మార్చుకోవాలనుకొన్నాడు. అంతేగాని, జర్మనీలో తాను ఏర్పాటు చేసిన సైనిక దళాన్ని వారి కర్మకు వారిని వదిలేసి పారిపోవడానికి కాదు. తాను సాగించవలసిన ప్రయాణం ప్రమాదభూయిష్ఠమైనదని తెలిసికూడా అందుకు సిద్ధపడింది భారతీయుల శ్రేయస్సును, భారతదేశ స్వాతంత్ర్యాన్ని దృష్టిలో ఉంచుకొనే.

## కోఎక్స్‌బ్రక్‌కు ఆఖరిసారి

కోఎన్స్‌బర్క్‌లో దళ సభ్యులకు కొన్ని ముఖ్య విషయాలు తెలియజేసి, మరొకసారి కర్తవ్య బోధ చేసి సెలవు తీసుకోవడానికే నేతాజీ అక్కడికి వచ్చాడు. అయితే తాను వెళుతున్నట్లు వారికి తెలియచేయడానికి వీలులేదు. అది రహస్యంగా ఉంచుతూనే వారివద్ద వీడ్కోలు

పొందాలి. మొదట కేవలం నాలుగు మాటలు చెప్పి ఇరవై నిమిషాలలో
కార్యక్రమం ముగించుకొని వారివద్ద సెలవు తీసుకోవాలని అనుకొన్నాడు.
కాని తన అధ్వర్యంలో, తన నేతృత్వంలో విదేశ గడ్డపైన శిక్షణపొంది
మాతృదేశ సేవకు తమను తాము అంకితం చేసుకొని, ఎంతటి త్యాగాల
కైనా చేయడానికి సిద్ధంగా కూర్చొన్న తన అనుచరులను చూస్తూ
ఆనందానుభూతిని పొందాడు. ఉపన్యాసం ప్రారంభించాడు. తన ఎదురుగా
ఉన్న సభ్యులను ఉత్తేజపరచి కరతాళధ్వనులు చేయించుకోవడానికి
ఉద్దేశించిన మాటలు కావు అవి ప్రపంచ చరిత్రను పరిశీలనాత్మక దృష్టితో
అవగాహన చేసుకొని సభికులను తన భావాలకు చేరువగా తీసుకుపోవ
డానికి, తత్సంబంధమైన పరిజ్ఞానం వారికి అందించడానికి వారి ధ్యేయ
మేమిటో స్పష్టంగా బోధపరచడానికి సాగిన సముద్ర మథనంలాంటిది ఆ
ఉపన్యాసం. తన అనారోగ్య విషయం కానీ, శారీరక బలహీనత కానీ,
తీవ్రమైన జలుబుతో బాధపడుతున్న స్థితి కానీ అప్పుడు ఆయన స్మృతి
పథంలో లేవు. సరళంగా, సహజంగా, గంభీరంగా సాగిన ఆ వాక్ప్ర
వాహంలో మంత్రముగ్ధులై మునిగిపోయారు సభికులు. రెండు గంటల
పదిహేను నిముషాలు సాగింది ఆ ఉపన్యాసం. దురదృష్టవశాత్తూ షార్టు
హాండులోగానీ, టేప్ రికార్డు ద్వారాగాని ఆ మహోపన్యాసాన్ని భద్ర
పరచుకోవడం జరగలేదు. నేతాజీ కావించిన ప్రసంగాలన్నింటిలో తల
మానికం అనతగిన ప్రసంగం భావితరాలకు అందుబాటులో లేకపోవడం
నిజంగా దురదృష్టకరమైన విషయమే. ఆ తర్వాత దళ సభ్యులతో కలసి
భోజనశాలలో భోజనం ముగించుకొని బయలుదేరాడు నేతాజీ.

## ముగిసిన పాత్ర

అయిదు మాసాలు హాలండులో గడిపిన తర్వాత అక్కడి నుంచి
ఆజాద్ హింద్ సైనికదళాన్ని ఫ్రాన్స్‌కు తరలించారు. హాలండులో తీర

ప్రాంత రక్షణ విషయంలో వారికి చక్కటి శిక్షణ లభించింది. ఫ్రాన్సులో తీరానికి మరికొంత చేరువలో ఉండి రక్షణ కార్యక్రమాలు చేపట్టడంలో శిక్షణ పొందారు హాలండులో అనుభవించిన ఆనందం ఫ్రాన్సులో అనుభవించడానికి వీలుపడలేదు. కాని, స్థలం మార్పిడి అనేది సైనికదళాలకు చాలా అవసరం. మారిన పరిస్థితులలో యుద్ధ వ్యూహంలో ఎలాంటి మార్పులు చేసుకోవాలనే విషయంలో ఆచరణరీత్యా నేర్చుకొనే అవకాశం లభిస్తుంది. ఫ్రాన్సులో వారు బస చేసిన ప్రాంతం ఆర్థికంగా చాలా వెనుకబడిన ప్రాంతం. అక్కడి ప్రజలు ఎక్కువగా అటవీ సంపదపైన ఆధారపడి జీవిస్తారు జీవన ప్రమాణాలు కూడా తక్కువే హాలండులో ఉన్నట్లుగా సస్యశ్యామలంగా కళకళలాడుతూ కన్పించే పొలాలు ఉండవు. అంతేకాక, జనసాంద్రత కూడా తక్కువ కావడం చేత స్థానికులతో ఎక్కువ పరిచయానికి కూడా అవకాశం లభించలేదు. సైనికదళానికి కావలసిన సరఫరాల విషయంలో జర్మన్లు ప్రత్యేక శ్రద్ధ తీసుకొని అన్ని ఏర్పాట్లు చేసిన కారణంగా దళంలోని సభ్యులకు ఇబ్బంది లేకుండా పోయింది. ఇంత కాలంగా పొందిన శిక్షణ ఫలితంగానూ, జర్మన్లు వ్యవహరిస్తున్న తీరు పరిశీలించి అవగాహన చేసుకొన్న కారణంగానూ, అంతకు పూర్వం ఉన్న అపోహలు తొలిగి పోయాయి. అజాద్ హింద్ దళంలోని సైనికులు ఇప్పుడు ఎంతో ఐకమత్యంతో విషయాలను అర్థం చేసుకొని ప్రవర్తిస్తున్నారు. చక్కటి శిక్షణ కూడా పొందారు. ఇప్పుడు ఎంతటి జటిలమైన యుద్ధ కార్యం అప్పచెప్పినా అవలీలగా నిర్వహించగల శక్తి సామర్థ్యాలు పెంపొందించుకున్నారు. జర్మన్ సైనికాధికారులతో చక్కటి అవగాహన కూడా ఏర్పడింది.

ఫీల్డ్ మార్షల్ రోమెల్ అంటే శత్రువుల గుండెలలో రైళ్ళు పరుగెడతాయి. జర్మన్ సైనికాధికారులలో ఉత్తమోత్తమమైన సైనికాధికారిగా

ఆయన ప్రసిద్ధి చెందాడు. అజాద్ హింద్ దళ సభ్యులు పొందిన శిక్షణ పరిశీలించిన తర్వాత రోమెల్ ఎంతో సంతృప్తిచెంది, వీరి నైపుణ్యాన్ని ప్రశంసించాడు.

ఫ్రాన్సులో ఉన్న పదినెలల కాలంలో ఆజాద్‌హింద్ దళం అన్ని రకాల అస్త్రాలు ప్రయోగించడంలో ఆరితేరింది. తీర రక్షణ సైనిక చర్యలకు కావలసిన తరిఫీదు లభించడానికి అనువుగా సైనికులను ఒకే జోన్‌లో ఒక స్థావరం నుంచి మరో స్థావరానికి తరచుగా మార్చడం జరిగేది. స్వేచ్ఛా భారత కేంద్రంనుంచి, అలాగే జర్మన్ సైనికాధికారుల నుంచి ఎప్పటి కప్పుడు యుద్ధరంగంలో జరుగుతున్న పరిణామాలు ఆజాద్ హింద్ సైనికులకు తెలుస్తూ ఉండేవి. జర్మన్ సైనికుల ఉధృతం తగ్గుముఖం పట్టి, వారు అనేక రంగాలలో వెనుకంజ వేస్తున్నారన్న సంగతి అవగాహనకు వచ్చింది. ఈ విషయాలు ఎప్పటికప్పుడు తెలుస్తున్నప్పటికి ఆజాద్ హింద్ దళంలో ఆత్మ విశ్వాసం చెక్కు చెదరలేదు. జర్మనీ అధికారులు కూడా దళ సభ్యులను ఏదో ఒక రీతిగా ఎక్కడో ఒక చోట యుద్ధంలో ఉపయోగించుకొందాం అన్న రీతిలో ప్రయత్నించలేదు.

కొద్దికాలంలోనే యుద్ధరంగంలో జర్మన్ల స్థితి బాగా క్షీణించింది. ఫ్రాన్సులో ఉన్న జర్మన్ పటాలాలను వెనుకకు మళ్ళించవలసినదిగా ఆజ్ఞలు జారీ అయ్యాయి. ఎప్పుడైతే జర్మన్లు వెనుకంజ వేయడం ప్రారంభించారో, ఫ్రెంచి రహస్య దళాలు తమ కార్యక్రమం ఉధృతం చేయ మొదలుపెట్టాయి. ఆజాద్ హింద్ దళానికి ఫ్రెంచి సైనికులతో తల పడాలనే ఉద్దేశం లేదు. కాని జర్మనీ వైపు తిరుగు ప్రయాణం సాగిస్తున్న తరుణంలో శత్రుసేనలు మీదపడితే ఆత్మరక్షణకు ఆ దళం సర్వ సన్నద్ధంగానే ఉంది. దళంలో మూడు బెటాలియన్ల సైనికులున్నారు. మూడు కాల్బలపు కంపెనీలున్నాయి; ఒక మెషిన్‌గన్ కంపెనీ ఉంది

ఒక ఇన్‌ఫాంట్రీ, ఆర్టిలరీ కంపెనీ ఉంది. ఒక పయనీర్స్ కంపెనీ, ఒక టాంకు ఫైటింగ్ కంపెనీ ఉన్నాయి.

## తిరుగు ప్రయాణంలో అన్నీ కష్టాలే

అజాద్ హింద్ సైనిక దళం జరిపిన తిరుగు ప్రయాణం అంత సుఖంగా ఏమీ సాగలేదు. ఎప్పటికప్పుడు శత్రు వ్యూహాన్ని ఛేదిస్తూ వెనుకకు సాగాల్సివచ్చింది. ఫ్రెంచి అజ్ఞాత దళాలూ, విప్లవ దళాలూ అడుగడుగునా దాడులు జరుపుతూ ఉన్నాయి. విమాన దాడులు కూడా ఎక్కువయ్యాయి. కాబట్టి రైలు మార్గాన వెళ్లడానికి అవకాశం లేదు. పాయిటీర్స్ ప్రాంతం చేరుకొన్నాక పది రోజులు ఆ ప్రాంతంలోనే మకాం వేయవలసి వచ్చింది. లారంటీ నదిని దాటి వెళ్లడం తప్ప మార్గం కన్పించ లేదు. ఈ పది రోజులలో దళంలోని సైనికులకు పతనం అవుతున్న పట్టణాన్ని కాపాడుకొంటూ ఆత్మరక్షణ ఏవిధంగా చేసుకోవాలో అనుభవ మైంది. మోటారుకార్లు, ట్రక్కులు, మోటార్ సైకిళ్లు, సైకిళ్లు, గుర్రపు బండ్లు ఏవి లభ్యమైతే వాటిలో ప్రయాణం సాగించడానికి ఏర్పాట్లు జరి గాయి. తమకు అందుబాటులో ఉన్న కనీస ప్రయాణ సౌకర్యాలు దృష్టిలో ఉంచుకొని అవసరమైన కొద్దిపాటి సామాగ్రిమాత్రం మూటలు కట్టుకొని, మిగిలినదంతా శత్రువులచేతిలో పడకుండా ధ్వంసం చేసి ప్రయాణం సాగిం చారు. ఈ ప్రయాణం బాగానే సాగింది కాని, ఆగష్టు 19 నాడు మాత్రం మాన్‌స్లై సమీపంలో ఫ్రెంచి విప్లవ దళాలు దాడిచేసి, అజాద్ హింద్ గస్తీ దళంలో ఒకరిని, జర్మన్ గస్తీ దళంలో ఒకరిని కాల్చి చంపారు.

వెళ్లవలసిన దారి కుణ్ణంగా గుర్తింపబడిలేదు. సాగించవలసిన ప్రయాణం చాలా కష్టనష్టాలతో కూడుకొని యున్నది. దినదినం పోయి క్షణక్షణం ఆపద ఎదురయ్యే స్థితి. మొత్తంమీద సైనికస్థితి అప్పుడు ఏ

మాత్రం సంతృప్తికరంగాలేదు. అడుగడుగునా ఎదురవుతున్న దాడులు, అలసటతో కూడిన ప్రయాణం, ఆహార పదార్థాల కొరత వీటన్నింటితో ప్రయాణం సాగిస్తున్న దళ సభ్యులకు మరో ఆలోచనకు తావు లేకుండా పోయింది. అంతవరకు అజాద్ హింద్ దళంలోని సభ్యుల పరిస్థితి బాగానే ఉంది. కాని ముందేమిటి? ఈ సమస్య పెనుభూతంలా ముందు నిలచింది. అయితే, వారిని ఆ దురవస్థ నుండి కాపాడినది ఒకే భావన—"ఏమైనా సరే భారతదేశానికి దాస్యవిముక్తి లభించేవరకు ఎన్ని కష్టాలనైనా ఎదుర్కొని తీరవలసిందే."

## బ్రిటిష్‌వారి అబద్ధపు ప్రచారం

బ్రిటిష్‌వారు తమ కుటిల నీతిని ప్రయోగించకుండా ఉండలేదు. అజాద్ హింద్ దళ సభ్యుల దృష్టిని వారి పునీతమైన ధ్యేయం నుండి మరల్చి జర్మనీ వారికి దూరం చేయడానికి కరపత్రాలు పడవేసి, గూఢచారులను పంపించి అనేక ప్రయత్నాలు చేశారు. ఈ మోసానికి గురియై ముగ్గురు సభ్యులు దళం నుండి వేరయ్యారు. అయితే వారు బ్రిటిషువారి మాటలకు మోసపోయారని తర్వాతి సంఘటనలు ఋజువు చేశాయి. ఆ విధంగా విడిపోయిన వారిని ఫ్రెంచి సైనికులు కాల్చి చంపారు. ఆవిధంగా వారు కుక్క చావు చచ్చారు. బ్రిటిష్‌వారి దుష్ప్రచారం నమ్మి, జర్మన్ సైనికులతోపాటు వెనుకకు మరలి ఉండకపోతే మిగిలిన అజాద్ హింద్ సైనికులకు కూడా ఇదే గతి పట్టేది.

అజాద్ హింద్ దళంలో చేరిపోయిన సైనికులను పారుబోతులని బ్రిటీషువారు వర్ణించారు. వాస్తవానికి వారు పారుబోతులు కారు. పొట్టగడవడానికి ఏదో ఒక వృత్తి అన్న ధోరణిలో బ్రిటిష్ సైన్యంలో చేరిన వారే. అలా చేరడంవలన జరిగే అనర్థమేమిటో పూర్తిగా తెలిసి చేరినవారు

మాత్రం కాదు. అలా కిరాయి సైనికులుగా యుద్ధంచేస్తూ జర్మన్లకు దొరికిపోయి ఖైదీలుగా పట్టుబడ్డారు. అలా పట్టుబడ్డవారికి నేతాజీ సువర్ణావకాశం కల్పించాడు. మాతృభూమి సేవలో సర్వసమర్పణ చేయడానికి కావలసిన మానసిక స్థైర్యం వారిలో కల్పించాడు. ఈ విధంగా నేతాజీ సేనలో చేరడంద్వారా వారికి ఆర్థికంగా ఎంతో నష్టం జరుగుతుందని తెలుసు. వారికే కాదు, వారి కుటుంబ సభ్యులకు కూడా ఇందుమూలంగా నష్టం వాటిల్లుతుందని తెలుసు. అంతేగాక, తిరిగి స్వతంత్ర సైనికులుగా యుద్ధభూమికి చేరితే ప్రాణనష్టం సంభవించినా సంభవించవచ్చునని తెలుసు. ఇవి అన్నీ తెలిసివుండికూడా మాతృదేశ దాస్య విముక్తికై సమర్పణాభావంతో ముందుకు ఉరికిన వారు దేశభక్తు లవుతారా, పారు బోతు లవుతారా? వారి చర్యను భారతీయులందరూ ముక్తకంఠంతో సమర్థించారే కాని బ్రిటిషువారి దుష్ప్రచారాన్ని ఎవరూ నమ్మలేదు.

## అడుగడుగునా సంకుల సమరం

ఫ్రాంసునుంచి సాగించిన తిరుగు ప్రయాణంలో ఫ్రెంచి గెరిల్లాలను అనేక సార్లు ఎదిరించవలసి వచ్చినా, వారు శక్తి యుక్తులు ప్రదర్శించి పోరాడారు. మార్గంలో ఫ్రెంచి గెరిల్లాలు కల్పించిన అడ్డంకులు తొలగించుకొంటూ, పాడుచేసిన వంతెనలు తాత్కాలికంగా మరమ్మతులు చేసుకొంటూ ఆ రోజుకు చేరాలని తాము నిర్దేశించుకున్న స్థలానికి చేరుకొనేవారు. అక్కడకు చేరిన తర్వాతనే కొంత ఆహారం, కొద్దిపాటి విశ్రాంతి తీసుకొనేవారు. ఈ తిరుగు ప్రయాణం ఆజాద్ హింద్ దళానికి నైతిక బలాన్నీ, అనుకొన్న పని సాధించగలం అన్న మనో స్థైర్యాన్ని ప్రసాదించింది. ఈ ప్రయాణంలో దళంలోని సభ్యులు కొందరు తమ ప్రాణాలు పోగొట్టుకొన్నారు కొందరు క్షతగాత్రులైనారు. అయినప్పటికీ తమ మనో నిబ్బరాన్ని కోల్పోయి ఫ్రెంచి సైనికులకు లొంగిపోవడ మనేది

పొరపాటున కూడా చేయలేదు. ఏమైనా సరే జర్మనీ చేరాలన్నదే వారి ఆశయం సెప్టెంబరు మొదటి వారంలో ఒక జర్మన్ విమాన దళంతో పాటు అజాద్ హింద్ దళం బెర్రి కాల్వ ప్రక్కనఉన్న దున్ పట్టణానికి చేరుకొంది. కాలవపైన ఉన్న వంతెనను దాటి అవతలకు పోవాలి. సాయంత్ర సమయానికి దళానికి చెందిన బెటాలియన్లు యుద్ధ సామగ్రితో వచ్చి కలుసుకొన్నాయి. ఈ ప్రదేశంలో ఫ్రెంచి సైనిక దళాలను వెనుకకు తరలి వెళుతున్న జర్మనీ సైనికులను పట్టుకోవడానికి సిద్ధంగా ఉంచారు. కాబట్టి ప్రమాదకరమైన యుద్ధానికి తలపడటం తప్ప అజాద్ హింద్ ఫౌజ్‌కి గత్యంతరం లేదు. ప్రప్రథమంగా సైకిళ్ళపై ప్రయాణం చేస్తున్న సైనికులను పంపించారు. వారి వెనుకనే ఇన్‌ఫాంట్రీ, ఆర్టిలరీ దళాలు నడుస్తాయి. ఈ లోగా జర్మన్ పటాలాలు కొన్ని ఆగ్నేయ దిశగాఉన్న కేసే నదిని దాటిపోవాలని నిర్ణయం జరిగింది. ఈ ఏర్పాట్లన్నీ జరిగేటప్పటికి బాగా చీకటి పడిపోయింది. శత్రు సైనికులు దగ్ధం చేసిన ఇళ్ళ నుంచి వెలువడుతున్న గుడ్డి వెలుగులో భారతీయ దళం వంతెన దాటడానికి సహాయత్తమైంది. అవతల ఫ్రెంచి సైనికులు కూడా జాగ్రత్తగా ఆ వంతెనకు కాపలా కాస్తున్నారు. ధైర్యశాలురు, సుశిక్షితులు అయిన అజాద్ హింద్ సైనికులు, హిందూస్తానీలో, ఆ నీరవ నిశీథిలో నిశ్శబ్దాన్ని బద్దలు కొడుతూ ఆజ్ఞలు జారీచేస్తూ శత్రుసైన్యాల తుపాకి గుండ్ల గుండా ఈదుకొంటూ ఫ్రెంచివారి రక్షణ శ్రేణిని ఛిన్నాభిన్నం చేశారు. అడుగడుగునా సాగిన ఆ సంకుల సమరంలో అజాద్ హింద్ దళంలో లెఫ్టినెంట్‌గా ఉన్న ఆలీఖాన్ గుండు దెబ్బకు గురియై అక్కడికక్కడే అసువులు బాశాడు. మరికొందరు సైనికాధికారులు, సైనికులు క్షతగాత్రులైనారు. ఈ త్యాగాలు వృధా కాలేదు. ఆ రాత్రికే దళం నదిని దాటి అవతలికి చేరుకోగల్గింది. ఫ్రెంచి సైనిక పటాలం తమ పైన బలవంతంగా రుద్దిన ఈ యుద్ధంలో అజాద్ హింద్ దళం తన యుద్ధ

శౌశలాన్ని ప్రదర్శించింది. ఆ మర్నాడు శాంకాయిన్ పట్టణంలో సకల సైనిక మర్యాదలతో ఆలీఖాన్ మృతదేహం ఖననం చేయబడింది. స్వదేశానికి ఎంతో దూర ప్రాంతంలో తమ దేశ స్వాతంత్ర్యం కోసం తనను తాను సమర్పించుకొని ధన్యుడయ్యాడు ఆలీఖాన్.

## సాహస చర్య

వారు తమ తిరుగు ప్రయాణాన్ని కొనసాగిస్తూంటే ఆకురాలుకాలం ప్రవేశించింది. ఎక్కడా నిలుపు చేయకుండా 'డిజాన్' చేరే వరకూ ప్రయాణం చేయాలని దళం అధికారులు నిశ్చయించారు. ప్రయాణం చేస్తూనే కొద్దిపాటి ఆహారం సేవించాలి. గుర్రాలకు మేత పెట్టాలి. ఎక్కడా ఆపరాదు మోటార్లపైన, సైకిళ్లపైన వెళ్ళిన సైనికులు అప్పటికే 'బాన్' చేరుకొన్నారు. ఆ ప్రదేశం చేరేసరికి దక్షిణదిశ నుంచి వచ్చిన ఫ్రెంచి సైనికులు జర్మన్ సైనికులను, ఆజాద్ హింద్ దళాన్ని అడ్డగించి నిలిచారు. ఆజాద్ హింద్ దళం ఈ ప్రదేశంలో భారీ నష్టాలకు గురి అయింది. దళంలోని సైనికులలో దాదాపు నలభై మంది మరణించడమో, క్షతగాత్రులు కావడమో, ఖైదీలుగా పట్టుబడటమో జరిగింది. ఈలోగా ఫ్రెంచి టాంకు దళం ఒకటి వీరిపైన గుళ్ల వర్షం కురిపించింది. అయితే స్వతంత్ర భారత టాంకు రక్షణ దళం సాహసోపేతంగా ఎదుర్కోనడంతో వారు కాళ్లకు బుద్ధి చెప్పారు. ఆజాద్ హింద్ దళం తన స్థావరాన్ని అత్యంత సాహసోపేతంగా కాపాడుకోగల్గింది.

ఆజాద్ హింద్ దళంలోని సైనికులు డిజాన్‌కు సమీపానగల 'చాంప్లెట్రి' ప్రదేశంలో తిరిగి కలుసుకొన్నారు శత్రుసైనికులు వెనక్కు తగ్గారు. ఆ విధంగా మన సైనికులకు ఆరోజు చక్కటి విశ్రాంతి లభించింది. అక్కడినుంచి కొద్దిరోజుల ప్రయాణానంతరం 'రెమిన్‌మాట్' చేరారు. ఈ ప్రదేశంలో జర్మన్ సైనికులు శత్రు సైన్యాన్ని ఎదిరించడానికి కావలసిన

ప్రయత్నాలు చేసుకోడంలో మునిగి ఉన్నారు. అజాద్ హింద్ దళాన్ని అక్కడ నిలపకుండా వెనుకకు సాగిపొమ్మన్నారు. రైన్ నదీ లోయ గుండా ప్రయాణం చేస్తూ చిన్న చిన్న పట్టణాలు, అడవులు దాటి 'హాగినో' సమీపానికి చేరుకొన్నారు. ఆ తర్వాత కొద్దిరోజులు ప్రయాణానంతరం 'బ్రెటీన్' సమీపానికి చేరుకొన్నారు. ఇక్కడ చాలా రోజులు మకాం చేసి మంచి విశ్రాంతి తీసుకొన్నారు. డిశంబరు 1914 లో 'హ్యూబెర్గ్' మిలిటరీ శిక్షణ కేంద్రం ఖాళీ అయింది అజాద్ హింద్ దళాన్ని అక్కడ బస చేయమన్నారు.

నేతాజీ ఆధ్వర్యంలో అజాద్ హింద్ దళం ఏర్పడి సరిగ్గా మూడు సంవత్సరాలు గడిచాయి. నేతాజీ నాయకత్వంలో తమ దేశానికి ఎనలేని సేవచేసే భాగ్యం కలిగించని, ఎన్నో మహత్కార్యాలు తమ చేతులమీదుగా జరుగుతాయని పరమ విశ్వాసంతో దళంలో చేరారు. విదేశాలలో విద్యాభ్యాసానికి తదితర వ్యాపకాలకు వచ్చిన వారితో పదిహేను మంది మొట్టమొదట నేతాజీ నాయకత్వంలో అజాద్ హింద్ దళంగా ఏర్పడ్డారు. ఆ తరువాత యుద్ధఖైదీలను క్రమంగా చేర్చుకోవడంతో ఆ సంఖ్య 3500 కు పెరిగింది ఆరోజులలో జర్మనీలో లభించే అతి శ్రేష్టమైన సైనిక శిక్షణ వారికి లభించింది. అనేక కష్టనష్టాలు భరించారు. ప్రాణాలు పోయినా సరేకాని, తాము నిశ్చయించుకొన్న ధ్యేయం నుండి విచలితులు కారాదన్న దృఢనిశ్చయంతో ఉండిపోయారు.

## యుద్ధ ఖైదీలుగా :

1945 వసంత కాలంలో మిత్ర పక్షాలు రైన్ నదిని దాటాయి. రష్యా వారు తూర్పు జర్మనీలో ప్రవేశించారు. అనేక మందిని ఊచకోత కోశారు. పట్టణాలను విధ్వంసం చేశారు. అనేక మంది జర్మన్లు అక్కడి నుంచి కాందిశీకులుగా పశ్చిమ జర్మనీ చేరారు. ఇక సైనిక శిబిరంలో

తలదాచుకొనే ప్రయోజనం లేదని అజాద్ హింద్ దళం నిశ్చయించుకొంది. 1945మార్చిలో హ్యూబెర్గ్ను విడిచి ఆల్ప్పైన్ కనుమలగుండా ప్రయాణమై కదిలిపోయారు.అత్యంత దయనీయమైన ప్రయాణం ఇది. అయితే జర్మనీ ప్రజలు మాత్రం వారికి ఉన్నదానిలోనే కొంత వీరికి పెడుతూ ఎంతో ఆదరణతో చూచారు అది ఒక్కటే ఆ ప్రయాణంలో తమకు సంతోషం కల్గించిన విషయం. స్వేచ్ఛా భారత కేంద్రంతోనూ, బెర్లిన్‌తోనూ వారి సంబంధాలు ఇప్పుడు పూర్తిగా విచ్ఛిన్నమైపోయాయి. దళాన్ని నడుపుతున్న అధికారులే ఇప్పుడు నిర్ణయాలు తీసుకోవలసిన స్థితి ఏర్పడింది. ఆల్ప్పైన్ కనుమల గుండా ప్రయాణం చేస్తూ 'బోడెన్సీ'కి తూర్పు దిశన చేరుకొన్నారు. అక్కడినుంచి స్విట్జర్లాండ్ చేరడానికి మంతనాలు జరిపారు. కాని ఈలోగా మిత్రసైన్యాలు ఆ ప్రాంతానికి చేరుకొన్నాయి.

మే 7, 1945 నాడు జర్మన్లు బేషరతుగా లొంగిపోవడం చేత యుద్ధం పరిసమాప్తమయింది. జర్మనీ సైనికులతోపాటు అజాద్ హింద్ సైనిక దళం కూడా యుద్ధ ఖైదీలుగా పట్టుబడ్డారు. ఓటమిచేత నిరాశ చెంది ఉన్నప్పటికి తమ కర్తవ్యాన్ని తాము నిర్వహించామన్న సంతృప్తితో గర్వంగా తలలు ఎత్తుకొనే లొంగిపోయారు. ఎటో పారిపోయి తలదాచుకోవాలనే ప్రయత్నం చేయలేదు. వారిని జర్మనీ నుండి ఢిల్లీలోని ఎర్రకోటకు తరలించారు. తూర్పు ఆసియాలో బ్రిటీషు సైన్యాలతో పోరాడిన సోదరులు కూడా అక్కడ వారిని కలిశారు. ఆ తరువాత ఎర్రకోటలో జరిగిన చరిత్రాత్మక విచారణకు నిలిచారు.

* * *

బెర్లిన్‌లో నిర్మాణం చేసుకొన్న సైన్యం భారత స్వాతంత్ర్య పోరాటానికి వినియోగించేందుకే కాని జర్మనీ తరఫున యుద్ధం చేయడానికి కాదని నేతాజీ మొదటి నుండి స్పష్టంగా చెపుతూ వచ్చాడు. హిట్లర్

సోవియట్ రష్యాపైకి సైన్యాలు పంపడానికి ఉద్యుక్తుడు కావడంతో నేతాజీ పథకం మార్చుకోవలసి వచ్చింది. జర్మనీకి, సోవియట్ యూనియన్‌కు మధ్య మైత్రీ పూర్వక సంబంధాలు నెలకొన్నట్లయితే వాయవ్య సరిహద్దు గుండా తన సైన్యంతో భారత దేశంలోనికి చొచ్చుకు రావాలన్న ఆశతోనే జర్మనీలో అజాద్ హింద్ సేన నిర్మాణానికి సుభాస్ పూనుకొన్నాడు. ఆ ఆశ వమ్ము అయింది. అందుచేతనే తూర్పు ఆసియాను కార్యక్షేత్రంగా పెట్టుకొని పని చేయాలనే కోర్కె బలపడింది. ప్రయాణానికి ఎంత గట్టిగా ప్రయత్నం కొనసాగించినప్పటికి ఒక సంవత్సరం కాలం వృథా కానే అయింది. అప్పటికైనా మొండిగా స్థిర సంకల్పంతో ఎంతటి సాహసానికైనా ఒడికట్టేందుకు సిద్ధపడటంతో ప్రయాణం నిశ్చయమైంది.

# రక్త తర్పణం

భారత సరిహద్దుల్లో
పూరించిన నీ శంఖారావం
ప్రతిధ్వనించింది ప్రపంచమంతా
పిక్కటిల్లాయే! ఎల్ల దిక్కులు
మహోధృతంగా - మహోధృతంగా
స్వేచ్ఛా ఝంఝు వీచింది
తెల్లవారి పని తెల్లవారింది.

## సాహస యాత్ర

బెర్లిన్‌నుండి నేతాజీ టోక్యోకు వెళుతున్నాడన్న వార్త అతి గోప్యంగా ఉంచబడింది. జర్మన్ నావికాధికారులు జపాన్ అధికారులు ఎంతో నేర్పుతో ఈ ప్రయాణ సన్నాహాలు నిర్వహించారు. జెట్ విమానాల యుగంలో అన్ని పరిస్థితులు అనుకూలంగా ఉంటే బెర్లిన్‌కు టోక్యోకు మధ్య ప్రయాణం ఇరవై గంటలే. కాని సంక్లిష్టమైన వాతావరణంలో అడుగడుగునా ఎదురయ్యే ప్రమాదాలను తట్టుకొని ఎన్నో జాగ్రత్తలు తీసుకుంటూ ప్రయాణం సాగించిన కారణంగా నేతాజీకి ఆ సముద్ర ప్రయాణం 90 రోజులు పట్టింది. జలాంతర్గామిలో నేతాజీ చేసిన ఈ ప్రయాణం ఒక మహాద్భుత విషయంగా అనేకమంది నావికాదళాధికారులు వర్ణించారు. రెండో ప్రపంచ యుద్ధం మొత్తంలో ఇలాంటిది మరో ఉదాహరణం లేదు.

1943 ఏప్రిల్ 20 నాడు జపాన్ జలాంతర్గామి 1-29 పెనాంగ్ గుండా బయలుదేరింది. శత్రు ఓడలను విధ్వంసం చేయడానికి పోతున్న

మిషతో. అయితే అలా బయలుదేరేప్పుడు మామూలు నౌకాదళ సిబ్బంది వెళతారే కాని జలాంతర్గాముల సమూహాధికారి కెప్టెన్ మసావో టెరోకా ఆ జలాంతర్గామిలో ఎందుకు ప్రయాణం చేస్తాడు? పెనాంగ్ రేవులో పని చేస్తున్న భారతీయ రేవు కార్మికులకు ఈ అనుమానం పీడించ సాగింది. అదీకాక ఈ జలాంతర్గామిలో భారతీయుల తినుబండారాలు తయారు చేయ డానికి పనికి వచ్చే పదార్థాలు చాలా తీసుకుపోతున్నారన్న వార్త కూడా పొక్కింది. ఆ మర్నాడు ఈ వార్త చిలువలు పలువలై 'నేతాజీ ఇక్కడికి వస్తున్నాడు' అని చాలా మంది నోట వినిపించే దశకు చేరింది. ఆ ప్రాంతంలో కాస్త గడుసైన బ్రిటిష్ గూఢచారి ఎవడూ లేకపోబట్టి సరి పోయింది కాని లేకపోతే కెప్టెన్ టెరోకా, నేతాజీ ఇద్దరూ ఏ చిన్నపాటి విమానదాడి జరిగినా దొరికిపోయేవారే.

మొజాంబిక్ ఛానల్‌లో పోర్చుగీసు తటస్థ ప్రాంతానికి జలాంతర్గామి I-29 ఏప్రిల్ 26 వ తేదీన అనుకొన్నదానికంటె పది గంటలు ముందుగా చేరింది. ఈ ప్రదేశం మెడగాస్కర్‌కు సుమారు 400 నాటికల్ మైళ్ళ దూరంలో ఉంది జలాంతర్గామిలో ఉన్న నౌకాదళ సిబ్బందికి అసలు అక్కడికి ఎందుకు వచ్చినది అప్పుడు తెలియజేయబడింది. ఈ జలాంత ర్గామికి జూఇచి ఇజూ కెప్టెన్‌గా ఉన్నాడు. జర్మనీ నుండి రావలసిన జలాంతర్గామి కోసం వారు ఎదురు చూస్తూ నిలబడ్డారు. ఇంతలో ఆ మసక చీకటిలో ఒక చిన్న జలాంతర్గామి ఉనికి తోచింది. అది జర్మన్ యు-బోటు అని గుర్తించడానికి ఎంతోసేపు పట్టలేదు. అయితే ఆ చీకటిలో జర్మన్ యు-బోటు నుంచి జపాన్ జలాంతర్గామిలోనికి మనుషులు మారడం అంటే సాధ్యమయ్యే పనికాదు. జపాన్ బోటులోని నౌకా సిబ్బంది ఆ రాత్రంతా ప్రయత్నం చేస్తూనే ఉన్నారు కాని వీలుపడలేదు. ఇంతలో తెల్లవారింది. తీరా చూస్తే సముద్రం పోటు తీవ్రంగా ఉంది. రెండు బోట్లు సమీపానికి చేరడానికి కూడా వీలులేకుండా ఉన్నాయి

అలలు. పోసీ వైర్‌లెస్ ద్వారా మాట్లాడదామా అంటే ఎక్కడైనా అది శత్రువుల చెవిన పడిందంటే ప్రమాదం ముంచుకు వస్తుంది. రెండు బోట్లలోని నావికులు దిక్కుతోచని స్థితిలో పడ్డారు. జపాన్ బోటు I-29 ఉత్తర దిశగా ప్రయాణం చేస్తోంది. జర్మన్ బోటు దాన్ని అనుసరించి ప్రక్కనే ప్రయాణం చేస్తోంది. ఇంజన్లు ఆపుచేసి ఇంధనం పొదుపు చేసుకోవడానికి కూడా వీల్లేదు శత్రువులు కంటపడితే వెంటనే నీటిలోనికి మునిగిపోవడానికి వీలుగా ఉండాలి కాబట్టి ఇంజన్లు ఆపుచేసే ప్రసక్తి లేదు. ఇలా కొన్ని గంటలు గడిచాయి. ఆ జలాంతర్గాముల పైనున్న నావికులకు కొన్ని యుగాలు గడిచిపోతున్నట్లనిపించింది. అన్ని గంటలు సముద్ర ఉపరితలంలో తిరుగాడుతున్న జలాంతర్గాములు శత్రువుల కంట పడకపోవడం మహాదృష్టం. ఒకవేళ శత్రు విమానాలు చూసి ఉన్నప్పటికి, ఇంత మరీ బరితెగించి తిరుగాడుతున్న జలాంతర్గాములు తమవే అనుకొని వదిలేసి ఉండవచ్చుకూడా.

మళ్ళీ సూర్యాస్తమయ వేళ సమీపిస్తోంది. జపాన్ బోటులోని నావికులు విస్తుపోయే దృశ్యం కంటపడింది జర్మన్ బోటు నుండి ఇద్దరు నావికులు సముద్రంలోనికి దూకేశారు ఆత్మహత్యా సదృశ్యమైన చర్య ఇది. అయినా గత్యంతరంలేక వారు అలా చేశారు. అతి చాకచక్యంగా ఈదుకుంటూ జపాన్ బోటు చెంతకు చేరగానే, జపాన్ నావికులు త్రాళ్ళువేసి ఆ సాహసవంతులను పైకి చేదుకొన్నారు. ఆ ఇద్దరు జర్మన్లలో ఒకరు అధికారి, మరొకరు సిగ్నల్‌మన్. ఆ ఇద్దరూ జపాన్ నావికులతో తమవద్ద పరిమితంగా ఇంధనం ఉన్నదనీ, ఎక్కువకాలం సముద్ర ఉపరితలంలో తమ యు-బోటు తిరుగాడజాలదనీ, కాబట్టి ఆ విధమైన సాహసం చేయవలసివచ్చిందని చెప్పారు. సిగ్నల్‌మాన్ చేతులూ ఊపుతూ యు-బోటుకు సంకేతం పంపించడం ప్రారంభించాడు. రెండు జలాంతర్గాములు ఈశాన్య దిశగా మరో 12 గంటలు అలాగే ప్రయాణం చేయవలసి

వచ్చింది. మళ్ళీ తెల్లవారింది. క్యాలండర్ ఏప్రిల్ 28 చూపెట్టింది. సముద్రం ప్రశాంత స్థితికి వస్తుందన్న ఆశ కనబడలేదు. అప్పుడు జర్మన్లు ఒక రబ్బరు బల్లకు గట్టి త్రాళ్ళు బిగించి సముద్రంలోనికి వదిచారు. ఆ రబ్బరుబల్ల సహాయంతో మోకులు పట్టుకొని జర్మన్ యు-బోటు లోని ప్రయాణికులు జపాన్ బోటులోకి చేరాలి. సముద్రంలో ఉవ్వెత్తున అలలు లేస్తున్నాయి. చిన్న చిన్న ఓడలను అమాంతం మించివేయగల్గిన షార్క్ చేపలు తిరుగాడుతున్నాయి. ఆ పరిస్థితిలో త్రాడు పట్టుకొని ప్రాకుతూ ఒక చోటునుండి మరో చోటుకు చేరడం అంటే అతి సాహసవంతమైన పని. ప్రాణాపాయ పరిస్థితి అని తెలిసికూడా భగవంతునిపైం భారంవేసి అందుకు సిద్ధపడటం తప్ప గత్యంతరంలేదు. నేతాజీ తన సహచరుడైన అబీద్ హసన్‌తో పాటు ఆ రబ్బరు బల్లమీదకు చేరి, త్రాళ్ళు పట్టుకొని ప్రాకడం ప్రారంభించాడు. ఇద్దరూ సముద్ర జలాంలో పూర్తిగా తడిసిపోయారు. ఎలాగైతేనేం, అదృష్టం బాగుండి జపాన్ బోటులోకి ఎక్కగలిగారు. ఆ చిన్న జపాన్ జలాంతర్గామిలోకి చేరగానే రొప్పుకొంటూ జర్మన్లకు ధన్యవాదాలు చెప్పాడు నేతాజీ. తక్షణమే జర్మన్ యు-బోటు వెనుకకు తిరిగింది. జపాన్ నావికులు వారికి 'ఆఫ్ వడర్ షే' అంటూ వీడ్కోలు చెప్పారు.

శత్రువుల నౌకాదళం, విమాన దళం కాపలా కాస్తున్న సముద్ర జలాలలో అంతటి సాహస చర్యకు ఉద్యమించటం ఒక మహాద్భుత విషయం. అసలు రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ఒక జలాంతర్గామి నుండి మరో జలాంతర్గామిలోనికి మనుషులను బదిలీ చేయడం అనేది అదే మొదటిసారి, అదే ఆఖరిసారి కూడా!

నేతాజీ జపాన్ బోటులోనికి చేరిన మర్నాడు, అనగా 1943 ఏప్రిల్ 29 నాడు, జలాంతర్గామిలోనివారు విందు చేసుకొన్నారు! ఆ రోజు జపాన్ చక్రవర్తి పుట్టినరోజు కావడం, తమ ముఖ్య అతిథి నేతాజీ ఆ బోటులోనికి సురక్షితంగా చేరడం రెండూ కలిసివచ్చాయి. వంటవారు పెనాంగ్ నుండి సేకరించి తెచ్చిన ద్రవ్యాలతో భారతదేశపు విందు భోజనం తయారుచేశారు. నేతాజీ, ఆయన అంగరక్షకుడు తమ అలసట అంతా మర్చిపోయారు. చాలా సంతోషంగా ఉల్లాసంగా మాట్లాడుతూ విందు సేవించారు. కెప్టెన్ టెరోకా నేతాజీకోసం కేబిన్ ఖాళీచేసి ఇచ్చాడు. ఆ ఇరుకైన జలాంతర్గామిలో ఎక్కువగా తిరగడానికి స్థలం లేకపోయినా కొద్దిపాటి వ్యాయామం మాత్రం చేయగలిగారు. శరీరానికి ఏ మాత్రం శ్రమ లేని కారణంగా ఆహారం తీసుకోవాలంటే ప్రాణం మీదకు వచ్చినట్లుండేది.

జలాంతర్గామి బ్రిటిష్‌వారి కాపలా పరిధిని దాటగానే పెనాంగ్ నుంచి రేడియో వర్తమానం అందింది. జలాంతర్గామి మార్గాన్ని మార్చి సుమత్రాకు దక్షిణంగా ఉన్న ఓ చిన్న ద్వీపం సెబాంగ్‌కు ప్రయాణీకులను చేర్చవలసిందిగా ఆ వర్తమానంలో తెలియజేశారు. పెనాంగ్‌లో నేతాజీ రాకకు సంబంధించిన వార్త పొక్కింది అందరూ అదే చెప్పుకొంటున్నారు ఆ సమయంలో ఆయనను అక్కడకు తీసుకురావడం క్షేమం కాదని భావించి అలా మార్గం మార్చారు. జలాంతర్గామి 1-29, 1943 మే 6 న సెబాంగ్ చేరింది. సముద్ర ఉపరితలానికి చేరిన జలాంతర్గామిపైన నావికులతో పాటుగా నేతాజీ ఫోటో తీయించుకొన్నాడు. ఒక కాపీపైన సంతకం చేసి ఇలా వ్రాశాడు—

'ఈ జలాంతర్గామిపైన ప్రయాణం నాకెంతో ఆనందాన్ని కల్గించింది. ఈ వసతి సమకూర్చినందుకు జపాన్ ప్రభుత్వానికి కృతజ్ఞాభివందనాలు తెలియజేస్తున్నాను. ఈ ప్రయాణంలో నా పట్ల, నా అంగ

మండలం వరకు ఎదిగినాడు. ఇక ఆ తరువాతి పెరుగుదలను ఒక జాలాన్ని ప్రదర్శించినట్లుగా పోతన ఈ పద్యంలో చూపినాడు.

బ్రహ్మాండాన్ని నిండుతూ విక్రమిస్తున్న వామనమూర్తికి మనం ఉపమానంగా చెప్పదలచుకుంటే సూర్యబింబాన్ని తగిన గొడుగుగా మారిందీ అని చెప్పవచ్చు. ఆ తరువాత ఆయన తల ధరించే రత్నంగా ప్రకాశించింది. మరికొంత సేపటికి చెవికి పెట్టుకునే ఆభరణ విశేషమైన కుండలంగా మారింది. ఇంకా కొంత సేపటికి కంఠాభరణమై పోయింది. చూస్తుండగనే ఆ సూర్యబింబము దండచేతికి పెట్టుకునే దండపట్టిగా, ముంజేతి కడియంగా, మొలను కట్టే పట్టుబట్టగా, కాలి కడియంగా, చివరకు పాదపీఠంగా మారిపోయింది అంటూ చెప్పినాడు.

ఈ పద్యములో పోతన త్రివిక్రమ స్ఫూర్తికి తగిన అలంకార విశేషాలన్నీ ఒక్కొక్కటే తప్పక చెప్పినాడు. సూర్య బింబం ఒక్కటే వామనమూర్తి ఆయా అంగాలను ఆశ్రయిస్తూ ఆయా ఆభరణ విశేషాలుగా పరిణమించింది. తొలుత వామనుడు సూర్యబింబంకన్న కొంత క్రిందికి ఉన్నాడు. అప్పుడా బింబం వామనునికి విడలేని అలంకారమైన గొడుగైంది. తరువాత ఆ సూర్యుడు మరి కొంత దగ్గర పడగా శిరోలంకారము ఐనాడు. విష్ణువు పైకి విక్రమిస్తూ ఉంటే రవిబింబం తరతరాలుగా కిందికి దిగుతూ ఉన్నట్లు గోచరింప చేస్తుంది కాని ఇక్కడ రవిబింబం మాత్రం ఉన్నతావునే ఉంది. ఎదుగుతున్నవాడే వామనుడు. సూర్యుడు తేజోమూర్తి. అంతేకాదు, ఈ ప్రకాశమే వామనమూర్తి అంగాలల్లో అలంకారాదులుగా భాసించింది. త్రివిక్రమునికి

## టోక్యోకు ప్రయాణం

అయిదు రోజులు గడిచాక నేతాజీని ఎక్కించుకు వెళ్ళడానికి ఒక విమానం సెలాంగ్‌కు చేరింది. అది చాలా చిన్న యుద్ధ విమానం. అనేక చోట్ల ఇంధనం కొరకు దిగింది. పెనాంగ్, సైగాన్, మనీలా, తేపై, హమామస్తులలో రాత్రిపూట అంతా మకాం చేసింది. 1943 మే 16 నాడు టోక్యోకు చేరుకొంది. అక్కడ దిగిన వెంటనే నేతాజీని ఇంపీరియల్ హోటల్‌కు తీసుకువెళ్ళారు. ఇది రాజభవనానికి, ప్రధాన మంత్రి కచేరికి చాలా సమీపంలో ఉంది. నేతాజీ రాకను రహస్యంగానే ఉంచటం జరిగింది. అందుచేత ఆయనను మట్‌సుడా అనే మారుతో పిలిచారక్కడ.

మే 17 తర్వాత జపాన్ సైనిక దళాధిపతిని, నౌకాదళాధిపతిని, విదేశాంగ మంత్రిని వెంట వెంటనే నేతాజీ కలవడం జరిగింది. అయితే ఇవి కేవలం మర్యాద పూర్వక కలయికలే కాని విషయాలు చర్చించుకొనేందుకు ఏర్పరచిన సమావేశాలు కావు. జపాన్ ప్రధాని టోజోను కలవాలని నేతాజీ కోరినప్పుడు, పని ఒత్తిడి కారణంగా టోజో ఇప్పుడెవరినీ కలుసుకొనేందుకు సిద్ధంగా లేడు' అనే వర్తమానం చేరింది. పనుల ఒత్తిడి ఎప్పుడూ ఉండేదే, అదే ముఖ్య కారణమనడానికి వీలులేదు. టోజో ఆ సమయంలో తనను కలుసుకొనేందుకు ఇష్టపడలేదన్న విషయం నేతాజీ గ్రహించాడు. ఆ తర్వాత 20 రోజులు ఎదురు చూడవలసివచ్చింది. అన్ని కష్టాలకు ఓర్చి జపాన్‌కు చేరిన భారతీయ నాయకునిపట్ల టోజో అంత మొరటుగా ఎందుకు ప్రవర్తిస్తున్నాడన్న విషయం ఎవరికీ అర్థం కాలేదు. అయితే పనుల ఒత్తిడి అన్న కారణం బొత్తిగా తీసివేయవలసింది మాత్రం కాదు. యుద్ధభూమిలో జపాన్ ఎదుర్కొంటున్న అపజయాలు, ఇతరత్రా సంభవిస్తున్న పరిణామాలు టోజోకు తీరిక లేకుండా చేశాయన్నది వాస్తవం. అంతకు ఆరు నెలలకు పూర్వం జర్మన్ సేనలు స్టాలిన్

గ్రాడ్ నుండి ఉపసంహరించుకొన్నప్పుడు టోజో బాధపడ్డాడు. కాని అంతకంటె ఎక్కువగా ఆఫ్రికా ఖండంలో ఇటలీ, జర్మన్ సైనికుల పరాభవం టోజోను ఎక్కువగా కృంగదీసింది. రెండవ ప్రపంచ యుద్ధంలో తన మార్చి ముందు టోజో జర్మనీ బలాన్ని చాలా ఎక్కువగా అంచనా వేసుకోవడమే దీనికి కారణమని కొందరు చరిత్రకారులు వ్రాశారు. జపాన్ ప్రజల అసంతృప్తిని పరికించి టోజో పరితాపం చెందాడు. ఆ తరుణంలో నేతాజీతో ఏమి మాట్లాడాలో తెలియని స్థితిలో పడ్డాడు. అంతకుముందున్న అనుభవందృష్ట్యా భారతీయ నాయకుల పట్ల టోజోకు సద్భావం లేదు.

భారత స్వాతంత్ర్య పోరాటానికి సంబంధించి జపాన్‌లో ఉండి రాస్‌బిహారి బోస్ గణనీయమైన కృషి చేశాడు. సింగపూర్‌లోనూ, బాంకాక్‌లోనూ ఇతర భారతీయ నాయకులు చేసిన కృషి రాస్ బిహారి పనికి చేయూత నిచ్చింది. అమర్‌సింగ్ నాయకత్వంలో ప్రీతమ్‌సింగ్ సహాయంతో బాంకాక్‌లో ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ పేరిట అజ్ఞాతంలో పని ప్రారంభమైంది. భారత స్వాతంత్ర్య సముపార్జనకు దోహదం చేయడమే ఈ సంస్థ కార్యక్రమం. హాంకాంగ్, షాంగై, టోక్యో, బెర్లిన్‌లలో కూడ వీరి స్నేహితులు పని ప్రారంభించారు. బాంకాక్‌లో జపాన్ సేనాధిపతిగా ఉన్న తామురాతో అమర్‌సింగ్, ప్రీతంసింగ్‌లకు సన్నిహిత సంబంధాలుండేవి. జపాన్ సేనల అధీనం కాక ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ స్వతంత్రంగా పోరాటం సాగిస్తుందని, కేవలం భారతదేశ స్వాతంత్ర్యం కొరకే ఈ పోరాటం సాగుతుందని ప్రీతంసింగ్ స్పష్టం చేశాడు. జపాన్‌వారు చేయవలసిందల్లా వీరికి కావలసిన ఆయుధ సామగ్రి, వనరులు సమకూర్చడమే.

18, డిశంబరు 1941 నాడు బ్రిటన్, అమెరికాలపై యుద్ధం ప్రకటించాక జపాన్‌వారికి ఇండియన్ ఇండిపెండెన్స్ వలంటీర్ ఆర్మీ

(భారత స్వాతంత్ర్య స్వచ్ఛంద సేన) తో కలిసి పనిచేయక తప్పలేదు. భారత స్వాతంత్ర్య స్వచ్ఛంద సేనా, జపాన్ సేనా కలిసి శత్రువుపైన అనేక ముట్టడులు కొనసాగించడం, శత్రు సేనను బందీలుగా పట్టుకొని ఆ యుద్ధఖైదీలనుంచి భారత స్వాతంత్ర్య పోరాటానికి సంసిద్ధమైన వారిని తమలో కలుపుకోవడం జరిగింది. అలా మనసు మార్చుకొని వీరితో చేరిన వాడే కెప్టెన్ మోహన్‌సింగ్. తమ సేనను భారత స్వచ్ఛంద సేన అని పిలవడం అతనికి ఇష్టం లేదు. ఇండియన్ నేషనల్ ఆర్మీ (భారత జాతీయ సేన) అని పిలవాలని పట్టుపట్టాడు. ఇందుకు అందరూ అంగీకరించారు. మోహన్‌సింగ్ ఇంకా కొన్ని ప్రతిపాదనలు కూడా చేశాడు. భారత యుద్ధఖైదీలపై పూర్తిగా ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్, ఇండియన్ నేషనల్ ఆర్మీకే అదుపు ఉండాలనీ, ఐ.యన్.ఏ.ను జపాన్ సేనలతో కలిసి పనిచేస్తున్న ఒక స్వతంత్ర సేనగా గుర్తించాలనీ, యుద్ధం పరిసమాప్తమైన తర్వాత భారతదేశం పూర్తిగా స్వతంత్ర దేశం కావాలనీ, కాందిశీకులుగా వెళ్ళిపోయిన తూర్పు ఆసియా భారతీయుల ఆస్తి ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ స్వాధీనం కావాలనీ షరతులు పెట్టాడు. జపాన్ ప్రభుత్వం ఈ షరతులకు అంగీకరించలేదు.

ఐ. యన్. ఏ. ప్రాబల్యం బాగా పెరిగింది. భారత యుద్ధ ఖైదీలలో 45,000 మంది ఐ.యన్.ఏ. లో చేరారు. ఆగ్నేయాసియా భారతీయులు బాంకాక్‌లో సమావేశమై. మే 15, 1942 నాడు రాస్‌బిహారి బోస్‌ను అధ్యక్షుడుగా ఎన్నుకొన్నారు. 60 సూత్రాల పథకం ఒకటి జపాన్ ప్రభుత్వానికి సమర్పించాలని నిర్ణయించారు. ఈ బాంకాక్ సమావేశం జరిగిన తీరు జపాన్ వారికి నచ్చలేదు. బ్రిటిష్ సేనలను భారతదేశం నుంచి తరిమివేయడానికి జపాన్ తక్షణ చర్యలు తీసుకోవాలని ఈ సమావేశం చేసిన తీర్మానం వారికి నచ్చలేదు. దానితో జపాన్ ప్రభుత్వానికీ, భారతీయ నాయకులకు మధ్య అనుమానాలు పెరిగాయి. భారతీయ నాయక

ల్లో కూడా విభేదాలు పొడసూపాయి. రాస్ బిహారి బోస్‌ను జపాన్ వారి కీలుబొమ్మగా కొందరు చిత్రించారు. బ్రిటిష్‌వారి దుష్ప్రచారం కొంతవరకు దీనికి తోడైంది. ఈ సమయంలోనే మోహన్‌సింగ్ భారత జాతీయ సేన సంఖ్యను విపరీతంగా పెంచాలనే ప్రతిపాదన చేశాడు. రెండున్నర లక్షల మందిని చేర్చుకొంటానన్నాడు. దానివలన జరిగే అనర్థాలు ఊహించి జపాన్‌వారు అందుకు అంగీకరించలేదు. కొన్ని ఆరోపణల కారణంగా కల్నల్ యన్.యస్. గిల్‌ను జపాన్‌వారు అరెస్టు చేయడాన్ని పురస్కరించుకొని మోహన్‌సింగ్ జపాన్ వారిపై తిరుగుబాటు జరిపాడు. 1942 డిశంబరు 21 నాడు మరో ఇద్దరు సభ్యులతోపాటు సమితి సభ్యత్వానికి రాజీనామా సమర్పించాడు. రాస్‌బిహారి బోస్, మోహన్‌సింగ్‌లు ఒకరి నొకరు దూషించుకోసాగారు. రాస్‌బిహారిబోస్ సమక్షంలో మోహన్‌సింగ్‌ను కల్నల్ ఇవాకురో ఆఫీసుకు పిలిపించి కొన్ని షరతులపై సంతకం చేయ మన్నారు. మోహన్‌సింగ్ తిరస్కరించాడు. వెంటనే రాస్ బిహారి బోస్, మోహన్‌సింగ్‌ను అధికారం నుంచి తొలగించి అతని స్థానంలో లెఫ్టినెంట్ కల్నల్ భోన్‌స్లేను నియమించాడు. ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్‌ను, ఐ.యన్.ఏ.ను మార్పులు, చేర్పులతో పునర్నిర్మించారు అయినప్పటికి వార్ధక్యంవలన కానీ, చొరవలేని కారణంగా కానీ, ఐ. యన్. ఏ. ను రాస్ బిహారి బోస్ సమర్థవంతంగా నడిపించలేక పోతున్నాడన్న భావన జపాన్ వారి మనస్సులలో ఉంది రాస్ బిహారిని నొప్పించకుండా నాయకత్వంలో మార్పు తీసుకురావాలనేది వారి కోరిక. సుభాస్ బోస్ తూర్పు ఆసియాకు రావాలనే నిర్ణయం జరిగాక ఆయనకు నాయకత్వం వప్పచెపితే బాగుంటుం దనే కోరిక కూడా జపాన్ అధికారుల్లో చాలా మందికి కలిగింది. ఒకసారి అగ్రశ్రేణి సైనికాధికారులు సమావేశమై ఉన్న తరుణంలో 'నేతాజీ జపాన్‌కు రావాలని కోరుకొంటున్నాడు. ఆ విషయంలో మీ అభిప్రాయం ఏమిటి?' అంటూ రాస్ బిహారీని అడిగారు. 'పుట్టుకతోనే నేతాజీ నాయకు

లకు నాయకుడు. నా వద్దనుంచి బాధ్యత స్వీకరించడానికి అతడు ముందుకు వస్తే సంతోషంగా అప్పగిస్తాను' అని సమాధానం చెప్పాడు రాస్ బిహారి బోస్. ఆ విధంగా నేపథ్యం సిద్ధం చేశారు. ఇంత కథ నడిచాక కూడా నేతాజీతో మాట్లాడటానికి టోజో ముందు వెనకలు ఆలోచిస్తూనే కూర్చు న్నాడు. నేతాజీతో మాట్లాడటం అంటే అవసరమైతే భారతదేశంపైకి జపాన్ సైన్యాలను పంపించవలసినదిగా చేసే అభ్యర్థనను గూర్చి ఆలో చించడమే అవుతుంది. ఇందులో చాలా చిక్కులు ఎదుర్కొవలసి ఉంటుంది. కాబట్టి ఎటూ తేల్చుకోలేని స్థితిలో సైనికాధికారులు, ఇతర పెద్దలు తెచ్చిన ఒత్తిడిని కాదనలేక 1943 జూన్ 10 నాడు నేతాజీని కలుసుకోవడానికి టోజో ఒప్పుకొన్నాడు.

ఈ ఇరవై రోజుల విరామం వృథా కాలేదు. ఈ సమయంలో జపాన్‌లోని రాజకీయ స్థితిగతులను అవగాహన చేసుకొనేందుకు నేతాజీకి వీలు చిక్కింది. టోజో వ్యక్తిత్వానికి సంబంధించిన అనేక విషయాలు కూడా తెలుసుకోగలిగాడు. నేతాజీ టోజోను కలుసుకోవడానికి కొద్ది రోజుల ముందే రాస్‌బిహారీబోస్ నేతాజీని కలుసుకొని, తూర్పు ఆసియాలో భారత స్వాతంత్ర్యోద్యమ నాయకత్వాన్ని ఆయనకు ఒప్పచెప్పడం జరి గింది. ఎంతో కాలంగా జపాన్‌లో నివస్తూ వచ్చిన రాస్‌బిహారి జపాన్ సైనిక పరిస్థితిని, టోజో వ్యక్తిత్వాన్ని నేతాజీకి వివరంగా తెలియజేశాడు.

## టోజోతో సమావేశం

టోజోతో జరిగిన ప్రథమ సమావేశంలో నేతాజీ చాలా హుందాగా ప్రవర్తించాడు. టోజో ఆలోచనలను అంచనా కడుతూ, అతడుపయో గిస్తున్న భాషను గమనిస్తూ, ప్రతి కదలికనూ పరిశీలన చేస్తూ తాను చెప్పవలసినది ఎలాంటి తొట్రుపాటు లేకుండా చెప్పాడు. మన పూర్వులు చెప్పనే చెప్పారు కదా-

సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్
నబ్రూయాత్ సత్యమప్రియం
ప్రియంచ నానృతం బ్రూయాత్
ఏష ధర్మ స్సనాతనః.

అవతలవాడి మనస్సు కష్టపెట్టకుండానే నేర్పుగా తాను ఎందుకు వచ్చినదీ తెలియజెప్పాడు. భారతదేశానికి పట్టిన పరపీడన తొలగించడమే తన ఆశయం అని స్పష్టం చేశాడు. ఈ సమావేశంలో లోతుగా చర్చలు జరగక పోయినప్పటికీ, మళ్ళీ నాల్గు రోజుల తర్వాత నేతాజీతో సమావేశానికి టోజో అంగీకరించాడు.

రెండవ సమావేశంలో భారతదేశ స్వాతంత్ర్యానికి సంబంధించిన విషయాలూ, తూర్పు ఆసియా బృహత్ ప్రగతి పథకానికి సంబంధించిన విషయాలూ వివరించడానికి టోజో ఎక్కువ సమయం తీసుకొన్నాడు. అంతా విన్న తర్వాత నేతాజీ సూటిగా అసలు విషయాన్ని కదిపాడు. 'అవసరమైతే భారతదేశ విముక్తికి జపాన్ సైన్యాలను పంపించడానికి మీరు సిద్ధంగా ఉన్నారా?' అని అడిగాడు. ఒక్కసారిగా టోజో గొంతులో వెలక్కాయ పడినట్లయింది. సమావేశంలో ఉన్న తన విదేశాంగ మంత్రి వైపు చూశాడు. చాలాసేపు మౌనంగా ఉన్న తర్వాత నోరు విప్పాడు. "ఉన్న పళాన అలాంటి ముఖ్యమైన విషయంలో సమాధానం చెప్పడం కష్టం. వ్యూహరీత్యానూ, రాజకీయపరంగానూ ఎన్నో సమస్యలు ఇమిడి ఉన్న ప్రశ్న ఇది" అని సమాధానం చెప్పాడు టోజో. ఇక అంతకుమించి ఆ విషయాన్ని నేతాజీ ప్రస్తావించదలుచుకోలేదు. 'మంచిది, అలాగేనండి' అని ఊరుకున్నాడు. అయితే ఈ రెండవ సమావేశం నేతాజీకి మరో విజయంగా పరిగణించవచ్చు. తన విదేశాంగమంత్రి మమోరు షిగే మిట్సుతో, భారత 'జాతీయ సేనకు ఆధిపత్యం వహించడానికి తగిన

భారతీయ నాయకుడు ఈయనే అనిపిస్తోంది' అన్నాడు టోజో. షిగే మిట్సు వెంటనే ఆ అభిప్రాయంతో ఏకీభవించాడు

ఆ తర్వాత రెండు రోజులకు, అనగా జూన్ 16 వ తేదీన, డైట్ (జపాన్ పార్లమెంటు) ను సందర్శించ వలసినదిగా కోరుతూ నేతాజీకి ఆహ్వానం అందింది. ఆనాటి సమావేశంలో అనుకోని ప్రమోదాన్ని కలుగ చేసే ప్రకటన ఒకటి జరిగింది. సుదీర్ఘమైన తన ఉపన్యాసంలో టోజో ఈ క్రింది అంశాలతో కూడిన ఒక ప్రకటన చేశాడు-

'బ్రిటిషువారి దమననీతికి ఇంకా భారతదేశం గురి అవుతూ ఉండ డాన్ని జపాన్ ఏ మాత్రం సహించజాలదు. భారతదేశంలో జరుగుతున్న స్వాతంత్ర్య పోరాటంపట్ల జపాన్ ప్రగాఢ సానుభూతిని తెలియజేస్తోంది. మాకు సాధ్యమైన పూర్తి సహాయం చేయడానికి సిద్ధంగా ఉన్నాం. భారత దేశం స్వాతంత్ర్యం పొంది స్వేచ్ఛా వాయువులు పీల్చే దినం ఎంతో దూరంలో లేదని మేము విశ్వసిస్తున్నాం.'

అవసరమైతే భారతదేశంపైన పోరాటానికి జపాన్ సైన్యాలను పంపిస్తుందా అన్న నేతాజీ ప్రశ్నకు 'సాధ్యమైన ప్రతి సహాయం చేస్తాం' అన్నది టోజో సమాధానం. టోజో నోటి నుంచి ఈ మాటలు రావడం ఇదే ప్రథమం. నేతాజీకి ఇది నైతిక విజయం. మరే నాయకునికి సాధ్యం కానటువంటిది కూడా. ఇక్కడ టోజో వ్యక్తిత్వాన్ని గూర్చి కొంత తెలుసుకోవలసిన అవసరం ఉంది. హిట్లర్, ముసోలినీల మాదిరిగా అట్టడుగున ఉన్న కార్యకర్త స్థాయినుండి ప్రతిభ చేత ఉన్నత స్థానాన్ని అధివసించినవాడు కాడు టోజో స్వయంగా ఒక పటాలాన్ని యుద్ధ భూమిలో నడిపిన అనుభవం కూడా లేదు అతనికి. అయితే అదృష్టం బాగుండి, పై అధికారులు ముఠా తగాదాలతో చీలిపోవడం వలన ఇతనికి యుద్ధమంత్రి పదవి లభించింది. ఆ తర్వాత ప్రధానమంత్రి అయ్యాడు.

ప్రధానమంత్రి బాధ్యత చేపట్టిన తర్వాత తనకు పోటీ వస్తారనుకొన్నవారి నందరిని ఏరిపారేశాడు. తన మంత్రివర్గంలో కేవలం తన కీలుబొమ్మలను కొనేవారికి స్థానం కల్పించాడు. హిట్లర్, ముసోలినీలు అవసరమను కొన్నప్పుడల్లా కలుసుకొంటూ ఉండేవారు. కాని టోజో మాత్రం వీరిని ఎప్పుడూ కలుసుకోలేదు. జపాన్ ప్రధానిగా ఆసియా దేశాలవారిని మాత్రమే కలుసుకొంటూ ఉండేవాడు. వారిలో ఎవరూ ప్రతిభలో నేతాజీకి సాటిరారు. అయస్కాంతపు ఆకర్షణ శక్తి కలిగి ఎదుటి వారిని సమ్మోహితులుగా చేయగల్గిన వ్యక్తిత్వం నేతాజీది. కాబట్టే కేవలం రెండుసార్ల కలయికతో టోజోను పూర్తిగా మెప్పించ గలిగాడు. జూన్ 1943 ప్రాంతానికి ప్రతికూల పరిస్థితుల మధ్య టోజో కృంగిపోవనారంభించాడు. తనమీద తనకే నమ్మకం లేని పరిస్థితి ఏర్పడింది. ఆనాడు అంత బలహీన మనస్కుని చేతిలో జపాన్ ప్రజల భవిష్యత్తు ఇమిడి ఉందేదంటే ఈనాడు జపాన్ పరిస్థితి తెలిసిన వారెవ్వరూ విశ్వసించరు. జపాన్ చరిత్రకారుల అభిప్రాయంలో టోజో ఒక జాకీలాంటివాడు. ఎదురు తిరిగే గుర్రాన్ని కళ్లెంపట్టి ఆపలేక దానిమీదనే పడిఉండే రకం. సైన్యం యధేచ్ఛగా సంచరించి స్వయం వినాశనాన్ని కొనితెచ్చుకొంటూ ఉంటే అదుపులో పెట్టలేక చూస్తూ ఊరకొన్నవాడు.

## విలేఖరులతో నేతాజీ

జపాన్ పార్లమెంటు సమావేశానికి హాజరయిన తర్వాత తన మారుపేరును వదిలిపెట్టి స్వంత పేరుతో సుమారు అరవై మంది జపాన్ విలేఖరులూ, విదేశీ విలేఖరులతో జూన్ 19 న ప్రెస్ కాన్ఫరెన్సు పెట్టాడు నేతాజీ. ఆ పత్రికా విలేఖరుల సమావేశంలో మాట్లాడుతూ —

"భారతదేశంలో ఉండగా పత్రికారంగంతో నాకు సన్నిహిత సంబంధం ఉండేవి. మీలో చాలా మంది ఈ తరుణంలో నేను జపాన్‌లో

ఉండటం చూసి ఆశ్చర్యపోతూ ఉండవచ్చు. నేను ఇండియాలో ఉన్న సమయంలో ఎక్కువ భాగం భారతదేశంలోనూ, బర్మాలోనూ ఉన్న బ్రిటిష్ జైళ్ళలో నివాసం గడపవలసివచ్చింది అలా క్రుంగిపోకుండా ఈనాడు జపాన్ ముఖ్య పట్టణంలో స్వేచ్ఛగా మీ ముందు నిలబడి మాట్లాడుతున్నానంటేనే భారతదేశంలో స్వాతంత్ర్యోద్యమం తీసుకొన్న మలుపు మీరు అర్థం చేసుకోవచ్చు.

''సాటి దేశభక్తుల ప్రోత్సాహంతో రెండు సంవత్సరాల క్రితం నేను భారతదేశాన్ని విడిచిపెట్టాను. ఆనాటి నుంచి ఈనాటివరకు వారి భావాలకు అనుగుణంగానే ప్రతిక్షణం మసలుతూ ఉన్నాను. మొదటి ప్రపంచ యుద్ధ సమయంలో బ్రిటిష్‌వారి పన్నాగాలకు మా నాయకులు మోసపోయారు. ఇకమీదట ఎప్పుడూ అలా మోసపోకూడదనే నిశ్చయానికి ఇరవై సంవత్సరాలపూర్వం వచ్చేశాం. యీ ఇరవై ఏళ్ళుగా నా తరం వారు స్వాతంత్ర్యం కొరకు పోరాటం సాగిస్తూనే, సరియైన అదనుకోసం ఎదురుచూస్తూ ఉన్నారు. ఆ తరుణం ఇప్పుడు ఆసన్నమైంది. ఇప్పుడు చేయిజారిపోతే మరో వంద సంవత్సరాలవరకు ఇలాంటి సువర్ణావకాశం లభించదు. కాబట్టి యీ అవకాశాన్ని సంపూర్ణంగా వినియోగించుకోవాలనే నిర్ణయానికి వచ్చాం.

''ఈ యుద్ధం స్వేచ్ఛను, ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించడానికి సాగుతోందని బ్రిటిష్‌వారు తరచూ చెపుతుంటారు. స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలను గూర్చి అహర్నిశలు మాట్లాడే ఈ ఆంగ్లో-శాక్షన్లు భారతదేశంలో నిరాయుధులైన అమాయక పురుషులనూ, స్త్రీలనూ, పిల్లలనూ రాక్షసంగా హింసిస్తూ ఉంటే, అలాంటివారికి వ్యతిరేకంగా భారతీయులు సాగించే పోరాటాలను మీరు సమర్థిస్తారనే భావిస్తున్నాను.

''ఆధ్యాత్మిక పతనం, సాంస్కృతిక క్షీణత, తీవ్రమైన పేదరికం, రాజకీయ బానిసత్వం మాత్రమే బ్రిటిష్ సామ్రాజ్యవాదులనుంచి భారత

దేశానికి సంక్రమించాయి. అందుచేత ఈ దాస్యశృంఖలాలను త్రెంచుకోవ డానికి భారతీయులు ఉవ్వెత్తున లేచి నిలబడడంలో ఆశ్చర్యం లేదు...... క్రొత్త మార్పు రావాలని మేము మనసారా కోరుకొంటున్నాం.

"బ్రిటిష్‌వారు, వారి మిత్రులు ఎలాంటి ప్రచారం చేసినప్పటికి భారతీయులు అక్షరాజ్యాల (Axis powers) విజయాన్ని కోరుతున్నా రనడంలో సందేహం లేదు. అక్షరాజ్యాలు నిలిచినట్లయితే ఆంగ్లో-సాక్సన్ల రాక్షసత్వం తుదముట్టుతుంది. బ్రిటిష్ సామ్రాజ్యవాదం మటుమాయ మవుతుంది. భారతదేశం పోగొట్టుకొన్న స్వాతంత్ర్యం తిరిగి లభిస్తుంది.

"మా శాశ్వత శత్రువుపైన యుద్ధం ప్రకటించి అక్షరాజ్యాలవారు భారతదేశ స్వాతంత్ర్య పోరాటానికి ఎంతో దోహదం చేశారు. కేవలం సానుభూతి ప్రకటించడంతో మాత్రమే ఆగిపోకుండా పెద్ద యెత్తున మా ప్రయత్నాలకు సహాయం అందిస్తున్నందుకు మేము వారికి కృతజ్ఞులం. అయితే రక్తతర్పణం ద్వారా మాత్రమే స్వాతంత్ర్యం సంపాదించ గల్గుతాం. ఎన్నో కష్టాలు, త్యాగాల ఫలితంగా స్వాతంత్ర్యం సిద్ధించి నప్పుడు మాత్రమే దానిని కాపాడుకోగల్గిన శక్తి సమకూరుతుంది.

"కాబట్టి మా ఉమ్మడి శత్రువును ఓడించడానికి మేము చురుకుగా ఈ యుద్ధంలో పాల్గొనాలని భావిస్తున్నాం. శత్రువు ఆయుధాలు చేబూని పోరాడుతున్నాడు కాబట్టి మేము కూడా ఆయుధాలు ధరించాలని నిర్ణ యించుకొన్నాం. అహింసాయుత పోరాటం హింసాత్మక పోరాటంగా మారకతప్పదు. లక్షలాది హృదయాలలో ఈ జ్వాల రగుల్కొన్నప్పుడు మాత్రమే ఈ పోటీలో నెగ్గుతాం స్వాతంత్ర్యం సిద్ధిస్తుంది..." అంటూ జపాన్‌కు తానెందుకు చేరుకొన్నదీ విపరంగా తెలియజేశాడు.

## బర్మాకు స్వాతంత్ర్యం

1943 జూన్ 23 నాడు టోక్యోనుంచి సింగపూర్‌కు బయలుదేరే ముందు బర్మాదేశపు పాలనాధికారి డాక్టరు బామానుండి నేతాజీకి ఒక టెలిగ్రాం వచ్చింది. దానిలో—

'ప్రాచ్య ఖండానికి మీరు తిరిగి వచ్చినందుకు హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాను. జపాన్‌లో మీరు చేసిన ప్రకటన ఇక్కడ నివసిస్తున్న భారతీయులలో ఆత్మవిశ్వాసాన్నీ, ధైర్యాన్నీ కలుగజేసింది. ఈ సమయంకోసం భారతీయులూ, బర్మా దేశీయులూ వేయికళ్ళతో ఎదురు చూస్తున్నారు. మనమంతా ఐక్య పోరాటం జరిపే తరుణం ఆసన్నమైంది. గౌరవాన్నీ, స్వాతంత్ర్యాన్నీ సాధించేందుకు మీరు సాగించే పోరాటంలో మీ సరసన బర్మా గట్టిగా నిలబడుతుందని వాగ్దానం చేస్తున్నాను అని ఉంది

స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్న మరో నాయకుని వద్దనుంచి అందిన వర్తమానం నేతాజీని ఎంతగానో కదిలించింది. కొద్ది కాలంలోనే బర్మా స్వతంత్ర రాజ్యంగా రూపొందుతుందని, దానికి బామా ప్రధాని అవుతాడని జపాన్ స్నేహితులద్వారా అంతకుముందే నేతాజీ విని ఉన్నాడు. అందుచేత ఈ బర్మా స్నేహితుని కలుసుకోవడానికి ఎంతో ఉత్సుకత చూపాడు నేతాజీ.

1943 ప్రథమార్థంలో టోక్యో బర్మాకు స్వాతంత్ర్యం ఇవ్వాలని నిర్ణయించింది. బామాతో పాటు ఆంగ్‌సాన్ మరో ఇద్దరు మంత్రులు మార్చి 1943 లో టోక్యోను సందర్శించి టోజోతో మాట్లాడారు. జపాన్ ప్రభుత్వం బామాను అత్యున్నత పురస్కారంతో సత్కరించిది. 1943 ఆగష్టునాడు బర్మాకు స్వాతంత్ర్యం లభించింది. స్వాతంత్ర్యం లభించ

గానే తూర్పు ఆసియా బృహత్ ప్రగతి పథకంలో భాగస్వామిగా చేరిపోయి, బర్మా బ్రిటన్‌తో సంబంధాలు తెగత్రెంపులు చేసుకొంది. వెంటనే మిత్రరాజ్యాలపైన యుద్ధం ప్రకటించి, జపాన్‌తో ఒడంబడిక కుదుర్చుకొన్నట్లు ప్రకటన వెలువడింది. స్వాతంత్ర్యోత్సవ వేడుకలకు నేతాజీ ఒక ముఖ్య అతిథిగా విచ్చేశాడు. ఆ సందర్భంలో భారత ప్రజల నుద్దేశించి నేతాజీ ఇలా చెప్పాడు—

'ప్రపంచ చరిత్రలో అత్యంత క్లిష్టమైన ఈ సమయంలో బర్మా సాధించిన స్వాతంత్ర్యం రెండు విధాలుగా ప్రాముఖ్యం సంతరించు కొంటుంది. చరిత్ర మనకు అందించిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకొంటే మనం గొప్ప విజయాలు సాధించవచ్చునన్నది మొదటిది. రెండవది భారతదేశాన్ని ఆక్రమించుకోవడం ద్వారా 19 వ శతాబ్దంలో బ్రిటన్ బర్మాను కబళించ గలిగింది. అలాగే ఇప్పుడు బర్మా స్వాతంత్ర్యం పొందటంచేత భారతదేశంలో ఉన్న బ్రిటిష్ వారిపైన దాడి చేయడానికి వీలుకలిగింది.

'స్నేహితులారా! బ్రిటిష్‌వారు తమ పరిపాలనా కాలంలో భారతీయులకు ఎన్నెన్ని వాగ్దానాలు చేశారో మీకు తెలుసు. ఈ వాగ్దానాలు వ్రాయబడ్డ కాగితాలకు చెత్త కాగితాలకున్న విలువకూడా లేకుండా పోయింది. అయితే జపాన్ విషయం అందుకు భిన్నంగా ఉంది. బర్మాకు స్వాతంత్ర్యం ఇస్తామని టోజో చేసిన ప్రకటనను ఆయన నిలబెట్టు కొన్నారు. ఇది చాలా సంతోషించదగిన పరిణామం మతిఉంటే మార్గం ఉంటుందనేది అక్షరాల నిజం.

'భారతదేశం స్వాతంత్ర్యం సాధించేంత వరకు ఆసియాకు విముక్తి లేదు కాబట్టి భారతీయులంతా ఒక్క త్రాటిపైన నిలబడి భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చేటట్లు చేయగల్గితే ఆసియా దేశాలు ప్రగతి సాధించ గల్గుతాయి''

* * *

ఈలోగా ఫిలిప్పైన్స్‌లో పరిస్థితి విషమించింది. సెప్టెంబర్ 25 నాడు జోస్ పి. లారెల్ అధ్యక్షుడైనాడు. 1943 అక్టోబర్ 14 నాటి స్వతంత్ర రాజ్యంగా ప్రకటించుకోవడం జరిగింది. తూర్పు ఆసియాలో యుద్ధ పరిసమాప్తి జరిగేటంతవరకు హాంకాంగ్, మలయా, సింగపూర్‌లు మాత్రం జపాన్‌వారి ఆధీనంలో ఉంటాయని స్పష్టం చేయబడింది. ఇండోనీషియాకు స్వాతంత్ర్యం ఇవ్వడానికి జపాన్ వ్యూహకర్తలు ఒప్పు కోలేదు. ఆ తర్వాత కొంతకాలానికి సెప్టెంబరు 1944 లో టోజోనుండి ప్రధానమంత్రి పదవిని గ్రహించిన కునిమాకీ కోసో ఇండోనేషియాకు స్వాతంత్ర్యం ఇవ్వడం జరుగుతుందని ప్రకటించాడు. అయితే ఇండి పెండెన్స్ ప్రిపరేటరీ కమిటీ ఆఫ్ ఇండొనీషియా 1945 ఆగష్టు 9 నాటికి గాని సంఘటితం కాలేదు. మిత్రరాజ్యాలకు జపాన్ లొంగిపోయిన తర్వాత ఆరు రోజులకు 1945 ఆగష్టు 17 నాడు సుకర్నో, హట్టాలు ఇండో నీషియాకు స్వాతంత్ర్యం ప్రకటించారు.

## ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ అధ్యక్షపదవి

రాస్ బహారీ బోస్ తోడురాగా 1943 జూన్ 23 నాడు నేతాజీ సింగపూర్ చేరుకొన్నాడు. ఆ రోజు మొదలు అవిశ్రాంతంగా భారత స్వాతంత్ర్యోద్యమ ప్రచారంలోనూ, సంఘటన నిర్మాణంలోనూ పనిచేయ నారంభించాడు ఒక వారం తర్వాత 4 జూలైనాడు సింగపూర్‌లోని ఒక సినిమా హాలులో ఏర్పాటైన ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ సర్వసభ్య సమావేశానికి హాజరయ్యాడు. తూర్పు ఆసియా దేశాలలో నివసిస్తున్న 2000 మంది భారతీయ విప్లవయోధులు ప్రతినిధులుగా వచ్చిన ఆసభ భారతజాతీయ గీతాలాపనతో ప్రారంభమయింది. అప్పుడు ఏడుగురు యువతులు బోసు లిద్దరికి సభికుల కరతాళ ధ్వనులమధ్య పుష్పగుచ్ఛాలు అందజేశారు.

భారతీయ గాయని కుమారి సరస్వతి 'సుభాస్‌జీ' 'సుభాస్‌జీ' అన్న మకుటంతో ఉత్తేజకరమైన పాట పాడింది. సమర యోధుడు, రోగ బాధితుడు, వృద్ధుడు అయిన రాస్ బిహారి లేచి లీగ్ అధ్యక్ష పదవికి తాను రాజీనామా సమర్పిస్తున్నట్లు, నేతాజీని తన వారసునిగా ప్రతిపాదిస్తున్నట్లు ప్రకటించాడు. అక్కడ సమావిష్టులై ఉన్న రెండువేలమంది ఒక్క ఉదుటున లేచి నిలబడి అమితోత్సాహంతో, హర్షాతిశయంతో ఆ ప్రతిపాదనకు సమర్థన తెలియజేశారు.

అధ్యక్షుని స్థానంలో సభికుల నుద్దేశించి మాట్లాడుతూ నేతాజీ ఇలా అన్నాడు—

'స్నేహితులారా! స్వాతంత్ర్య ప్రియులైన భారతీయులందరూ రంగంలో దూకవలసిన తరుణం ఆసన్నమైంది. క్లిష్టతరమైన యుద్ధ సమయంలో సైనిక శిక్షణ, మొక్కవోని విశ్వాసపాత్రత ప్రతివారు అలవరచుకోవాలి. కాబట్టి ఒకే నాయకత్వంక్రింద పెట్టని గోడలా నిలబడి, రానున్న సంకుల సమరంలో మన సర్వశక్తులను ఒడ్డి పోరాడాలని తూర్పు ఆసియాలో నివసిస్తున్న భారతీయ సోదరులకు మనవి చేస్తున్నాను...... భారత స్వాతంత్ర్య సమర చరిత్రలో 1942 చిరస్మరణీయంగా నిలిచి పోతుంది. 1942 ఉద్యమంలో ఉదాసీన ప్రవృత్తిని వదిలి భారత ప్రజలు ఉద్యమశీలురయ్యారు....... ఇప్పుడు ఇంకో అడుగుముందుకు వేయవలసి ఉంది....... ఆయుధాలు చేతబూనాలి. ఈ ప్రయత్నంలో భాగంగా స్వతంత్ర భారత తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పరచుకోవాలి.......

'రక్తతర్పణం ద్వారా స్వరాజ్యానికి మనం మూల్యం చెల్లించినప్పుడే మన జాతీయ ఐక్యతకు శాశ్వతమైన పునాదులు వేసిన వారమవుతాం. మన త్యాగాలతో స్వశక్తిపై ఆధారపడి స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొన్నప్పుడే దానిని నిలుపుకోగల్గిన శక్తి మనకు సమకూరుతుంది...

'అత్యంత క్లిష్టతరమైన సంకుల సమరాన్ని మనం ఎదుర్కొన బోతున్నాం. విచక్షణారహితమైన క్రౌర్యానికి పాల్పడే శక్తివంతుడైన శత్రువును మనం ఎదుర్కొనబోతున్నాం. స్వరాజ్య స్థాపనకై జరిగే ఈ తుది పోరాటంలో ఆకలి దప్పులకూ, కష్టాలతో కూడిన ప్రయాణాలకూ, అనేక ఒడుదుడుకులకూ, మరణాలకూ మనమంతా సిద్ధపడాలి. ఈ పరీక్షలో నెగ్గినప్పుడే స్వాతంత్ర్యం సాధించగల్గుతాం. పేదరికంతోనూ, బానిసత్వంలోనూ క్రుమ్మగ్గుతున్న మాతృభూమి చెర విడిపించి, దానిని సస్యశ్యామలంగా మార్చగలమనే ధైర్యం నాకున్నది.'

ఉపన్యాసాన్ని సభికులంతా మంత్రముగ్ధులై విన్నారు. సర్వసభ్య సమావేశం పూర్తికాగానే రాస్ బిహారి బోస్‌తో కలిసి సింగపూర్ ముఖ్య కేంద్రంగా పెట్టుకొని పనిచేస్తున్న జపాన్ ముఖ్యసైన్యాధికారి జనరల్ కేంట్ జూచీతెరాచీని మర్యాద పూర్వకంగా కలుసుకొనేందుకు నేతాజీ వెళ్ళాడు. ఈఇద్దరు భారతీయ నాయకులను తెరాచీ సాదరంగా ఆహ్వానించి, అప్పుడు యుద్ధరంగంలో తాను ఎదుర్కొంటున్న పరాజయాలను కూడా మర్చిపోయి హాస్యం చిందిస్తూ మాట్లాడాడు. జపాన్ యుద్ధ కళాశాలలో పట్టభద్రుడై, పై చదువులు జర్మనీలో పూర్తి చేసిన తెరాచీ నేతాజీతో జర్మన్ భాషలో సంభాషించాడు. నేతాజీని చూసీ చూడగానే ఆకర్షితుడయ్యాడు. నేతాజీ పట్లగల ఈ మైత్రీపూర్వక ప్రవర్తన తెరాచీ బ్రతికి ఉన్నంతకాలం కొనసాగింది. జపాన్ మిలిటరీ అధికారులలో మంచిపేరు గల తెరాచీ నేతాజీ పట్ల ఆ విధంగా ప్రవర్తించడమనేది సామాన్యమైన విషయం కాదు. ఒకప్పుడు యుద్ధ మంత్రిగా ఉండి ప్రధాని కూడా అవుతాడని అందరిచేత భావించబడి, టోజోతో సమాన స్థాయిలో మాట్లాడగల్గిన సైన్యాధిపతులలో తెరాచీ ఒకడు.

## ఢిల్లీ చలో

ఆ మర్నాడే నేతాజీ భారత జాతీయసేన సైన్యాధిపత్యాన్ని స్వీకరించాడు. నగర కూడలిలో బారులుతీరి నిలబడి ఉన్న 13,000 మంది సైనికులనూ, సైనికాధికారులనూ పరిశీలనగా చూచాడు. ఉత్తేజపూరితము, చరిత్రాత్మకము అయిన ఉపన్యాసంలో తన విధానాన్ని ఇలా స్పష్టంగా వివరించాడు-

''భారతదేశ విముక్తి సైనికులారా! జీవితంలో నాకు మహదానందకరమైన రోజు ఇది. భారత విముక్తి సేన ఏర్పడిందన్న వార్త ప్రపంచానికి తెలియజేసే సౌభాగ్యాన్ని నా అదృష్టం నాకు ప్రసాదించిన దినం ఇది. ఒకనాడు బ్రిటిష్ వారికి పెట్టని కోటగా నిలిచిన సింగపూర్ గడ్డపై ఈ సైన్యం బారులు తీరి యుద్ధభూమిలో నిలబడి ఉంది. బ్రిటిష్‌వారి కబంధ హస్తాలనుంచి భారతదేశానికి విముక్తి కల్గించడమే కాదు, భావి స్వతంత్ర భారత జాతీయ సేనకు నాంది పలుకుతోంది. పూర్తిగా భారతీయుల నాయకత్వంలో ఏర్పడి, భారతీయుడి నేతృత్వంలోనే కదనభూమికి నడిచే ఈ సేనను చూచి ప్రతి భారతీయుని హృదయం పులకిస్తుంది.

"రవి అస్తమించని సామ్రాజ్యమని ప్రసిద్ధి చెందిన బ్రిటిష్ సామ్రాజ్యం ఈ పుడమిపైన శాశ్వతంగా నిలిచిపోతుందని భావించిన ప్రజలు ఒకనాడున్నారు. అయినా అది నన్ను ఏ మాత్రం బాధించలేదు. ఎవరేమి అనుకొన్నా ప్రతి సామ్రాజ్యం పతనమైపోయి కాలగర్భంలో కలిసిపోతుందనే వాస్తవం నాకు చరిత్ర నేర్పిన సత్యం ఒకనాడు వివిధ సామ్రాజ్యాలకు ముఖ్య పట్టణాలుగానూ బలిష్ఠమైన కోటలుగానూ ఉండి శ్మశాన వాటికలుగా మారిన పట్టణాల నెన్నింటినో నా కళ్ళతో నేను చూచాను. ఈనాడు బ్రిటిష్ సామ్రాజ్య శ్మశానాన్ని పరిశీలిస్తున్న ఏ బాలు

దైనా బ్రిటిష్ సామ్రాజ్యమనేది గత చరిత్ర పుటలకు చేరిన విషయం అని గుర్తించగలదు.

''1939 లో ఫ్రాంసు దేశం జర్మనీపైన యుద్ధం ప్రకటించి నప్పుడు జర్మన్ సైనికులలో ప్రతివాని నోటివెంట ఒకేమాట— 'పారిస్ చేరాలి', 'పారిస్ చేరాలి.' 1941 డిశంబరులో జపాన్ సైనికులు యుద్ధానికి కదలి నప్పుడు వారినోట వెలువడింది ఒకేమాట-'సింగపూర్ చేరాలి', 'సింగపూర్ చేరాలి.' స్నేహితులారా ! మన యుద్ధ నినాదం- 'ఢిల్లీ చలో' 'ఢిల్లీచలో' దేశస్వాతంత్ర్యానికై మనం సాగించే పోరాటంలో ఎందరం బ్రతికి బయటపడతామో నేను చెప్పలేను. అయితే ఒకటి మాత్రం చెప్ప గలను - అంతిమ విజయం మనదే. బ్రిటిష్ సామ్రాజ్యపు గోరీ మరొకటి ఢిల్లీలో కడతాం. ఢిల్లీలోని లాల్ ఖిల్లాలో మన సైనికులు విజయోత్సవ కవాతు జరిపేవరకు ఈ పోరాటం సాగుతుంది.

''స్వాతంత్ర్యం పొందటానికి భారతదేం అన్ని అర్హతలు కల్గి ఉన్నప్పటికీ, ఒక విముక్తి సేన లేకపోవడం ఒక పెద్ద లోటుగా నేనెప్పుడూ భావిస్తుండేవాడిని. తనదంటూ ఒక సేన ఉండబట్టి జార్జి వాషింగ్టన్ యుద్ధంచేసి అమెరికాకు స్వాతంత్ర్యం తెచ్చిపెట్టగలిగాడు. సాయుధ స్వచ్ఛంద దళం తన చేతిలో ఉండబట్టే గారిబాల్డీ ఇటలీకి స్వాతంత్ర్యం తెచ్చిపెట్టగలిగాడు. ప్రప్రథమ భారత విముక్తి సేనగా ఏర్పడిన అదృష్టం ఈనాడు మిమ్మల్ని వరించింది. ఇంతటితో మన స్వతంత్ర పోరాటంలో ఉన్న ఆ ఒక్క లోపం కూడా తీరిపోయినట్లయింది. ఆలాంటి ఉత్తమ కార్యంలో అగ్రేసరులుగా నిలిచినందుకు మీరు గర్వించాలి, సంతోషించాలి.

''మీరు రెండు విధాల పని చేయవలసి ఉంటుందనే విషయం మరో సారి జ్ఞప్తికి తెస్తున్నాను. సాయుధ పోరాటంలో మీ రక్తాన్ని ప్రవహింప

చేసి స్వాతంత్ర్యం సముపార్జించాలి. దేశం స్వాతంత్ర్యం పొందాక స్వేచ్ఛా భారత శాశ్వత సైన్య నిర్మాణం మీ ద్వారా జరిగి, సంపాదించిన స్వాతంత్ర్యం చిరకాలం పరిరక్షించబడాలి. మన జాతి రక్షణకు పటిష్టమైన పునాదులు ఏర్పడాలి. ఇక ముందెన్నడూ భారతదేశం తన స్వాతంత్ర్యాన్ని తిరిగి పోగొట్టుకొన్నదన్న మాట చరిత్ర పుటల కెక్కకూడదు.

''విశ్వాసం, కర్తవ్యం, త్యాగం అనే మూడు మూల సిద్ధాంతాలు మీ సైనిక జీవితంలో అడుగడునా ప్రతిబింబించాలి. జాతికి విశ్వాస పాత్రులుగా ఉండి, ప్రాణ త్యాగానికి ఎప్పుడూ సంసిద్ధంగా ఉండే సైనికు లకు పరాజయం ఎన్నడూ లేదు! అలాంటి విజయశీలురుగా ఉండాలంటే, ఈ మూడు మాటలు మా హృదయాంతరాళంలో శాశ్వతంగా ముద్రించు కోండి.

''నిజమైన సైనికునికి సైనిక శిక్షణ, ఆధ్యాత్మిక శిక్షణ - రెండూ అవసరం. కాబట్టి మీరు, మీ స్నేహితులూ ఈరకమైన శిక్షణ పొంది, ప్రతి ఒక్కరూ పరిపూర్ణమైన ఆత్మవిశ్వాసం కల్గి, శత్రువుకంటె అన్నివిధాల మెరుగుగా ఉన్నామని నమ్మి, మరణం అంటే భయం లేకుండా, ఎంతటి అవాంతర పరిస్థితులు ఏర్పడినా స్వయంస్ఫూర్తితో నిర్ణయాలు తీసుకో గల్గి ఉండాలి. ధైర్యసాహసాలు, నిర్భీకతా, చౌరవ శాస్త్రీయ శిక్షణతో పెనవేసుకొన్నప్పుడు ఎంత గొప్ప విజయాలు సాధించవచ్చునో ప్రస్తుతం సాగుతున్న యుద్ధంలో మీరు కళ్లారా చూసి ఉన్నారు. కాబట్టి ఇవన్నీ నేర్చుకొని మాతృభూమి సేవకై ఉపయోగపడేందుకు చక్కటి ఆధునిక సేనగా మిమ్మల్ని మీరు రూపుదిద్దుకోండి.

''ఇందులో అధికారులుగా ఉన్నవారి బాధ్యత మరీ ఎక్కువ. ప్రపంచంలో ఎక్కడైనా సైన్యంలో ఉన్న అధికారుల బాధ్యత గొప్పదే కాని, మీ బాధ్యత ఇంకా పెద్దది. ఇంత కాలంగా రాజకీయంగా బాని

సత్వంలో ప్రమగ్గుతున్న కారణంగా ఉత్తేజపరచడానికి మనకు ముక్‌డేన్, పోర్టు ఆర్థర్, సెడాన్ లాంటి సంప్రదాయాలు లేవు. బ్రిటిష్ వారి వద్ద మనం నేర్చుకొన్న విషయాలు కొన్ని మనం మార్చిపోవాలి. వారు మనకు నేర్పకుండా వదిలేసిన విషయాలు అనేకం మనం నేర్చుకోవాలి. మీ విశాల భుజస్కంధాల మీద మీదేశీయులు విశ్వాసంతో ఉంచిన భారాన్ని మీరు తప్పక నిర్వహిస్తారనే నమ్మకం నాకుంది. సైన్యాన్ని నిలపాలన్నా, విచ్ఛిన్నం చేయాలన్నా అధికారుల చేతిలోనే ఉందన్న సంగతి గుర్తించు కోండి ఈనాడు బ్రిటిష్ సేనలు అనేక రంగాలలో పరాజయాలను చవి చూడటానికి కారణం నిష్ప్రయోజకులైన అధికారులే అన్న విషయం గుర్తుంచుకోండి భవిష్యత్తులో స్వేచ్ఛా భారత సేనలు నడిపే సేనానులు మీలోనుంచే తయారవుతారన్న విషయం మర్చిపోకండి.

"ఈ యుద్ధ సమయంలో మీరు గడించిన అనుభవం, సాధించిన విజయాలు మన సైన్యానికి ఒరవడులు కావాలి. ధైర్యసాహసాలు, నిర్భీకత, అజేయత్వం ఇత్యాది సత్సాంప్రదాయాలు లేని సేన శక్తివంతమైన శత్రువుతో తన పోరాటాన్ని కొనసాగించజాలదు.

"స్నేహితులారా! మానవ మేధకు అందినంత మేరకు అత్యుత్తమ కార్యాన్ని స్వచ్ఛందంగా మీరు చేబూనారు. ఈ ఉత్తమ కార్యం జయ ప్రదం చేయడంలో ఎంతటి త్యాగమైనా, చివరకు ప్రాణ త్యాగమైనా, అల్పమైనదే అవుతుంది భారత జాతి గౌరవాన్ని కాపాడే బాధ్యత మీపైన ఉంది. కాబట్టి భారతీయులందరి మన్ననలు పొందే రీతిగా, భావి తరాలు గర్వపడే విధంగా ప్రవర్తించండి.

"నాకీరోజు అత్యంత గర్వకారణమైన రోజు అని ముందే చెప్పాను. బానిసత్వంలో కొట్టుమిట్టాడుతున్న ప్రజల విముక్తి సేనలో ప్రథమ సైనికుడిగా ఉండటం కంటె గొప్ప గర్వం, గౌరవం మరేదీ ఉండదు.

అయితే ఈ గౌరవంతో పెనవేసుకొని ఉన్న బాధ్యత చాలా గొప్పది అన్న సంగతి నాకు తెలుసు. చీకటిలో, వెలుగులో, దుఃఖంలో, సంతోషంలో, ఓటమిలో, విజయంలో నేను మీతో ఉంటానని శపథం చేస్తున్నాను. ప్రస్తుతానికి మాత్రం నేను మీముందుంచగల్గింది ఆకలీ, దప్పికా, పీడనా, కష్టాలతో కూడిన కదలికా, చావూ మాత్రమే. కాని మీరు బ్రతుకులోనూ చావులోనూ నన్ను అనుసరించగల్గితే—మీరు అనుసరిస్తారనే విశ్వాసం నాకుంది—మీకు స్వేచ్ఛనూ విజయాన్ని సాధించిపెట్టగలను. స్వేచ్ఛా భారత దేశాన్ని మనలో ఎందరు చూడగలరన్నది వేరే విషయం. భారత దేశం స్వేచ్ఛను పొందితే చాలు. స్వాతంత్ర్యం తేవడానికి మనం మన సర్వస్వం అర్పిద్దాం. భగవంతుడు మనలను ఆశీర్వదించి, రాబోయే యుద్ధంలో విజయం సమకూర్చుగాక! విప్లవం వర్ధిల్లాలి ! అజాద్ హింద్ జిందాబాద్ !”

* * *

భారత జాతీయ సేన అధికారులూ, సైనికులూ తన్మయత్వంతో ఈ ఉపన్యాసం విన్నారు. ‘ఈనాటికి మనకొక మహా నాయకుడు లభించాడు’ అన్న భావన వారి హృదయాంలో మెదిలింది. జనరల్ పెరోచి, ఇతర సైనికాధికారులు కూడా దాన్ని ఎంతగానో మెచ్చుకొన్నారు. సరియైన తరుణంలో ఆ ఉపన్యాసం నేతాజీ నోట వెలువడిందని అందరూ భావించారు. 6 వ తేదీన జపాన్ ప్రధాని టోజో ఆగ్నేయాసియా పర్యటన కోసం సింగపూర్ చేరుకొంటాడు. సరిగ్గా ఒక్క రోజు ముందు అంటే 5 వ తేదీన నేతాజీ ఉపన్యాసం జరిగింది.

నేతాజీని గూర్చి టోజోకు తెలియజేసేటప్పుడు జపాన్ సైనికాధికారులు ఆయనకు గల శక్తియుక్తులనూ, గౌరవనూ ప్రశంసించడమేగాక, వ్యక్తిగతంగా అంతటి సచ్ఛీలనంతుడు అరుదుగా కనిపిస్తాడని చెప్పారు.

ఒక కర్నల్ మాట్లాడుతూ, 'ఈ భారతీయ నాయకుడు జితేంద్రియునివలె సుఖదుఃఖాలకు అతీతంగా, 24 గంటలూ భారత స్వాతంత్ర్యాన్ని గూర్చి ఆలోచిస్తాడు. ఎథెన్స్ నగరంలోని జెనో ప్రతిపాదించిన స్టోయిసిజానికి ఈయన ప్రతిరూపం అనిపిస్తాడు' అన్నాడు జపాన్ అధికారులు ఆడంబర హీనమైన సామాన్య జీవితానికి అలవాటుపడాలని టోజో తరచు చెబుతుండేవాడు. నేతాజీని గూర్చి ఈ ప్రశంసలు విని, 'నా నిర్ణయం సరియైనదే అయినందుకు చాలా సంతోషిస్తున్నాను. మొదటి సారిగా టోక్యోలో నేతాజీని చూచినప్పుడు నిజంగా గొప్ప శక్తివంతుడైన నాయకుడిని చూస్తున్నానన్న భావన నాకు కల్గింది'అన్నాడు. టోజో భావనతో ఏకీభవిస్తూ, 'ఇంతకాలం వాయిదా వేస్తూ వచ్చిన తాత్కాలిక భారత ప్రభుత్వ ఏర్పాటును గూర్చి నేతాజీ ప్రస్తావిస్తున్నాడు. వ్యక్తిగతంగా ఆ ప్రతిపాదన నాకు నచ్చింది. మీరు ఏమంటారు?' అని అడిగాడు టెరోచీ. 'ఇప్పుడు అది జరగవలసిందే అని నేను భావిస్తున్నాను. గత కొద్ది మాసాలలో పరిస్థితి చాలా మారిపోయింది' అంటూ వెంటనే తన అంగీకారం తెలియజేశాడు టోజో. 14 మాసాల క్రితం కొందరు భారతీయులు 60 సూత్రాల కోర్కెలు సమర్పించినప్పుడు ఆయనకు కల్గిన కోపం అంతా మాయమైంది. పరిస్థితి మారింది అన్నపుడు బర్మాలో తలఎత్తుతున్న అశాంతి, తాయ్‌లాండ్ ప్రధాని పిబుల్‌సోన్‌గ్రాం కనపరస్తున్న సందిగ్ధత, చైనా, ఆగ్నేసియాలలో తల ఎత్తుతున్న ఇతరమైన అసంతృప్తి టోజో మనసులో ఉన్నాయి.

టెరోచీతో మాట్లాడి బయటకు వచ్చిన వెంటనే నేతాజీతో టోజో ఇలా అన్నాడు- 'మీరు స్వతంత్ర భారత తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాట్లు చేసుకోవచ్చు. అయితే కొన్ని లాంఛనాలూ, మర్యాదలూ పాటించడం విషయంలో టెరోచీ కోసమూ, జపాన్ ప్రభుత్వంతోనూ సంప్రదించి

వ్యవహరించడానికి మీకే విధమైన అభ్యంతరం ఉండదుకదా?" అన్నాడు. పరమానందభరితుడైన నేతాజీ, 'గౌరవనీయులైన ప్రధానీ, మనం టోక్యోలో సమావేశమైనపుడు మిమ్మల్ని అడిగిన రెండవ ప్రశ్నకు మీనుంచి సమాధానం రాలేదు' అన్నాడు. 'అబ్బా, ఇతడు అసాధ్యుడే' అని మనసులో అనుకొని, 'ఈ ప్రాంతంలో యుద్ధ చర్యలన్నింటికీ తెరోచీయే బాధ్యుడు. అతని అభిప్రాయాన్ని టోక్యోలోని కేంద్రప్రభుత్వం మన్నిస్తుంది' అని సమాధానం చెప్పాడు టోజో. సంతోష ఛాయలు ముఖంపైన స్పష్టంగా కన్పిస్తూ ఉండగా నేతాజీ తల ఊపాడు. భారత జాతీయ సేన భారత భూభాగంపై అడుగుపెట్టే ఆశలు మెరుగయ్యాయి.

భారత జాతీయ సేన అధికారులతో ఇంటర్వ్యూకు టోజో అంగీకరించాడు. అంతేకాక, చాలినన్ని ఆయుధాలు సరఫరా చేసి భారత జాతీయ సేనను పటిష్టం చేయడానికి అంగీకరించాడు. జూలై 9 వ తేదీన సింగపూర్‌లో ఉన్న భారతీయులందరూ సమైక్యంగా జపాన్ ప్రధానికి తమ సమర్థనను తెలియజేయడానికి ఏకత్రితమయ్యారు. ఈ సమావేశంలో నేతాజీ ఇలా ఉపన్యసించాడు-

"సోదరీ సోదరులారా!

"నాకు మీరందజేసిన హార్దిక స్వాగతానికి ముమ్మందుగా నా ధన్యవాదాలు తెలియజేస్తున్నాను. ముఖ్యంగా తమ దేశభక్తిని చాటుతూ ఇక్కడ సమావేశమైన సోదరీమణులకు నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. ఈ వేళ నేను చూస్తున్న దానినిబట్టి రాబోయే యుద్ధ కాలంలో సియోనన్ (సింగపూర్) లోనూ, మలయాలోనూ భారతీయులు ప్రముఖ పాత్ర వహిస్తారనిపిస్తున్నది. ఒకప్పుడు బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి ఆయువు పట్టు అనదగిన ఈ ప్రదేశం ఈనాడు భారత జాతీయ వాదానికి పట్టుకొమ్మగా మారింది.

''అనేక కష్ట నష్టాలతో కూడుకొని ఉన్న ప్రయాణం సాగించి స్వగృహాన్ని, మాతృదేశాన్ని విడిచి నేను ఎందుకు వచ్చానో మీకు తెలియ జేస్తాను.

''1921 లో విశ్వవిద్యాలయ ప్రాంగణం వదిలి పెట్టాక నేను రాజకీయరంగంలో చురుకుగా పాల్గొంటూ వచ్చిన సంగతి మీకు తెలుసు. గత రెండు దశాబ్దాలలో భారతదేశంలో కొనసాగిన సహకార నిరాకర ణోద్యమాలలో నేను ముందున్నాను. అంతేకాదు, రహస్యోద్యమాలతో. హింసాయుతమూ, అహింసాయుతమూ రెండింటితోను - నాకు ప్రత్యక్ష సంబంధం ఉన్నదన్న కారణంగా బ్రిటిష్‌వారు నన్ను విచారణ లేకుండా అనేకసార్లు జైళ్ళలో బంధించారు. ఇన్ని రకాల అనుభవం మరే భారతీయ నాయకునికి లేదేమో! ఇంత అనుభవం గడించాక నాకు అనిపించే దేమంటే - బ్రిటిష్‌వారిని భారతదేశంనుంచి తరిమివేయడానికి దేశంలో ఇప్పుడు కొనసాగుతున్న ప్రయత్నం సరిపోదు. దేశంలో సాగుతున్న ఉద్యమాలవలన మాత్రమే స్వాతంత్ర్యం సిద్ధిస్తుందన్న నమ్మకం నాకు కలిగితే, ఇంతటి ప్రమాద భూయిష్టమైన ప్రయాణానికి ఒడిగట్టి ఆపదను కొనితెచ్చుకొనేంత మూర్ఖుడిని కాదు.

''సంక్షిప్తంగా చెప్పాలంటే, దేశంలో కొనసాగుతున్న ఉద్యమాలకు బయటినుంచి కూడా మద్దతు లభింపచేయడమే నా ప్రయాణంలోని ఉద్దేశం. ఈ రకమైన మద్దతు లేకుండా భారత దేశానికి స్వేచ్ఛ లభింపచేయడం ఎవరికీ శక్యంకాదు. దేశంలో కొనసాగుతున్న ఉద్యమానికి బయటినుంచి తక్షణమే కొద్దిపాటి మద్దతు లభిస్తే సరిపోతుంది. అక్షరాజ్యాలు బ్రిటిష్ సామ్రాజ్యానికి కల్గించిన నష్టాల కారణంగా మన పని సులువైపోయింది.

''మన దేశీయులకు ఈ వేళ-వస్తు పరంగా, నైతిక పరంగా- రెండు రకాల సహాయం అందవలసి ఉంది. దీర్ఘకాలిక పోరాటంలో

విజయం వారిని తప్పక వరిస్తుందన్న విశ్వాసం మొదట కల్గించాలి. ఇక రెండవది, అవసరమైన సైనిక సహాయం లభిస్తుందన్న విశ్వాసం కల్గించడం. అందుకుగాను ఈనాడు ప్రపంచంలో జరుగుతున్న యుద్ధానికి సంబంధించిన సరియైన అంచనాలు భారతీయులకు తెలియజేయాలి. ఇక సైన్య సహాయానికి వస్తే, దేశం వెలుపల నివసిస్తున్న భారతీయులందరూ, అవసరమైతే బ్రిటిష్‌వారి శత్రువుల సహాయం తీసుకొనైనా సరే, సంసిద్ధంగా ముందుకు రావాలి.

''స్నేహితులారా! ఈ రెండు విధాలా ప్రయత్నం జరిగిందని మీకు తెలియజేస్తున్నాను. విదేశీ యాత్రద్వారా వివిధ రాజ్యాల స్థితిగతులు తెలుసుకొనే అవకాశం నాకు లభించింది. ఆంగ్లో - అమెరికన్ రాజ్యాల ఓటమి తథ్యమని భావించగానే ఆ విషయం భారతీయులందరికి తెలియజేశాను. విదేశాలలో ఉన్న భారతీయులందరూ జాగరూకులై ఉన్నారనీ, తగు విధంగా భారత స్వాతంత్ర్య పోరాటంలో పాలు పంచుకోడానికి సిద్ధంగా ఉన్నారనీ తెలుసుకొని పరమానంద భరితుడనయ్యాను. భారతీయులు కోరినట్లయితే వారిని బానిసత్వంనుంచి విముక్తి చేయడానికి చేతనైనదంతా చేయడానికి అక్షరాజ్యాలు, ముఖ్యంగా జపాన్ సిద్ధంగా ఉన్నట్లు తెలుసుకొని మరీ సంతోషించాను. నన్ను విశ్వసించవలసినదిగా కోరుతున్నాను. నా దేశ ప్రయోజనాలకు భిన్నంగా నేను ప్రవర్తిస్తానని చెప్పడానికి నా బద్ధ శత్రువులుకూడా సాహసించలేరు బ్రిటిష్ ప్రభుత్వమే నన్ను మోసంచేసి, ఆశలు చూపి లోబరచుకోలేకపోయింది. అలాంటప్పుడు ప్రపంచంలో మరే దేశానికైనా అది ఎలా సాధ్యమవుతుంది? కాబట్టి బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా మనం సాగించే పోరాటానికి బయటివారి సహాయం మనకు లభిస్తుందని నేను చెప్పేమాటలు విశ్వసించండి. అయితే బయటివారి సహాయం కావాలా, అక్కరలేదా అన్నది నిర్ణయించుకోవలసి

నది భారతీయులే. బయటివారి సహాయం ఏ మాత్రం లేకుండానే పోరాటం సాగించడం అన్ని విధాల మంచిదే. అయితే ఒక మాట చెప్పదలచు కొన్నాను. శక్తివంతమైన బ్రిటిష్ సామ్రాజ్యమే పరిస్థితులు అనుకూలంగా లేవని తెలుసుకొని ప్రపంచం నలుమూలలా సహాయాన్ని అర్థిస్తూ తిరిగింది. చివరకు బానిసత్వంలో మగ్గుతున్న భారత ప్రజల సహాయాన్ని కూడా అర్థించింది. కాబట్టి అవసరమైనప్పుడు ఇతరుల సహాయాన్ని అర్థించ డంలో తప్పులేదు.

''మన దేశానికి స్వాతంత్ర్యం ఎలా సంపాదించదలచుకొన్నదీ మన శత్రువుతో సహా ప్రపంచదేశాలన్నింటికీ నేను బహిరంగంగా చెప్పాలను కొంటున్నాను. భారతదేశానికి వెలుపల, ముఖ్యంగా తూర్పు ఆసియాలో నివసిస్తున్న భారతీయులు సంఘటితమై ఒక సైన్యంగా రూపొంది భారత దేశంలో బ్రిటిష్ సైనికులతో పోరాటానికి సమాయత్తమవుతున్నారు. అలా జరిగినప్పుడు భారతదేశంలో ఒక అంతర్యుద్ధం సంభవిస్తుంది. బ్రిటిష్ పతాక ఛాయలలో పోరాడుతున్న భారత సైనికులు కూడా తిరుగుబాటు జరుపుతారు. ఆ విధంగా బ్రిటిష్‌వారు ఇరువైపులనుంచి మనల్ని ఎదుర్కొన వలసివచ్చినప్పుడు తప్పక నశిస్తారు. దేశానికి స్వాతంత్ర్యం లభిస్తుంది.

''నామటుకు నేను అక్షరాజ్యాల సహాయాన్నిగూర్చి ఆలోచించ వలసిన అవసరంకూడా రాదేమోనని భావిస్తున్నాను. దేశంలోనూ, విదేశా లలోనూ ఉన్న భారతీయులు తమ కర్తవ్యాన్ని నిర్వహించిననాడు బ్రిటిష్ వారిని భారత దేశంనుంచి తరిమివేయడం, 388 మిలియన్ల భారతీయులకు స్వేచ్ఛ లభించడం తథ్యం.

''భారతదేశంలో నివసిస్తున్న 388 మిలియన్ల భారతీయులు బ్రిటిష్ వారిని వెళ్ళగొట్టలేకపోయినప్పుడు విదేశాలలో ఉన్న మూడు మిలియన్ల భారతీయులు ఆ పని ఎలా చేయగల్గుతారు అని ప్రశ్నించే వారుండవచ్చు.

స్నేహితులారా! ఐర్లండు చరిత్రను ఒకసారి పరిశీలించండి - మూడు మిలియన్ల ఐరిష్ ప్రజలు బ్రిటిష్ కబంధ హస్తాలలో క్రుమ్మిపోతున్న తరుణంలో అయిదువేల మంది సిన్‌ఫిన్ స్వచ్ఛంద సేవకులు దేశం బయట నుంచి విముక్తి పోరాటం సాగించి 1921 లో బ్రిటిష్ వారిని వంచగల్గినప్పుడు, మూడు మిలియన్ల భారతీయులకు బలసంపన్నమైన జపాన్ వారి అండదండలు కూడా లభించినప్పుడు ఆ పని అసాధ్యం ఎలా అవుతుంది?

"అయితే విదేశాలలో నివసిస్తున్న భారతీయులు, ముఖ్యంగా తూర్పు ఆసియాలో ఉన్నవారు అతి పెద్ద ప్రయత్నం చేయవలసి ఉంటుందని చెప్పదలచుకొన్నాను. ఆ విధంగా చేసేందుకుగాను స్వేచ్ఛా భారత తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకోవాలని తలపెట్టాను. ఇక్కడి భారతీయుల వనరులన్నింటిని సమీకరించి భారతదేశంలోని బ్రిటిష్ సైన్యంతో పోరాడటమే ఈ ప్రభుత్వం ధ్యేయంగా పెట్టుకొంటుంది. ఈ ప్రయత్నం ఫలప్రదమై స్వాతంత్ర్యం సిద్ధించినప్పుడు ఈ తాత్కాలిక ప్రభుత్వం తొలగిపోయి భారత ప్రజల అభీష్టానుసారం శాశ్వత ప్రభుత్వం ఏర్పడటానికి వీలు కల్పిస్తాము.

"స్నేహితులారా! తూర్పు ఆసియాలో నివసిస్తున్న మూడు మిలియన్ల భారతీయులు తమ సర్వ సంపదలను — అంటే డబ్బూ, మనుషులూ - సమీకరించుకొనవలసిన తరుణం ఆసన్నమైందని గుర్తించండి సగం సగం ప్రయత్నాల వల్ల ఫలితం లేదు. ఈనాడు నేను కోరేది సర్వసమర్పణ. అంతకంటే గత్యంతరం లేదు. మన శత్రువులు కూడా యుద్ధాన్ని అంతిమ యుద్ధంగా ప్రకటించారన్న సంగతి మీకు తెలుసు. భారతదేశ విముక్తి సేనలో ఒక భాగమైన అజాద్ హింద్ ఫౌజ్ ఈనాడు మీముందు నిలిచి ఉండటం మీరు చూస్తున్నారు. టౌన్ హాలు ముందు నిన్న వారి కవాతు ప్రదర్శన జరిగింది. ఢిల్లీలో ఎర్రకోట ముందు

విజయ పతాకతో సైన్య విన్యాసం జరిపేంతవరకు విశ్రమించబోమని వారు నిశ్చయించుకొన్నారు. ఢిల్లీ చలో అన్నది వారి నినాదం. కాబట్టి స్నేహితులారా, తూర్పు ఆసియాలోవున్న మూడు మిలియన్ల భారతీయుల నినాదం అంతిమ యుద్ధానికి సర్వసమర్పణ.

“ఈ సర్వ సమర్పణోద్యమంలో భాగంగా 300 వేల మంది సైనికులు, మూడు కోట్ల డాలర్ల ధనం నేను కోరుతున్నాను. 1857 లో జరిగిన ప్రథమ స్వాతంత్ర్య సమరంలో వీరనారి ఝాన్సీరాణివలె ప్రాణాలను తెగించి పోరాడగల స్త్రీ సైన్యం ఒకటి ఏర్పడాలి.

“స్నేహితులారా, మనం చాలా కాలంగా ఐరోపాలో రెండవ రంగం అన్న మాట వింటున్నాం. ఐరోపా సంగతి ఎలా ఉన్నా స్వదేశంలో ఉన్న భారతీయులు వెంటనే రెండవ రంగం సిద్ధం కావాలని కోరుకొంటున్నారు. సర్వ సమర్పణకు మీరు సిద్ధమైతే స్వాతంత్ర్య పోరాటంలో రెండవ రంగాన్ని సిద్ధంచేసి మీకు చూపిస్తాను.”

* * *

నేతాజీ ఉపన్యాసం విన్న తర్వాత అక్కడ సమావేశమై ఉన్న భారతీయులు ఏది అడిగినా ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నామని తెలియజేస్తూ ముందుకు వచ్చారు. అక్కడ నివసిస్తున్న భారతీయ కుటుంబాలన్నీ ధనమూ, విలువైన సామగ్రీ నేతాజీకి ఇవ్వడమే కాక, అనతికాలంలోనే భారతీయ సేనలో భాగంగా స్త్రీల విభాగాన్ని నిర్మాణం చేసుకొన్నారు. ‘1857 లో జరిగిన స్వాతంత్ర్య సమరంలో ఒక్క ఝాన్సీ లక్ష్మి వీరవిహారం చేసింది, కాని నేటి స్వాతంత్ర్య సమరంలో నాకు వెయ్యిమంది ఝాన్సీ రాణులు కావాలి’ అని నేతాజీ చాటగానే 1200 మంది శక్తి స్వరూపిణులు వీర దుర్గలై విజృంభించారు.

భారత జాతీయ సేనలో భాగంగా స్త్రీల విభాగాన్ని ఏర్పాటు చేయాలని నేతాజీ తీసుకొన్న నిర్ణయం పాత భావాలు కల జపాన్ సైనికాధికారులను కలవర పరచింది. యుద్ధం అంటే పురుషులకు సంబంధించినదేకాని స్త్రీలకు అందులో ప్రమేయం ఉండరాదని జపాన్ అధికారుల భావన. రెడ్‌క్రాస్ సంస్థలో చేరి, నర్సులుగా యుద్ధభూమిలో సేవ చేసిన జపాన్ వనితలు పలువురు ఉన్నారు. కాని వీరిని పదాతి దళంలోగానీ, నౌకాదళంలోకానీ సభ్యులుగా ఎన్నడూ తీసుకోలేదు. కొన్ని కొన్ని సమయాల్లో జపాన్ వారితో జరిగిన పోరాటంలో చైనా గెరిల్లా దళాలలో స్త్రీలు పాల్గొనడం జపాన్ వారికి తెలుసు కాని ఇంకెక్కడా నియమబద్ధమైన సేనలో ఆడవారిని నియమించడం వినలేదు. ఈ చర్య సైన్యంలో క్రమశిక్షణారాహిత్యానికి దారి తీస్తుందని కొందరు జపాన్ సైనికాధికారులు వాదించారు. కాని ఆ తర్వాత ఈ సేన పనిచేసిన తీరు పరిశీలించాక ఈ అధికారుల అపోహలన్నీ పోయి, నేతాజీ పట్ల కల్గిన గౌరవ భావం ద్విగుణీకృతమైంది.

నేతాజీతో సింగపూర్‌లో జరిపిన సమావేశంలో ఆగ్నేయాసియాలో నివసిస్తున్న భారతీయుల నుండి నిధులు ప్రోగుచేయడంలో నేతాజీకి పూర్తి స్వేచ్ఛ ఇచ్చేందుకు టోజో సమ్మతించాడు. ఇది చాలా ముఖ్యమైన ఒప్పందం.

## ప్రవాస భారతీయుల ముందంజ

తూర్పు ఆసియా దేశాలలో చైనావారు, యూదులు, భారతీయులు వ్యాపారాలలో స్థిరపడి బాగా ఆర్జించారు. వారి సహకారం లేకుండా ఈ దేశాలలో ఏ కార్యక్రమాలైనా జయప్రదంగా నిర్వహించడం కష్టమే. ఇండో చైనా, ఇండొనీసియా, సింగపూరులలో వ్యాపారంలో అత్యధిక భాగం చైనీయుల చేతులలోనే ఉంది. దూరాలోచనలేని జపాన్ సైనికాధి

కారులు సింగపూర్‌లో చైనీయులు తమతో సహకరించడంలేదన్న నెపంతో వారిని నిర్బంధించడం, చంపివేయడం చేశారు. యుద్ధం అయిపోయిన తర్వాత చాలా సంవత్సరాల వరకు ఈ క్రూర చర్యల ప్రతిఫలం జపాన్ వారు అనుభవించవలసి వచ్చింది. జపాన్ వారు అనుసరించిన విధానం కాకుండా తూర్పు ఆసియాలో ఉన్న భారతీయులకు నచ్చచెప్పి వారి సంపూర్ణ సహాయ, సహకారాలు సాధించడానికి కృషి చేశాడు నేతాజీ. బర్మాలోని పది లక్షల మంది భారతీయులు దాదాపు ఆ దేశపు ఆర్థికవ్యవస్థ నంతటిని తమ అదుపులో పెట్టుకొన్నారు. బాంకాక్, సైగాన్, పెనాంగ్, కౌలాలంపూర్, సింగపూర్-ఇంకా అనేక ప్రదేశాలలో 20 లక్షల మంది భారతీయులు బాగా ఆర్జించి సంపన్నులుగా ఉన్నారు. వీరందరిని కలుపుకు రావాలని నేతాజీ ప్రయత్నించాడు.

## బర్మా స్వాతంత్ర్య దినోత్సవంలో

బర్మా స్వాతంత్ర్య దినోత్సవంలో పాల్గొనేందుకు నేతాజీ సింగపూర్‌నుంచి జూలై 20 నాడు రంగూన్‌కు బయలుదేశాడు. దారిలో థాయ్‌లాండ్ ప్రధాన మంత్రి మార్షల్ లాంగ్ పిబుల్ సంగ్రామ్‌ను కలుసుకొనేందుకు బాంకాక్‌లో దిగాడు. అయితే ఆ సమయంలో ప్రధానమంత్రి బాంకాక్‌లో లేడని ప్రధాని కార్యదర్శులు తెలియజెశారు. వాస్తవానికి అగ్గిపిడుగులా దూసుకుపోతున్న భారతీయ నాయకుని కలుసుకోవడానికి థాయ్ ప్రధానికి ఇష్టంలేదు. పసిఫిక్ సముద్రప్రాంతంలో యుద్ధం చెలరేగినప్పుడు ప్రథమ దశలో జపాన్‌తో చేతులు కలిపి పోరాడటానికి పిబుల్ సంగ్రామ్ సిద్ధమై రంగంలో దిగాడు. కాని ఆ తరువాత పరిణామాలు చూశాక జాగ్రత్తపడటం ఎందుకైనా మంచిదన్న ధోరణిలో గోడమీది పిల్లి వాటంగా ప్రవర్తించ నారంభించాడు.



కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో సుభాస్



హరిపురా కాంగ్రెసులో



జర్మన్ జలాంతర్గామిమీద



జర్మన్ జలాంతర్గామి నుంచి జపాన్ జలాంతర్గామిలోకి



బెర్లిన్‌లో స్వాతంత్ర్యదినోత్సవంనాడు (26-1-43)



సర్దార్ పటేలు, కృపలానీలతో నేతాజీ



సైగాన్ విమానాశ్రయంలో కట్టకడపటి ఫోటో

బర్మా స్వాతంత్ర్య దినోత్సవ వేడుకలలో పాల్గొనడం ద్వారా నేతాజీ అనేక విషయాలు తెలుసుకోగలిగాడు. బర్మా ప్రజల ఉత్సాహాన్ని తిలకించి పులకించిపోయాడు. రంగూన్ పట్టణంలో నివసిస్తున్న భారతీయ యువకులను కలుసుకొనే అవకాశం లభించింది. అయితే స్వతంత్ర భారత తాత్కాలిక ప్రభుత్వాన్ని రంగూన్‌లో నెలకొల్పుకొనేందుకు అనుమతించవలసినదిగా నేతాజీ కోరినప్పుడు బర్మా పాలనాధికారిగా ఉన్న బామా అంగీకరించలేదు. అయితే ఆ విధంగా తిరస్కరించడానికి నేతాజీ పట్ల ఉన్న అయిష్టత కారణంకాదు. అంతకుముందునుంచి భారతీయులకూ, బర్మావారికీ మధ్యన ఏర్పడిన అవగాహన లోపమే అందుకు కారణం. 1874 లో 7,000 మంది బెంగాలీలు మూకఉమ్మడిగా బర్మాకు తరలి వెళ్ళారు. కష్టపడి పనిచేయడం ద్వారా స్థానికులకంటే అతిత్వరలో మంచి ఆస్తిపాస్తులు సంపాదించుకొని స్థిరపడ్డారు. 1930 నాటికి అన్ని రంగాల లోను స్థానిక ప్రజలకంటే మెరుగైన స్థితికి చేరుకొన్నారు. ఇది బర్మా ప్రజలలో ఒక రకమైన ఈర్ష్యకు దారితీసింది. బర్మా అంతరంగిక విషయాలలో ఏ విధమైన జోక్యం చేసుకోబోమనీ, కేవలం స్వతంత్ర భారత తాత్కాలిక ప్రభుత్వ స్థావరం మాత్రం నెలకొల్పుకొంటామని తెలియజేస్తూ జపాన్ సైనికాధికారుల ద్వారా నేతాజీ మంతనాలు కొనసాగించాడు.

**బాంకాక్‌లో**

తిరుగు ప్రయాణంలో ఆగష్టు 4 నాడు నేతాజీ బాంకాక్‌లో దిగాడు. ఈసారి తాయ్ ప్రధాని పిబుల్ సంగ్రామ్‌ను కలుసుకో గలిగాడు. తాయ్‌లాండ్‌కు ఆసియా దేశాలలో ఒక ప్రత్యేక స్థానం ఉంది. చుట్టుపట్ల ఉన్న దేశాలన్నీ ఐరోపా దేశాలకు వలస రాజ్యాలుగా మారిపోయినా తాయ్‌లాండ్ మాత్రం తన స్వాతంత్ర్యాన్ని కాపాడుకొంటూ వచ్చింది. తాయ్ ప్రధాని పొట్టిగా, నిలకడలేని మనిషిగా కన్పించినప్పటికీ. చాలా శక్తివంతుడు అని

పించింది. నేతాజీతో చాలా అప్యాయంగా మాట్లాడాడు కాని, ఏ విషయం పైన ఒక నిర్ణయానికి రాలేదు. అయితే నేతాజీ ఒక సత్ఫలితం సాధిం చాడు. బర్మా అనుమతిస్తే భారత జాతీయ సేన థాయ్‌లాండ్ మీదుగా బర్మా చేరడానికి థాయ్ ప్రధాని అనుమతించాడు. బాంకాక్‌లో ఉన్నప్పుడు కూడా నేతాజీ 24 గంటలు పనిచేశాడు. బ్రిటిష్‌వారితో జరుపుతున్న పోరాటానికి తమ సంపూర్ణమైన మద్దతు తెలియజేయవలసిందిగా అక్కడి భారతీయులను కోరాడు.

## సైగాన్‌లో

అగష్టు 9 వ తేదీన నేతాజీ విమానంలో సైగాన్ చేరుకున్నాడు. అక్కడ జపాన్ దౌత్యాధికారితోనూ, ఇతర ఉన్నతాధికారులతోనూ చర్చలు జరిపాడు. ఇక్కడకూడ వెయ్యిమంది భారతీయులు పాల్గొన్న సభలో ఉపన్యసించాడు. యుద్ధభూమికి చాలా దూరంగా ఉన్న కారణంగా సైగాన్ ప్రశాంతంగానూ, ఐశ్వర్యవంతంగానూ కనిపించింది. దక్షిణ ప్రాంతాలకు యుద్ధ సామగ్రినీ, ఇతర సరుకులనూ చేరవేయడానికి ఇది బదిలీ కేంద్రంగా ఉన్న కారణంగా క్రొత్త క్రొత్త సైనికులతోనూ, యుద్ధ పరికరాలతోనూ కిటకిటలాడుతూ ఉంది. రంగూన్‌లోనూ, బాంకాక్‌లోనూ కనిపించిన నిరాసక్త వాతావరణానికి భిన్నమైన వాతా వరణం సైగాన్‌లో చూసి నేతాజీ ఉత్తేజితుడైనాడు. బర్మాను కేంద్రంగా పెట్టుకొని భారతదేశంపైన పోరాటాన్ని తీవ్రతరం చేయవలసిందిగా టోక్యోలోని కేంద్ర ప్రభుత్వం సింగపూర్‌లో ఉన్న తన సైన్యాధిపతు లకు ఆజ్ఞలు జారీచేసిన సంగతి అప్పటికి ఇంకా నేతాజీకి తెలియదు.

## తిరిగి సింగపూర్‌కు

తూర్పు ఆసియాలో తన ప్రచార కార్యక్రమాన్ని అవిశ్రాంతంగా కొనసాగించి అగష్టు 24 నాడు నేతాజీ సింగపూర్‌కు తిరిగివచ్చాడు.

మహాత్మా గాంధీ అరెస్టు మొదటి వార్షికోత్సవాన్ని పురస్కరించుకొని ఏర్పాటు చేసిన సభలో నేతాజీ ఉపన్యసించాడు. ఆ సందర్భంలో స్త్రీల సైనిక విభాగం, సింగపూర్‌లో నివసిస్తున్న భారతీయులు, పిల్లలు కవాతు చేస్తూ సింగపూర్ పురవీధులగుండా నడిచివచ్చి సభాస్థలికి చేరారు.

ఆ తర్వాత 12 రోజులకు అనగా ఆగష్టు 26 నాడు నేతాజీ అధికార నివాస గృహంలో 15 వ సైనిక డివిజన్‌కు చెందిన ముఖ్య సేనాధిపతి మేజర్ జనరల్ తోడై కునోమురా, గుప్తచర విభాగాధిపతి మేజర్ ఇవైచీ ఫుజివేరాలను కలుసుకోవడం జరిగింది. టెరోచీతో కలిసి పనిచేస్తున్న సైనికాధికారులతో వ్యూహపరమైన చర్చలు జరిపేందుకు వారిద్దరూ సింగపూర్ వచ్చి ఉన్నారు. నేతాజీతో కలిసి పనిచేస్తున్న అధికారులు కూడా చాలామంది అప్పుడు అక్కడ ఉన్నారు. ఫుజివేరాను తిరిగి కలుసుకోవడం అంటే నేతాజీకి యెంతో ఆనందకరమైన విషయం. భారత స్వాతంత్ర్య సమరోద్యమానికి ఫుజివేరా అందజేస్తున్న తోడ్పాటుకు నేతాజీ హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేశాడు. ఫుజివేరా తిరిగి బర్మాలో నియమింపబడినందుకు నేతాజీతోపాటు మిగిలిన అధికారులు కూడా యెంతగానో సంతోషించారు. కొంతసేపు కుశల ప్రశ్నలు అయిన తర్వాత కునోమురా అసలు విషయాన్ని తెలియజేశాడు. తమ సైన్య శక్తులు ఒడ్డి ఇంఫాల్‌లో బ్రిటిష్ వారిపైన దాడి చేయడానికి ఆగష్టు 12 నాడు నిర్ణయం తీసుకొన్న సంగతి తెలియజేశాడు. అంటే పోరాటాన్ని భారత భూభాగంపైకి విస్తరింపచేసేందుకు నిర్ణయం తీసుకోవడం జరిగిందన్న మాట. నేతాజీ యెప్పటినుంచో కోరుకొంటున్న చర్య ఇది. దీనికి సంబంధించిన వివరాలు తెలియజేస్తూ భారత జాతీయ సేన సహకారాన్ని పూర్తిగా వినియోగించుకొని ఈ ముట్టడి కొనసాగించవలసి ఉంటుందని జనరల్ ముటగూచి కోరినట్లుగా కునోమురా తెలియజేశాడు. అంతవరకు గంభీరంగా అత్యంత శ్రద్ధతో ఆ విషయాన్ని విన్న నేతాజీ

మందహాసంతో తన ఆనందాన్ని వ్యక్తం చేశాడు. భారత జాతీయ సేన జపాన్ సేనల తోడ్పాటుతో భారత భూభాగంపైకి చొచ్చుకుపోగలిగితే దేశం వెలుపలినుంచి వచ్చిన ఈ భారత సైనికులకు మద్దతుగా భారత ప్రజలు తమ ఉద్యమాన్ని తీవ్రతరం చేస్తారనీ, అది తమకు అన్నివిధాల అనువుగా వుంటుందని యెంతోకాలంగా తన మనస్సులో పెల్లుబుకున్న ఊహలను బయటపెట్టాడు. వాస్తవానికి నేతాజీ సైన్యాలు భారత భూభాగం పైన అడుగుపెట్టగానే ఘనంగా స్వాగతించడానికి ఫార్వర్డ్ బ్లాక్ అనుచర వర్గం, సోషలిష్టు నాయకుడు జయప్రకాశ్ ఒక పథకాన్ని సిద్ధం చేసుకొన్నారు. అయితే బ్రిటిష్‌వారు అనుసరించిన కుటిలనీతి కారణంగా ఆ పథకం విఫలమైంది.

భారత భూభాగంపైన యుద్ధం కొనసాగించడానికి జపాన్ ప్రభుత్వపు అండదండలు లభిస్తాయని నిశ్చయంగా తెలియగానే నేతాజీ యుద్ధ సన్నాహాలలో నిమగ్నమైపోయాడు. అక్కడ నివసిస్తున్న భారతీయులందరూ తమ పునీత రక్తంతో సంతకాలు చేయవలసినదిగా కోరుతూ ఒక ప్రమాణ పత్రాన్ని విడుదల చేశాడు. అందులో 'నా అంతట నేను ఇష్టపూర్వకంగా, ఏ రకమైన బలవంతం లేకుండా, స్వతంత్ర భారత సేనలో చేరుతున్నాను. మాతృదేశ స్వాతంత్ర్యంకొరకై పాటుపడగలనని శపథం చేస్తున్నాను. భారత స్వాతంత్ర్యంకొరకై ప్రాణాలను ఇచ్చేందుకు సిద్ధంగా ఉన్నాను. నేను చేసే సేవకు ఏ విధమైన జీతంగానీ, బహుమానంగానీ కోరను. కుల, మతములనూ, భాషనూ, ప్రాంతాలనూ పాటించక భారతీయులందరినీ సోదరీ సోదరులుగా భావిస్తాను' అని లిఖించి ఉంది. ఈ ప్రమాణ పత్రంపై స్త్రీ, పురుష విభేదం లేకుండా, హిందూ, ముస్లిం అనే భేదం పాటించకుండా అందరూ తమ రక్తంతో సంతకాలు చేశారు.

నేతాజీ తన ప్రకటనలో ''మీలో నాకు పరిపూర్ణ విశ్వాసం ఉంది. కాని ఈ ప్రమాణంపై రక్తంతో సంతకం చేయాలి. ఎవరి రక్తనాళాలలో

మాతృదేవత రక్తం ప్రవహిస్తోందో వారు మాత్రం దీనిపై సంతకం పెట్టాలి. మాతృదేవత పాద పద్మములచెంత పుష్పాలనుగాక శిరస్సులను కానుకగా అర్పించగలవారే దీనిపై సంతకం చేయండి" అన్నాడు. అందుకు సిద్ధపడి వేలాది మంది సంతకాలు చేశారు. నేతాజీ పట్ల తమకు గల అచంచల విశ్వాసాన్ని ఆ విధంగా ప్రకటించుకొన్నారు.

## కనక వర్షం

సెప్టెంబర్ 3 వ తేదీన పెనాంగ్‌లో సమావేశమైన 15000 మంది భారతీయులనుద్దేశించి కావించిన ప్రసంగంలో నేతాజీ అగ్నివర్షం కురిపించాడు. గంటల తరబడి సాగిన ఆ ఉపన్యాసాన్ని ప్రజలు మంత్ర ముగ్ధులై విన్నారు. ఉపన్యాసం ముగిసినంతనే ప్రజలు వేదిక వద్దకు పరుగులెత్తుకుంటూ వచ్చి తమ వద్దనున్న సర్వస్వం అర్పించ నారంభించారు. ఆ రోజు ఆ విధంగా సమకూరిన ధనం 20 లక్షల డాలర్లు. ఇది చరిత్రలో అపూర్వమైన విషయం. వాస్తవం ఇలా ఉండగా ఆ రోజులలో భారత దేశంలో బెంగాల్‌నుంచి వెలువడిన 'పీపుల్స్‌వార్' అనే కమ్యూనిష్టు పత్రిక 'ఏదో కొద్ది మంది వ్యాపారులు నిహిత స్వార్థంతో కొంత డబ్బు నేతాజీకి ఇచ్చేవారు కాని, సామాన్య ప్రజలు ఎవరూ నేతాజీని సమర్థించలేదు' అంటూ అబద్ధాలు ప్రచారం చేసింది.

అజాద్ హింద్ ప్రభుత్వానికీ, అజాద్ హింద్ ఫౌజ్ కార్యకలాపాలకూ నేతాజీ ఎన్ని కోట్లు సంపాదించాడో లెక్కించలేం. ఆయన కోరడమాలస్యం స్త్రీలు ఆవేశంతో కంటెలూ, గొలుసులూ, గాజులూ, లోలకులూ మొదలైన ఆభరణాలు ఆయనకు సమర్పించుకొనేవారు. పురుషులు తమ సర్వస్వాన్ని, ప్రాణాలను సహితం ఆయన పాదాల వద్ద ఉంచేవారు. అజాద్ హింద్ బ్యాంకు స్థాపించబడింది. ఆయనను తూర్పు ఆసియా ప్రజలు తమ సర్వస్వంగా భావించారు. ఆయన ఏది అడిగినా కాదనలేదు.

ఒకసారి నేతాజీ తన మెడలో వేసిన పూలదండను వేలం పెట్టాడు. ఆ దండను తమ స్వంతం చేసుకోవడానికి ఉవ్విళ్ళూరిన ప్రజలు పాడటం మొదలు పెట్టారు. లక్ష, రెండు లక్షలు ...ఏడు లక్షలవరకు పెరిగింది పాట. ఇంతలో ఒక పంజాబ్ యువకుడు ఆవేశంగా వేదికపైకి వచ్చి ఆ దండను లాగుకొని 'ఈ దండ నాది. నా పాట కోటి రూపాయలు. యెవరు ముందుకు వస్తారో రండి 'అంటూ ఆవేశంగా అరిచాడు. అలాగే మరోసారి ఒక ముస్లిం యువకుడు కోటి రూపాయల విలువ చేసే తన ఆస్తి సర్వస్వం సమర్పించడమే కాక, తనను తాను నేతాజీకి అర్పించు కొని దండను పొందాడు. ఆ విధంగా నేతాజీ కోట్ల కొలది రూపాయలు పోగుచేశాడు.

నేతాజీ తరచు అంటూ ఉండేవాడు- ''సామ్రాజ్యవాదంతో పోరాడ తావా- జాతి ఐక్యత సిద్ధిస్తుంది! సామ్రాజ్యవాదంతో రాజీ చేసుకొంటావా. అంతర్యుద్ధం వస్తుంది!''

సెప్టెంబరు 8 వ తేదీనాడు నేతాజీ సింగపూర్‌లో ఉన్నాడు. ఇటలీ మిత్రపక్షాలకు లొంగిపోయిందన్న వార్త తెలిసింది. నిరుత్సాహం కల్గించవలసిన ఈ వార్త నేతాజీని ఏమాత్రం క్రుంగతీయలేకపోయింది. బ్రిటిష్‌వాళ్ళ ప్రచారానికి మోసపోయి, వారి వలలో చిక్కిన భారతీయు లను విమర్శిస్తూ నేతాజీ ఒక ప్రకటన చేశాడు. యుద్ధంలో అక్షరాజ్యాలు గెలిచినా ఓడినా ఇంగ్లాండుకు మాత్రం ప్రపంచ రాజ్యాలలో అధికారం చలాయించే రోజులు చెల్లాయి. ఇంగ్లాండు యుద్ధానంతరం శక్తిహీనమైన దేశంగా మిగిలిపోతుంది అని జోస్యం చెప్పాడు. ఇటలీ ఓటమి చెంది౦ దని తెలుసుకొన్న తర్వాత స్వతంత్ర భారత తాత్కాలిక ప్రభుత్వాన్ని వెంటనే ఏర్పాటు చేసుకోవాలని నిశ్చయించుకొన్నాడు.

## స్వతంత్ర భారత తాత్కాలిక ప్రభుత్వం :

దూర ప్రాచ్యదేశాల నుంచి విచ్చేసిన వెయ్యిమందికి పైగా ప్రతినిధులు 1943 అక్టోబరు 21 నాడు సింగపూర్‌లో సమావేశమై, వెంటనే స్వతంత్ర భారత తాత్కాలిక ప్రభుత్వాన్ని స్థాపించాలనీ, దానికి ముఖ్య పాలనాధికారిగా నేతాజీ ఉండాలనీ ఏకగ్రీవంగా తీర్మానించారు. నేతాజీ ఆ సందర్భంలో మాట్లాడుతూ-

"1757 లో వంగదేశం బ్రిటీష్‌వారి చేతిలో ప్రథమ పరాజయం చవి చూచాక భారతీయులు వంద సంవత్సరాల కాలగతిలో అనేక పోరాటాలు సాగించారు. ఈ కాలంతో వీరత్వానికీ, ఆత్మ సమర్పణకూ సంబంధించిన అనేక ఉదాహరణలు చరిత్ర పుటలలో మనకు కనిపిస్తాయి. వీరిలో బెంగాల్‌కు చెందిన మోహన్‌లాల్, సిరాజుద్దౌలా, దక్షిణ భారతానికి చెందిన హైదర్ అలీ, టిప్పు సుల్తాన్, వేలుతంబి, మహారాష్ట్రకు చెందిన అప్పా సాహెబ్ భోన్లే, పీష్వా బాజీరావు, పంజాబ్‌కు చెందిన సర్దార్ శ్యాంసింగ్ అతరీవాలా, ఔధ్‌బేగం వారికంటే ఏ మాత్రం తీసిపోని ఝూన్సీరాణి, తాంత్యాతోపే, మహారాజ్ కున్వర్‌సింగ్, నానాసాహెబ్ ఇంకా అనేకమంది వీరులపేర్లు చరిత్రలో సువర్ణాక్షరాలలో కనిపిస్తాయి. దురదృష్టవశాత్తు మన పూర్వులు బ్రిటీష్‌వారి నుంచి ఇంత పెద్ద ఉపద్రవం ఏర్పడుతుందని ఊహించని కారణంగా శత్రువును ఓడించడానికి ఐక్య పోరాటం సాగించలేకపోయారు వాస్తవాన్ని గ్రహించాక అందరూ కలిసి 1857 లో బహదూర్ షా నాయకత్వంలో స్వతంత్ర భారతీయులుగా చివరిపోరాటం జరిపారు. ఈ యుద్ధంలో తొలిదశలో అనేక ఘన విజయాలు సాధించినప్పటికీ దురదృష్టవశాత్తు నాయకత్వపులోపంవలన పరాభూతులమైనాం. అయినప్పటికి వీరనారి ఝూన్సీరాణి, తాంత్యాతోపే, కున్వర్‌సింగ్, నానాసాహెబ్ మొదలైన వీరశిఖామణులు చిరస్మరణీయు

లుగా నిలిచిపోయి, భావితరాలవారు ఇంతకంటే ఎక్కువ త్యాగాలను, ఆత్మ సమర్పణను చేయడానికి కావలసిన స్ఫూర్తినిచ్చారు.

''1857 తర్వాత బలవంతంగా నిరాయుధులుగా చేయబడి విపరీతమైన రాక్షస చర్యలకు గురియై కొంతకాలం భారతీయులు నిర్వీర్యులయ్యారు. కాని 1885లో భారతీయ కాంగ్రెస్ స్థాపనతో క్రొత్తవెలుగు వచ్చింది. 1885 మొదలు మొదటి ప్రపంచ యుద్ధకాలంవరకు పోగొట్టుకున్న స్వాతంత్ర్యాన్ని తిరిగి పొందటానికి అన్నిరకాల ప్రయత్నాలు కొనసాగించారు. ఉద్యమాలు నడిపారు. ప్రచారం చేశారు. బ్రిటిష్ వస్తువులను బహిష్కరించారు. తీవ్రవాద చర్యలకు పూనుకొన్నారు. ఆఖరికి సాయుధ విప్లవం చేపట్టారు. అయితే ఈ ప్రయత్నాలన్నీ తాత్కాలికంగా విఫలమైపోయాయి. భారతీయులు పరాజయాల వలయంలో దిక్కుతోచని స్థితిలో బాధపడుతున్న తరుణంలో 1920లో మహాత్మా గాంధి సహాయ నిరాకరణ, సత్యాగ్రహం అన్న అస్త్రాలతో అవతరించాడు.

''ఆ తర్వాత రెండు దశాబ్దాలపాటు భారతీయులు తీవ్రమైన దేశభక్తితో కార్యకలాపాలుసాగించారు. భారతీయులందరికీ స్వరాజ్య సందేశం అందించబడింది. స్వయంగా బాధలుపడి, సర్వస్వం త్యాగంచేసి, ప్రాణాలు సహితం పోగొట్టుకొని ఇతరులకు ఆదర్శంగా నిలిచినవారెందరో ఉన్నారు. కేంద్రస్థానంనుంచి మారుమూలనున్న గ్రామంవరకు నివసిస్తున్న ప్రజలంతా ఏకసూత్ర బద్ధమైన రాజకీయ సంస్థగా రూపొందారు. ఈ విధంగా భారతీయులలో కేవలం రాజకీయచైతన్యమే గాకరాజకీయంగా తామంతా ఒక్కటే అన్న భావం అంకురించింది. నిర్దిష్టమైన ఆదర్శం కోసం అందరూ ఏకకంఠంతో నినదిస్తూ, ఒకే ఆకాంక్షను వెలువరించారు. 1937-39 మధ్యకాలంలో ఎనిమిది రాష్ట్రాలలో ఏర్పడిన కాంగ్రెస్ ప్రభుత్వాలు తమ వ్యవహారాలు తాము చక్కదిద్దుకొంటూ పరిపాలనా యంత్రాంగాన్ని సమర్థవంతంగా నిర్వహించగలమని ఋజువు పరిచారు.

''ఈ విధంగా నేటి యుద్ధసమయానికి భారతదేశ దాస్యవిముక్తికై తుది పోరాటం సాగించడానికి అనువైన వాతావరణం ఏర్పడి ఉంది. ఈ యుద్ధకాలంలో జర్మనీ తన మిత్రులతో కలిసి ఐరోపా ఖండంలో మన శత్రువుపైన తిరుగులేని దెబ్బతీసింది. తూర్పు ఆసియాలో జపాన్ అదే పని చేసింది. ఇన్ని అనుకూల పరిస్థితులమధ్య స్వరాజ్య స్థాపనకై భారతీయులకు మహదవకాశం లభించింది.

''చరిత్రలో తొలిసారిగా విదేశాలలో ఉన్న భారతీయులు రాజకీయంగా ఉత్తేజం పొంది ఒకే సంఘటనగా ఏర్పడ్డారు. స్వదేశంలో ఉన్న ప్రజల భావాలతో ఏకీభవించడమే కాదు- భుజం, భుజం కలిపి స్వరాజ్య పోరాటానికి సిద్ధంగా ఉన్నారు. ముఖ్యంగా తూర్పు ఆసియాలో 20 లక్షల మంది భారతీయులు సంఘటితమై 'సర్వసమర్పణ' నినాదంతో ఒక మాటపై నిలిచారు. వారిముందు భారతదేశ విముక్తి సేన 'ఢిల్లీచలో' నినాదంతో బారులు తీరి నిలబడివుంది.

''కృత్రిమ విధానాలు అనుసరించడం ద్వారా భారతీయులలో నిస్పృహ నింపి మోసంచేసి దోచుకొని వారిని ఆకలిబాధకు, మరణాలకు, గురిచేయడం ద్వారా బ్రిటిష్ ప్రభుత్వం భారతీయులలో పరపతి పరిపూర్ణంగా కోల్పోయి దుస్థితిలో పడింది. అవసాన దశలో ఉన్న ఆ అసంతుష్ట పరిపాలనను అంతమొందించడానికి ఒక కాగడా కావాలి. ఆ కాగడాను వెలిగించే పని ఈ భారత విముక్తి సేన నిర్వహిస్తుంది. స్వదేశంలో నివసిస్తున్న పౌరుల సమర్థనతోనూ, బ్రిటిష్ వారి సైన్యంలో పని చేస్తున్న భారతీయులలో అధిక సంఖ్యాకుల సమర్థనతోనూ, అజేయంగా ముందుకు సాగుతున్న విదేశీమిత్రుల అండతోను, అన్నింటికంటే ముఖ్యంగా స్వశక్తిపైననూ ఆధారపడి భారతదేశ విముక్తి సేన తన చారిత్రాత్మక పాత్రను సమర్థవంతంగా నిర్వహిస్తుంది.

"ఇప్పుడు స్వాతంత్ర్యం చేరువలోనే ఉంది కాబట్టి తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకొని ఆ ప్రభుత్వ ధ్వజ ఛాయలలో తుది పోరాటాన్ని కొనసాగించ వలసిన కర్తవ్యం భారతీయులందరిపైన ఉంది. ప్రజలు నిరాయుధులుగా ఉండి నాయకులంతా జైళ్ళలో ఉన్న సమయంలో తాత్కాలిక ప్రభుత్వాన్ని భారతదేశంలోనే ఏర్పాటు చేసుకొనే అవకాశం కానీ, సాయుధ పోరాటం సాగించే అవకాశం కానీ లేదు. కాబట్టి తూర్పు ఆసియాలో ఉన్న భారత స్వాతంత్ర్య సంఘం (Indian Independence League) ఇంటా, బయటా ఉన్న దేశభక్తులైన భారతీయులందరి సమర్థనతో అజాద్ హింద్ తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకొని భారత జాతీయ సేన తుది స్వతంత్ర సమరం సాగించవలసి ఉంది" అంటూ తన గంభీరోపన్యాసాన్ని ముగించాడు నేతాజీ.

## అజాద్ హింద్ తాత్కాలిక ప్రభుత్వ అవతరణ

"భారత స్వతంత్ర సంఘం ఆధ్వర్యంలో అజాద్ హింద్ తాత్కాలిక ప్రభుత్వం ఏర్పడడంతో మన విధ్యుక్త ధర్మాన్ని మనం బాధ్యతాయుతంగా నిర్వహిస్తాం. భారతదేశ దాస్య విముక్తికై సాగించ బడుతున్న ఈ పోరాటానికి అదృష్టం కలసి రావాలని ప్రార్థిస్తున్నాం. స్వరాజ్యం సంపాదించడంలోనూ, సంక్షేమ కార్యకలాపాలు నిర్వహించడంలోనూ, భారతదేశాన్ని ప్రపంచరాజ్యాలలో విశిష్టస్థానానికి చేర్చే కృషిలోనూ మేము, మాతోపాటు సాయుధ పోరాటంలో పాల్గొంటున్న సహచరులు ప్రాణాలు అర్పించడానికి సిద్ధంగా ఉన్నామని ప్రమాణ పూర్వకంగా తెలియజేస్తున్నాం.

"భారతదేశం నుండి బ్రిటిష్ వారిని, వారి మిత్రులను తరిమి వేయడమే తన ధ్యేయంగా పెట్టుకొని తాత్కాలిక ప్రభుత్వం పని చేస్తుంది. ఈ పని పూర్తి చేసిన తర్వాత భారత ప్రజల అభీష్టానుసారం

శాశ్వతమైన అజాద్ హింద్ జాతీయ ప్రభుత్వం ఏర్పడేట్లు చూడటం ఈ తాత్కాలిక ప్రభుత్వం తల పెట్టిన మరోపని. అంతవరకు భారత ప్రజల తరఫున ఈ తాత్కాలిక ప్రభుత్వం అన్ని వ్యవహారాలు నిర్వహిస్తుంది.

''ప్రతి భారతీయుడు ఈ తాత్కాలిక ప్రభుత్వానికి విధిగా కట్టుబడి ఉండాలని కోరుకొంటున్నాం. పౌరులందరికి సమాన హక్కులు, సమాన అవకాశాలు కలుగజేయడమే కాక, మత స్వేచ్ఛ ఇవ్వడం జరుగుతుంది. భారతీయులందరికి సుఖ శాంతుల కొరకు గతంలో బ్రిటిష్‌వారి కుటిల రాజనీతి కారణంగా వారిలో ఏర్పడిన విభేదాలను తొలగించి అనేక ప్రదేశాలలో నివసిస్తున్న భారతమాత సంతానంలో సమానత సాధించడానికి ఈ ప్రభుత్వం దృఢ నిశ్చయంతో ఉంది.

పరమేశ్వరుని పేరుమీద, ఈ జాతిని ఒకటిగా నిలిపి ఉంచేందుకు తరతరాలుగా కృషి చేసిన మహనీయుల పేరుమీద, వీరత్వాన్ని ఆత్మ సమర్పణ భావాన్ని మనకందించి గతించిన వీరుల పేరు మీద, భారత స్వాతంత్ర్యం కొరకు సాగించే పోరాటంలో ఈ ప్రభుత్వాన్ని సమర్థించవలసిందిగా కోరుకొంటున్నాం. బ్రిటిష్ వారికి, వారి మిత్రులకు వ్యతిరేకంగా, వారు భారతదేశాన్ని విడిచిపోయేంతవరకు, భారతీయులకు స్వాతంత్ర్యం సిద్ధించేవరకు అంతిమ విజయం మనదే అన్న విశ్వాసంతో, పట్టుదలతో, వీరోచితంగా తుది పోరాటాన్ని కొనసాగించ వలసినదిగా భారతీయులందరిని కోరుకొంటున్నాం.

ఇట్లు

సుభాస్‌చంద్రబోస్ (రాజ్యాధినేత, ప్రధానమంత్రి, యుద్ధమంత్రి మరియు విదేశాంగమంత్రి)

కెప్టెన్ శ్రీమతి లక్ష్మి (స్త్రీ సంఘటన)

యస్. ఏ. అయ్యర్ (ప్రకటన, ప్రచారం)

లెఫ్టినెంట్ కర్నల్ ఏ సి. చటర్జీ (ఆర్థిక శాఖ)
లె. క. అజీజ్ అహ్మద్, లె. క. యన్. యస్. భగత్,
లె.క. జె.కె. బోస్లే, లె.క. గుల్జారాసింగ్, లె.క. యం.జడ్.
కియాని, లె.క. ఏ.డి. లోగనాధన్, లె.క. ఎహసాన్ ఖాదిర్,
లె.క. షానవాజ్ (సైన్యవిభాగ ప్రతినిధులు)
ఏ.యం. సహాయ్ (కార్యదర్శి. మంత్రిహోదా)
రాస్‌బిహారిబోస్ (ఉన్నత సలహాదారు)
కరీం గని, దేవనాథ్‌దాస్, డి.యం.ఖాన్. ఏ. ఎల్లప్ప, ఏ.జె. తివి,
సర్దార్ ఇషార్‌సింగ్ (సలహాదారులు)
ఏ. యన్. సర్కార్ (న్యాయ సలహాదారుడు)
(సింగపూర్, 1943 అక్టోబర్ 21)

* * *

ఈ తాత్కాలిక ప్రభుత్వానికి అక్టోబర్ 23 నాడు జపాన్ ప్రభుత్వపు ఆధికార గుర్తింపు లభించింది. సార్వభౌమాధికారం లభించాక మొదటి చర్యగా అక్టోబర్ 24 నాడు తాత్కాలిక ప్రభుత్వం బ్రిటన్, అమెరికాల పైన యుద్ధం ప్రకటించింది.

1943 అక్టోబర్ 24 నాడు సింగపూర్‌లో భారత స్వాతంత్ర సంఘాన్ని ఉద్దేశించి మాట్లాడుతూ నేతాజీ ఇలా ప్రకటించాడు.

'భారతదేశపు తాత్కాలిక ప్రభుత్వం భారతదేశంలోని పరిస్థితులనూ, ప్రపంచ పరిస్థితులనూ శ్రద్ధగా పరిశీలించి బేరీజు వేసుకొని షోనాన్‌లో అర్ధరాత్రివేళ జరిగిన సమావేశంలో శత్రువుల మీద యుద్ధం ప్రకటించే తరుణం ఆసన్నమైనదనే నిర్ణయానికి వచ్చింది. ఈ ప్రకటన లోని విజ్ఞతని కొందరు భారతీయులు ప్రశ్నిస్తారన్న సంగతి నాకు బాగా తెలుసు. అయినప్పటికీ చట్టబద్ధంగా ఏర్పడి దేశానికి ప్రాతినిధ్యం వహిస్తున్న

ఒక ప్రభుత్వం జారీ చేసిన ఈ ప్రకటన చట్టసమ్మతమైనదే అని విశ్వసించవలసినదిగా కోరుతున్నాను. తాత్కాలిక ప్రభుత్వం తీసుకొన్న ఈ నిర్ణయం ప్రపంచ మంతటికీ రేడియో ద్వారా తెలియజేయడం జరిగింది. భారతదేశపు తాత్కాలిక ప్రభుత్వం బ్రిటిష్ వారిపైన, వారి మిత్రులైన అమెరికాపైన యుద్ధం ప్రకటించడం తన కర్తవ్యంగా భావిస్తోంది.

'స్నేహితులారా! తక్షణమే మనం సంసిద్ధమై భారతదేశంవైపు పురోగమిద్దాం. భారతదేశపు గడ్డపైన మన జాతీయ జండాను ఎగురవేసి ఢిల్లీవైపుకు సాగుదాం. ఈ సంవత్సరాంతానికి మనం భారతదేశం చేరుకొని భూతలంపైన సముద్రజలాలపైన ఆధిపత్యం సాధించాలి. రాబోయే పోరాటానికి సర్వ సన్నద్ధంగా ఉండాలి.'

## తూర్పు ఆసియా బృహద్ సమ్మేళనం

(Greater East Asia Conference)

ఈ తర్వాత రెండు రోజులకు జనరల్ చటర్జీ, జనరల్ భోస్లేలను వెంటపెట్టుకొని టోక్యోలో 1943 నవంబరు 5, 6 తారీఖులలో జరిగే తూర్పు ఆసియా బృహద్ సమ్మేళనానికి హాజరయ్యేందుకు నేతాజీ సింగపూర్‌నుంచి బయలుదేరాడు. ఈ సమ్మేళనం జయప్రదంకాలేదని చరిత్రకారులు స్పష్టంగా వ్రాశారు. ఇలాంటి సమ్మేళనం ఒక సంవత్సరం ముందుగా జరిగిఉంటే జయప్రదం అయిఉండేదని చాలామంది అభిప్రాయపడ్డారు. అంతేకాక, సమావేశం టోక్యోలో ఏర్పాటు చేయడమనేది టోజో రాజకీయ దివాలాకోరుతనానికి నిదర్శనం. బాండుంగులోకాని, మరోచోటకాని, ఈ సమావేశం ఏర్పాటు చేసిఉంటే దాని ప్రభావం ఇంకోవిధంగా ఉండేది. ఈ సమావేశానికి తాయ్‌లాండ్ ప్రధాని పిబుల్ సంగ్రామ్ హాజరుకాకుండా ఒక ప్రతినిధిని పంపించాడు. బర్మానుంచి బామా హాజరయ్యాడు కాని, బర్మా ప్రజల అభీష్టానికి ప్రతిబింబంగా మాత్రం కాదు.

ఫిలిప్పైన్స్ నుంచి వచ్చిన అధ్యక్షుడు జోస్. పి. లారెల్ అప్పటికే ప్రజాభిమానాన్ని పోగొట్టుకొని కూర్చున్నాడు. చైనాలోని నాన్‌కింగ్ ప్రభుత్వాధినేత వాంగ్ చింగ్ వే హాజరైనాడు. మంచుకోనుండి ఒక అనామక ప్రతినిధి వచ్చాడు. మేధాసంపదలోను, రాజనీతిజ్ఞతలోను, చొరవలోను, వీరెవరూ నేతాజీకి సమఉజ్జీలుకారు. కాబట్టి ఈ సమ్మేళనం తూర్పు ఆసియా బృహద్ సమ్మేళనంగాకాక నేతాజీ సమ్మేళనంగా మారి పోయింది.

ఈ సమ్మేళనానికి మూడురోజులు ముందు జర్మన్ దౌత్య ప్రతినిధి హెన్రిచ్ స్టేమర్ స్వతంత్ర భారత తాత్కాలిక ప్రభుత్వానికి తమ దేశపు అధికారిక గుర్తింపును అందజేశాడు. ఈ సమ్మేళనం ముగింపు సమావేశంలో 'భారత స్వాతంత్ర్యోద్యమ పోరాటానికి సంపూర్ణ సానుభూతి, సమర్థనా తెలియజేస్తున్నాం' అంటూ బామా ప్రవేశ పెట్టిన తీర్మానాన్ని సమ్మేళనానికి హాజరైన ప్రతినిధులంతా ఏకగ్రీవంగా ఆమోదించారు. నేతాజీ తన కృతజ్ఞతలు తెలుపుతూ ఇలా చెప్పాడు-

"ఈ సమ్మేళనం అధికారం ద్వారా లభించిన కవళం పంచుకోవడానికి ఏర్పడినట్టిది కాదు. అనగా ఒక బలహీన దేశాన్ని కబళించడానికి గానీ, లేక పొరుగునఉన్న ఒక పేదదేశాన్ని మోసగించడానికిగానీ పన్నిన కుట్రలో భాగంలో ఏర్పాటుచేయబడినది కూడా కాదు. ఇది స్వతంత్రమైన రాజ్యాల సమాగమం. ప్రపంచానికి ఒక క్రొత్త దిశను ఇవ్వడానికిఏర్పడిన సమ్మేళనం. న్యాయం, సార్వభౌమాధికారం పరస్పరం ఇచ్చిపుచ్చుకొనే అంతర్జాతీయ సంబంధాలు, సహాయ సహకారాలు అందించుకొనే సుహృద్భావం అనే పవిత్ర సిద్ధాంతాల ఆధారంగా ఏర్పాటు అయిన సమ్మేళనం ఇది..."

మొత్తం ఈ సమ్మేళనంలో జరిగిన కార్యక్రమాలన్నింటిలో నేతాజీ ఉపన్యాసం తలమానికంగా భాసించింది.

తన ముగింపు ఉపన్యాసంలో జపాన్ ప్రధాని టోజో ఒక ప్రకటన చేశాడు. కొద్ది రోజులలోనే అండమాన్, నికోబార్ దీవులను స్వతంత్ర భారత తాత్కాలిక ప్రభుత్వానికి బదిలీచేస్తున్నట్లు ప్రకటించాడు. అన్నట్లు గానే ఒక నెల రోజుల తర్వాత 8,100 చదరపు కిలో మీటర్ల విస్తీర్ణంతో 33,000 మంది జనాభా గల ఈ దీవులను తాత్కాలిక ప్రభుత్వానికి బదిలీ చేయడం జరిగింది. ఆ విధంగా 20వ శతాబ్దంలో నిర్దిష్టమైన భూభాగంతో సార్వభౌమాధికారంగల తొలి స్వతంత్ర భారత ప్రభుత్వం ఏర్పడింది. ఆ సందర్భంలో జారీచేసిన ప్రకటనలో నేతాజీ ఇలా తెలియజేశాడు —

"అండమాన్, నికోబార్ దీవులను స్వాధీనం చేసుకొంటున్నామంటే బ్రిటిష్ పాలననుంచి ప్రప్రథమంగా ఈ భూభాగాన్ని విముక్తం చేశామన్న మాట. ఈ ప్రాంతం స్వాధీనం చేసుకొన్న తర్వాత తాత్కాలికప్రభుత్వం నామమాత్రంగానే కాక వాస్తవమైన జాతీయ ప్రతిపత్తిని సంపాదించింది. అండమాన్ దీవులను బ్రిటిష్ ప్రభుత్వం రాజకీయ ఖైదీలు జైలుగా ఉపయోగిస్తూ ఉండేది. ఈ జైలును విముక్తం చేయడం ద్వారా భారతీయుల సంకెళ్ళు తెగకొట్టబడ్డాయన్నమాట. ప్రభుత్వం పైన కుట్ర పన్నారన్న నేరారోపణతో అనేక మంది భారతీయులను ఈ దీవులకు పంపి జైళ్ళలో బంధించేవారు. ఫ్రెంచి విప్లవ కాలంలో పారిస్ నగరం లోని బాస్టైలీని ప్రప్రథమంగా విముక్తం చేసి అక్కడ నిర్బంధించబడిన రాజకీయ ఖైదీలకు స్వేచ్ఛను ప్రసాదించినట్లుగానే భారత స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్న అనేక మంది దేశభక్తులు ఖైదీలుగా మగ్గుతున్న అండమాన్ దీవులను ప్రథమంగా విముక్తం చేసి ఇక్కడి నిర్బంధితులకు స్వేచ్ఛను ప్రసాదించడం జరిగింది. ఇకపైన ఒక ప్రాంతం తర్వాత మరొకటిగా భారత భూభాగం విముక్తి పొందుతుంది. అయితే ప్రథమంగా

బానిసత్వంనుంచి విముక్తి పొందిన ప్రాంతానికి ఎప్పుడూ ప్రాముఖ్యం ఉంటుంది.....మనం అండమాన్ దీవులను అమర వీరుల చిహ్నంగా 'షహీద్' అని, నికోబార్ దీవులకు 'స్వరాజ్' అన్న పేర్లతో పిలుస్తాం."

* * *

సమ్మేళనానంతరం టోక్యోలో ఉన్న వారం రోజులలో నేతాజీ అవిరామంగా జపాన్ నాయకులను కలుసుకొని సంభాషణలు కొనసాగించాడు. భారతదేశాన్ని గూర్చి పరిశీలనాత్మకంగా అధ్యయనం చేసిన డా॥ షుమే ఒకావాను కూడా కలవడం జరిగింది. 'భారత స్వాతంత్ర్య సముపార్జనకై అవసరమైతే రష్యాతోనే కాదు, సాక్షాత్తు భూతంతో చేతులు కలిపి అయినా బ్రిటిష్‌వారితో పోరాడటానికి నేను సిద్ధంగా ఉన్నాను' అంటూ మాటల సందర్భంలో నేతాజీ ఆయనకు చెప్పాడు. దరిమిలా నేతాజీని గూర్చి తన అభిప్రాయం తెలియజేస్తూ, సంపూర్ణంగా భారత స్వాతంత్ర్య సముపార్జన ధ్యేయం తప్ప మరొక భావన నేతాజీకి లేనే లేదనీ, ఆయనను నాజీల సమర్థకుడు అని విమర్శించడంకన్న అవివేకం మరొకటి ఉండదని డా॥ ఒకావా చెప్పాడు. ఇంత అవిశ్రాంతంగా పని చేస్తూ కూడా రోగగ్రస్తుడై ఉన్న రాస్‌బిహారీబోస్‌ను పలుకరించి వచ్చాడు. జపాన్‌లో అప్పుడు చదువుకొంటూ ఉన్న భారతీయ విద్యార్థులను కూడా కలుసుకొన్నాడు.

జపాన్ వారితో సాగించిన సంప్రదింపుల ఫలితంగా వారి వద్ద నుంచి నేతాజీ అనేక వాగ్దానాలు పొందాడు. కాని, యుద్ధభూమిలో అనేక ఒడుదుడుకులు సంభవించి నష్టపోతున్న కారణంగా జపాన్‌వారు తాము చేసిన వాగ్దానాలను నెరవేర్చలేకపోతుండేవారు.

## అవిరామ పర్యటన :

1943 నవంబరు 17 వ తేదీనాడు నేతాజీ టోక్యో నుంచి వాంగ్ చింగ్‌వే ఆహ్వానంపైన నాన్‌కింగ్‌కు బయలుదేరి వెళ్ళాడు. ఏవిధమైన

ఙర్షణలకు లోనుకాకుండా ఋషితుల్యమైన పవిత్ర జీవితం గడపడానికి
ఙలవాటుపడిన నేతాజీని చూచి వాంగ్ ప్రశంసతో కూడిన ఆశ్చర్యాన్ని
వ్యక్తం చేశాడు. వాంగ్‌తోపాటు ఇతర జాతీయ నాయకులూ జపాన్
సైనికాధికారులూ కూడా నేతాజీ జీవిత సరళిని కొనియాడకుండా ఉండ
లేకపోయారు. నేతాజీ అందరి మన్ననలకు పాత్రుడు కావడానికి అదొక
ముఖ్య కారణం. శీలసంపన్నుడికి గౌరవం లభించని దెక్కడ? నేతాజీ
నాన్‌కింగ్ నుంచి షాంగై వెళ్ళాడు. నవంబరు 21 నాడు ఆ మహా
నగరంలో నివసిస్తున్న భారతీయులను కలుసుకొన్నాడు. అనేక మంది
యువకులు భారత జాతీయ సేనలో చేరేందుకు తమ సంసిద్ధత తెలియ
జేశారు. వీరందరినీ బర్మాకు తరలించడానికి కావలసిన నౌకలు అందజేసే
స్థితిలో జపాన్ లేదు. అందుచేత వారికి కృతజ్ఞతలు చెప్పుకొని, ఆ మర్నాడు
అక్కడినుంచి మనీలా చేరుకొన్నాడు. అక్కడి భారతీయుల నుంచి
స్వతంత్ర పోరాటానికి కావలసిన ధనం సేకరించడానికి ప్రయత్నించాడు
కాని, అది అంతగా ఫలించలేదు. ఈ అమెరికా వలస ప్రాంతంలో నివసి
స్తున్న భారతీయులు ఆగ్నేయాసియా నగరాలలోని భారతీయులవలె
సంపన్నులు కాకపోవడమే అందుకు కారణం. నవంబర్ 25 నాడు నేతాజీ
సింగపూర్ చేరుకొన్నాడు. తన కేబినెట్ మంత్రులతోనూ, ఇతర సహ
చరులతోను వ్యూహపరమైన చర్చలు కొనసాగించేందుకు అత్యవసర
సమావేశాన్ని ఏర్పాటు చేశాడు. మళ్ళీ డిశంబర్ 10 నాడు సింగపూర్
నుంచి బయలుదేరి ఇండొనీషియాలోని జకార్తా, సురబాయ మొదలైన
ముఖ్య పట్టణాలలో ఒక వారం రోజులపాటు అక్కడి భారతీయులను
కలుసుకొంటూ గడిపాడు. శక్తి మహాసాగరుడైన నేతాజీ విసుగు,
విరామం లేకుండా అలా పర్యటిస్తూనే ఉన్నాడు. యుద్ధకాలంలో ఎదు
రయ్యే కష్టాలనూ, లోపాలనూ సరకుచేయక అయిదు మాసాల వ్యవధిలో
తూర్పు ఆసియా దేశాలన్నింటిలోను పర్యటించాడు. ఈ ప్రాంతంలో

నివసిస్తున్న ముప్పైలక్షల మంది భారతీయుల హృదయాలను చూర గొన్నాడు డిశంబరు 29 నాడు అండమాన్‌ను దర్శించి అధికారికంగా ఆ ప్రాంతాన్ని స్వతంత్ర భారత తాత్కాలిక ప్రభుత్వ అధీనంలోనికి తెచ్చుకొన్నాడు. అండమాన్, నికోబార్ దీవులకు ప్రధాన కమీషనర్‌గా కల్నల్ ఏ.డి. లోగనాధన్‌ను నియమించాడు.

## ఇంఫాల్ ముట్టడి

బర్మా స్థావరంగా కల్గిన మూడు జపాన్ సైనిక డివిజన్లూ, భారత జాతీయసేనా కలిసి తూర్పు ఆసియా యుద్ధంలో జరిపిన తుది పోరాటం ఇంఫాల్ ముట్టడి. భారతదేశంలో మణిపూర్ రాష్ట్రంలో ఉన్న ఇంఫాల్ మిత్ర రాజ్యాలకు బర్మా సరిహద్దు సమీపంలో ఉన్న బలమైన స్థావరం. ఈ ముట్టడి 1944 మార్చి 16 నుండి జూలై 9 వరకు సాగింది. 1942లో బర్మాను కైవసం చేసుకొన్నప్పుడే ఇంఫాల్‌ను కూడా పట్టుకోవాలని, అలాచేస్తే ఆ ప్రాంతంలో మిత్రరాజ్యాల ఆయువుపట్టు పట్టుకొన్నట్లుగా అవుతుందని కొందరు జపాన్ అధికారులు సూచించారు. కాని ఆ విధంగా చేసినట్లయితే భారతీయులను రెచ్చగొట్టినట్లవుతుందని, అదీకాక బర్మా సరిహద్దులలో ఉన్న మహారణ్యాలను, చింద్విన్ నదిని దాటి వెళ్ళడం అసాధ్యమైన కార్యం అని జపాన్ ప్రభుత్వం భావించి ఊరుకుంది. అయితే ఆ అరణ్యాలు దాటడం అంత కష్టతరమైన కార్యం కాదని ఆ తర్వాత అనుభవ పూర్వకంగా తెలుసుకొన్నారు. ఆ తర్వాత ఇంఫాల్ ముట్టడికి మరో ప్రబలమైన కారణం నేతాజీ. భారత జాతీయ సేనతో కలిసి భారత దేశంమీదకుపోతే ఎదిరించడానికి బదులుగా భారతీయులు ఆహ్వానిస్తారని జపాన్ భావించింది. అందుచేతనే ఇంఫాల్ యుద్ధానికి సిద్ధపడ్డారు. ఏది ఏమైనప్పటికి, ఇనుమును కాలుతూ ఉండగానే సాగకొట్టాలన్న సూత్రం మర్చిపోవడం అనర్థాలకు దారి తీసింది.

1943 ఆగస్టులో లెఫ్టెనెంట్ జనరల్‌కి ట్యూజూ అయాచేని

టోజో తెరోచీకి సహాయకుడుగా సింగపూర్ పంపాడు. ఇంఫాల్ యుద్ధా నికి అనుమతి సంపాదించడానికి ఇద్దరు సైనికాధికారులను వెంటబెట్టుకొని అయాచే టోక్యోకు చేరాడు. ఈ యుద్ధంలో నిశ్చయంగా జయం తమను వరిస్తుందని వర్ణించి చెప్పి, క్రొత్త సంవత్సరం ప్రవేశిస్తుందనగా టోజో ఆజ్ఞలు సంపాదించారు. అధికారికంగా 1944 జనవరి 7వ తేదీన ఆజ్ఞలు జారీ అయినాయి. ఈ ఆజ్ఞలు జారీ కావడం, భారత జాతీయ సేన రంగూనులో ప్రవేశించడం ఒకేసారి జరిగాయి. నాల్గుమాసాలు దీర్ఘమైన చర్చలు జరిగాక భారత జాతీయ సేన బర్మాలో ప్రవేశించడానికి ఆ ప్రభుత్వం అంగీకరించింది. ఆ సాయంత్రమే బర్మా హెడ్ క్వార్టర్స్‌లో జపాన్ సైనికాధికారిగా ఉన్న లెఫ్టెనెంట్ జనరల్ మసకాజు కవాచీ నేతాజీ గౌర వార్థం విందుచేశాడు. ఆ విందు సందర్భంలో మాట్లాడుతూ, 'రక్త తర్ప ణంలో స్వరాజ్యానికి మూల్యం చెల్లించుకొనే అవకాశం ఎంత త్వరగా వీలైతే అంత త్వరగా ప్రసాదించమని ఆ పరమేశ్వరుని ప్రార్థిస్తున్నాను' అన్నాడు నేతాజీ. సందర్భోచితమైన నిర్ణయాలు తీసుకోలేనటువంటి బామా తోను, తిరస్కార భావం పెంచుకొంటున్న ఆంగ్ శాంగ్‌తోనూ విసిగి పోయిన కవాచే బృందం నేతాజీ చొరవకు ముగ్ధులై, చాలా సన్నిహితులై పోయారు. ఆ తర్వాత జపాన్ సైన్యానికి సంబంధించిన ముఖ్య రహస్యా లనుకూడా నేతాజీ తెలియజేస్తూ ఉండేవారు. అనతికాలంలోనే రంగూన్‌లో జపాన్, ఇండియా, బర్మా సమన్వయ బృందం ఏర్పడింది. ఇంఫాల్ యుద్ధంలో బర్మా సైన్యం చేరనక్కరలేదని నిర్ణయించారు. ఆ తరువాత సంభవించిన పరిణామాలదృష్ట్యా ఇది గుర్తుంచుకోవలసిన నిర్ణయం.

ఇంఫాల్ యుద్ధాన్ని త్వరగా ప్రారంభించి మే నెలాఖరుకు పూర్తి స్తే సత్ఫలితాలు సాధించవచ్చునన్నది ముటగూచి అభిప్రాయం. కాని ఈ నికోసం ఆయనకు మూడు డివిజన్లు ఒప్పగించగా, నిర్దిష్టంగా ఒక్క డివిజన్

మాత్రమే బర్మాలో ఉంది. ఇంకో డివిజన్ బాంకాక్ నుండి అనుకొన్న సమయానికి చేరింది. కాని మూడవ డివిజన్ నాన్‌కింగ్ నుండి రావడంతో చాలా ఆలస్యం జరిగింది. అందుచేత మార్చి 15 వరకు ముట్టడి ప్రారంభించడానికి వీలు కుదరలేదు.

ఈలోగా భారత జాతీయ సేన దళాలు తాయ్‌లాండ్ గుండా వచ్చి బర్మా చేరాయి. ఒకరోజున ఈ దళాల కవాతు జరుగుతూ ఉండగా, బర్మా అధికారులు కొందరు నేతాజీతో పాటు పర్యవేక్షిస్తున్నారు. ఇంతలో అనుకోకుండా శత్రువిమానాలు దాడి చేశాయి. బర్మా అధికారులు ఎక్కడివారక్కడ చిందరవందరగా ప్రాణ రక్షణకు పరుగులెత్తారు. నేతాజీ మాత్రం స్థిరంగా నిలబడి, తన సైనికులంతా సురక్షిత ప్రదేశాలకు చేరేంత వరకు తగిన ఆజ్ఞలు జారీ చేస్తూనే ఉన్నాడు. నేతాజీ ధైర్య సాహసాలను చూసిన జపాన్ అధికారులు విస్తుపోయారు.

స్వతంత్ర భారత తాత్కాలిక ప్రభుత్వం తాయ్‌లాండ్‌కు లక్ష బాట్లను బహూకరించింది. క్లిష్టకాలంలో క్రొత్తగా ఏర్పడిన ఆ చిన్న ప్రభుత్వం అంత మొత్తాన్ని అందించకల్గినందుకు తాయ్ ప్రజలు సంతోషించారు.

ఈ సమయంలోనే భారతదేశంలో కస్తూరిబా మరణించింది. ఆమె 74 వ ఏట జైలులో మరణించింది. కస్తూరిబా గాంధీ మరణవార్త విన్న నేతాజీ చలించిపోయాడు. వీరనారిగా, ధర్మపత్నిగా కర్తవ్య నిర్వహణలో ప్రాణాలు విడిచిన ఆ వనితారత్నానికి జోహారులర్పించాడు నేతాజీ.

ఇంఫాల్ ముట్టడికి సైన్యం సాగింది. ఒకలక్షా ఇరవై వేల మంది సైనికులు చింద్విన్ నదికి 200 కిలోమీటర్ల పొడవునా రహస్యంగా చేరుకొన్నారు. ఎంతో జాగ్రత్తగా ఆ పరిసరప్రాంతాలను కనిపెట్టిఉన్న బ్రిటిష్ సైనికాధికారులూ, గూఢచారులూ పసికట్టకుండా ఈ పని జరగడం ఆశ్చర్యకరమైన విషయం. ఈలోగా భారత జాతీయ సేన వచ్చి చేరింది.

ముట్టడి ప్రారంభిస్తారనగా మధ్యబర్మాలోని మైమియో హెడ్‌క్వార్టర్స్‌లో ముటగూచి యుద్ధవార్తలు తెలిపే విలేఖరులు సమావేశం ఏర్పాటుచేసి-

"మూడు డివిజన్ల నా సైన్యం ఒక మాసం రోజులలో ఇంఫాల్‌ను పట్టుకోవడం జరుగుతుంది. ఈ ముట్టడి త్వరితగతిని పూర్తి అయ్యేందుకు వీలుగా భారీ మందుగుండు సామగ్రితోనూ, మూడు వారాలకు పుష్కలంగా సరిపడే ఆహార పదార్థాలతోనూ నా సైన్యం సాగిపోతోంది. ఏప్రిల్ 29 వ తేదీన చక్రవర్తి పుట్టినరోజు ఉత్సవాలకు మిమ్మల్ని ఇంఫాల్‌లో కలుసుకొంటాను" అని చెప్పాడు.

భారత జాతీయ సేనతో కలిసి జపాన్ సేన ఈ విధమైన ముట్టడికి బయలుదేరుతుందన్న విషయం బ్రిటిష్‌వారు ఊహించనైనా ఊహించ లేదు. వాహనాలు కానీ, విమానాలు కానీ అందుబాటులో లేనప్పటికీ, ఈ సైన్యాలు ఆ అడవులనూ, పర్వతాలనూ దాటుకొంటూ నడిచారనడం కంటే పరుగులు పెట్టారనడం భావ్యంగా ఉంటుంది. జపాన్‌వారి 31 వ డివిజన్, 15 వ డివిజన్ అరకాన్ పర్వతశ్రేణులగుండా 200 కిలోమీటర్లు నడిచి, రెండు వారాల సమయంలో భారత-బర్మా సరిహద్దును చేరుకొన్నాయి. అయితే ఇంతటి సాహస చర్యా 33 వ డివిజన్ చేసిన పొరపాటు వలన వమ్ము అయిపోయింది. ఈ డివిజన్‌వారు అతిత్వరగా ప్రయాణం చేసి ఎత్తైన పర్వత శ్రేణులతో చుట్టబడిఉన్న ఇరుకు లోయలో బ్రిటిష్‌వారి 17 వ డివిజన్‌ను చుట్టుముట్టారు. ట్రక్కులతోనూ, ఇతర మోటారు వాహనాలతోనూ సమృద్ధిగా ఉన్న ఆ 17 వ డివిజన్ పూర్తిగా తుడిచి పెట్టుకుపోవడమో లేక లొంగి పోవడమో తప్ప మార్గాంతరం లేదని అంతా భావించారు. 17 వ డివిజన్ పని అయిపోయిందనే అంతా అనుకొన్నారు. ఇంతలో బ్రిటిష్‌వారి 17 వ డివిజన్ వెనక్కు సర్దుకొనేందుకు వీలు లేకుండా అడ్డంగా నిలిచిన జపాన్ వారి 215 వ రెజిమెంటు పైన శత్రువుల వత్తిడి ఎక్కువైంది. ఆ వత్తిడికి తట్టుకోలేని పరిస్థితి

ఏర్పండిదన్న వర్తమానం చేరేసరికి, లెఫ్టినెంట్ జనరల్ మొట్వొ యానగిడా 215 వ రెజిమెంటును రెండు కిలో మీటర్లు ప్రక్కకు వెళ్ళ మని ఆజ్ఞలు జారీ చేశాడు. ఇంకేముంది, బ్రిటిష్ వారి 17 వ డివిజన్ క్షేమంగా వెనక్కు వెళ్ళే అవకాశం చిక్కింది.

మార్చి 27 నాడు ముటగూచికి కేబుల్ పంపుతూ, ముట్టడి కొన సాగించడం అవసరమా అన్న విషయం మరోసారి ఆలోచించ వలసిన దిగా యానగిడా కోరాడు. వీరిలో ఒకరు ముందుకు సాగిపొమ్మనీ, మరొ కరు ముందుకు పోవడం మంచిది కాదనీ వాదులాడుకోవడంలో వారం రోజుల సమయం వృథా అయిపోయింది. చివరకు ఎలాగైతేనేం యానగిడా ముందుకు పోవడానికి అంగీకరించి బయలుదేరాడు. కాని వేగం తగ్గించి అతి జాగ్రత్తగా ఆచి-తూచి అడుగు ముందుకు వేయడం ప్రారంభించాడు. ముందుగా అగ్రగామిదళం పరిశీలనచేసి అంతా సవ్యంగా ఉందని తెలియ జేశాకనే మిగతా సైన్యాన్ని ముందుకు కదిలించేవాడు ఏప్రిల్ 10 నాడు ఇంఫాల్‌కు 50 కిలో మీటర్ల దూరంలో ఉన్న టోర్‌బంగ్‌కు యానగిడా అధ్వర్యంలోని 33 వ డివిజన్ చేరింది. 31 వ డివిజన్ మిడతల దండులా సాగి అస్సాంలో ఇంఫాల్‌కు, దిమాపూర్‌కు మధ్య నున్న కోహిమా చేరు కొంది. 15 వ డివిజన్ ఇంఫాల్-కోహిమా రోడ్డును ఆవరించియున్న కొండలపైకి చేరింది. మొత్తం మీద అనుకొన్నదానికంటే ముందుగా, ఊహించినదానికంటే ఎక్కువ ఫలితాలు సాధించారనే చెప్పాలి.

జపాన్ సైన్యాలకు తోడుగా భారత జాతీయ సేన కదన భూమిలో కదం త్రొక్కుతూ ముందుకు సాగి, ఏప్రిల్ 6 వ తేదీనాడు కోహిమాను పట్టుకొన్నారన్న వార్త ఏప్రిల్ 8 వ తేదీన టోక్యో రేడియోలో విన్నారు. జపాన్ చక్రవర్తి పుట్టినరోజు ఏప్రిల్ 29 నాటికి ఇంఫాల్ పట్టుబడటం ఖాయం అని అనుకొన్నారు. కొన్ని మాసాలుగా ఒకదాని తర్వాత ఒకటిగా ఎదురవుతున్న అపజయాలతో దిగులు చెందిన టోజో మొఖంలో చాలా

కాలానికి చిరునవ్వు కనపడింది. భారత జాతీయ సేన వశపరచుకొన్న భూభాగాలపై పరిపాలన బాధ్యత పూర్తిగా స్వతంత్ర్య భారత తాత్కాలిక ప్రభుత్వానికే వదిలివేయాలని టోజో ఉత్తర్వులు జారీ చేశాడు. శత్రు సంహారం పూర్తి అయిన తర్వాత భారత భూభాగాన్ని భారతీయులకే ఒప్పచెప్పాలనే నిశ్చయంతో జపాన్‌వారు ఉన్నారు. రోగగ్రస్తుడై ప్రక్కమీది నుంచి లేవలేని స్థితిలో ఉండి కూడా రాస్‌బిహారీబోస్ టోక్యోలో రేడియో స్టేషన్‌కు వెళ్ళి తన సంతోషాన్ని వ్యక్తం చేస్తూ ప్రసంగించాడు. అయితే ఏవో అనివార్య కారణాలవల్ల కాబోలు ఆ ప్రసంగం ప్రసారం కాలేదు.

బర్మా సరిహద్దులు దాటి భారత భూభాగంపైన అడుగు పెట్టగానే నేతాజీ ఒక ప్రకటన చేశాడు భారతదేశం పూర్తిగా బ్రిటిష్‌వారి కోరల నుండి విముక్తి అయ్యేంతవరకు జపాన్ వారితో కలిసి సాగించే పోరాటం కొనసాగుతూనే ఉంటుందని ప్రకటించాడు. స్వతంత్ర భారత తాత్కాలిక ప్రభుత్వం తరఫున చేసిన విన్నపంలో భారత ప్రజలంతా తనను పూర్తిగా సమర్థించాలని, అమెరికా బ్రిటన్‌లు సాగించే యుద్ధ ప్రయత్నాలను అడుగడుగునా అడ్డుకొని భారత స్వాతంత్ర్య సమరం అనతికాలంలోనే జయప్రదంగా ముగిసేట్లు చేయాలనీ కోరాడు. బ్రిటిష్ వారితో కలిసి పని చేస్తున్న భారతీయ సైనికులు బ్రిటిష్ పాలకులను విడిచిపెట్టి భారత జాతీయ సేనలో కలసిపోవలసిందిగా పిలుపు నిచ్చాడు. బ్రిటిష్‌వారి ఆధీనంలో పనిచేస్తున్న భారతీయ అధికారులు వారిని విడిచిపెట్టి స్వతంత్ర భారత తాత్కాలిక ప్రభుత్వం కొనసాగిస్తున్న పవిత్ర సమరంలో చేతులు కలపవలసిందిగా విజ్ఞప్తి చేశాడు. అనతికాలంలోనే తాత్కాలిక ప్రభుత్వ స్థావరం బ్రిటిష్ వారినుండి జయించుకొన్న భారత భూమిలో ఏర్పాటు చేయబడుతుందని తెలియజేశాడు. అమెరికా - బ్రిటన్ ఆధీనంలో ఉన్న విమానాశ్రయాల నుంచీ, మందుగుండు ఫ్యాక్టరీల నుంచీ, ఇతర సైనిక

పరమైన వ్యవస్థల నుంచీ తక్షణమే వైదొలగి పోవలసినదిగా భారతీయు లను హెచ్చరించాడు. ఆ విధంగా జపాన్ సేనలూ, భారతీయ సేనా జరిపే దాడులనుంచి తమ్మును తాము రక్షించుకోవలసిందిగా సలహా ఇచ్చాడు. ఈ క్లిష్ట సమయంలో ప్రతి భారతీయుడూ తనవంతు కర్తవ్యాన్ని నిర్వ హించాలని కోరాడు. ఏప్రిల్ 4 వ తేదీన లెఫ్టనెంట్ జనరల్ ఏ. సి. చటర్జీని క్రొత్తగా విముక్తి చేయబడిన ప్రాంతాలకు గవర్నరుగా నియ మించాడు.

## అనూహ్యమైన పరాజయం

జపాన్ సేనతో, భారత జాతీయ సేన ఎవరూ ఊహించని రీతిగా, అతి విచిత్రంగా, బహు సులభంగా బర్మా సరిహద్దును దాటి, భారత భూ భాగంలోనికి ఏవిధంగా చొచ్చుకు రాగలిగారో అంతకంటె ఎక్కువ విచిత్రంగా వారు పరాజయం పాలైనారు. అంతా అయిపోయింది, విజయం చేతి కందినది అనుకొన్న తరుణంలో పరాజయం అనే రక్కసి కోరలలో చిక్కుకు పోవడం జరిగింది. ఈ ఓటమికి అనేకులు అనేక కారణాలు చెప్తారు బ్రిటిష్ వారి 14 వ ఆర్మీ కమాండర్‌గా ఉన్న జనరల్ సర్ విలియం స్లిమ్ ఇలా అంటాడు—

“జపాన్ వారి 31 వ డివిజన్ కోహిమాను పట్టుకొన్న వెంటనే కొద్దిపాటి సైన్యాన్ని మాత్రం కోహిమా రక్షణకు అక్కడ ఉంచి మిగిలిన సైన్యంతో దిమాపూర్ పైన పడి ఉంటే బ్రిటిష్ వారి ఆర్మీ చిత్తు చిత్తుగా ఓడిపోయి ఉండేది.”

దిమాపూర్‌లో మొత్తం సైన్యానికి పుష్కలంగా సంవత్సరం పాటు తినడానికి సరిపడే ఆహార పదార్థాల నిల్వలు ఉన్నాయి. ఆ ప్రదేశం ఏమాత్రం రక్షణ లేకుండా నిస్సహాయ స్థితిలో ఉంది. ఆ పరిస్థితిలో కాస్త తెగింపు చేసి జపాన్ వారి 31 వడివిజన్ ముందుకు సాగి ఉండే వారి కష్టాలు గట్టెక్కి, కొదువలేని సరఫరాలు చేతి కందేవి. కాని

అదృష్టం మరో విధంగా ఉన్నప్పుడు అదెలా జరుగుతుంది? వాస్తవానికి జపాన్ సేనలూ, భారత జాతీయ సేనా తినడానికి తిండిలేక, త్రాగడానికి మంచి నీరు లభించక, రోగ పీడితులై, ఒక్క అడుగు కూడా ముందుకు వేయలేని స్థితిలో వెనుదిరగవలసి వచ్చింది.

జనరల్ ముటగాచీకి జపాన్ సేనల ఉపసంహరణ ఏమాత్రం ఇష్టంలేదు. 33 డివిజన్ కమాండర్ అయిన లెఫ్‌టెనెంట్ జనరల్ యనగి దాని 1944 మే నేలలో పదవినుంచి తొలగించాడు. అయితే, ఒక నెల గడిచే సరికి ముటగాచీకి మరో చేదు అనుభవం ఎదురైంది. జూన్ 3 వ తేదీన 31 వ డివిజన్ కమాండర్ లెఫ్‌టెనెంట్ జనరల్ కొటోకుసాటో మిగిలి ఉన్న పది వేల సైనికులను తీసుకొని ముటగూచీ అనుమతి తీసుకో కుండానే ఉపసంహరించుకొని వెనకకువచ్చేశాడు. 80 సంవత్సరాల జపాన్ సైన్య చరిత్రలో ఆజ్ఞలు ధిక్కరించిన ఉదాహరణలు అంతకు పూర్వం లేవు. ఇదేమొదటిసారి, చివరిసారి కూడా. ఈ చర్యపట్ల మండిపడిన ముటగూచి సాటోను పదవి నుంచి పీకిపారేసి, కోర్టు మార్షల్ చేయడానికి సిద్ధపడ్డాడు. సాటో కూడా అంత తీవ్రంగానే, 'ఈ ముట్టడి ఎంత తెలివి తక్కువగా యోజన చేయబడిందో పది మందికి తెలియ చెప్పడానికి నాకు మంచి అవకాశం లభిస్తుంది, అలాగే కానివ్వండి' అని బదులు చెప్పాడు జూలై 9 వ తేదీన అధికారికంగా ఇంఫాల్ ముట్టడి రద్దు చేసుకోవడం జరిగింది. ఆ తర్వాత 9 రోజులకు టోజో, అతని మంత్రివర్గం రాజీనామా సమర్పించారు. మరోనెలగడిచాక ముటగూచితోపాటు బర్మాలో పనిచేసిన పెద్ద అధికారు లందరూ తొలగించబడ్డారు.

భారత జాతీయ సేనకు నాయకత్వం వహించిన కియానీని తన దళంతోపాటు వెనక్కు తిరిగిరావలసిందిగా కోరడం జరిగింది. కాని మానీ అందుకు అంగీకరించకుండా ఇంకా ముందుకు సాగిపోవాలనే నిశ్చయించుకొన్నాడు. జపాన్ సైనికాధికారులు ఎంతగానో నచ్చచెప్పిన

మీదటగాని నేతాజీ తన నిర్ణయాన్ని మార్చుకోలేదు. అప్పుడు కియానీని కూడా ఒప్పించి వెనుకకు మరలడం జరిగింది.

ఈ సమయంలోనే ఇక జపాన్ గెలిచే అవకాశాలు పూర్తిగా పోయాయని భావించిన గాంధీజీ బ్రిటిష్‌వారితో సంప్రదింపులు ప్రారంభించాడు. అది విన్న తర్వాత నేతాజీ గాంధీజీకి ఒక పెద్ద ఉత్తరం వ్రాశాడు. భారతదేశంనుంచి అదృశ్యమైనది మొదలు తాను కొనసాగించిన ఉద్యమ వివరాలు ఆ లేఖలో విపులంగా తెలియజేశాడు.

భారత జాతీయ సేన నాయకత్వం నేతాజీ చేతిలోనికి తీసుకొన్నప్పుడు అతి పరిమితమైన సాధన సంపత్తులూ, శిక్షణ అంతంత మాత్రంగానే ఉన్న పదిమూడు వేలమంది సైనికులూ, అధికారులూ, మాత్రం ఆ సేనలో ఉన్నారు. టోకోనుండి వాగ్దానాల వర్షంతప్ప వాస్తవంగా అందిన సరఫరాలు బహుకొద్ది. అయితే టోక్యో మోసం చేశాడనడానికి వీలులేదు. జపాన్ సైన్యానికి సరిపడిన ఆయుధాలూ, ఇతర సామగ్రి అందించలేని స్థితిలో ఉన్న టోకో అంతకంటె చేయగల్గింది కూడా లేదప్పుడు. ఆగ్నేయాసియాలో నేతాజీ పర్యటన జరిపి అక్కడి భారతీయులను ఉత్సాహపరచి, ఉత్తేజం రగిలింపచేసిన కారణంగా భారత జాతీయ సేనలో ఒక్కొక్క దళానికి పదివేల సైన్యంగల మూడు డివిజన్లు తయారయ్యాయి. వీరుగాక శిక్షణ పొందుతున్న స్వచ్ఛంద దళాలలో ఇరవై వేలమంది స్వచ్ఛంద సేవకులున్నారు. గెరిల్లా యుద్ధం నడపవలసివస్తే వీరు తోడ్పడగలిగేవారు.

వృత్తిపరమైన సైనిక బాధ్యతలు వహించి అనుభవం గడించినవాడు కాకపోయినా, మేధాసంపత్తితో జరుగుతున్న విషయాలను సంపూర్ణంగా అవగాహన చేసుకోగల సమర్థుడు నేతాజీ. అటు మిత్రపక్షాలూ, ఇటు జపాన్‌వారూ సాగిస్తున్న యుద్ధ ప్రచారంలోని సత్యాసత్యాలు తేలికగా ఆకళింపు చేసుకొనేవాడు. జపాన్‌వారి పరిస్థితిని అంచనా కట్టలేని

వాడూ కాదు. అందుకే భారత జాతీయ సేనను ఉద్బోధిస్తూ మాట్లాడేప్పుడు విజయం ఖాయంగా తమ పక్షాన ఉందన్న ధోరణిలో కాకుండా ఒక దేశం బానిసత్వంనుంచి విముక్తి చెందాలంటే ఎంతటి మహత్తర త్యాగాలు చేయవలసి ఉంటుందో నొక్కి వక్కాణిస్తుండేవాడు. "స్వతంత్ర భారత దేశాన్ని మనలో ఎందరు చూస్తారన్నది సమస్య కాదు'' అంటూ తన ఉపన్యాసాలలో తరచు చెప్పుతూ ఉండేవాడు.

గెరిల్లా యుద్ధానికి పనికివచ్చే సామాన్యమైన శిక్షణ పొందిన సైనికులతో, అత్యల్పమైన సాధన సంపదలతో, వాడితే అయిపోతాయేమో నన్నట్లున్న సాయుధ సామగ్రితో అనంతమైన వనరులు కల్గి, విశిష్టమైన శిక్షణ పొంది ఉన్న శత్రువును ఢీకొని విజయం సాధించగలమన్న పరిపూర్ణ విశ్వాసం నేతాజీకి ఎన్నడూ లేదు కాని, ఆత్మత్యాగం చేసి మహోజ్జ్వలమైన ఆదర్శాన్ని భారత ప్రజలముందుంచి వారిలో దేశభక్తిని ప్రజ్వలింపచేయడంలో కృతకృత్యుడు కాగలనన్న ధైర్యం ఆయనకుంది. అందుకే "నన్ను అనుసరించేవారికి నేను ఈనాడు చూపగల్గింది ఆకలి దప్పులూ, అరికాలి మంటలు, బలిదానాలు మాత్రమే'' అంటూ ఉండేవాడు. నేతాజీ ఊహించినట్లు ఇంఫాల్ ముట్టడిలో భారత జాతీయ సేనకు లభించినవి ఇవే

ఇంఫాల్ ముట్టడి విఫలం కావడంతోపాటు మధ్య పసిఫిక్ ప్రాంతంలోని సైపాన్ అమెరికావారి వశమైంది. దానితో అమెరికావారి బి-29 యుద్ధ విమానాల దాడికి జపాన్ చేరువైంది. టోజో రాజీనామా చేసినందువలన అతని గౌరవం ఏమాత్రం పెరగలేదు. ఎవరూ సమర్థించని స్థితిలో విధిలేక చేసిన రాజీనామాగానే దానికి గుర్తింపు లభించింది. కొరియాలో జపాన్ గవర్నరుగా పనిచేస్తున్న జనరల్ కునియాకి కైసోను ప్రధానిగా నియమించారు. టోజోకు ఏమాత్రం ప్రాధాన్యం లేనటువంటి హోదా ఒకటి కల్పించి, తెర వెనకకు నెట్టారు. ఆ తర్వాత 1948 లో

యుద్ధ నేరస్తుల జాబితాలో చేర్చి, మిత్రపక్షాల మిలిటరీ ట్రిబ్యునల్ టోజోను ఉరి తీయడం జరిగింది.

నేతాజీకి పెద్ద సమస్య ఎదురైంది. భారత స్వాతంత్ర్య పోరాటం బర్మా భూభాగం నుంచి కొనసాగించే అవకాశం జారిపోయింది. మరో రంగం ఎంచుకోవాలంటే ఎక్కడ ప్రారంభించాలో నిశ్చయించుకోలేని స్థితిలో పడ్డాడు. ఒక సందర్భంలో జపాన్ నౌకాదళాధిపతి వైస్ అడ్మిరల్ కాన్ ఏ చుడో నేతాజీతో మాట్లాడుతూ, భారత జాతీయ సేనతో రష్యాకు చేరి, మధ్య ఆసియాలో సమర్‌ఖండ్ నుంచో, తాష్కెంట్ నుంచో సమరం కొనసాగిస్తే అనువుగా ఉంటుందని సలహా చెప్పాడు. ఆ రకమైన ప్రయత్నానికి టోక్యో అనుమతి సంపాదిస్తానని తెలియజేశాడు. కాని అతడు చేసిన ప్రయత్నం ఫలించలేదు. బర్మా ప్రాంతంలో పనిచేస్తున్న 'హికారి కికన్' డైరెక్టర్ అయిన కర్నల్ యామమాటో కూడ నేతాజీకి ఇలాంటి సలహాయే ఇచ్చాడు. ఆయనతో కూడా నేతాజీ ప్రయత్నించమనే చెప్పాడు. కాని టోక్యో అనుమతి సంపాదించడంలో యామమాటో కూడా విఫలమైనాడు. ఏదో ఒక రకంగా రష్యాను మధ్యవర్తిగా పెట్టుకొని మిత్రపక్షాలతో ఒక గౌరవప్రదమైన ఒప్పందానికి రావాలని జపాన్ తహతహలాడుతోంది. ఆ పరిస్థితిలో నేతాజీ కోరిక మన్నించి పరిస్థితిని ఇంకా క్లిష్టతరం చేసుకోవడం జపాన్ ప్రభుత్వానికి ఇష్టంలేదు. అందుచేతనే ఆ ఇరువురు జపాన్ మిత్రులూ చేసిన ప్రయత్నం వీగిపోయింది. నేతాజీ తన హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేశాడు.

ఈలోగా భారత జాతీయ కాంగ్రెస్ నాయకులు దేశవిభజనను ప్రాతిపదికగా తీసుకొని ముస్లింలీగ్‌తో సంప్రదింపులు జరపనున్నారని విని నేతాజీ ఎంతో వ్యాకులత చెందాడు. హిందువులు వేరు, ముస్లింలు వేరు అన్న ధోరణిలో ఆయన ఎప్పుడూ ఆలోచించలేదు. ద్విజాతి సిద్ధాంతం దేశానికి ప్రమాదం తెస్తుందని హెచ్చరిస్తూ ఉండేవాడు. భారతదేశ స్వాతంత్ర్యానికి

హిందువులు, ముస్లింలు కలిసి పనిచేయాలన్నది ఆయన విశ్వాసం. తన ప్రయివేటు కార్యదర్శిగానే కాక, ఇంకా అనేకమైన ముఖ్య పదవులలో ముస్లింలను నియమించాడు. 'విభజించి పాలించు' అన్న బ్రిటిష్‌వారి కుటిల నీతికి బలి కావలదని సెప్టెంబర్ 12 వ తేదీన చేసిన రేడియో ప్రసంగంలో ఆయన భారత నాయకులను హెచ్చరించాడు.

## ఆఖరిసారి టోక్యోకు

అక్టోబరు మాసాంతంలో టోక్యోనుంచి నేతాజీకి ఆహ్వానం వచ్చింది. ఉదయిస్తున్న సూర్యుని చిహ్నంగల అత్యున్నత పురస్కారం నేతాజీకి అందచేయబడుతుందని తెలియజేయడం జరిగింది. అంతకుముందు బామాకు కొద్దిమంది ఆసియాదేశాల నాయకులకు ఆ పురస్కారం అందజేయబడింది. కాని నేతాజీ వినయపూర్వకంగా 'భారతదేశం విముక్తి చెందాక నేను ఆపురస్కారం స్వీకరిస్తాను' అని చెప్పి తిరస్కరించాడు. 1944 నవంబర్ 1 వ తేదీన తన సహచరులైన కియాని, చటర్జీ, హబీబుర్ రహమాన్‌ఖాన్ ుతో కలిసి జపాన్‌లోని ఉన్నతాధికారులతో సమగ్రమైన చర్చలు జరప ానికి టోక్యోకు రష్యా దౌత్యప్రతినిధితో కలుసుకొనే అవకాశం తనకు ల్పించవలసినదిగా కోరాడు. అది విదేశాంగమంత్రి అధికారపరిధిలోని విషయం అని చెప్పి, ఎవరికివారు తప్పించుకొన్నారు. అప్పుడు విదేశాంగ మంత్రి అయిన శిగేముట్సును కలుసుకొని తన కోరిక తెలియజేశాడు. అతడు సమాధానం ఏమీ చెప్పకుండా విని ఊరుకున్నాడు.

ఈ సమావేశానంతరం తన హోటలుకు చేరుకొన్న తర్వాత కొన్ని గంటలపాటు ఆలోచించి ఒక దీర్ఘమైన లేఖ వ్రాసి తన సహచరులలో ఒకరికిచ్చి రష్యా దౌత్యప్రతినిధికి అది అందజేయమని పంపించాడు. కాని అతడిని రష్యా దౌత్య కార్యాలయంలోనికి వెళ్ళనివ్వకపోవడంతో ఆ త్తరం దౌత్యప్రతినిధి కార్యదర్శికి అందజేయడం జరిగింది. కాని, ఆ

కార్యదర్శి ఆ ఉత్తరాన్ని కొన్నిక్షణాలు అటుఇటు త్రిప్పిచూసి చించకుండానే తిరిగి ఇచ్చివేశాడు. ఆ విధంగా తాను వ్రాసిన ఉత్తరం దౌత్యప్రతినిధికి చేరకుండానే తిరిగి రావడంతో నేతాజీ నిట్టూర్పు విడిచి ఆ ఉత్తరాన్ని తగులబెట్టేశాడు. దురాక్రమణకు వ్యతిరేకంగా జపాన్‌తో కుదుర్చుకొన్న ఒప్పందాన్ని రద్దుచేసుకోవాలని అప్పటికే రష్యా తీవ్రంగా ఆలోచిస్తోంది. జపాన్‌కు చెందిన ఉత్తరదీవులను రష్యా కైవసం చేయడానికి ఒప్పుకొన్నట్లయితే చర్చిల్‌తోను, రూజ్‌వెల్ట్‌తోను చేతులు కలిపి జపాన్‌తో యుద్ధం చేయడానికి స్టాలిన్ తన సంసిద్ధత తెలియజేశాడు.

టోక్యో పర్యటనలో నేతాజీ కొన్ని ముఖ్యమైన పనులు సాధించాడు. ఏ విధమైన ఆంక్షలు లేకుండా జపాన్ ప్రభుత్వం 100 మిలియన్ యన్నులు (షుమారు 20 మిలియన్ల పౌన్లు) తిరిగి చెల్లించే షరతుపైన స్వతంత్ర భారత తాత్కాలిక ప్రభుత్వానికి అప్పుగా అందించడానికి ఒప్పుకొంది. అంతకు పూర్వం అనేకమంది ఆసియా దేశాల నాయకులతో జపాన్ ఎన్నో ఒప్పందాలు కుదుర్చుకొంది. కాని నేతాజీతో ఒప్పందం కుదుర్చుకొన్న తర్వాత అంతటి చొరవగల నాయకుడు ఆనాడు ఆసియాలో మరొకరు లేరని జపాన్ అధికారులు నిర్ద్వంద్వంగా అంగీకరించాడు. ఆగస్టు 1945 లో జపాన్ మిత్రపక్షాలకు లొంగిపోయిన నాటికి జపాన్ వద్ద 90 మిలియన్ల ఎన్నులు వాడకుండా అలాగే మిగిలిపోయాయి. ఆ పది మిలియన్ల ఎన్నులు కూడా భారత జాతీయ సేన జీతాలు చెల్లించడానికి ఖర్చు అయినాయి. ఆ తర్వాత ఈ మొత్తం చెల్లించనవసరం లేదని జపాన్ ప్రభుత్వం రద్దు చేసింది.

1944 నవంబరు 10 వ తేదీన నాన్‌కింగ్ ప్రభుత్వాధినేత వాంగ్ చింగ్ వే రోగగ్రస్తుడై కన్ను మూశాడు. ఆ తర్వాత మూడు మాసాలకు రాస్‌బిహారిబోస్ కూడా పరమపదించాడు.

## విఫల మనోరథం

1944 నవంబరు చివరలో నేతాజీ రంగూన్‌కు తిరిగి వచ్చాడు. కాని అప్పటికే పరిస్థితి తారుమారు అయింది. ఏకకమైన అడ్డంకి లేకుండా శత్రు విమానాలు బర్మా అంతటా గగనతలంలో విచ్చలవిడిగా విహరిస్తున్నాయి. సముద్రంలో బ్రిటిష్ నావలకు ఎదురులేకుండా పోయింది. ఇక పదాతిదళం సంగతి చూద్దామా అంటే మిత్ర పక్షాల సైన్యాలను యెదిరించి నిలువగల ధైర్యం జపాన్‌వారికి సన్నగిల్లింది. క్రమక్రమంగా మిత్ర పక్షాలు తమ సైన్యాన్ని బర్మాలో దింపుతున్నాయి. 'హికారికికన్' సంస్థ బాధ్యత నుంచి యామమాటోను తప్పించారు. ఆ బాధ్యతను మేజర్ జనరల్ సబురో ఐసోడాకు ఒప్పచెప్పారు.

1945 జనవరి 23 నాడు నేతాజీ జన్మదినోత్సవం జరుపుకొన్నాడు. ఆ ప్రాంతంలో నివసిస్తున్న భారతీయులందరూ యుద్ధంలో సంభవిస్తున్న పరాజయాలను లెక్కచేయక తమ ప్రియతమ నాయకుని జన్మదిన వేడుకలో పాల్గొన్నారు. ఆయన బరువుకు ఒకటిన్నర రెట్లు తూగే వెండి, బంగారు ఆభరణాలు ఆయనకు సమర్పించారు. ఆజానుబాహువైన నేతాజీ 100 కిలోల బరువున్నా ఆశ్చర్యపడ నక్కరలేదు. ఐరావతీ నదీ ప్రాంతంలో యుద్ధం చేస్తున్న భారత జాతీయ సేన ప్రథమ భాగం జపాన్ వారి 15వ డివిజన్‌తోపాటుగా వెనుతిరిగిందని తెలుసుకొని నేతాజీ హుటాహుటిగా అక్కడికి ప్రయాణమైనాడు. విజయమో, వీరస్వర్గమో అన్నది నేతాజీ అనుసరించవలెననుకొన్న మార్గం. చనిపోయినవారు చనిపోతూ ఉంటే ఆ మృతదేహాలపైన నడుస్తూనే క్రొత్తవారు యెప్పటికప్పుడు ఆత్మ సమర్పణకు సిద్ధమై, అంతిమ విజయం కోసం ఐరిష్ విప్లవ సేనలు యెలాగైతే యుద్ధం చేశాయో భారతీయులమైన మేము కూడా అలాగే యుద్ధం చేస్తాం అంటూ ప్రకటించాడు. కల్నల్ కియాని, ఇంకా ఇతర జపాన్ సైనికాధికారులు యెంతగానో వత్తిడి తెచ్చిన మీదట

ముందుకు పోకుండా నిలిచిపోయాడు. జపాన్ సైనికాధికారి మేజర్ తకాహాషీ నేతాజీని గూర్చి చెపుతూ—

'ఈ భారతీయ నాయకుడు నాకు మానవాతీత వ్యక్తిగా కనిపించాడు. ఆయనతో జరిపిన మూడువారాల పర్యటనలో అలసటకు గురియై ముగ్గురు సహాయకులు మారారు. కాని నేతాజీ మాత్రం స్థానిక నాయకులతో మాట్లాడుతూనూ, దళాలను తనిఖీ చేస్తూనూ, వారికి కలుగజేసిన సౌకర్యాలు పరిశీలిస్తూనూ 24 గంటలు పనిచేస్తూ ఉండిపోయేవాడు. సామాన్య మానవు లెవ్వరూ అంత పనిభారాన్ని మోయలేరు' అన్నాడు.

యుద్ధరంగంలో నేతాజీ కన్పించగానే భారత జాతీయ సేనకు వర్ణించలేని ఉత్సాహం వచ్చింది. అయితే, అతి స్వల్పమైన సాయుధ సంపత్తి కల్గిన ఈ సేన మిత్రపక్షాల సైన్యం ధాటికి ఆగలేకపోయింది. నిదానంగా వెనుకంజ వేయడం జరిగింది. నేతాజీ రంగూన్ చేరుకొన్న తర్వాత భారత జాతీయ సేనలో పనిచేసినకొందరు బ్రిటిష్‌వారితో చేతులు కలిపారు ఈ వార్త విన్న నేతాజీ ఆగ్రహోదగ్రుడై భారత జాతీయ సేనలో ఎవరైనా విద్రోహం తలపెడితే కాల్చి చంపవలసినదిగా ఆజ్ఞలు జారీ చేశాడు. 1945 మార్చి 13 వ తేదీన విడుదల చేసిన ప్రత్యేక పత్రంలో ఇలా తెలియజేశారు—

'స్నేహితులారా! యుద్ధభూమిలో అజాద్ హింద్ ఫౌజ్ సైనికాధికారులూ, సైనికులూ ఎన్నో ఘన విజయాలు సాధించారు. వారి దేశభక్తి, సాహసం, ఆత్మ సమర్పణలవలన సమకూరిన ఈ విజయాలు పిరికివారు అయిన కొద్దిమంది సైనికాధికారులూ, సైనికులూ తలపెట్టిన విద్రోహ చర్యలవలన వమ్మయిపోయాయి. క్రొత్త సంవత్సరం ప్రవేశించడంతో కొంతమందిలో చోటు చేసుకొన్న పిరికితనం, విద్రోహ చింతనా తుడిచి పెట్టబడి, ఈ ఏడాది సాగించే పోరాటాలలో అజాద్ హింద్ ఫౌజ్ ఎనలేని సాహసం, ఆత్మ సమర్పణ చేయగలదని ఆశించడం జరిగింది. కాని

సంభవించలేదు. హెడ్ క్వార్టర్సులో రెండవ డివిజన్‌కు చెందిన అయిదారు గురు అధికారులు జరిపిన విద్రోహం మా కళ్ళు తెరిపించింది. ఆజాద్ హింద్ సేనలో అంతా సవ్యంగా జరగడం లేదని, పిరికితనం, విద్రోహ చర్యల బీజాలు ఇంకా తుడిచిపెట్టబడలేదని అర్థం అయింది. భగవత్ కృపవలన ఇప్పటికైనా మనం పిరికితనాన్ని, విద్రోహ చర్యలను శాశ్వతంగా తొలగించుకోవడంలో కృతకృత్యులమైతే ఈ సిగ్గుచేటైన, అవమానకరమైన సంఘటన ఒకరకంగా పరోక్షంగా మనకు మేలు చేసినట్లే అవుతుంది. కాబట్టి మన సైన్యాన్ని శుద్ధిపరచడానికి అవసరమైన చర్యలు కొన్ని తీసుకోవాలని నిశ్చయించుకొన్నాను. ఈ విషయంలో తిరుగులేని సంపూర్ణ సహకారం మీనుంచి లభిస్తుందన్న విశ్వాసం నాకుంది.''

## ఆంగ్‌సాన్ విద్రోహం

1945 మార్చి 15 వ తేదీన నేతాజీకి, జపాన్ వారికి క్షోభ కల్గించే దుర్ఘటన ఒకటి జరిగింది. ఎంతో కాలంగా అత్యవసర పరిస్థితిలో మాత్రమే వినియోగించేందుకు వీలుగా యుద్ధం నుంచి దూరంగా ఉంచబడిన బర్మా సైనిక దళాన్ని ఒకదానిని శత్రువుతో యుద్ధానికి తలపడవలసినదిగా ఆజ్ఞలు జారీచేయడం జరిగింది. ఆ దళం మేజర్ జనరల్ ఆంగ్‌సాన్ ఆధిపత్యంలో ఉంది. ఆ దళంలో 3,000 మంది సైనికులున్నారు. అత్యంత శోభాయమానంగా వారు కవాతు ప్రదర్శనలు చేసి తుపాకులు గురిపెట్టారు. అయితే బ్రిటిష్‌వారిపైన కాకుండా జపాన్‌వారిపైన కాల్పులు ప్రారంభించారు. అయితే కొద్ది సమయంలోనే ఆ తిరుగుబాటును అణిచివేయడంతో వారిలో చాలామంది మిలిటరీ దుస్తులు విడిచేసి సామాన్య పౌరులలో చేరిపోయి గెరిల్లా చర్యలకు పూనుకున్నారు. ఈ విధమైన తిరుగుబాటు నెరపి బ్రిటిష్‌వారి మన్ననలకు పాత్రమై, గొప్ప హోదా సంపాదించాలని పన్నిన కుట్ర ఫలితం అది. అనుకొన్నట్లుగానే కొందరికి

కొన్ని లాభాలు చేకూరాయి. ఆంగ్‌సాన్ 1947 లో తన అనుయాయుల చేతిలో హత్య చేయబడ్డాడు.

## బర్మానుంచి ఉపసంహరణ

1945 ఏప్రిల్ 20 నాడు కవాచే స్థానంలో నియుక్తుడైన జనరల్ హిలూరో కిమూరా రంగూన్‌ను విడిచి వెళ్ళడం క్షేమకరంగా ఉంటుందని నేతాజీకి ఇచ్చాడు. బామా అంతకు ముందే బర్మా విడిచి వెళ్ళిపోయాడు. ముందుగా స్త్రీ దళం అక్కడి నుంచి ఖాళీచేసి వెళ్ళిపోయే ఏర్పాట్లు చేస్తే తాము కూడా బయదేరి వెళ్ళడానికి నేతాజీ అంగీకరించాడు. ఆ విధంగానే 80 మంది సైనికురాండ్రతో కూడిన రైలు రంగూన్‌ను వదిలి వెళ్ళడం చూశాకనే నేతాజీ తన ప్రయాణం ప్రారంభించాడు.

పరాజయం సంభవించినా నేతాజీ పరాభూతుడు కాలేదు. స్వాతంత్ర్యం సిద్ధించేవరకు ఎన్ని పరాజయాలెదురైనా పారిపోయేది లేదు. తుది శ్వాస వదిలేవరకు పోరాటం కొనసాగించవలసిందే. అంతే కాదు, అంతిమ విజయం భారతీయులదే అన్న ఆత్మవిశ్వాసం నేతాజీని ఎన్నడూ వీడలేదు. భారతదేశం స్వరాజ్యం సాధించే రోజు ఎంతో దూరంలో లేదన్నది నేతాజీ దృఢవిశ్వాసం. బర్మాను విడిచిపోతూ 1945 ఏప్రిల్ 24 నాడు విడుదల చేసిన ప్రకటనలో ఇలా అంటాడు—

''బర్మాలో ఉన్న భారత, బర్మామిత్రులారా! సోదర, సోదరీమణులారా!

"బరువైన హృదయంతో నేను బర్మాను విడిచి వెళుతున్నాను. మనం సాగించిన స్వాతంత్ర్య పోరాటంలో మొదటి దశలో ఓటమి చెందాం. ఇది కేవలం మొదటి దశలో సంభవించిన అపజయం. ఇంకా ఎన్నో దశలలో మన పోరాటం సాగుతుంది. మొదటి దశలో ఓటమిని చవి చూసినప్పటికీ ధైర్యాన్ని కోల్పోవలసిన అవసరంలేదు.

''బర్మాలో నివసిస్తున్న సాటి భారతీయులారా! ప్రపంచమంతా కొనియాడే విధంగా మాతృభూమిపట్ల మీ కర్తవ్యాన్ని మీరు మహోద్భుతంగా నిర్వహించారు. మనుషులూ, ధనం, సాధన సంపత్తులూ అడిగినదే తడవుగా సమర్పించారు. సంపూర్ణ సమర్పణ అంటే ఏమిటో ఉదాహరణ పూర్వకంగా మీరు చూపించారు. కాని శక్తికిమించిన కష్టాలను ఎదుర్కోవలసివచ్చిన కారణంగా బర్మాలో జరిగిన ఈ పోరాటంలో ఓటమి చెందాం.

''నా కేంద్రాన్ని బర్మాకు మార్చినది మొదలు మీరు చూపిన నిస్వార్థ పూరిత త్యాగం నేను నా జీవితంలో ఎన్నడూ మర్చిపోలేను.

''ఈ స్ఫూర్తి ఎన్నడూ అణచివేయబడజాలదనే నమ్మకం నాకున్నది. స్వాతంత్ర్య సముపార్జన దృష్ట్యా ఈ స్ఫూర్తిని ఇలాగే కాపాడుకొనవలసినదిగా హృదయ పూర్వకంగా మనవి చేస్తున్నాను. తలలు వంచక భారతదేశ స్వాతంత్ర్యం కోసం మరొకసారి పోరాడే సదవకాశం కోసం మీరు ఎదురు చూస్తూ ఉండాలని కోరుకుంటున్నాను.

''భారత దేశ స్వాతంత్ర్యం కోసం సాగిన ఈ చివరి సమరాన్ని చరిత్ర పుటలలో లిపిబద్ధం చేసేప్పుడు అందులో ఉన్న భారతీయులకు సముచితస్థానం లభిస్తుంది. నేను సాగించిన ఈ పోరాటంలో సర్వవిధాలా తోడ్పడినందుకు బర్మా ప్రభుత్వానికీ, ప్రజలకూ బహిరంగంగా కృతజ్ఞతలు చెప్పుకోవడం నా విధి. కృతజ్ఞతాభారం అనే ఈ ఋణాన్ని స్వేచ్ఛాభారతదేశం తగువిధంగా తీర్చుకొనే రోజు ఎంతో దూరంగా లేదని భావిస్తున్నాను.

''విప్లవం వర్ధిల్లాలి! అజాద్‌హింద్ జిందాబాద్! జైహింద్!''

* * *

తన సైనికులతోపాటు అనేక ఇబ్బందులకు గురిఅవుతూ నేతాజీ బ్యాంకాక్ ప్రయాణం చేశాడు. వీరు తాయ్‌లాండ్ సరిహద్దుకు చేరుకొనే సరికి మరో నిరాశాజనకమైన వార్త వినవలసివచ్చింది మిత్రపక్షాలు 1945

మే 7వ తేదీన జర్మనీని పట్టుకొన్నారన్న వార్త తెలిసింది. ఆ వార్త విన్న
తర్వాత నేతాజీ గంభీరంగా ఆలోచిస్తూ ఉండిపోయాడు. బాంకాక్‌లో
నివసిస్తున్న భారతీయుడు ఒకరు నేతాజీ ఉండటానికి కావలసిన ఏర్పాట్ల
అన్నీ తన ఇంట్లో చేశాడు. పదిరోజులపాటు ఎవరితోనూ మాట్లాడకుండ
నేతాజీ తన గదిలోనే ఆలోచించుకొంటూ ఉండిపోయాడు.

కొద్దిరోజులు గడిచాక నేతాజీ బాంకాక్ నుంచి సింగపూర్ చే
కొన్నాడు. సింగపూర్‌లో తాను పూర్వం నివసించిన ఇంటికి చేరుకొన్న
తర్వాత తన కార్యక్రమాన్ని తిరిగి ప్రారంభించాడు. రాజనీతిజ్ఞ
లోపించిన కారణంగానే జర్మనీ పరాజయం పొందినదని నేతాజీ భావి
చాడు. 1945 మే 25వ తేదీన సింగపూర్‌నుంచి చేసిన రేడియో ప్రక
నలో నేతాజీ ఇలా అంటాడు-

'హిట్లర్ మరణించేంతవరకు జర్మన్లు సలిపిన వీరోచిత పోరాట
ప్రపంచ దేశాల మన్నలను పొందినది. నా ఉద్దేశ్యంలో జర్మన్ల పరాజయ
రాజకీయ పరమైనదే కాని సైనిక పరమైనదికాదు. జర్మనీవారి విదేశాం
విధానం, ముఖ్యంగా రష్యాతోను ఇతర రాజ్యాలతోను వారు వ్యవహరించి
తీరు వారికి కడగండ్లు తెచ్చింది. 'ఒకే సమయంలో ఇరువైపుల శత్రు
లతో పోరాటానికి తలపడకు' అన్న బిస్మార్క్ సలహాను పెడచెవి
పెట్టిన కారణంగానే ఈ అనర్థం జరిగింది. 1940 లో సోవియట్ విదేశాం
మంత్రి మాలటోవ్ బెర్లిన్ సందర్శించినప్పుడు ఏ రకంగానైనా స
సోవియట్ రష్యాతో ఒక ఒప్పందానికి వచ్చిఉంటే బాగుండేది. కా
రాజనీతిజ్ఞత లోపించడంచేత ఏవిధంగానైతే మొదటి ప్రపంచయుద్ధంలో
దెబ్బతిన్నారో ఈ యుద్ధంలో కూడ అలాగే దెబ్బతిన్నారు.

''ప్రపంచ రాజకీయాలు అవగాహన చేసుకొన్న ఏ విద్యార్థికైనా
భవిష్యత్తులో యూరోప్‌లో పరిస్థితి ఎలా ఉంటుంది అన్న ప్రశ్న ఉద

యించక మానదు. నేను మొదటినుండి చెపుతూ వస్తున్నట్లుగా జర్మనీ పతనంలో రష్యాకు, ఆంగ్లో–అమెరికన్ దేశాలకు మధ్య సంఘర్షణ దిన దిన ప్రవర్ధమానమవుతుంది. ఈ యుద్ధంలో ప్రవేశించడంలో ఆంగ్లో-అమెరికన్ల ఉద్దేశ్యాలకూ, రష్యా ఉద్దేశ్యాలకూ ఎంతో తేడా ఉంది. రష్యాసేనలు ప్రదర్శించిన ధైర్యసాహసాల ఫలితంగానే జర్మనీ ఓడిపోయిందనే విశ్వాసం రష్యాకు ఉంది. కాబట్టి తన బలమేమిటో గ్రహించిన రష్యా ఎట్టి పరిస్థితులలోను యుద్ధానంతర ఐరోపా నిర్మాణంలో ఆంగ్లో-అమెరికన్ వర్గాలకు తల ఒగ్గదు. శాన్‌ఫ్రాన్సిస్కోలో జరిగిన సమావేశాన్ని మాలటోవ్ బహిష్కరించడంచేత ఇది పూర్తిగా ఋజువైంది.

''చరిత్రగతిలో ఈనాడుజర్మన్లు అనుభవిస్తున్న కష్టాలుచూసి మేము సాగించిన స్వాతంత్ర్య సమరంలో వారు మాపట్ల ప్రదర్శించిన సానుభూతికీ, సమర్థనకూ నా తరఫునా, భారత ప్రజల తరఫునా హార్దిక కృతజ్ఞతాభివందనాలు తెలియజేస్తున్నాను''.

* * *

సింగపూర్ చేరాక నేతాజీ ఎన్నో రేడియో ప్రసంగాలు చేశాడు. నిత్యం, నిర్విరామంగా భారతీయులను కలుసుకొంటూ ఉండేవాడు. రేడియో ఉపన్యాసాలలో తరచు దేశ విభజనను వ్యతిరేకిస్తూండేవాడు.

1945 ఆగష్టు 9 నాడు జపాన్‌పైన సోవియట్ యూనియన్ యుద్ధం ప్రకటించింది. తక్షణమే మంచూరియాను, ఉత్తరంగా ఉన్న జపాన్ దీవులను రష్యా ఆక్రమించింది. ఆ తర్వాత రెండు రోజులకు లొంగిపోవడానికి జపాన్ సంసిద్ధతను వ్యక్తం చేసింది. ఆ తర్వాత రెండు రోజులలో నేతాజీ దాదాపు 23,000 మంది భారత జాతీయ సైనికులకు చెల్లించవలసిన జీతాలు చెల్లించేశాడు. వారందరిని సమావేశపరచి 1945 ఆగష్టు 15 నాడు ఇలా చెప్పాడు—

"స్నేహితులారా! మాతృభూమిని దాస్యవిముక్తం చేయడానికి మనం సాగించిన పోరాటంలో మలుపు ఎదురైన కారణంగా మనం కృంగి పోయి ఉన్నాం. భారతదేశ దాస్య విముక్తికై తలపెట్టిన కార్యం విఫలమై పోయిందని మీరు భావిస్తూ ఉండవచ్చు. కాని ఈ పరాజయం తాత్కాలికమైనదే అని మీకు తెలియజేస్తున్నాను. ఎన్ని అవాంతరాలైనా, ఎన్ని పరాజయాలైనా గతంలో మీరు సాగించిన కృషిని వమ్ము చేయలేవు. మీలో చాలామంది భారత-బర్మా సరిహద్దులలో జరిగిన పోరాటాలలోనూ, భారత భూభాగంపై జరిపిన పోరాటంలోనూ పాల్గొని అనేక కష్టనష్టాలు చవిచూసిన వారే. మీ స్నేహితులలో అనేకులు యుద్ధభూమిలో తమ ప్రాణాలు అర్పించి అజాద్ హింద్ అమరవీరులైనారు. ఘనమైన ఈ త్యాగాలు ఊరికేపోవు.

"స్నేహితులారా! విచార సమయంలో ఒక విప్లవ సేనకు తగిన క్రమశిక్షణ, ఆత్మాభిమానం, సహనశక్తితో ప్రవర్తించవలసినదిగా మిమ్మ కోరుకొంటున్నాను. యుద్ధ భూమిలో మీరు ఇంతకుముందే మీ సాహసాన్నీ, ఆత్మ సమర్పణ భావాన్నీ ఋజువు చేసుకొన్నారు. ఈ తాత్కాలిక పరాజయ తరుణంలో మొక్కవోని ఆశనూ, తొణకని మనో నిబ్బరాన్నీ చూపించవలసిన కర్తవ్యం మీపైన ఉంది. మిమ్ములను బాగా గుర్తెరిగిన నేను ఈ విపత్సమయంలోకూడా శిరస్సువంచక చెక్కుచెదరని ఆశా విశ్వాసాలతో మీరు భవిష్యత్తులోనికి నడుస్తారని సంపూర్ణంగా విశ్వసిస్తున్నాను.

"స్నేహితులారా! ఈ ఆపదకాలంలో భారత విముక్తిసేన సభ్యులైన మనవైపు మన దేశీయులైన 38 కోట్ల కోట్ల భారతీయులు చూస్తూ ఉంటారు. కాబట్టి నిజమైన భారతీయులుగా మసలుకొని ఒక లిప్త మాత్రం కూడా భవిష్యత్తుపట్ల విశ్వాసాన్ని కోల్పోకుండా

ప్రవర్తించాలి. ఢిల్లీ చేరడానికి మార్గాలు అనేకం. ఇప్పటికీ ఢిల్లీ చేరడమే మన ధ్యేయం. అమర వీరులైన మీ మిత్రుల త్యాగం, మీలోని ఆత్మ సమర్పణ భావం తప్పకుండా విజయం సాధిస్తాయి. ఇంకా భారతదేశాన్ని సంకెళ్ళతో బంధించి ఉంచగల శక్తి ఏదీ ఈ ప్రపంచంలో లేదు. భారతదేశం స్వతంత్రం పొందితీరుతుంది, అనతికాలంలోనే పొంది తీరుతుంది.''

* * *

భారతదేశం స్వాతంత్ర్యం పొందుతుందనీ, అదీ అతి త్వరలో సాధ్యమవుతుందనీ యుద్ధంలో ఘోరపరాజయం పొందిన తర్వాత కూడా స్పష్టంగా ఊహించడమన్నది నేతాజీ విజ్ఞతకు నిదర్శనం. కొద్దిమంది అనుయాయులతో కలిసి టోక్యోకు వెళ్ళాలని ఈ సమావేశంలో నిర్ణయించడం జరిగింది.

ఆ మర్నాడు తూర్పు ఆసియాలోని భారతీయులకు సందేశమిస్తూ-

'సోదరీ, సోదరులారా! స్వాతంత్ర్య పోరాట చరిత్రలో ఒక ఉజ్జ్వలమైన అధ్యాయం ఇప్పుడిప్పుడే ముగిసింది. ఈ అధ్యాయంలో తూర్పు ఆసియాలో ఉన్న భారతీయ సంతతికి మాసిపోని స్థానం లభిస్తుంది.

భారతదేశ స్వాతంత్ర్య పోరాటానికి మనుషులూ, డబ్బూ, వస్తుసామగ్రి సమర్పించడం ద్వారా దేశభక్తి, ఆత్మ సమర్పణలకు సంబంధించిన గొప్ప ఉదాహరణను నెలకొల్పారు. 'సంపూర్ణ సమర్పణ'కై నేను ఇచ్చిన పిలుపును అందుకొని తక్షణమే ఎంత ఉత్సాహంతో మీరు ముందుకు వచ్చిన సంగతి నేను విస్మరించలేను. అజాద్ హింద్ ఫౌజ్‌లోనూ, రాణి ఝాన్సీ దళంలోనూ సైనిక శిక్షణ పొందేందుకు మీ పుత్రులనూ, పుత్రికలనూ పంపించారు. అజాద్ హింద్ తాత్కాలిక ప్రభుత్వపు యుద్ధ ఖజానాలో డబ్బు, వస్తుసామగ్రి ఎడతెరిపి లేకుండా గుమ్మ

రించారు. ఒక్క మాటలో చెప్పాలంటే, నిజమైన భారతమాత సంతానంగా మీరు చేయవలసినదంతా చేశారు.

మీ కష్టాలూ, త్యాగాలూ వెనువెంటనే సత్ఫలితాలు ఇవ్వలేక పోయినందుకు మీతోపాటు నేను కూడా విచారిస్తున్నాను. అయితే, అవి వృధా కాలేదు. భారతమాత దాస్య విముక్తిని ధృవపరిచి విశ్వవ్యాప్తంగా ఉన్న భారతీయులలో నిరంతర స్ఫూర్తిని నింపడానికి పనికి వచ్చాయి. భావితరాలవారు మిమ్మల్ని స్తుతిస్తూ, భారత స్వాతంత్ర్య సంగ్రామంలో మీరొనర్చిన సేవలు, వాటి ఫలితాలను గూర్చి సగర్వంగా చెప్పుకొంటారు.

భారతదేశ చరిత్రలో అతి విషాదకరమైన ఈ సమయంలో ఒకే ఒక మాట చెప్పదలచుకొన్నాను. తాత్కాలికంగా మనకు సంభవించిన పరాజయాన్ని తలచుకొని క్రుంగిపోకండి. చిరునవ్వుతో ఎప్పటివలె ఉత్సాహంగా ఉండండి. భారతదేశ భవిష్యత్తును గూర్చి ఒక్క క్షణం కూడా సందేహంలో పడకండి. భారతదేశాన్ని సంకెళ్ళతో బంధించి ఉంచగలశక్తి ఏదీ ప్రపంచంలో లేదు. భారతదేశం స్వాతంత్ర్యం పొంది తీరుతుంది. జైహింద్!'

* * *

## చివరి ప్రయాణం

హబీబుర్ రహమాన్‌ఖాన్ నేతాజీ ముఖ్య అనుయాయులలో ఒకడు. ఆయన టుట్సు ఓ హయాషిడాకు 1965లో వ్రాసిన కథనం ఇలాఉంది:

అనుకొన్నట్లుగానే హబీబుర్ రహమాన్‌ఖాన్, యస్. ఎ. అయ్యర్ మరికొందరు అధికారులతో కలిసి విమానంలో నేతాజీ టోక్యోకు బయలు దేరాడు. దారిలో బాంకాక్‌లో కొద్దిసేపు ఆగారు అక్కడినుంచి సైగాన్ చేరారు. సైగాన్‌లో విమానం మార్చారు. ఈ విమానంలో నేతాజీతో పాటు హబీబుర్ రహమాన్‌ఖాన్‌కు మాత్రమే చోటు లభించింది. వీరితో పాటు ప్రయాణంచేసిన మిగతా ప్రయాణికులు జపాన్ సైనికాధికారులు.

ఈ కథనం ఇలా ఉండగా, అప్పుడు నేతాజీతో కలిసి పనిచేసిన జపాన్ అధికారుల కథనం కాస్త భిన్నంగా ఉంది. నేతాజీ తన ఆరుగురు సహచరులతో ఆగస్టు 15 మధ్యాహ్నానికి బాంకాక్ చేరుకొన్నాడు. వారు వెంటనే తెరువో హబియానూ, ఐసోడను చూడటానికి వెళ్ళారు. ఈ ఇద్దరు జపాన్ సైనికాధికారులతో ముచ్చటిస్తూ, మంచూరియాకు చేరుకొని సోవియట్ దళాలలో చేరి తన పోరాటం సాగించనున్నట్లు నేతాజీ చెప్పాడు. "నాకేవిధమైన భ్రమలూ లేవు; నా ఈ ప్రయత్నంలో రష్యావారిచేత ఉరి తీయబడ్డా, నిర్బంధించబడినా- దేనికైనా సిద్ధంగానే ఉన్నాను. ఏ కొద్ది అవకాశం కనిపించినా దానిని అందుకోవడానికి అర్రులు చాచడమే నేనిప్పుడు చేస్తున్న పని. నేను ఐరోపానుంచి ప్రాచ్య ఖండానికి వచ్చినప్పుడు సహాయపడిన రీతిగా ఇప్పుడుకూడా సహాయపడవలసినదిగా జపాన్‌వారిని అర్థిస్తున్నాను" అన్నాడు. ఈ వర్తమానం టోక్యోకు చేరింది. టోక్యోలో ఉన్న ప్రభుత్వాధికారులు, 'జపాన్ వారి వద్ద హృదయపూర్వకమైన సహాయ, సహకారాలు పొందిన తర్వాత ఈ క్లిష్ట సమయంలో జపాన్‌వారిని కాదని రష్యా అండన చేరాలనుకోవడం నేతాజీకే చెల్లింది' అన్నారు. అస్వస్థతతో ప్రక్కమీద కదలకుండా పడి ఉన్న ఫీల్డుమార్షల్ తెరోచికి ఈ విషయం తెలిసి, జపాన్ అధికారులపైన మండిపడ్డాడు. 'బుర్రలో మట్టి పెట్టుకొని ఆలోచిస్తున్న జపాన్ సిబ్బంది నేతాజీని జపాన్ దేశీయుడుగా భావిస్తున్నారేమో! తన దేశ స్వాతంత్ర్యం కోసం పోరాటం సలిపిన నా స్నేహితుడు నేతాజీ భావాలను నేను గౌరవిస్తున్నానని టోక్యోకు తెలియజేయండి' అన్నాడు. తెరోచీ నుంచి ఇటువంటి ఆగ్రహంతో కూడిన మాటలు వెలువడగానే, మారు మాటాడకుండా జపాన్ అధికారులు నేతాజీ అభీష్ట ప్రకారం చేయడానికి అనుమతించారు.

మిగిలి ఉన్న కొద్దిపాటి బాంబర్ విమానాలలో ఒకదానిని షెడ్‌లో నుండి బయటకు తీసి సైగాన్‌నుంచి సికింగ్ మీదుగా డైరేన్‌గుండా

మంచూరియాకు పోయేందుకు సిద్ధంచేశారు ఈ యుద్ధవిమానం 97-2 హెవీ బాంబరు విమానం. మిత్రపక్షాలవారు దీనిని సాల్లీ అని పిలుస్తుండేవారు. ఇది 280 నాట్ల వేగంతో పోగల్గుతుంది. చాలామంది పైలెట్లు యుద్ధంలో మరణించారు. సైగాన్‌లో మిగిలి ఉన్న పైలట్లలో దక్షతగల వారెంట్ ఆఫీసర్ ఓయాగీ విమానం నడిపాడు. మేజర్ సబరోటకీజావా అతనికి సహాయకుడుగా ఉన్నాడు. లెఫ్టినెంట్ కల్నల్ షిరోనోనోగాకి, మేజర్ యరకోనో కూడా విమాన సిబ్బందిలో ఉన్నారు. నోనోగాకి కెప్టెన్‌గా నియమింపబడ్డాడు. ఈ విమానంలో నేతాజీని తీసుకుపోవలసిందిగా టెరోచీ ఆజ్ఞలు జారీ చేశాడు. అప్పుడు హబియా, ఐసోడలతో కలిసి ఆగస్టు 17 నాడు నేతాజీ బాంకాక్ నుంచి సైగాన్‌కు బయలుదేరారు. ఏడుగురు భారతీయులు బాంబర్ విమానంలోనికి ఎక్కబోతూఉంటే పైలట్లు ఇద్దరూ నిర్ఘాంతపోయి చూస్తూ ఉన్నారు. అంతమంది అదనపు ప్రయాణీకులతో విమానం బయలుదేరడం అసంభవమని చెప్పారు. పోనీ, మరొక విమానం తీసుకుపోదామా అంటే పైలట్లకొరత బాధిస్తోంది. కొంత సమయం లభిస్తే యుద్ధభూమి నుంచి ఒకరిద్దరు పైలట్లను రప్పించవచ్చు, కాని ఏ మాత్రం వ్యవధి లేదు. అప్పటికి సోవియట్ యూనియన్ నుంచి భద్రతానుమతి పొందకుండానే విమానాన్ని బయలుదేర తీస్తున్నారు. ఏ పనిమీదనైనాసరే ఆ ప్రాంతంలో యుద్ధవిమానాలు ఎగురకూడదనే ఆంక్షలు ఏ క్షణంలోనైనా బ్రిటిష్‌వారు విధించే ప్రమాదం ఉంది. కాలంతో పాటు పరుగెత్తవలసిన సమయం అది.

చివరకు ఒక అయిదుగురిని వదిలేసి నేతాజీ, హబీబుర్ రహమాన్ మాత్రం ప్రయాణం చేయాలనే అంగీకారం కుదిరింది. తనతోపాటు, నేతాజీ పది సంచుల లగేజీ విమానంలో పెట్టించబోగా, పైలట్లు కేవలం మూడు సంచులు పెట్టడానికి అనుమతించారు. ఇక విమానం ఎగరడానికి

అంతా సిద్ధంగా ఉన్న సమయంలో ఒక భారత సైనికాధికారి పరుగు పరుగున వచ్చి పెద్దగా కేకలు వేస్తూ, కేవలం పదిహేను నిమిషాలు విమానాన్ని ఆపవలసిందిగా వేడుకొన్నాడు. భారతీయులు కొందరు నేతాజీకి బహుమతి నివ్వడానికి వస్తున్నారని, తప్పకుండా కొద్ది నిమిషాలు ఆగవలసిందని అర్థించాడు. ఆ తర్వాత కొద్ది నిమిషాలలోనే నేతాజీకి రెండు సూటుకేసులు బహుమతిగా అందజేయబడ్డాయి. వాటి బరువు పట్టిచూచిన తర్వాతనే పైలట్లు వాటిని లోపల చేర్చారు. ఇంత జాగ్రత్తలు తీసుకొన్నప్పటికి దాదాపు ఒక మెట్రిక్ టన్ను అదనపు బరువుతో విమానం సైగాన్‌నుంచి బయలుదేరింది. రెండు గంటల ప్రయాణం తర్వాత సైగాన్‌కు హనోయ్‌కి మధ్యనున్న టోరేన్‌సు విమానం చేరింది. ఓవర్ లోడ్ అయిఉన్న ఆ విమానం రాత్రిపూట ప్రయాణానికి వీలుకాదని పైలట్లు ప్రకటించారు. ప్రయాణీకులు విశ్రాంతి గదులకు వెళ్ళాక ఈ బాంబరు విమానానికి ఉన్న ఆరు మెషీన్ గన్‌లను ఊడదీసి దాదాపు 600 కిలోల బరువు తగ్గించేశారు ఆ విరామంలో నేతాజీ, షీదై మంచి మిత్రులైనారు. లెఫ్టెనెంట్ జనరల్ సునామాసా షీదై బర్మా కమాండ్‌లో ముఖ్య సైనికాధికారిగా పని చేసేవాడు. ఆయనను మంచూరియా కమాండ్‌కు బదిలీ చేశారు. ఇద్దరూ ఆ రాత్రి ఒకే గదిలో విశ్రాంతి తీసుకొన్నారు.

1945, అగష్టు 18 నాడు ఉదయం 5 గంటలకు విమానం మళ్ళీ బయలుదేరింది. మధ్యాహ్నానికి తైపెసంగ్‌షాన్‌కు చేరింది. 4000 మీటర్ల ఎత్తున ఎగురుతూ ఓయాగీ 1200 నాటికల్ మైళ్ళు 7 గంటలలో తీసుకు వచ్చాడు. ఆ విమానం ఉన్న పరిస్థితి గమనిస్తే ఎంతో నేర్పుతో ఓయాగీ ఆ ప్రయాణాన్ని సాధించాడని చెప్పక తప్పదు. తైపీ (తైహోకు)లో ఎక్కువ సమయం గడపడం విమాన సిబ్బందికి ఏమాత్రం ఇష్టంలేదు. వారు చేరవలసిన డైరన్ తైపైనుంచి ఒక వెయ్యి నాటికల్ మైళ్ళ దూరంలో ఉంది. ఎలా లేదన్నా ఆరు గంటల ప్రయాణం. చీకటి పడకముందే ఆ ప్రయాణం పూర్తి చేయాలనే పట్టుదలతో ఉన్నారు

పైలట్లు. అంత తొందరలో కూడా రెండు గంటల సమయం తీసుకొని విమానాన్ని బాగా పరిశీలించారు. స్పార్క్‌ప్లగ్, ఇతరమైన యాంత్రిక స్థితి సక్రమంగా ఉండేట్లు చూచుకొన్నారు. సరిగ్గా మధ్యాహ్నం రెండు గంటల సమయంలో మూడు అదనపు పెట్రోల్ టాంకులు విమానంలో పెట్టుకొని బయలుదేరారు. ఇతర జపాన్ యుద్ధ విమానాలలోనైతే అదనపు పెట్రోల్ టాంకులు బయటనే ముందు భాగంలో తగిలించుకొనే ఏర్పాటు ఉండేది. కాని ఈ 97 బైపు విమానానికి ఆ ఏర్పాటు లేదు. విమానం పైకి ఎగిరిన కొద్దిసేపటికే పెద్ద ప్రమాదం జరిగింది. కొందరు చెపుతున్న దాన్నిబట్టి నేతాజీ, జనరల్ షిదై, ఇద్దరు పైలట్లు, ఇద్దరు సిబ్బంది అసువులు కోల్పోయారు. హబీబుర్ రహమాన్ ఖాన్, నోనోగాకి, కోనో, ఇంకో అయిదుగురు మాత్రం బ్రతికి బయటపడ్డారు. వీరిలో కొందరికి చిన్న చిన్న గాయాలు, మరికొందరికి పెద్ద గాయాలు అయ్యాయి. ఈ సంఘటన జరిగాక 20 సంవత్సరాల తర్వాత వీరి వద్ద తీసుకొన్న వాఙ్మూలంలో భిన్న స్వరాలు వినిపించాయి. ఇరవై సంవత్సరాల పూర్వం జరిగిన సంఘటనను గుర్తుకు తెచ్చుకోవడం అంటే జరిగినదంతా జ్ఞాపకం ఉండటం అసాధ్యం. సంఘటన జరిగిన రోజునే దర్యాప్తు ఎందుకు జరగలేదన్న ప్రశ్న వస్తుంది. కాని ఆనాడు తైపీలో ఉన్న సంక్లిష్ట పరిస్థితిలో సమగ్ర దర్యాప్తుకు అవకాశం లేక అది జరగలేదు అన్నారు.

విమాన ప్రమాదానికి సంబంధించిన వివిధ వర్ణనలు ప్రచారంలోనికి వచ్చాయి. వాటి సారాంశాన్ని ఈ క్రింది విధంగా వివరించవచ్చు—

పదమూడుమంది ప్రయాణీకులతో తైపీ విమానాశ్రయం నుండి బాంబర్ విమానం బయలుదేరింది. 890 మీటర్ల రన్‌వేలో మూడువంతులు ప్రయాణించి అప్పుడే పైకి లేచింది. వెనువెంటనే ఎడమవైపుకు ఒరిగిపోయింది. ఆ తర్వాత కొద్ది క్షణాల్లోనే విమాన క్షేత్రాన్ని దాటి, మట్టి గట్టులోనికి దూసుకుపోయింది. ఆ తర్వాత ఒక నిమిషంలో మంటలు

పైకి లేచాయి. పైలట్ ఓయాగీ గుండెలలో స్టీరింగ్ గేర్ గుచ్చుకు పోయింది. ఇంకో పైలట్ తల స్టీరింగ్ రాడ్‌కు గ్రుద్దుకొని బద్దలైంది. వారిద్దరూ మృతిచెందారు. వారున్న భంగిమనుబట్టి విమానాన్ని రక్షించ డానికి చివరివరకు వారి సర్వశక్తులు ఒడ్డి కృషి చేశారన్నది స్పష్టమైంది. జనరల్ షీడై, సుభాష్‌చంద్రబోస్‌లు ఇరువురికి విమానం లోపల పెట్టబడి ఉన్న పెట్రోల్ టాంకుల కారణంగా బలమైన గాయాలైనాయి.

ఈ ప్రమాదానికి సంబంధించిన మరో వర్ణన 1966లో రావల్పిండి నుంచి టాట్సువోహమాషిడాకు హబీబుర్ రహమాన్ ఖాన్ వ్రాసిన పత్రంలో లభిస్తుంది.అందులో హబీబుర్ రహమాన్ ఖాన్ ఇలా వ్రాశాడు-

నేనూ, సుభాస్ చంద్రబోస్ కాలిపోతున్న విమానం నుంచి బయ టకు దూకాం. బయట పడగానే పెట్రోల్ చిలకబడి ఉన్న సుభాస్ ఒంటి మీది బట్టలు మండుతూ ఉండటం గమనించాను. ముందుకు దూకి ఆయన బట్టలకు అంటుకొన్న మంటలు ఆర్పివేసి నేలపైన పరుండబెట్టాను. ఆయన తలకు పెద్ద గాయమై, రక్తం కారుతోంది. శరీరం అనేక చోట్ల కాలి పోయింది. నాకు మాత్రం చాలా కొద్ది దెబ్బలు తగిలాయి. అప్పుడు మా ఇద్దరి మధ్య సంభాషణ ఇలా నడిచింది-

'నీకు అంతపెద్ద దెబ్బలు తగలలేదు కదా?' అడిగాడు బోస్.

'లేదండీ, నేను చాలా స్వల్ప గాయాలతో బయటపడ్డాను'అన్నాను.

'నేను ఈ ప్రమాదం నుంచి బ్రతికి బయట పడతానన్న ఆశ కన్పించలేదు. నీవు భారతదేశానికి చేరిన తర్వాత ఆఖరి శ్వాస విడిచేంత వరకు నేను భారతదేశ స్వాతంత్ర్యానికి పోరాడుతూనే ఉన్నానన్న విషయం అక్కడి వారికి తెలియజేయి. ఇప్పుడు ఇక ఏ శక్తీ మనను బానిసత్వంలో ఉంచలేదు. భారతీయులు పోరాటాన్ని కొనసాగించాలి అనతికాలంలోనే మనకు స్వాతంత్ర్యం వస్తుంది' అన్నాడు బోస్.

ఈ కథనాన్ని అనుసరించి ఒక పదిహేను నిమిషాలలో ప్రమాదానికి గురియైన వారిని విమాన క్షేత్రం నుంచి తైపీ నగర వైద్యశాలకు మోటారుకారులో చేర్చారు. శక్తివంచన లేకుండా జపాన్ డాక్టర్లు చేయ గల్గినదంతా చేసినప్పటికి ప్రయోజనం లేకపోయింది. రాత్రి 8-30 గ॥కు సుభాన్‌చంద్ర బోస్ అంతిమ శ్వాస విడిచాడు. ఆగష్టు 20 నాడు తైపీలో దహనక్రియ జరిగింది. సెప్టెంబర్ 5 వ తేదీన అస్థికలను జపాన్‌కు పంపించారు. టోక్యోలోని రెంకోజీ బౌద్ధ దేవాలయంలో వాటిని భద్ర పరిచారు. విమాన ప్రమాదం జరిగినచోట లభించిన ఆభరణాలు, విలువైన వస్తువులు భారత ప్రభుత్వానికి అందజేశారు.

రోగ పీడితుడై యున్న ఫీల్డు మార్షల్ టెరోచీ ఈ దుర్ఘటన వార్త విని మళ్ళీ కోలుకోలేకపోయాడు. అలాగే తీసుకొని, 1946 జూన్ 20 వ తేదీన కన్ను మూశాడు.

నేతాజీ మరణాన్ని విశ్వసించనివారి కథనం మరో రకంగా ఉంది. సమర్‌గుహ ప్రభృతులు 18 ఆగష్టు 1945 నాటి సంఘటనను విశ్వసించ లేదు. వివిధ పత్రికలకు ఆయన వ్రాసిన వ్యాసాలలో ఈ విషయాన్ని స్పష్టంగా పేర్కొన్నారు. 'ఆర్గనైజర్' కు వ్రాసిన ఈ క్రింది వ్యాసం పరిశీలనార్హమైనది:

# నేతాజీ జాడ తెలియకుండా నిజాన్ని తొక్కిపెట్టాడు నెహ్రూ

—సమర్‌గుహ

**నేతాజీ అదృశ్యానికి సంబంధించి నెహ్రూగారి ఆధీనంలో ఉంచిన 34 రహస్య ఫైళ్ళు ఆయన మరణానంతరం అదృశ్యం కావడమో తగలబెట్టబడటమో జరిగింది.**

మిత్ర పక్షాలకు జపాన్ లొంగిపోయిన తర్వాత నేతాజీ ఏమయ్యాడో నెహ్రూకు తెలుసా? మొదట్లో మౌంట్‌బాటన్ ద్వారానూ, ఆ తర్వాత బ్రిటిష్ గూఢచార శాఖ ద్వారానూ అందిన సమాచారాన్ని బట్టి విమాన ప్రమాదంలో నేతాజీ మరణించాడన్న వార్త కల్పితమనీ, భారత విప్లవ వీరుడు రష్యాకు తప్పించుకుపోయాడనీ నెహ్రూకు వర్తమానం అందినదా? వేవెల్ కార్యనిర్వాహక వర్గం వద్ద ఉంటూ, ఇటీవలి కాలంలో ప్రకటితమైన అతి రహస్య పత్రాలనుబట్టి, షానవాజ్ కమిటీకి, ఖోస్లా కమిషన్‌కు అందజేయబడిన ముఖ్య సమాచారాన్నిబట్టి తైవాన్‌లోని తైహోకులో 18 ఆగస్టు 1945 నాడు జరిగిన ప్రమాదంలో నేతాజీ మరణించాడని జపాన్‌వారు ప్రచారం చేసిన వార్త అసత్యం అన్న సంగతి మాత్రమే కాదు, మిత్ర పక్షాలకు జపాన్ లొంగిపోయిన తర్వాత సుభాస్ చంద్రబోస్ రష్యాకు చేరుకొన్నాడన్న సంగతి కూడా నెహ్రూకు తెలుసు.

## రహస్య పత్రాలు

బ్రిటిష్‌వారు భారతదేశాన్ని వదిలిపెట్టి పోయిన తర్వాత ముప్పై సంవత్సరాలకు వెలువడించిన ''ట్రాన్స్‌ఫర్ ఆఫ్ పవర్ 1942-47'' అనే

గ్రంథంలో భారత దేశానికి సంబంధించిన అనేక రహస్య పత్రాలు వెల్ల డించడం జరిగింది. విమాన ప్రమాదంలో సుభాస్‌చంద్ర బోస్ మరణించ లేదని ఋజువుచేసే నిర్దిష్టమైన సమాచారం బ్రిటిష్ ప్రభుత్వం వద్ద ఉన్నట్లు ఈ పత్రాలు వెల్లడిస్తున్నాయి. అంతేకాదు, ఆయన తప్పించుకు పోయి, రష్యావారిని ఆశ్రయించి అక్కడ ఉన్న సమాచారం కూడా వారికి తెలుసు.

సుభాస్ చంద్రబోస్ బ్రతికే ఉన్నాడని, అందులోనూ రష్యాలో ఉన్నాడని తెలుసుకొని బ్రిటిష్ ప్రభుత్వం అయోమయ పరిస్థితిలో పడింది. నేతాజీపై ఏవిధమైన చర్య తీసుకోవాలో బోధపడలేదు. యుద్ధానంతరం తొలగించిన ఆంక్షల ఫలితంగా భారత జాతీయ సేనతో కలిసి నేతాజీ సాధించిన విజయాలను గూర్చి ప్రజలు కథలు కథలుగా చెప్పుకోవడం ప్రారంభించారు. ఈ భారత వీర రత్నాన్ని దేశంలోని కోనకోనలలోనూ కొనియాడటం కనిపించింది. ఈ పరిస్థితులలో బోస్‌బాబు మరణించాడన్న కట్టుకథను ప్రజలు నమ్మడం లేదని వేవెల్ తన డైరీలో వ్రాశాడు. అప్పటి భారత వైస్రాయి, ఫీల్డు మార్షల్ అయిన వేవెల్ తన కౌన్సిల్‌లో ఆంతరంగిక వ్యవహారాలు చూసే సభ్యుడు ఆర్.యఫ్. ముడీకి బోస్ విషయంలో అనుసరించదగిన విధానం ఏమిటో తెలియజేస్తూ ఒక టిప్పణి తయారు చేయమని పురమాయించాడు. అలాగే ముడీ ఒక టిప్పణి తయారుచేసి వైస్రాయ్‌గారి ప్రయివేటు కార్యదర్శి ఈవెన్ జంకిన్స్‌కు బోస్ మరణించాడని ప్రకటించిన అయిదు రోజులకు, అనగా 23 ఆగస్టు 1945 నాడు అందజేశాడు. ఆ మర్నాడు, అనగా 24 ఆగస్టు, 1945 నాడు వేవెల్ తన డైరీలో ఇలా వ్రాసుకొన్నాడు —

"విమాన ప్రమాదంలో సుభాస్ చనిపోయాడని జపాన్‌వారు వెలువరించిన ప్రకటన నాకు ఆశ్చర్యం కల్గిస్తోంది. నాకు ఈ విషయంలో

పెద్ద అనుమానంగా ఉంది. ఇది ఆయన అజ్ఞాతంలోనికి వెళ్ళడానికి వీలుగా ఉద్దేశించబడిన ప్రకటనగా నాకు తోస్తున్నది."

నేతాజీ పట్ల అనుసరించదగిన విధానాన్ని గూర్చి వివిధ కోణాలలో ఆలోచించే ముందు భారత జాతీయ జీవనంలో నేతాజీకి ఉన్న స్థానాన్ని గూర్చి ఇలా వ్రాశాడు-

"భారత జాతీయ సేనపైన బోస్ ప్రభావం అమితంగా ఉంది. ......జాతి, మత, కుల భేదం లేకుండా అందరిపైన ఈ ప్రభావం ఉంది. నిజాయితీ గల దేశభక్తుడుగానూ, దక్షతగల నేతగానూ, ప్రవాస భారతీయులందరిలో తలమానికంగానూ, తొలి భారత జాతీయసేన సంఘటకునిగానూ, జపాన్‌వారి ఆక్రమణలో ఉన్న ప్రదేశాలలో నివసిస్తున్న భారతీయుల సంరక్షకుడిగానూ, జపాన్ వారితో సమాన హాయాలో నిలబడి మిగిలిన దేశాల నాయకులందరికంటె మిన్నగా వారి గౌరవానికి పాత్రుడైన నాయకుడుగానూ ఆయనపట్ల అజాద్ హింద్ సైనికులకు అపారమైన విశ్వాసం, భక్తి ప్రపత్తులు ఉన్నాయి భారత దేశంతో అత్యున్నత శ్రేణికి చెందిన నాయకుడుగా ఆయన అదివరకే ప్రఖ్యాతి చెందాడు.

## ముడీ వ్రాసిన టిప్పణి

నేతాజీ అదృశ్యానికి సంబంధించి ఏర్పరచిన ఏకసభ్య విచారణ సంఘ చైర్మన్ జి. డి. ఖోస్లా తన నివేదికలో, నేతాజీని జపాన్‌వారి చేతిలో కీలుబొమ్మగానూ, పంచమాంగ దళ సభ్యుడుగా వర్ణించాడు. అనేకచోట్ల ఆ నివేదికలో నేతాజీని జపాన్‌వారి పనిముట్టు అనీ, పావు అనీ పేర్కొన్నాడు. కాని, బ్రిటిష్‌వారు బయటకు ఆయనను ఎంతగా నిందిస్తూ ప్రచారం చేసినప్పటికీ, నేతాజీ వ్యక్తిత్వాన్ని అంచనా కట్టేప్పుడు మాత్రం వాస్తవాలను పరిగణన తీసుకోవడం జరిగింది. స్వతంత్ర భారత తాత్కా-

లిక నేతగా జపాన్‌వారితో నేతాజీ బహు చాకచక్యంగా వ్యవహరించాడనీ, అటువంటి స్థానంలో ఉన్న మిగతా నాయకులందరికంటె మిన్నగా నేతాజీ జపాన్ వారినుండి గౌరవాభిమానాలను, అధికారాలను పొందాడనీ బ్రిటిష్ వారు వ్రాశారు.

నేతాజీని అరెస్టుచేసి బహిరంగంగాకాని, న్యాయస్థానంలో గాని విచారించడం జరిగితే భారతదేశంలో అలవికాని అలజడి చెలరేగుతుందని భారతదేశంలోని బ్రిటిష్ ప్రభుత్వం అంచనా వేసింది. బహిరంగంగా కాని, రహస్యంగాకాని విచారణ జరపడంలో ఉన్న ఈ ఇబ్బందిని గుర్తించి బోస్‌పట్ల వ్యవహరించదగిన తీరుకు సంబంధించి ప్రత్యామ్నాయ సూచనలు ముడీ ఇలా తెలియజేశాడు-

1. భారత దేశానికి రప్పించి, యుద్ధం ప్రకటించినందుకుగాను కోర్టులో విచారించడం, లేదా ఎనిమీ ఏజంట్స్ ఆర్డినెన్స్ క్రింద విచారించడం.
2. చక్రవర్తికి వ్యతిరేకంగా యుద్ధం ప్రకటించినందుకు మలయాలో కాని, బర్మాలోగాని న్యాయస్థానంలో విచారణ జరపడం.
3. ఇండియాకు వెలుపల సైనిక న్యాయస్థానంలో విచారించడం.
4. నిర్బంధంలో ఉంచడం.
5. సెషెల్స్ దీవిలో కాని, మరొకచోటగాని నిర్బంధంలో ఉంచడం.
6. అతడినిగూర్చి పట్టించుకోకుండా వదిలేయడం.

బర్మాలో కానీ, మలయాలో కానీ విచారణ జరిపి శిక్షించడం కానీ, బ్రిటిష్‌వారి ఆధీనంలో ఉన్న మరో ప్రదేశంలో ఎక్కడైనా నిర్బంధంలో ఉంచడం కానీ మంచిది కాదని చెపుతూ-

"ఆయనను ఉన్నచోటనే ఉండనిచ్చి, అప్పచెప్పమని అడగకుండా ఉండటమే మంచి మంచి మార్గం. కొన్ని ప్రత్యేక పరిస్థితులను పురస్కరించుకొని రష్యావారు నేతాజీని అక్కడ ఉంచి ఉండవచ్చు. అలా ఉంచ

దమే మేలు'' అని వ్రాశాడు ముడీ. ఆ టిప్పణిని వేవెల్ అప్పటి బ్రిటిష్ ప్రధాని అట్లీకి అందజేశాడు. అది - 25 అక్టోబర్, 1945లో, అనగా మరణవార్త వెలువడిన 67 రోజులతర్వాత బ్రిటిష్ కేబినెట్‌చేత ఆమోదించబడింది. దానినిబట్టి నేతాజీ మరణవార్తను బ్రిటిష్ ప్రభుత్వం విశ్వసించకపోవడమేకాక, రష్యాలో నేతాజీ ఉన్నాడన్న వాస్తవం గుర్తెరిగి ఉన్నదని భావించవచ్చు.

## గూఢచారుల సమాచారం

వేవెల్ అట్లీకి సమర్పించిన టిప్పణిని కాస్త జాగ్రత్తగా పరిశీలిస్తే నేతాజీ రష్యాలో ప్రవేశించాడన్న విషయం స్పష్టమవుతుంది. అలా కాకపోతే 'అప్పచెప్పమనడం' 'వదిలిపెట్టమనడం' లాంటి పదాలు వాడేవారు కాదు. కొన్ని ప్రత్యేక పరిస్థితులలో బోస్‌బాబు అక్కడ ఉండాలని రష్యా కోరుకుని ఉండవచ్చుననే సూచనకూడా ఈ టిప్పణిలో పొందుపరచబడి ఉంది. బోస్‌బాబు రష్యాలో ఉండటంవలన బ్రిటిష్‌ప్రభుత్వానికి తక్షణమే ఎదురయ్యే సమస్య ఏమీ ఉండదనికూడా వారు భావించారు. కాబట్టి నేతాజీ రష్యాలో ఉన్నాడన్న సంగతి తిరగతోడటం వారికి ఇష్టంలేదు. అంతేకాక, అసలు ఆ ప్రస్తావన లేకుండా ఉండటమే విజ్ఞతగా ఉంటుందని భావించారు.

బ్రిటిష్ ప్రభుత్వం ముప్పై ఏండ్లకు పైగా నేతాజీ జాడకు సంబంధించిన ఈ అతిరహస్య సమాచారం ఎక్కడా పొక్కకుండా తొక్కిపెట్టివుంచింది. రష్యావారుకూడా ఏమీ చెప్పకపోతే బాగుండదు అన్నట్లుగా నేతాజీ తమ దేశంలో ఉన్నాడనటం అబద్ధం అంటూ 1946 లో ప్రావ్దా పత్రికలో ఒకసారి ప్రకటించి ఊరుకొన్నారు. భారతదేశంలో జన్మించిన విప్లవ వీరులలో ఉత్తమోత్తముడైన నేతాజీనిగూర్చి కినుకతో బ్రిటిష్‌వారు, రష్యన్లు కూటనీతిని అవలంబించారంటే అర్థం వుంది. కాని స్వేచ్ఛా భారత ప్రథమ ప్రభుత్వం అయిన నెహ్రూ ప్రభుత్వం మాటేమిటి ?

షానవాజ్ ఖాన్ కమిటీ ముందుంచిన పత్రాలనూ, ఖోస్లా కమీషన్కు సమర్పించిన పత్రాలనూ ఆధారంగా తీసుకొని కేంద్ర గూఢచార శాఖ ఒక రహస్య నివేదిక సమర్పించింది. 'బోస్‌బాబు నుంచి నెహ్రూకు ఒక రహస్య సమాచారం చేరింది' అని ఆ నివేదికలో ఉంది. అందులో తనను విడుదల చేయించడానికి తగిన సన్నాహాలు చేయవలసినదిగా నేతాజీ కోరినట్లు ఉంది. ఆ రహస్య నివేదికలోనే బోస్‌బాబు మాస్కోలో గిజాయ్ మలాన్ అనే మారు పేరుతో ఉన్నట్లుగా పేర్కొనబడింది. ఈ సమాచారం కాబూల్‌లో ఉన్న రష్యా రాయబారి, టెహరాన్‌లోని రష్యా రాయబార కార్యాలయ సహాయాధికారి 1946 ప్రారంభంలో తెలియజేసినట్లుగా బ్రిటిష్ ప్రభుత్వానికి తెలుపబడింది.

## మౌంట్‌బాటన్ పాత్ర

1946 లో వైస్రాయ్ కార్యవర్గ సమితిలో చేరిన తర్వాత పండిట్ నెహ్రూకు రష్యాలో నేతాజీ ఉన్నట్లుగా తెలిపే నివేదికల విషయం పూర్తిగా తెలిసింది. అంతకుముందే, జపాన్ లొంగిపోయిన తర్వాత, నేతాజీ ఏమైపోయాడన్న విషయం మౌంట్‌బాటన్ ద్వారా నెహ్రూకు తెలిసింది. 1946 లో ఆగ్నేయాసియా కమాండ్ అధిపతి అయిన లార్డ్ లూయీస్ మౌంట్‌బాటన్‌కు అతిథిగా నెహ్రూ సింగపూర్ సందర్శించాడు. సింగపూర్ నుంచి తిరిగి వచ్చాక నేతాజీని గూర్చి నెహ్రూ ఒక్కమాట కూడా అనకపోవడం గమనించదగిన విషయం. నెహ్రూతోపాటు సింగపూర్ వెళ్ళివచ్చిన గుజరాత్ దినపత్రిక జనమ్‌భూమి సంపాదకుడు, కీ.శే. అమృతలాల్ సేట్ శరత్ చంద్రబోస్‌కు తెలియజేసిన సమాచారాన్నిబట్టి నెహ్రూ మౌంట్‌బాటన్ సలహాను పాటించాడని విదితమవుతోంది. బోస్‌బాబుకు సంబంధించిన వీరగాథలు ఇక ఏ మాత్రం ప్రచారం చేసినా భారతదేశపు నాయకత్వం పూలలోపెట్టి నేతాజీకి సమర్పించినట్లు అవు

తుంది. కాబట్టి నేతాజీని గూర్చి మాట్లాడటం నెహ్రూకు ఎంత మాత్రం శ్రేయస్కరం కాదని మౌంట్‌బాటన్ సలహా. 1945-46 మధ్య అజాద్ హింద్ ఫౌజ్ రక్షణ సమితికి స్టెనోగా పని చేసిన శ్యాంలాల్ జైన్ ఖోస్లా కమీషన్‌కు సంచలనాత్మకమైన సమాచారం అందజేశాడు. 1945లో నేతాజీ వద్దనుంచి నెహ్రూకు బహుశః అతి ముఖ్యమైన రహస్య సమాచారం చేరిందని చెప్పాడు. ఈ సమాచారం అందుకొన్న వెంటనే 'రష్యాతో మిత్రపక్షాలు కుదుర్చుకొన్న ఒప్పందానికి వ్యతిరేకంగా మీ యుద్ధ నేరస్థుడైన సుభాస్ చంద్రబోస్‌కు రష్యా ఆశ్రయం ఇచ్చిందన్న విషయం గుర్తుకు తెస్తున్నాను' అంటూ బ్రిటిష్ ప్రధాని అట్లీకి నెహ్రూ ఒక ఉత్తరం వ్రాసినట్లుగా జైన్ చెప్పాడు. ఆ ఉత్తరం స్వయంగా నెహ్రూ తనకు డిక్టేట్ చేసినట్లు, అసఫ్ ఆలీ ఇంట్లో తాను ఆ ఉత్తరాన్ని టైపు చేసినట్లు జైన్ తెలియజేశాడు.

## రహస్య టిప్పణి

నేతాజీ రష్యాకు చేరిఉండవచ్చునని తెలుపుతూ 1951 లో యస్. ఏ. అయ్యర్ నెహ్రూకు ఒక నివేదిక సమర్పించాడు. నేతాజీ మరణానికి సంబంధించిన పూర్తి సమాచారాన్ని సేకరించుకు రావలసిందని నెహ్రూ అప్పటి బొంబాయి ప్రభుత్వ సమాచార శాఖ అధికారిగా ఉన్న యస్. ఏ. అయ్యర్‌ను జపాన్‌కు పంపాడు. టోక్యోలో తాను కనుగొన్న విషయాలకు సంబంధించి వ్రాతపూర్వకంగా నెహ్రూకు సమర్పించిన ఒక నివేదికలో అయ్యర్ ఒక రహస్య టిప్పణి కూడా చేర్చాడు. అందులో ''ఈసారి కల్నల్ టాడా నాకొక ముఖ్యమైన సమాచారం వెల్లడించాడు'' అని వ్రాశాడు.

కల్నల్ టాడా సైగాల్‌లోని యఫ్. యం. పెరాచీ హెడ్ క్వార్టర్స్‌లో స్టాఫ్ ఆఫీసర్‌గా ఉండేవాడు. టోక్యోలోని జపాన్ సామ్రాజ్య

ప్రభుత్వం, సైగాన్‌లోని టెరాచీ యొక్క హెడ్‌క్వార్టర్స్ అందజేసిన ఆజ్ఞలమేరకు సుభాస్ బోస్‌ను మంచూరియా సరిహద్దులగుండా రష్యాకు చేర్చేపని కల్నల్ టాడా, లెఫ్టినెంట్ జనరల్ ఐసోడాలు స్వీకరించారు. సుభాస్‌చంద్ర బోస్‌ను ఆంగ్లో-అమెరికన్ల అదుపులో ఉన్న ప్రాంతంనుంచి తప్పించడానికి ప్రణాళిక సిద్ధం చేసుకొన్నారు. ఆ పథకం ప్రకారం కొమింగ్‌టాంగ్ దళాల అధిపతి లెఫ్‌టెనెంట్ జనరల్ షీడే తోడురాగా నేతాజీ మంచూరియా సరిహద్దు దాటాలి. ఆపైన రష్యాలో బోస్ తన ఏర్పాటు తాను చేసుకోవాలి. కల్నల్ టాడా వెల్లడించిన ముఖ్యమైన సమాచారం ఇది.

## అదృశ్యమైన ఫైళ్ళు

బోస్ రష్యా చేరుకున్న తర్వాతనే జపాన్ ప్రభుత్వం సుభాస్ అదృశ్యమయ్యాడన్న సంగతి ప్రకటించాలని కూడా నిర్ణయించబడింది. ఆ ప్రకారమే 18, ఆగష్టు 1945 నాడు నేతాజీ మరణించాడన్న వార్త అయిదు రోజులు గడిచాక అనగా 23 అగష్టు 1945 నాడు ప్రకటించడం జరిగింది. ఈలోగా నేతాజీ మంచూరియా సరిహద్దు దాటేందుకు కావలసిన సమయం ఇవ్వడం జరిగిందన్నమాట. అయ్యర్ సమర్పించిన నివేదికలోని మిగతా భాగాలన్నీ పార్లమెందుముందు పెట్టి కల్నల్ టాడా తెలియచేసిన సమాచారం మాత్రం పార్లమెంటు సభ్యులకు తెలియజేయలేదు. నేతాజీ అదృశ్యానికి సంబంధించిన 34 ఫైళ్ళు స్వయంగా పండిత నెహ్రూ ఆధీనంలో ఉన్నట్లు ఖోస్లా కమిషన్‌కు తెలియజేయబడింది. నెహ్రూకు ప్రత్యేక కార్యదర్శిగా ఉన్న మహమ్మద్ యూనస్ ఆ ఫైళ్ళునిర్వహించేవాడు. ఈ ఫైళ్ళు విషయం అడిగినప్పుడు కొన్ని ఎక్కడో పోయినట్లు, కొన్ని చెడిపోయినట్లు భారత ప్రభుత్వం ఖోస్లా కమిషన్‌కు తెలియజేసింది. కనీసం ఆ ఫైళ్ళలోఉన్న సమాచారం ఏమిటో కూడా భారత ప్రభుత్వం తన

నివేదికలో ఖోస్లా కమిషన్‌కు తెలియజేయలేదు. అయితే అలా పోయిన కొన్ని ఫైళ్ళలో నేతాజీ అదృశ్యానికి సంబంధించి సింగపూర్‌లోని మౌంట్ బాటన్ క్వార్టర్స్‌నుంచీ, టోక్యోలోని మెక్ ఆర్థర్ హెడ్ క్వార్టర్స్ నుంచీ సేకరించిన సమాచారం ఉన్నట్లు వ్రాశారు. నేతాజీకి సంభవించిన దుస్థితి తెలియజేసే ఈ రహస్య ఫైళ్ళు మాయం కావడం అందరిలో సందేహాలు రేకెత్తించింది. ప్రధానమంత్రి కార్యాలయంలో ప్రత్యేకంగా భద్రపరచిన ఈ రహస్య ఫైళ్ళు మాయం కావడం ఏమిటి ? ఈ ఫైళ్ళలో నేతాజీ మరణ కథనానికి సంబంధించీ, రష్యాకు తప్పించుకుపోవడానికి సంబంధించీ నిగూఢమైన రహస్యాలేవో దాగి ఉండబట్టే వాటిని మాయం చేయడం జరిగిందని స్పష్టంగా ఊహించుకోవచ్చు.

## సత్యం బయటపడాలి

18 ఆగష్టు 1945 నాడు నేతాజీ అదృశ్యానికి సంబంధించిన నిజానిజాలు బయటపెట్టవలసినదిగా కోరుతూ ప్రజలనుంచి ఎంతో ఒత్తిడి వచ్చిన కారణంగా ఏప్రిల్ 1956 లో పండిత నెహ్రూ జనరల్ షానవాజ్‌ఖాన్ చైర్మన్‌గా, యస్. యన్. మైత్రా, సురేష్ చంద్రబోస్‌లు సభ్యులు గల విచారణ కమిటీని వేశాడు. అలాగే ఆయన కూతురు 1971 లో జి. డి. ఖోస్లా అధ్యక్షతన మరొక విచారణ సంఘాన్ని నియమించడం జరిగింది. ఈ రెండు సంఘాలూ విచారణ జరిపి వెలువరించిన నివేదికలు కపోలకల్పితాలు కావడం సిగ్గుచేటయిన విషయం. ఈ రెండు సంఘాలూ తమ నివేదికలో నేతాజీ మరణాన్ని ధృవపరిచాయి. ......విమాన ప్రమాదంలో నేతాజీ చనిపోలేదనీ, రష్యాకు తప్పించుకు పోయాడనీ బ్రిటిష్ ప్రభుత్వంవద్ద ఉన్న సమాచారం తెలుపుతోంది. బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటించిన 'అతి రహస్య నివేదికల'లో వెల్లడయిన విషయాలు తెలుసుకొన్న తర్వాత కూడా భారతమాత అనుంగుబిడ్డ, విప్లవ వీరులలో శ్రేష్టతమనేత

అయిన నేతాజీకి సంబంధించిన నిజమైన సమాచారం సేకరించలేకపోతే భావితరాలవారు మనను క్షమించరు.

(''ఆర్గనైజర్'' 1977 దీపావళి ప్రత్యేక సంచిక నుంచి)

* * *

నేతాజీ అదృశ్యానికి సంబంధించి వేసిన మొదటి విచారణ సంఘం తెపై (తైహోకు) కు వెళ్ళి అక్కడి విమానాశ్రమాన్ని పరిశీలించడంగానీ, నేతాజీతో పాటు ప్రయాణం చేసినవారిని కలుసుకొని విచారించడం కానీ చేయలేదు. అయినప్పటికి తెపైలో జరిగిన విమాన ప్రమాదంలోనే నేతాజీ మరణించినట్లు తేల్చిచెప్పారు. శరత్‌చంద్ర బోస్ దీనితో ఏకీభవించలేదు.

ఆ తర్వాత సత్యనారాయణ సిన్హా తెపైకి వెళ్ళి అ సంఘటన జరిగిందని చెప్పబడుతున్న రోజున అక్కడవున్న ఒక అధికారిని కలుసుకోవడం జరిగింది. కాని ఆ అధికారి ఆ రోజున తెపైలో అలాంటి సంఘటన ఏదీ జరగలేదని చెప్పాడు. ఆ తర్వాత ఆయన జరిపిన విచారణలో నేతాజీ మంచూరియాలోని డైరెన్‌కు చేరాడనీ, అప్పటికే అది రష్యా ఆక్రమణలో ఉందనీ, నేతాజీ మారువేషంలో ఉన్నప్పటికి ఆయనను గుర్తుపట్టి నాజీల తొత్తుగా ముద్రవేసి సైబీరియా పంపించారనీ, ఇక ఆపైన కథ తెలియలేదనీ వ్రాశాడు.

ఏది ఏమైనప్పటికీ సుభాష్ చంద్రుడు అదృశ్యమై నాలుగు దశాబ్దాలు కావస్తున్నా వాస్తవంగా ఆయన తైవాన్‌లోని తైపీ (తైహోకు) విమానాశ్రయంలో 18 ఆగష్టు 1945 నాడు మృతుడైనాడా అన్న విషయం స్పష్టంగా తేలనేలేదు.

నేతాజీ సల్పిన కృషి వృథా కాలేదు. భారతీయుల హృదయాలలో స్వాతంత్ర్యేచ్ఛ చిచ్చులా రగిలింది. భారతీయులపైన పట్టు కోల్పోయి,

ఇక ఏ మాత్రం తమ ఆధీనంలో వారిని ఉంచుకోవడం సాధ్యం కాదని గ్రహించిన బ్రిటిష్‌వారు గృహోన్ముఖులయ్యారు. 14 ఆగష్టు 1947 నాడు భారతదేశాన్ని విడిచిపెట్టిపోవడానికి నిర్ణయించుకొన్నారు. ఏమైనా బ్రిటిష్‌వారు ఈ దేశాన్ని వదిలిపెట్టిపోక తప్పదని నేతాజీ చేసిన హెచ్చరిక సహేతుకమైనదని ఋజువైంది. భారత జాతీయ సేన యుద్ధంలో విజయం పొందినా, ఓడిపోయినా బ్రిటిష్‌వారు భారతదేశాన్ని వదిలి వెళ్ళడం ఖాయం అని నేతాజీ వ్యక్తంచేసిన విశ్వాసం అక్షరాలా నిజమైంది. భారత దేశానికి స్వాతంత్ర్యం సిద్ధింప చేసేందుకు తన జీవితాన్ని పణంగా పెట్టి పోరాడిన నేతాజీ తన కలలు ఫలించిన రోజున మన మధ్యన లేకపోవడం విధివంచన కాక మరేమిటి ? ఇంకా ఆయన బ్రతికే ఉన్నాడు, ఏదో ఒక రోజున ఆయన సందర్శన భాగ్యం లభిస్తుంది అని విశ్వసించే భారతీయులు అనేకులున్నారు. సమర గుహ లాంటి పెద్దలు ఆయన జాడ తీయడానికి సాగించిన అన్వేషణ అంతా ఇంతా కాదు. నిజంగా ఆయన బ్రతికిఉండి భారతదేశానికి తిరిగివస్తే ఎంత బాగుండును! మన మధ్య లేక పోయినా ఆయన మన హృదయాలలో రగిల్చిన స్వాతంత్ర్య జ్వాల ఏనాటికీ చల్లారదు. ఇక ప్రపంచంలో ఏ శక్తీ మన స్వాతంత్ర్యాన్ని హరించలేదు. కేవలం భారతీయులకే కాదు, స్వాతంత్ర్యం పొందటానికి పోరాటం సాగిస్తున్న ఏ జాతికైనా నేతాజీ జీవితం స్ఫూర్తిదాయకంగా నిలుస్తుంది.

# సింహావలోకనం

సుభాస్‌చంద్ర బోస్ అజరామరమైన కీర్తి గడించి, చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోయాడు. ఆయన విచిత్రమైన పరిస్థితులలో అదృశ్యమైన కారణంగా వాస్తవమేమిటో తెలుసుకొనేందుకు ప్రభుత్వస్థాయిలో విచారణ జరిగింది అలాగే కొందరు ప్రముఖ వ్యక్తులు కూడ నిజానిజాలు తెలుసుకొనేందుకు వ్యయప్రయాసలకోర్చి అన్వేషణ సాగించారు. అయినా నిజం బయటపడలేదు. కొందరు నిశ్చయంగా చనిపోయాడని చెప్పగా, మరి కొందరు అంత దృఢంగానే బ్రతికున్నాడని వాదించారు. తైహోకులో విమాన ప్రమాదంలో మరణించాడన్న వార్త అసత్యమే అని అంగీకరించినా, ఇప్పటికీ జీవించి ఉన్నాడంటే విశ్వసించడం కష్టమే. స్వప్రయోజనాలను ఆశించి ఎవరైనా ఆయనను బందీగా ఉంచి ఉండవచ్చునన్న వాదంలో బలం లేకపోలేదు కాని, ఆ కాలపరిమితి కూడా దాటిపోయిందేమో నన్న భయం ఉంది.

## భారత స్వాతంత్ర్య పోరాటం ఆగదు

నేతాజీ తన ఆఖరి రేడియో ప్రసంగంలో ఆజాద్ హింద్ ఫౌజ్ ఓటమిని అంగీకరిస్తూనే తన ప్రయత్నం అంతటితో ఆగిపోలేదని స్పష్టం చేశాడు. సుభాస్ బోస్ సిసలైన విప్లవ వీరుడు. ఎన్ని కష్టాలు ఎదురైనప్పటికి అంతిమ విజయం తనదేనన్న ఆత్మ విశ్వాసం కల ధీరుడు. తన యుద్ధ ప్రయత్నాలకు ఎంతగానో తోడ్పడిన మిత్రులు ఒకరి తర్వాత ఒకరు పతనమై పోతున్నప్పటికి చలించక చివరివరకూ ఢిల్లీకి మరోదారి వెతుకుతూనే ఉన్నాడు. అక్షరాజ్యాలు పరాజయం పొందడం కళ్ళారా చూస్తూకూడా అధైర్యం చెందలేదు భారత స్వాతంత్ర్య పోరాటానికి

అక్షరాజ్యాల ఓటమికీ సంబంధం లేదన్నాడు. దేనికది విడదీసి ఆలోచించ వలసిన సమస్యలని స్పష్టం చేశాడు. సిద్ధాంతపరమైన విభేదాలున్నప్పటికీ పరిస్థితుల ప్రాబల్యం వలన సోవియట్ యూనియన్ సహాయం అందిస్తుం దేమోనని ఆశించి అందుకు ప్రయత్నించాడు.

## ఒక్క సంవత్సరం ముందుగా చేరి ఉంటే?

పరిస్థితిని అంచనా కట్టడంలో సుభాస్ ఎవరికీ తీసిపోడు. తూర్పు ఆసియాలో పోరాటం కొనసాగుతున్న ఒక దశలో ఇక అవకాశం తన చేయి జారిపోతోందని, సమయం తనకు అనుకూలంగా లేదని బోస్ గ్రహించాడు. చేరవలసిన సమయంలో తూర్పు ఆసియాకు చేరలేకపోయి నందువలన ఈ అనర్థం జరిగిందని భావించాడు. ఒక సంవత్సరం ముందుగా అక్కడికి చేరగల్గి ఉంటే పరిస్థితి అన్ని విధాల అనుకూలంగా ఉండేదని తలచాడు. వాస్తవానికి 1942 లోనే తూర్పు ఆసియాకు చేరాలని నేతాజీ శతవిధాల ప్రయత్నించి విఫలుడైనాడు. సువర్ణావకాశం చేయి జారిపోయింది. 1942 లో భారత జాతీయ కాంగ్రెస్ బ్రిటిష్‌వారికి వ్యతి రేకంగా ఉద్యమం తీవ్రతరం చేసింది. దేశంలో పరిస్థితి అలా ఉండగా దేశం వెలుపలకూడా బ్రిటిష్ వారికి నిరుత్సాహకరమైన వాతావరణమే ఎదురైంది. జపాన్ వారి చేతిలో చావుదెబ్బతిని, యుద్ధభూమిలో తలఎత్తుకో లేని స్థితిలో పడ్డారు. భారత సరిహద్దుల దాపులో జపాన్ సేనలు మోహ రించి నిలిచాయి. ఆ స్థితిలో తన సేనతో నేతాజీ భారత సరిహద్దులు దాటి లోపల ప్రవేశించ గల్గిఉంటే భారతదేశ భవిష్యత్తు మరోరకంగా ఉండేది.

ఇంగ్లాండు మాజీ ప్రధాని హెరాల్డ్ మాక్‌మిలన్ తన స్మృతులలో ఇలా వ్రాసుకొన్నాడు—

"...ముఖ్యంగా ఈ తరుణంలో భారత ఉపఖండం యావత్తూ ఎలాంటి రక్షణ లేకుండా శత్రువుల ప్రవేశానికి తలుపులు బార్లతీసి పెట్టి

నట్లు ఉండిపోయింది. 1942 లో జపాన్ నావికాదళం తలచుకొంటే బంగాళాఖాతంలో ఈ చివరినుండి ఆ చివరివరకు స్వేచ్ఛగా విన్యాసాలు సాగించకలిగేది అన్న విషయం బ్రిటిష్ అధికారులంతా ఒప్పుకొన్నదే. బ్రిటిష్‌వారు భారతదేశాన్ని ఆక్రమించుకొన్న తర్వాత మరో ఆసియా దేశం భారత దేశంపైన దాడి చేయడానికి సిద్ధపడటం అన్నది ఇదే ప్రథమం. ఈ తరుణంలో భారత్‌లో బ్రిటిష్ సేనలు ఏర్పరచిన రక్షణ శ్రేణి దేశాన్ని ప్రమాదం నుండి కాపాడే స్థితిలో లేనేలేదు."

## హిట్లర్ సృష్టించిన గందరగోళం

కాబట్టి 1942 లో తన లక్ష్యం సులభంగా నెరవేరి ఉండేదని బోస్ భావించడంలో తప్పులేదు. అప్పుడే సుభాస్ బోస్ తూర్పు ఆసియాకు చేరాలన్న అభిప్రాయాన్ని వ్యక్తం చేయగా హిట్లర్ జాగు చేశాడు. హిట్లర్ సలహాదారులు కూడా బోస్‌బాబు ఆలోచనలను సాగనివ్వలేదు. భారతదేశం నుంచి తప్పించుకొని బోస్ జర్మనీ చేరిన నాటికి బ్రిటన్ పరిస్థితి ఆందోళనకరంగా ఉంది. ఏ క్షణంలోనైనా బ్రిటన్ జర్మనీకి లొంగిపోవచ్చునన్న వాతావరణం కన్పించింది. మిగిలిన యూరోపియన్ దేశాలు అప్పటికే జర్మనీకి లొంగిపోయాయి. అత్యంత శక్తివంతమైన జర్మన్ ప్రభుత్వాధినేతగా హిట్లర్ నేర్పుగా వ్యవహరిస్తాడని బోస్ భావించాడు అర్థం లేని జాతిభేదాన్ని, బోల్షివిజంపట్ల ఆగ్రహాన్ని తగ్గించుకొని, అంతర్జాతీయ వ్యవహారాలలో అవసరమైన సర్దుబాట్లు చేసుకొంటాడని కూడా భావించాడు. కాని, తను ఆశించిన దానికి వ్యతిరేకంగా మూడు అగ్రరాజ్యాలు తనకెదురు నిలిచినా ఏ మాత్రం సరకు చేయకుండా హిట్లర్ నిర్లక్ష్యంగా ప్రవర్తించడం చూసి, చరిత్ర నుంచి హిట్లర్ ఏ మాత్రం పాఠం గ్రహించలేదని భావించాడు. జయనిజం, బోల్షివిజాలకు వ్యతిరేకంగా ప్రపంచ పోరాటం సాగిస్తున్నాం అంటూ హిట్లర్ గందరగోళం సృష్టిస్తున్నాడన్న

భావన నేతాజీకి కలిగింది. హిట్లర్ కోరుకొంటున్నటువంటి ప్రపంచ పోరాటంలో నేతాజీకి ఏ మాత్రం ఆసక్తిలేదు. కార్యార్థిగా వెళ్ళాడు కాబట్టి హిట్లర్ సహాయాన్ని అపేక్షించాడు.

1941 లో బోస్ జర్మనీలో అడుగుపెట్టినప్పుడు అక్షరాజ్యాలు జయించడం తథ్యమనే అనిపించింది. కాబట్టి యుద్ధానంతరం భారత దేశానికి స్వాతంత్ర్యం ఇస్తామని వారిచేత ప్రకటన చేయించాలని బోస్ కోరుకొన్నాడు. అదే సమయంలో యుద్ధానంతరం స్వాతంత్ర్యం ఇచ్చి వేస్తామని ప్రకటించవలసినదిగా బ్రిటన్ పైన గాంధీజీ వత్తిడి తేవడం సాగించాడు. అయితే అటు అక్షరాజ్యాలు కానీ, ఇటు బ్రిటన్ కానీ అటు వంటి ప్రకటనతో ముందుకు రాకపోవడం దురదృష్టకరమైన విషయం. కష్టాలలో ఉన్న సమయంలో బ్రిటిష్‌వారికి గాంధీజీ తన సమర్థన, సాను భూతి తెలియజేసినప్పటికీ, బ్రిటిష్ ప్రభుత్వం నుండి అనుకూలమైన సమా ధానం లభించలేదు. వినతి పత్రం రూపంలో జర్మన్ ప్రభుత్వానికి సుభాస్ చేసిన ప్రతిపాదనలలో ఇమిడి ఉన్న రాజనీతి హిట్లర్‌కు, అతని సలహా దారులకూ అవగాహన కాలేదు. బోస్ తన ఉద్దేశ్యాన్ని మిత్రపక్ష రాజ్యా లకు ఉమ్మడిగానూ, విడివిడిగాను బహు చాకచక్యంగా రాజనీతిజ్ఞతతో తెలియజెప్పాడు కాని, ఫలితం లేకపోయింది.

## వెలుగురేఖ

పాశ్చాత్య దేశాలలోనూ, ప్రాచ్యఖండంలోనూ యుద్ధానికి సంబం ధించి నేతాజీ చాటిన విషయాలూ, చేసిన ప్రసంగాలూ, ఏర్పాటు చేసిన కార్యక్రమాలూ ఆయనకున్న అవగాహనాశక్తికి, వాస్తవ దృష్టికి నిదర్శ నాలు. జర్మనీ,జపాన్‌లఆలోచనలు ఒకోసారి దోషభూయిష్టంగా కొనసాగేవి. వారే సర్వజ్ఞులు అన్న ధోరణిలో ఇతరుల సలహాలను సరకు చేసేవారు కాదు. ప్రపంచ రాజకీయాలను ఆపోశన పట్టిన నేతాజీ వెలిబుచ్చిన

అమూల్యమైన సలహాలు వారి చెవి కెక్కలేదు. అయితే, అంత నిరాశా పూరితమైన వాతావరణంలో కూడ బోస్‌బాబుకు ఒక వెలుగురేఖ కని పించింది. ఆగ్నేయాసియా దేశాలలో స్వాతంత్ర్య పిపాస పెల్లుబికింది. యుద్ధంలో జయాపజయాల సంగతి ఎలా ఉన్నా ఇక ఎంత మాత్రం ఈ దేశాలను బానిసత్వంలో ఉంచడం ఎవరి తరమూ కాదన్న సంగతి తేలి పోయింది. ఈ పరిస్థితి సుభాస్ బోస్‌కు ఎంతో సంతృప్తిని కలిగించింది.

అమెరికా, బ్రిటన్‌లతోపాటు ఏకకాలంలో రష్యాతో యుద్ధానికి తల పడటం హిట్లర్ ప్రదర్శించిన దివాలాకోరు విధానానికి నిదర్శనం అని సుభాస్ భావించాడు. సైనిక పరంగానూ, రాజనీతి దృష్ట్యానూ అవాంఛ నీయమైన మలుపు ఇది.

1945 లో అక్షరాజ్యాల ఓటమి తథ్యమని తేలిపోగానే రష్యా ఆక్రమణలో ఉన్న మంచూరియాకు చేరి తన పోరాటాన్ని సాగించాలని బోసు భావించాడు. ఆసియా దేశాలలో నూతన చైతన్యం చోటుచేసుకొన్న దనీ, ఈ దేశాల మధ్య పరస్పర సహకారం సాధ్యపడుతుందనీ ఆశించాడు. యుద్ధంలో చావుదెబ్బతిని దుర్దశ నెదుర్కొంటున్న సమయంలో కూడా జపాన్ ప్రభుత్వం ఒక యుద్ధ విమానాన్ని తనకు స్వాధీనం చేయడం ఈ చైతన్యానికి నిదర్శనం అని కూడా భావించాడు. తన నాయకత్వంలో ఏర్పడిన తాత్కాలిక స్వతంత్ర భారత ప్రభుత్వం రష్యాతో మంతనాలు కొనసాగించడం తెలిసి ఉండి కూడ జపాన్ మిన్నకుండడం ఈ చైత న్యంలో భాగమేనని భావించాడు. కాని రష్యాకు తన సామ్రాజ్య విస్తర ణలో ఉన్న ఆసక్తి ఆసియా దేశాల ప్రగతిలో లేదన్న విషయం గ్రహించ లేకపోయాడు.

## సామ్రాజ్యవాద శత్రువు :

రెండవ ప్రపంచ యుద్ధానంతరం 25 సంవత్సరాలలో ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికాలలో అనేక దేశాలు స్వాతంత్ర్యం పొందాయి.

ఈ పరిణామానికి దారితీసిన సంఘటనలలో సుభాస్ సాగించిన స్వాతంత్ర్య పోరాటం ప్రధానమైనదని మనం గుర్తించాలి. స్వాతంత్ర్యేచ్ఛ గల జాతిని ఎంతోకాలం అణచి ఉంచడం సాధ్యం కాదనీ, అలాంటి ప్రయత్నం వ్యర్థం కాక తప్పదనీ సుభాస్ సాగించిన ఉద్యమం ఋజువు చేసింది. బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని ప్రథమ శత్రువుగా ఎంచి తుదివరకు పోరాటం సాగించి కుతంత్రాలు ఇక పైన పని చేయవని వారు గ్రహించేట్లు చేసిన జాతీయ విప్లవవాది సుభాస్ ఇరవైయవ శతాబ్దపు ప్రథమార్ధంలో నేతాజీ వంటి ప్రతిభాసంపన్నుడు, తలపెట్టిన కార్యానికి పూర్తిగా అంకితమై పని చేసిన నాయకుడు మరొకడు లేడంటే అతిశయోక్తి కాదు. బ్రిటిష్ సామ్రాజ్య విచ్ఛిత్తికి బోస్ నిర్వహించిన పాత్ర అతి ప్రధానమైనదనడంలో సందేహంలేదు. నేతాజీ నేతృత్వంలోనే స్వతంత్ర భారతదేశ పునర్నిర్మాణం జరిగి ఉంటే ఎలా ఉండేది అన్న ప్రశ్నకు స్పష్టమైన సమాధానం లేకపోయినప్పటికీ, భారతదేశంలో ఇప్పటివరకు జరిగిన కృషి ఆయన సిద్ధాంతాలకూ, ఆశయాలకూ అనుగుణంగా లేదనిమాత్రం చెప్పవచ్చు. ఒక్క భారతదేశంలోనే కాదు, ప్రపంచమంతటా ఒక సాంఘిక చైతన్యం ఏర్పడాలని కోరుకొన్న ప్రజలందరి ప్రయోజనాలు నెరవేరినప్పుడే నేతాజీ ఆశయం నెరవేరినట్లు మనం భావించగల్గుతాం.

## అగ్రరాజ్యాల పోటీ

బోస్‌బాబు కనుమరుగైన తర్వాత ప్రపంచ రాజకీయాలలో అనేక మార్పులు సంభవించాయి. ఆసియాలో చాలా రాజ్యాలలో బ్రిటిష్ ప్రభుత్వం వైదొలగిన కారణంగా మానవాళి ప్రగతికీ, స్వేచ్ఛకూ ఉన్న పెద్ద అడ్డుగోడ తొలగిపోయింది. అయితే అంతమాత్రం చేత సామ్రాజ్య వాదం ప్రపంచం నుంచి పూర్తిగా అదృశ్యమైపోయిందని చెప్పలేము. అది మరో రూపంలో ఈనాడు దర్శనమిస్తోంది. ఈవేళ ప్రపంచ ఆధి

పత్యానికి సోవియట్ రష్యా, అమెరికా సంయుక్త రాష్ట్రాల మధ్య ప్రచ్ఛన్న యుద్ధం సాగుతోంది. ఇప్పుడు ఈ పోటీలో మూడవ శక్తిగా చైనా రంగప్రవేశం చేసింది. తక్కువ శక్తివంతమైన ఇతర రాజ్యాలు ఈ మూడు రాజ్యాలలో ఏదో ఒక రాజ్యం వెనుక నిలబడి, ఆ రాజ్యం అనుసరిస్తున్న విదేశాంగ విధానాన్నీ, సామాజిక వ్యవస్థనూ సమర్థిస్తున్నాయి. పాశ్చాత్య విధానం రెండు భిన్నమార్గాలు నడుస్తోంది- మొదటిది పెద్ద భూస్వాముల, పారిశ్రామికవేత్తల ప్రయోజనాలకు అనుకూలంగా ఉన్న కన్సర్వేటిజం; రెండవది సామ్యవాద ప్రజాస్వామ్య విధానం పేరుతో చలామణిలో ఉన్న కమ్యూనిస్టు నియంతృత్వం. ఈ కమ్యూనిస్టు పద్ధతి ప్రస్తుతం మూడు విధాలుగా మనకు దర్శనమిస్తోంది- మొదటిది బ్రెజ్నేవ్ సూత్రాన్ని అనుసరించి ఆచరణలో ఉన్న పాత సోవియట్ పద్ధతి; రెండవది మావోసేటుంగ్ ప్రతిపాదించిన క్రొత్త ప్రొలిటేరియన్ కమ్యూనిజం; మూడవది యుగోస్లావియాలో టిటో, క్యూబాలో కాస్ట్రో, వియత్నాంలో హోచిమిన్ ప్రతిపాదించిన స్వతంత్ర వామపక్ష సోషలిష్టు ఉద్యమం. ఇవిగాక ఆయా దేశాలలో విడివిడిగా ఏర్పడిన కమ్యూనిష్టు ముఠాలు లెక్కకు మిక్కిలిగా ఉన్నాయి. బోస్‌బాబు గనుక జీవించి ఉండి భారత దేశానికి తిరిగివస్తే ఈ పాశ్చాత్య సిద్ధాంతాలలో దేనినీ గ్రుడ్డిగా అనుసరించకుండా ఈ దేశ పరిస్థితులకు అనువైన ఒక స్వతంత్ర ఆలోచనను భారత ప్రజలకు అందించి ఉండేవాడు.

పాశ్చాత్య భూస్వామ్య విధానానికి బోస్‌బాబు బద్ధవ్యతిరేకి. అలాగే జాతీయ విప్లవ వాదిగా, విప్లవాత్మక సాంఘిక చైతన్యంతో తొణికిసలాడుతున్న సమాజం ఆవిర్భవించాలని కలలు కంటున్న నాయకుడుగా, ప్రపంచ ఆధిపత్యానికై పెనుగులాడుకొంటున్న రష్యా పంథాకానీ, చైనా పంథాకానీ అనుసరించేవాడు కాడు. భారతదేశానికి ఒక క్రొత్త దిశను

ప్రతిపాదించే రాజకీయ విధానం అవసరం. సుభాస్ నాయకత్వంలోని స్వేచ్ఛా భారతదేశం సిద్ధాంతరీత్యాను, ఆచరణరీత్యాను ప్రపంచంముందు ఒక నూతన దృక్పథాన్ని ఉంచకలిగేది.

## మేలు కలయిక కావాలి

సాధారణ మానవుడుగానూ, మేధా సంపన్నుడుగానూ బోస్‌బాబు విశిష్టమైన తాత్త్విక చింతన కలవాడు. సమకాలీన ప్రపంచ చరిత్రలో ఒక అద్భుతమైన వ్యక్తిత్వం కల్గిన సుభాస్ పరంపరానుగతంగా మనకు అందుబాటులో ఉన్న ఆధ్యాత్మిక సంపదనూ, ఈనాడు ప్రపంచం సాధించిన సాంఘిక, సాంకేతిక ప్రగతినీ మేళవించి భారతదేశానికి నూతన దిశను ప్రసాదించేవాడు. సిద్ధాంతాల విషయంలో రాజీకానీ, దాసుడు మాతలు కానీ ఆయనకు పనికిరావు. హితబోధల ద్వారా కాకుండా వ్యక్తిగత ఉదాహరణ ద్వారా ప్రజలను ఉత్తేజపరచి, దేశకార్యంలో తమను తాము అంకితం చేసుకొనేట్లు చేయగలిగేవాడు. తూర్పు ఆసియాలో, ఈ విషయంలో ఆయనకుగల సామర్థ్యం స్పష్టంగా ఋజువైంది. ఆయన ఆలోచనా విధానం ప్రస్తుత తరానికే గాక భావి తరాల వారికి కూడా స్ఫూర్తినిస్తుంది. 'భారతదేశం యుగయుగాలుగా అనూచానంగా అందిస్తూ వచ్చిన సందేశం ఇక ముందు కూడా అందించగల్గుతుంది' అనేది సుభాస్ చంద్రుని దృఢ విశ్వాసం.

## మతంకాదు, ప్రతిభ ప్రధానం

నేతాజీ మత విచక్షణనుససేమిరా ఒప్పుకొనేవాడుకాదు. భారతీయులలో అనేక మతాల వారున్నారు. సిక్కులూ, జైనులూ, బౌద్ధులూ, వైష్ణవులూ, శైవులూ, మహమ్మదీయులూ, క్రైస్తవులూ-అన్ని మతాలవారు ఉన్నారు. వీరంతా భారతీయులే. అందరూ సమానమే. వీరిలో ఒకరు అధికులనిగానీ, మరొకరు తక్కువ అని కానీ భావించడం పొరపాటు.

ఎవరికీ ప్రత్యేక హక్కులు లేవు. ఎవరి ప్రతిభకు తగిన గుర్తింపు వారికి లభిస్తుంది. అంతేకాని, కులాన్నిబట్టి కానీ, మతాన్నిబట్టి కాని ఎవరికీ ప్రత్యేక హక్కులూ, సదుపాయాలూ కల్పించబడవు. ఈ విషయంలో నేతాజీ చాలా పట్టుదలగా ఉండేవాడు ఐ యన్.ఏ లో పనిచేసిన సైనికులు ఈ భావంతోనే పనిచేశారు. ఈ అంశంలో నేతాజీ ఘనమైన విజయం సాధించాడని మహాత్మా గాంధీ కొనియాడాడు.

జలాంతర్గామిలో నేతాజీ జర్మనీ నుంచి ఆసియాకు పయనమై వచ్చినప్పుడు ఆయన వెంటవచ్చింది అబీద్‌హుస్సేన్ ఒక్కడే. అజాద్ హింద్ ఫౌజ్ యుద్ధ భూమికి కదలి వెళ్ళినప్పుడు మేజర్ జనరల్ కియాని, మేజర్ జనరల్ షానవాజ్‌ఖాన్‌లను డిపజనల్ కమాండర్స్‌గా నియమించి పంపాడు. సింగపూర్‌నుంచి కొనసాగించిన చివరి ప్రయాణంలో తోడుగా కల్నల్ హబీబుర్ రహమాన్‌ను తీసుకెళ్ళాడు. వీరికి ఇంత ముఖ్యమైన బాధ్యతలు వప్పగించడానికి కారణం వీరు మహమ్మదీయులని కాదు. వీరి దక్షతనుబట్టి ఆ బాధ్యతలు వప్పగించడం జరిగింది. మతపరమైన నియామకాలు నేతాజీ ఎన్నడూ చేయలేదు. సైనిక వ్యవహారాల విషయంలోనేకాదు, పౌరసంబంధాల విషయంలో కూడా ఈ సూత్రాన్నే పాటించాడు. అందుకే ఆయనను భక్తి, విశ్వాసాలతో సేవించిన పౌరులలో మహమ్మదీయు లనేకులున్నారు. రంగూన్ నివాసి అయిన హబిబ్ అనే ఐశ్వర్యవంతుడు బోస్ మెడలో వేయబడిన దండను కోటి రూపాయలకు కొని తన భక్తి ప్రపత్తులు చాటుకున్నాడు. తాత్కాలిక ప్రభుత్వ నిర్వహణ బాధ్యతనుగానీ, అజాద్ హింద్ ఫౌజ్ బాధ్యతలు కానీ నేతాజీ కుల, మత, వర్గ ప్రాతిపదికపై ఎన్నడూ చేయలేదు.

ఒకసారి సింగపూర్‌లోని చెట్టియార్ దేవాలయ ముఖ్య పురోహితుడు దసరా ఉత్సవాలకు రావలసినదిగా నేతాజీని ఆహ్వానించాడు.

'మతపరమైన విభేదాలు లేకుండా అజాద్ హింద్ సైనికాధికారులందరూ ఆ ఉత్సవంలో పాల్గొనవచ్చునా?' అని అడిగాడు నేతాజీ. హిందువులలోనే అన్ని తెగల వారిని ఆ ఆలయంలోనికి ప్రవేశించ నీయరు. పురోహితుడు ఏమి సమాధానం చెప్పగలడు? మౌనంగా తిరుగుముఖం పట్టాడు. అయితే రెండు మూడు రోజులు గడిచాక తిరిగివచ్చి అందరినీ ఆహ్వానించాడు. మహమ్మదీయులూ, క్రైస్తవులూ, హిందువులూ అన్నీ విచక్షణ లేకుండా అందరూ ఆ ఉత్సవానికి హాజరయ్యారు. అందరికీ తీర్థ ప్రసాదాలు అందాయి. అందరి ముఖాన తిలకం అలరింది. ఎవరికీ ఎటువంటి అభ్యంతరం రాలేదు. నేతాజీ సాధించిన భావ సమైక్యత అలాంటిది! నేతాజీయే కనుక స్వతంత్ర భారత రథ చోదకుడుగా ఉన్నట్లయితే అజాద్ హింద్ ఫౌజ్‌లో సాధించిన ఈ ఐక్యత భారతీయులందరిలో సాధించి ఉండేవాడు

## భారతమాత

దేశం అంటే కేవలం ఒక నిర్దిష్టమైన ప్రదేశంలో నివసిస్తున్న ప్రజలూ, లభిస్తున్న భౌతిక వసరులూ మాత్రమే కాదు. దేశం అంటే అక్కడి చెట్టూ, పుట్టా, మట్టీ, మనిషితోపాటు అక్కడి సంస్కృతీ, ఆలోచనా సరళీ, జీవన విధానం —అన్నీ అని అర్థం. ప్రజలు సుఖశాంతులతో మసలేందుకు కావలసిన సర్వస్వం అందిస్తున్న పుడమిని పుడమి తల్లి అన్నారు తన స్తన్యాన్నిచ్చి సంతానాన్ని తల్లి ఎలా అయితే పెంచి పోషిస్తున్నదో అలాగే భూమాత కూడా తన ప్రజలను పోషిస్తున్నది. కాబట్టి భారతదేశాన్ని భారతమాత అని పిలవడం అతిసహజమైన విషయం. బాలగంగాధరతిలక్, అరవిందఘోష్ మొదలైన నాయకులు దేశాన్ని మాతగా ఎంచి పూజించాలన్న భావాన్ని వ్యాపింపచేశారు. భారత మాత భారతీయులందరి కన్నతల్లి. తల్లి ఋణం తీర్చుకోవడం తనయుల కర్తవ్యం అని వారు బోధించారు. 'ఆనందమఠం' నవలలో బంకించంద్ర

చటర్జీ ఈ భావానికి జీవం పోశాడు. నేతాజీ కూడా వారు అనుసరించిన మార్గంలోనే భారతదేశాన్ని భారతమాతగా వర్ణించి పూజించాడు. తన అనుయాయులందరిలో దేశమాత పట్ల శ్రద్ధాభక్తులు పెంపొందింప చేశాడు. ఈ విషయంలో గాంధీ, నెహూర్రులు అనుసరించిన మార్గం భిన్నంగా ఉన్నదనే చెప్పాలి.

విదేశాలలో భారత స్వాతంత్ర్యం కోసం ప్రచారం చేసిన నాయకులు చాలామంది ఉన్నారు. కాని స్వాతంత్ర్య పోరాటానికిగాను సైన్యాన్ని విదేశాలలో తయారు చేసింది నేతాజీ ఒక్కడే. పరాయి దేశాలలో అహంకారంతో విర్రవీగుతున్న నియంతలను ఒప్పించి సైన్య నిర్మాణం చేపట్టడం అంటే సులభ సాధ్యమైన పని కాదు. అయితే, ఒక పనిని తలపెట్టిన తర్వాత సాధ్యాసాధ్యాలతో నిమిత్తం లేకుండా దూసుకుపోవడం నేతాజీ లక్షణం. మనసుంటే మార్గం తప్పకుండా ఉంటుందనేది నేతాజీ విశ్వాసం. అకుంఠిత దేశభక్తి, నిశ్చలమైన మనస్సు, దృఢదీక్ష, ఆత్మ విశ్వాసం, ఎనలేని సాహసం, నిశితమైన మేధా సంపద నేతాజీకి సహజంగా అబ్బిన లక్షణాలు. అందుచేతనే వట్టి చేతులతో జర్మనీ, సింగపూర్ మొదలైన సుదూర ప్రాంతాలకు వెళ్ళి గట్టి సైన్యాన్ని నిర్మాణం చేసుకోగలిగాడు.

## అభిప్రాయాలు

నేతాజీ సాగించిన స్వాతంత్ర్య పోరాటంయొక్క పర్యవసానాన్ని తెలియజేస్తూ అలాస్టెయిర్ లాంబ్ ఇలా వ్రాశాడు—

'యుద్ధం పరిసమాప్తమైన తర్వాత అజాద్ హింద్ ఫౌజ్‌లో పని చేసినవారిపైన బ్రిటిష్ ప్రభుత్వం విచారణ కొనసాగించడాన్ని భారతీయులు ఏక కంఠంతో అభిశంసించారు. ఈ విచారణకు వ్యతిరేకంగా ఉద్యమం సాగింది. ఇది చాలదన్నట్లు 1946లో భారత నావికాదళం

తిరుగుబాటు చేసింది. ఇది చూశాక ఇక భారతీయ సైన్యాన్ని నమ్ముకొని ఎక్కువకాలం భారతదేశాన్ని తమ అధీనంలో ఉంచుకోవడం అసంభవ మని బ్రిటిష్‌వారే గుర్తించారు. భారతదేశానికి స్వాతంత్ర్యం ఇవ్వక తప్పదు అన్న నిర్ణయానికి రావడానికి మిగతా కారణాలు ఎన్ని ఉన్నప్ప టికి దీనిని ప్రముఖమైన కారణంగా పేర్కొనవచ్చు. ఎలాగూ స్వాతంత్ర్యం ఇవ్వక తప్పదు కాబట్టి వ్యతిరేకిస్తున్నట్లు కనిపించడంకంటే స్వాతంత్ర్యం ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నామని ప్రకటించడమే విజ్ఞతగా ఉంటుందని బ్రిటిష్‌వారు భావించారు."

ఢిల్లీ ఎర్రకోటలో ఐ.ఎన్.ఏ. సైనికులపై విచారణ కొనసాగిన సమయంలో వారి తరపున వాదించిన బులాభాయ్ దేశాయ్ నేతాజీ తాత్కా లిక స్వతంత్ర భారత ప్రభుత్వం ఏర్పర్చడంలో ప్రదర్శించిన దూర దృష్టిని ఎంతగానో కొనియాడాడు కేవలం తిరుగుబాటు చేసిన రాజ ద్రోహులుగా కాక స్వతంత్ర దేశ సైనికులుగా గుర్తించి అజాద్ హింద్ ఫౌజ్ ఖైదీలను విచారించవలసి వచ్చింది. ఒకవేళ నేతాజీ 1945 ఆగస్టు 18 నాడు అదృశ్యం కాకుండా బ్రిటిష్‌వారికి దొరికిపోయివుంటే రాజ ద్రోహ నేరానికి ఆయనను ఉరితీసి ఉండేవారని అభిప్రాయపడినవారూ లేకపోలేదు. కాని అజాద్ హింద్ సైనికులపై విచారణ ప్రారంభించి నప్పుడు దేశవ్యాప్తంగా నిరసన వ్యక్తమైంది. ఐ.ఎన్.ఐ. సైనికులకు హాని కలిగిస్తే బ్రిటిష్‌వారిని భారతదేశంలో ఊచకోత కోస్తారన్న అభి ప్రాయం వారికి కలిగింది. అలాంటిది యుద్ధఖైదీగా ఒకవేళ నేతాజీ చిక్కి ఉంటే ఆయనకు ఎలాంటి ప్రమాదం తలపెట్టినా ప్రజలు ఊరుకొనేవారా? ఆత్మాభిమానంగల విప్లవ వీరుడిగా శత్రువుకు లొంగిపోకుండా చివరి దాకా పోరాటం సలపాలనే ఉద్దేశ్యంతో పోరాటం కొనసాగించడానికి అనువైన మరో ప్రదేశం వెతుక్కుంటూ నేతాజీ వెళ్ళాడు కాని, బ్రిటిష్

వారికి దొరికి ఉంటే ఆయనమీద ఈగ వాలినా భారత ప్రజలు సహించి ఉండేవారు కాదు.

సుభాస్‌చంద్ర బోస్ వ్యక్తిత్వాన్నిగూర్చి చక్కటి వ్యాఖ్యానం చేశాడు హెచ్.వి. కామత్—

'నేతాజీ కేవలం ఒక రాజకీయవేత్త మాత్రమే కాదు, ఇటీవలి కాలంలో ప్రపంచవేదికపై అలరారిన అత్యంత ప్రముఖ విప్లవ వీరులలో ఒకడు. తిరుగులేని ధైర్య సాహసాలూ, ఉన్నతమైన ఆశయాలు, విస్పష్టమైన భావాలూ, దూరదృష్టితోకూడిన రాజనీతిజ్ఞతా, సాటిలేని సంఘటనా శక్తి ఆయనకు గల వరాలు. భారత రాజకీలయాలో అగ్గిపిడుగుగా వర్ణించబడిన నేతాజీ సంఘర్షణను ఎదుర్కోవలసి వచ్చిన క్లిష్ట సమయాలలో అత్యున్నత స్థాయికి ఎదగగల మేధావి అనేది అనేకసార్లు ఋజువైంది. తనలోగల విశిష్ట గుణాలన్నింటిని బయటపెట్టి, తీవ్రాతి తీవ్రమైన ప్రతిఘటన నెదుర్కొనేందుకు సిద్ధపడేవాడు. పెను తుపానులో ఈదుకుంటూ తుపాను దిశనే మార్చగల సమర్థుడు.'

మైఖేల్ ఎడ్వర్డ్ 'ది లాస్ట్ ఇయర్స్ ఆఫ్ బ్రిటిష్ ఇండియా' అన్న పుస్తకంలో ఇలా వ్రాయడం జరిగింది-

'ఒక ప్రముఖ వ్యక్తి అందరూ పోయే మార్గంకంటే భిన్నమైన ఆయుధ పోరాటాన్ని చేపట్టాడు. ఆయన మనోరథం విఫలమైనట్లు కన్పించినప్పటికీ అందరికంటే ఎక్కువగా భారతదేశం ఆయనకు ఋణపడివుంది'

'టైగర్ అండ్ షకల్' అన్న తన పుస్తకంలో రేమండ్ షాకెల్ అనేకమైన అధికారిక పత్రాలు పరిశీలించిన తర్వాత ఇలా వ్రాస్తాడు-

'భారత స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్న అతిరథ మహారథులెందరో బోస్ బాబుకుగల దేశభక్తిని కొనియాడుతూ ఆయన ఎన్నడూ అవకాశవాద ధోరణిని అవలంబించలేదని పేర్కొన్నారు. వాస్తవంగా

చెప్పాలంటే ఆయన నాజీ సిద్ధాంతాన్ని సంశయాత్మక దృష్టితోనే చూశాడు కాని హిట్లర్‌కు కాని, ముసోలినీకి గాని కీలుబొమ్మగా ఎన్నడూ వ్యవహరించలేదు. రాజకీయ రంగంలో పనిచేసేప్పుడు వాస్తవాలు గుర్తించి పని చేయడం అవసరం అని భావించాడు.'

## నేతాజీ భారత ప్రధాని అయి ఉంటే?

విదేశీ పరిపాలకులు ఉద్దేశపూర్వకంగా భారతజాతిని చీల్చడానికి జొప్పించిన విభేదాలూ, వర్గవైమనస్యాలూ తుడిచిపారేసేవాడు. సామాన్య ప్రజల ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని వారి స్థితిగతులు మెరుగు పరచడానికి తక్షణ చర్యలు తీసుకొని ఉండేవాడు. ఆకాశ హర్మ్యాలలో నివసిస్తూ పేదల కష్టాలకు సంబంధించిన వర్ణనలు కార్యదర్శులచేత అందంగా వ్రాయించుకొని ఏకరువు పెట్టడంకాక సామాన్య ప్రజలతో కలిసి జీవించి, వారి కష్ట సుఖాలలో పాలు పంచుకొనేవాడు. ఇందుకు నిదర్శనగా అజాద్ హింద్ ఫౌజ్‌కు సారథ్యం వహించి నేతాజీకూడా సామాన్య సైనికునికి లభించేంత రేషన్ మాత్రమే తీసుకొన్న విషయం పేర్కొనవచ్చు. పదవులు ఆయనను వెతుక్కుంటూ వచ్చాయేకాని ఆయన పదవుల వెంటపడలేదు. ప్రజలత్యాగాల ఫలితంగా లభించినదే స్వాతంత్ర్యం కాని, పరుల దయాభిక్షవలన లభించినది కాదు. తనకు ప్రధాన మంత్రి పదవి లభించినా, లభించకపోయినా దేశవిభజనకు మాత్రం సుతరామూ ఒప్పుకొనేవాడుకాదు. చారిత్రకంగా పరిశీలించినా, ఆర్థికపరంగా ఆలోచించినా మతప్రాదికపై దేశాన్ని విభజించడం భావితరాలకు అన్యాయం చేయడమేఅవుతుందన్నాడు. మతం పేరుతోనూ, ప్రాంతీయ దురభిమానంతోనూ సాగుతున్న ఉద్యమాలను తల ఎత్తకుండా చేసి, జాతీయ సమైక్యతకు కృషి చేసేవాడు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాతకూడా బ్రిటిష్‌వారు

ఏర్పరచిన రాష్ట్ర విభజన ప్రాతిపదికపైననే దేశంలో రాష్ట్రాలు ఏర్పడ డాన్ని ఆయన ఒప్పుకొనేవాడు కాదు. భారతీయపరిస్థితులకు అనుగుణంగా ముసాయిదా కార్యక్రమాన్ని రూపొందించుకొని సామాజిక, ఆర్థిక పునర్ని ర్మాణానికి పూనుకొనేవాడు. భారతదేశ ప్రయోజనాలు దృష్టిలో పెట్టు కొని అటు కమ్యూనిస్టు రష్యావైపు కానీ, ఇటు కేపిటలిస్టు అమెరికావైపు కాని మొగ్గుచూపని స్వతంత్ర విదేశాంగ విధానాన్ని రూపొందించుకొనే వాడు. అసలు నేతాజీ ప్రధానిగా ఉంటే దేశంలో పటిష్టమైన రక్షణశ్రేణి నిర్మాణం అయిఉండేది. చైనా దురాక్రమణ జరిగి ఉండేది కాదు. అభి వృద్ధిచెందుతున్న బలహీన రాజ్యాల నాయకుడుగా వరించబడి పెట్టని కోటగా నిలిచి వారికి అండదండలు సమకూర్చేవాడు.

భారతదేశానికీ, ఆసియాదేశాలకూ సుభాస్ ఒక చారిత్రక వీరుడు మాత్రమే కాదు, భవిష్యత్తుకు బాటవేసిన ప్రవక్త.

# అనుబంధం

## జాతీయోద్యమంలో స్త్రీల పాత్ర

(జూలై 12, 1943లో భారత స్వతంత్ర దళంలో స్త్రీల విభాగాన్ని ఉద్దేశించి సింగపూర్‌లో నేతాజీ కావించిన ఉపన్యాసం)

సోదరీమణులారా! నేటి సాయంత్రం మీరు నాకు అందజేసిన ఘన స్వాగతానికి ధన్యవాదాలు. తొక్కు పెట్యూషీ భవనాలకు ఎదురుగా ఏర్పాటు చేసిన బ్రహ్మాండమైన సభలో మీరు ఉత్సాహంగా పాల్గొన్నందుకు నా హృదయపూర్వక ధన్యవాదాలు తెలియజేస్తున్నాను వర్షం ధారాపాతంగా పడుతున్నప్పటికీ మీ స్థానాలనుంచి కదలకుండా ఉండి సభను దిగ్విజయం చేసిన దృశ్యం నన్నూ, నా మిత్రులనూ ముగ్ధులు చేసింది. మీలో కొందరు పిల్లలను కూడా ఇక్కడకు తీసుకొచ్చారు. మీ వీరత్వం, ఉత్సాహం చూసి మేము తన్మయులమయ్యాము. ఇంత శుభప్రదంగా ప్రారంభమైన మీ ఉత్సాహం దిన దినాభివృద్ధి చెంది సఫలీకృతం అవుతుందనడంలో నాకు ఏమాత్రం సందేహం లేదు.

గత 20 సంవత్సరాలుగా భారత నారీమణులు జాతీయోద్యమంలో ఏ విధంగా పాల్గొంటున్నదీ మీ అందరికీ తెలుసు. భారత దేశంలో నూతనోత్తేజం వ్యాపించిన నాటి నుంచి సామాజిక జీవనంలో భారత నారీమణులు చురుకుగా పాల్గొంటున్నారు. ఈ మార్పు మనకు బాగా కనిపిస్తోంది. 1921 లో మహాత్మా గాంధీ నాయకత్వంలో కాంగ్రెస్ నూతనోత్తేజంపొందిన మొదలు కాంగ్రెస్ ఉద్యమాలలో మన సోదరీమణులు విరివిగా పాల్గొంటూ వచ్చారు. సహాయ నిరాకరణోద్యమంలోనే కాదు,

రహస్య విప్లవోద్యమంలో కూడా మన సోదరీమణులు పాల్గొంటూ వచ్చారు.

ప్రజా జీవనంలో స్త్రీలు పాల్గొనకుండా ఉన్న ఉద్యమశాఖలు గానీ, కార్యక్రమాలు గానీ ఈనాడు లేనే లేవంటే అతిశయోక్తి కాదు. కష్టాలలో సంతోషంగా, ధైర్యంతో పురుషులతోపాటు పాలు పంచుకోవడంలో స్త్రీలు ఏమాత్రం తీసిపోరనే విషయం ఇటీవలి కాలంలో మనం బాగా గమనిస్తు న్నాం. ఆహారం లభించక పోయినా, త్రాగడానికి నీరు లభించకపోయినా లెక్కచేయక గ్రామ గ్రామానికి తిరిగి స్వాతంత్ర్యోద్యమ సందేశాన్ని అందించడంలోనూ, ఇంటింటికి వెళ్ళి ఎన్నికల ప్రచారం నిర్వహించడం లోనూ, ప్రభుత్వ నిషేధాజ్ఞలు ధిక్కరించి ఊరేగింపులు నడపడంలోనూ, నిర్దయగా బ్రిటిష్ పోలీసులు జరుపుతున్న లాఠీచార్జీలను ఎదుర్కొనడం లోనూ, జైళ్ళలో అనేక ఇబ్బందులకూ, అవమానాలకూ, చిత్రహింసలకూ గురికావడంలోనూ భారత స్త్రీలు ఎవరికీ తీసిపోరని ఋజువు చేస్తున్నారు. అవసరమైతే ఆయుధాలు ఉపయోగించడంలో తమ సోదరుల కేమాత్రం తీసిపోరని అనేక సందర్భాలలో ఋజువు చేశారు మాతృదేశం కొరకు ఎన్ని కష్టాలైనా సహించి పోరాడడానికి మీరు ఈనాడు సిద్ధంగా ఉన్నారని చెప్పడంలో ఉద్దేశ్యం సరదాగా నాలుగు మంచి మాటలు చెప్పి మిమ్మల్ని ఉత్సాహపరచడం కాదు, నా విశ్వాసాన్ని తెలియజేస్తున్నాను. మన స్త్రీల సామర్థ్యం నాకు బాగా తెలుసు కాబట్టి భారత నారీమణులు చేయలేని పనులు కానీ, పడలేని బాధలు కానీ, చూపించలేని త్యాగం కానీ లేదని నేను నమ్మకంగా చెప్పగలను.

మాతృదేశ దాస్య విముక్తికి తుది పోరాటం సాగించవలసిన అవసరం వచ్చింది. ఒక జాతి జీవనంలో అతి అరుదుగా అలాంటి అవకా శాలు వస్తాయి మన జీవితకాలంలోనే కాదు, మళ్ళీ ఒక వంద సంవత్సరాల వరకు ఎన్నడూ ఇలాంటి సువర్ణావకాశం లభించదు. భగవత్కృపవలన

మనకిలాంటి అవకాశం వచ్చింది. దీనిని పోగొట్టుకోకుండా మన సర్వస్వాన్ని ఒడ్డి ప్రయత్నిస్తే మన దేశానికి దాస్య విముక్తి లభిస్తుంది.

మనలో కొంతమంది ఈ బ్రిటిష్ సామ్రాజ్యం శాశ్వతంగా నిలిచి పోతుందనీ, అది పోవడం కల్ల అనీ భావించే వారు కూడా ఉన్నారన్న సంగతి నాకు తెలుసు. కాని చారిత్రక దృష్టాంతాలు వేరే విధంగా ఉన్నాయన్న సంగతి మీరు తెలుసుకోవాలి. సామ్రాజ్యాలు ఏ విధంగా పైకి వస్తాయో ఆ విధంగానే పతనమవుతాయన్న సంగతి చరిత్ర చాటిచెపుతోంది. బ్రిటిష్ సామ్రాజ్య పతనానికి ఇపుడు సమయం ఆసన్నమైంది. ఈ ప్రాంతంలో బ్రిటిష్ సామ్రాజ్య పతనాన్ని మనం కళ్ళారా చూశాం. భారత దేశం నుంచి, ప్రపంచంలో ఇతర ప్రాంతాల నుంచి కూడా అది అదృశ్య మయ్యే రోజులు మనం చూస్తాం.

కొన్ని సంవత్సరాల క్రితం బ్రిటిష్ సామ్రాజ్యాన్ని గూర్చి మెరెడిత్ కోన్రాడ్ అనే ఆంగ్లేయుడు వ్రాసిన పుస్తకాన్ని చదివాను. భారతదేశాన్ని గూర్చి వ్రాస్తూ, భారతీయులంతా ఏకమయినట్లయితే బ్రిటిష్‌వారు ఏమాత్రం పరిపాలన సాగించలేరని స్పష్టంగా పేర్కొన్నాడు. అయితే ఓ వారం రోజులలోనే బ్రిటిష్‌వారు భారతదేశం నుంచి తరిమివేయబడతారని నేను చెప్పడం లేదు. సైనికపరమైన తుది పోరాటం ప్రారంభించాక ఎన్ని వారాలలో అది సాధ్యమవుతుందనేది లెక్కలుకట్టి చెప్పడానికి అవకాశం ఉంది.

సోదరీమణులారా ! మనం బానిసత్వం నుంచి బయటపడడానికి తగిన సమయం ఆసన్నమైనదని మీరంతా భావిస్తున్నారని విశ్వసిస్తున్నాను. ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదం పరాజయం చెందాలనీ, అలా జరిగి నపుడు మాత్రమే భారతదేశం స్వాతంత్ర్యం పొందగలుగుతుందనీ మీరంతా కోరుకుంటున్నారని నేను నమ్ముతున్నాను... ఈ వేళ అక్ష రాజ్యాలు, భారతదేశం ఒకే శత్రువును ఎదుర్కొంటున్నాయి. కాబట్టి మన ఇరువురి

ధ్యేయం ఒకటే. మన ఉమ్మడి శత్రువును ఎదుర్కోవాలి. కష్టసుఖాలలో సమానంగా పాలుపంచుకొంటూ ఎన్ని త్యాగాలకైనా సిద్ధపడి స్వాతంత్ర్యాన్ని సముపార్జించుకోవాలి.

ఎలాంటి కష్టాలు లేకుండా మనకు స్వాతంత్ర్యం వస్తే దానివలన ప్రయోజనమేమీ ఉండదు. అలా సులభంగా వచ్చిన స్వాతంత్ర్యాన్ని కాపాడుకో గలిగేశక్తి మన దగ్గర ఉండదు. కాబట్టి మనం బాధలు పడటం ద్వారానే స్వాతంత్ర్యాన్ని సంపాదిద్దాం. 'సర్వ సమర్పణ' ద్వారా మన మాతృదేశానికి తగినంత సమర్థన అందజేయగలమని విశ్వసిస్తున్నాను.

కాబట్టి సోదరీమణులారా! రాబోయే పోరాటంలో మీరు కూడా పాలు పంచుకోవాలి. అనేక విధాల మీ సేవలు ఉపయోగపడతాయి. కొన్ని పనులు ప్రత్యేకంగా స్త్రీలు సమర్థవంతంగా నిర్వహించగల్గుతారు. ఉదాహరణకు మీరు వైద్యశాలలో పనిచేయవచ్చు. మన సైనిక చర్య ప్రారంభమైన తరువాత క్షతగాత్రులైన సైనికుల బాధ్యత ఎవరు వహిస్తారు ? క్షతగాత్రులైన సైనికులకు సాంత్వన కల్గించడానికి మన సోదరీమణులు ముందుకు రాకపోతే సిగ్గుచేటు కాదా? మీరు నిర్వహించే పనులలో ఇది ఒక భాగం మాత్రమే. సైనికులను చేర్చుకోవడంలోనూ, ధనం వసూలు చేయడంలోనూ మీరు ఎంతగానో తోడ్పడవచ్చు కొన్ని సందర్భాలలో స్వయంగా తుపాకులు తీసుకొని పోరాటానికి సిద్ధం కావలసి రావచ్చు.

తుపాకి చేత పట్టడం స్త్రీలు చేయదగిన పని కాదని చెప్పేవారితో చరిత్ర పుటలు ఒకసారి తిరగవేయండి అని మనవి చేస్తున్నాను. 1857 ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ఝాన్సీరాణి ప్రదర్శించిన ధైర్యసాహసాలు ఎంత గొప్పవి ! ఆ విధంగానే ఇప్పుడు సాగించబోయే తుది పోరాటంలో ఎందరో స్త్రీలు ఝాన్సీరాణివలె ముందుకు దూకవలసిన అవసరం ఉంది. ఎన్ని తుపాకులు పట్టుకోగలరు, ఎన్ని తూటాలు పేల్చగలరు అన్నది కాదు సమస్య. మీ వీరోచిత చర్యల వలన ఏర్పడే నైతిక బలం

చాలా గొప్పది. తుపాకులు చేతధరించి మీరు కన్పించినపుడు, భారతీయ పౌరులూ, బ్రిటిష్ సైన్యంలో పనిచేస్తున్న భారతీయులూ స్వచ్ఛందంగా ముందుకు వచ్చి, మీ చేతులలో తుపాకులు తీసుకొని పోరాటాన్ని వారే సాగిస్తారు. నాకు ఇందులో ఏమాత్రం సందేహం లేదు. కాబట్టి భారతీయు లంతా-స్త్రీ పురుషులూ, బాల బాలికలూ అంతా — స్వాతంత్ర్య సిద్ధికై తమ సర్వస్వాన్ని అర్పణ చేసి ముందుకు రావలసిన సమయం ఆసన్న మైనదని నేను గట్టిగా చెప్పగలను.

సోదరీమణులారా ! మీ శక్తివంతమైన చర్యలు కేవలం మలయా, తూర్పు ఆసియా, సియోన్‌లో వున్న భారతీయులనే కాదు- భారతదేశంలో వున్న వారిని కూడా ఉత్తేజపరుస్తాయి. మీరు యుద్ధసన్నద్ధులై కొనసాగి స్తున్న కృషినిగూర్చివిని 388 మిలియన్ల భారతీయులు నూతనోత్తేజాన్ని పొందుతారు. మీ ప్రయత్నాలన్నీ జయప్రదం కావాలని నేను కోరుకుంటు న్నాను. మేము చేస్తున్న పనే మీరు చేస్తున్నారు. ఉభయుల సాగిస్తున్న ఈ పోరాటంలో బాధలు సహించడంలోనూ, త్యాగాలు చేయడంలోనూ స్త్రీ పురుష విచక్షణగాని, బాలురు-బాలికలు అనిగాని; పేదలూ, ధనికులూ అనిగానీ; యువకులూ, ముసలివారూ అనికానీ తేడాలులేకుండా భుజం భుజం కలిపి తుది పోరాటాన్ని కొనసాగించి స్వాతంత్ర్య సముపార్జనను త్వరితపరుద్దాం.

నిన్న జరిగిన బహిరంగ సభలో ఉత్సాహంగా పాల్గొన్నందుకు, నేడు నాకు అందించిన ఘన స్వాగతానికి మరియొకసారి మీకు ధన్యవాదాలు తెలియజేసుకుంటున్నాను. ఈ వేళ నాకు నిధి అందజేసినందుకు కూడా ధన్యవాదాలు. మాతృదేశ దాస్య విముక్తికై మీరు సాగించే కృషి విజయ వంతంగా ముగియవలెనని కోరుకుంటున్నాను.

మీతో మొదట మనవి చేసినట్లుగా- అంతిమ పోరాటానికి సిద్ధపడే సమయం ఇప్పుడు ఆసన్నమైంది. అజాద్ హింద్ సేన ఏర్పడిన సంగతి నేను ప్రపంచానికి ఇదివరకే తెలియజేశాను. విముక్తి పోరాటానికి ఆ సేన సన్నద్ధమవుతున్నది. ఝాన్సీరాణి దళం కూడా పోరాటానికి సన్నద్ధమవు తుందని ప్రపంచానికి తెలియజేసే సమయం అనతికాలంలోనే రానున్నదని నేను భావిస్తున్నాను. ఈ పని వెంటనే ప్రారంభం కావాలి. కాబట్టి ఝాన్సీ రాణి దళంలో చేరదలచుకున్న వీర వనితలు ముందుకు వచ్చి తమ పేర్లు నమోదు చేసుకోవలసిందిగా కోరుతున్నాను.

# ఝాన్సీ రాణీ దళం

**(22 అక్టోబర్ 1943 న ఝాన్సీరాణి దళం శిక్షణ శిబిరం ప్రారంభిస్తూ చేసిన ఉపన్యాసం)**

సోదరీమణులారా! తూర్పు ఆసియాలో మనం కొనసాగిస్తున్న ఉద్యమ పురోభివృద్ధిలో రాణీ ఝాన్సీ దళం శిక్షణా శిబిరం ప్రారంభిం చడం అనేది ఒక మైలురాయి వంటిది. జాతి పునరుజ్జీవనం అనే మహత్తర కార్యంలో మనం నిమగ్నమై ఉన్నాం. మన స్త్రీలలో కూడా నూతన చైతన్య వీచికలు గోచరించడం ఈ సందర్భానికి తగినట్లుగా ఉంది.

మన గత చరిత్ర మహోజ్వలమైనది. గత చరిత్రలో ఎలాంటి ఆదర్శం లేకుండా ఆకస్మికంగా ఝాన్సీరాణివంటి వీర వనితలు జనిం చారు. మన ప్రాచీన భారతంలో మైత్రేయి, ఇటీవలి చరిత్రలో మహా రాష్ట్రకు చెందిన అహల్యాబాయ్, బెంగాల్‌కు చెందిన రాణీ భవానీ, రజియా బేగం, నూర్జహాన్ మొదలైనవారు బ్రిటిష్ రాజ్యం నెలకొల్పబడక ముందు చక్కటి పరిపాలకులుగా ప్రఖ్యాతి చెందిన వనితలు. భారతమాత కన్న బిడ్డలపై నాకు పరమ విశ్వాసం ఉంది. గతంలో వలెనే భావిలో కూడా సుప్రసిద్ధ వనితా రత్నాలు భారతదేశంలో జనిస్తారు.

రాణీ ఝాన్సీని గూర్చి మీకు కొన్ని మాటలు చెప్పదలచాను. యుద్ధం ప్రారంభించేనాటికి ఆమె వయస్సు 20 సంవత్సరాలు. ఇరవై ఏళ్ళ యువతి గుఱ్ఱం స్వారీ చేస్తూ ఖడ్గాన్ని చేత ధరించి యుద్ధభూమిలో వీరవిహారం చేయడం అంటే ఎలాంటి సాహసకృత్యమో మనం ఊహించ వచ్చు. ఆమెతో యుద్ధం చేసిన ఆంగ్లసేనాని అంటాడు- ''తిరుగుబాటు

దారులందరిలోనూ ఉత్తమోత్తమమైన వీరత్వం ప్రదర్శించినది ఆమెయే." మొదట ఝాన్సీ కోటలో ఉండి యుద్ధం సాగించినది. కోట పతనం కాగానే కొద్దిమంది అనుచరులతో 'కల్పి' చేరి, యుద్ధం కొనసాగించింది. ఈ యుద్ధ రంగం నుంచి కూడా ఆమె వెనుదిరిగి పోవలసి వచ్చినపుడు తాంత్యా తోపేతో చేతులు కలిపి గ్వాలియర్ కోటను వశపరచుకొంది. ఆ తరువాత ఆ కోటను స్థావరంగా చేసుకొని యుద్ధం కొనసాగించింది. చివరకు యుద్ధం చేస్తూనే వీరస్వర్గం అలంకరించింది.

దురదృష్టవశాత్తూ ఝాన్సీరాణి పరాజయం పొందింది. అది ఆమె వ్యక్తిగత పరాజయం కాదు. యావత్ భారతదేశపు పరాజయం. ఈనాడు అమె భౌతిక కాయం లేదు కాని, యశఃకాయం శాశ్వతంగా నిలచింది. భారతదేశం మళ్ళీ ఝాన్సీ రాణీలను తయారు చేయగలదు. విజయం సాధించగలదు.

# కక్ష సాధింపు చర్యలు మానుకోండి

బర్మాలో ఆంగ్లో-అమెరికన్ వర్గాలకు పట్టుబడిన భారత జాతీయ సేన అయిన ఆజాద్ హింద్ ఫౌజ్ సైనికులను చిత్రహింసలకు గురి చేస్తున్నారన్న వార్తలు విశ్వసనీయ వర్గాల ద్వారా నా చెవిన బడు తున్నాయి. ఆంగ్లో-అమెరికన్ వర్గాలకు చెందిన యుద్ధ ఖైదీలను జర్మన్లు, జపానువారు నానాహింసలకు గురిచేస్తున్నారని వీరు మొత్తుకున్న విషయం యావత్ ప్రపంచానికి తెలుసు. ఇప్పుడు వారి చేతులలోపడ్డ ఆజాద్ హింద్ ఫౌజ్ సైనికులను ఈ ఆంగ్లో-అమెరికన్ వర్గాలు ఏ విధంగా చూస్తున్నాయి అని నేను ప్రశ్నించదలచుకోలేదు.

మన సైనికాధికారులను, సైనికులను ఏమి చేసినా ఇప్పుడు మన మేమీ చేయలేని నిస్సహాయ స్థితిలో ఉన్నామని బ్రిటిష్ అధికారులు అను కొంటూ ఉండొచ్చు. అలా భావిస్తే వారు చాలా పొరబడుతున్నారని చెప్పాలి. తప్పనిసరి పరిస్థితులు ఏర్పడితే ప్రతిక్రియాత్మక చర్యలు ఎలా తీసుకోవాలో మనకు బాగా తెలుసు. అయితే అందుకు తలపడే ముందు మనం తేలికగా చేయదగిన పని మరొకటి కూడా ఉంది. భారతీయు లందరూ కనుక ముక్తకంఠంతో బ్రిటిష్ వారి చర్యలను ఖండిస్తూ ఒక్క అరుపు అరిస్తే అధికారులు తప్పకుండా దారికి వస్తారు.

భారతీయులకు స్వాతంత్ర్యం ఇచ్చి బ్రిటిష్‌వారు దేశం వదలిపెట్టి పోయేట్లు చేయగలిగినంత సమర్థవంతంగా భారత ప్రజావాణి లేకపోవచ్చు కాని బ్రిటిష్ వారి చేతులలో యుద్ధ ఖైదీలుగా చిక్కిన ఆజాద్ హింద్

ఫౌజ్ సైనికులను హింసిస్తూ ఉంటే దానిని తీవ్రస్థాయిలో ఖండించి సరి దిద్దేంత బలం ప్రజావాణికి ఉన్నది. తమ మాతృదేశ దాస్య విముక్తికి అకుంఠిత దేశభక్తితో పోరాటం సాగించిన విప్లవ వీరులు అజాద్ హింద్ సైనికులు. బ్రిటిష్ వారితో ధైర్యసాహసాలు ప్రదర్శించి పోరాడిన మాట నిజమే కాని, ఆ పోరాటం విశుద్ధ మనస్సుతో నిష్కల్మషంగా సాగించి నట్టిది. కాబట్టి శత్రువులు అదుపులో ఉన్నప్పుడు వారిని అంతర్జాతీయ సూత్రాలకు, పద్ధతులకు అనుగుణంగా చూడాలి.

కాబట్టి దేశస్వాతంత్ర్యానికై పోరాడిన అజాద్ హింద్ సైనికులపై బ్రిటిష్‌వారు నెరపుతున్న కక్ష సాధింపు చర్యలను బాహాటంగా ఖండించ వలసినదిగా దేశంలో ఉన్న భారత పౌరులందరికీ నేను విజ్ఞప్తి చేస్తున్నాను. ఈ యుద్ధ ఖైదీలపట్ల బ్రిటిష్‌వారు ప్రదర్శిస్తున్న వాస్తవ వైఖరిని ఎప్పటి కప్పుడు తెలుసుకుంటూ అంతర్జాతీయ న్యాయ సూత్రాలపట్ల ధర్మ పన్నాలు వల్లిస్తున్న బ్రిటిష్‌వారు స్వయంగా ఏమి చేస్తున్నారో ప్రపంచా నికి తెలియజేయాలి.

(జూన్ 14, 1945 బాంకాక్ నుండి రేడియో ప్రకటన)

# ఆధార గ్రంథాలు


'ది ఇండియన్ ఇండిపెండెన్స్ మువ్‌మెంట్ ఇన్ ఈస్ట్ ఆసియా'
-యస్. ఏ. అయ్యర్

'ఇండియా విన్స్ ఫ్రీడం' - అబ్దుల్‌కలాం అజాద్ (Orient Longman Ltd, Calcutta)

'ఏన్ ఇండియన్ పిలిగ్రిమ్' - (అసంపూర్ణంగా ఉన్న ఆత్మకథ)
- సుభాస్‌చంద్రబోస్

'ఫండమెంటల్ క్వెశ్చన్స్ ఆఫ్ ఇండియన్ రివల్యూషన్' - నేతాజీ పరిశోధనా కేంద్రం, కలకత్తా

'ఇండియాస్ స్ట్రగుల్ ఫర్ ఫ్రీడం' - ఏ.సి చటర్జీ (Chukkerverte, Chaterji & co, Calcutta)

'ది సెకండ్ వరల్డ్‌వార్'-విన్‌స్టన్ చర్చిల్ (Cassel & co,London)

'సుభాస్ చంద్ర' - హేమేంద్రనాథ్‌దాస్ గుప్త (Bharat Book Agency, Calcutta)

'ఫేమస్ స్పీచెస్ అండ్ లెటర్స్ ఆఫ్ సుభాస్‌చంద్ర బోస్'-Lion Press, Lahore

'నేతాజీ ఇన్ జర్మనీ' - యన్.జి.గన్‌పూలే, (Bharateeya Vidya Bhavan)

'స్ట్రగుల్ ఫర్ ఫ్రీడం' - భారతీయ విద్యాభవన్. (Vol)

'నేతాజీ సుభాస్ చంద్ర' - జె.యన్. ఘోష్ (Orient Book Company, Calcutta)

'ఇన్ ఫ్రీడమ్స్ క్వెస్ట్' - యన్.జి. జోగ్ (Orient Longman Ltd)

'ఐ.యన్.ఏ. అండ్ ఇట్స్ నేతాజీ' - షానవాజ్‌ఖాన్ (Rajkamal Publications, Delhi)

'ఏ బంచ్ ఆఫ్ ఓల్డ్ లెటర్స్' - జవాహర్‌లాల్ నెహ్రూ (Asia Pub. House, Bombay)

'నేతాజీ ఎంక్వైరీ కమిటీ రిపోర్ట్' (షానవాజ్ ఖాన్)-GOI, New Delhi 1956.

'నేతాజీ ది మేన్' - దిలీప్‌కుమార్ రాయ్ (Bharateeya Vidya Bhavan)

'సెలెక్టెడ్ స్పీచెస్ ఆఫ్ సుభాస్‌చంద్రబోస్' (సంకలనం) (GOI, Ministry of Information and Broadcasting)

'ఏ బీకన్ ఎక్రాస్ ఏసియా' - సిసిర్. కె బోస్, అలెగ్జాండర్‌వెర్త్, యస్.ఏ. అయ్యర్ (Orient Longman, Calcutta)

'గేలంట్ ఎండ్ ఆఫ్ నేతాజీ' - హరీన్‌షా (Atmaram & sons, Delhi)

'ఆర్గనైజర్' - 1977 దీపావళి సంచిక.

'ఫార్మేషన్ అండ్ గ్రోత్ ఆఫ్ ఇండియన్ నేషనల్ ఆర్మీ' - దుర్లభ్‌సింగ్ (Hero Publications, Lahore)

'హిస్టరీ ఆఫ్ ది ఇండియన్ నేషనల్ కాంగ్రెస్' - డాక్టర్ పట్టాభి సీతారామయ్య

'ది తర్డ్ రీచ్'-లండన్ ప్రచురణ (The International Council for Philosophy and Humanistic studies)

'వెన్ బోస్ వజ్ జియాఉద్దీన్' - ఉత్తంచంద్ (Rajkamal Pub. Delhi)

'ది స్ప్రింగింగ్ టైగర్' - హుగ్‌టాయ్ (Toye Hugh, Cassel, London.)

'ది ఈవ్ ఆఫ్ ది వార్' - ఆర్నాల్ట్ టాయన్బీ

'నేతాజీ అండ్ ది సి.పి.ఐ.' - సీతారాం గోయల్ (Society for Defence of Freedom in Asia, Calcutta)

# సూచిక

NETAJI    By P. GOPI REDDY

# నేతాజీ

'నేతాజీ' అన్న మూడక్షరాలూ వినగానే భారతీయు లందరి మనస్సులూ ఉత్కంఠితమవుతాయి. హృదయాలు శ్రద్ధతో నిండిపోతాయి. నేతలెందరో ఉన్నారు కాని నేతాజీ అనగానే మన కళ్ళ ఎదుట నిలిచేది సుభాస్ చంద్రబోస్ మాత్రమే. ఐ. సి. ఎస్.నే కాలదన్నిన ఆయన దేశభక్తి, కాంగ్రెసు అధ్యక్షుడిగా మహాత్మాగాంధీ ముందైనా తలవంచని ఆయన స్వాతంత్ర్య వ్యక్తిత్వం ప్రబల బ్రిటిషుయంత్రాంగాన్నే కనుగప్పి గృహనిర్బంధంలో నుంచి తప్పించుకొని మారు వేషంలో జర్మనీ చేరడం, అక్కడ స్వారాజ్యశక్తులను సమీకరించడం, జర్మనీ నుంచి జపానుకు జలాంతర్గామిలో పయనం సింగపూర్‌లో ఆజాద్ హింద్ ఫౌజ్ నిర్మాణం తాత్కాలిక స్వాతంత్ర ప్రభుత్వ స్థాపన, ఇప్పటికీ ప్రశ్నార్థకంగానే ఉన్న ఆయన మృత్యువూ ఆయన జీవితాన్ని కాశీ మజిలీ కథలకన్న ఆసక్తిదాయకం చేస్తాయి. శ్రీ పి. గోపిరెడ్డిగారు ఆ గాథని మరింత రసవత్తరంగా రూపొందించారు. నవభారతి ప్రచురణల సంస్థ ఈ అమూల్య రత్నాన్ని మీ ముందు ఉంచుతున్నది.

నాలుగు ఛాయాచిత్రాలతో బాటు

**నవభారతి ప్రచురణలు**